*Andhra Katha Manjusha* (An anthology of Telugu short stories). Ed. by Swamy Sivasankara Sastry. Sahitya Akademi, New Delhi, 1958. Rs. 5.00.



ముద్రాపకులు

ది ఓరియంట్ పవర్ ప్రెస్, తెనాలి

ముఖపత్రము

అసోసియేటెడ్ ఆర్టిస్టులు
కనాట్ సర్కస్, న్యూఢిల్లీ

మూల్యము

ఐదు రూపాయలు

# పీ ఠి క

౧

ప్రాచీనాంధ్ర భాషలో ఏమి కథ లున్నవో స్పష్టముగా తెలియదు. ప్రజల వాక్కులలో ప్రచార మయ్యేకథలు ఉండి తీరుతవి. అవి వచన రూపములో ఉండవచ్చు, ఉండక పోవచ్చు. కొన్ని గేయరూపములోను, మరికొన్ని ద్విపదలలోను, కొన్ని సరళ మైన పద్యాలలోను ఉంటవి. ముద్రితమై కొన్ని ఇప్పటికి లభ్య మవుతున్నవి. కథన కావ్యాలలో కవితాపాటవముకంటె కథాధోరణి ప్రధానము.

పంచతంత్ర కథలు, భేతాళ పంచవింశతి, శుకసప్తతి, హంసవింశతి- ఇత్యాది కథాకావ్యాలు చాలా ఉన్నవి. వచనములో స్థలపురాణాలూ, కైఫియత్తులూ, కవిలెలూ మొద లైనవాటిల్లో కొన్ని చిత్ర మైన కథలు కన బడుతవి. హండే అనంతపుర రాజుల కథలవంటివి భాషాసంకీర్ణతవల్ల బాగా అర్థము కావు. భోజ కాళిదాస కథలు, చమత్కార కథాకల్లోలిని, కాశీ మజిలీలు-ఇత్యాదులు జనరంజకములు.

రుచిభేదాన్ని బట్టి, కాలాన్ని అనుసరించి ఆధునికము అనేపద్ధతిలో కథ "ఆంధ్రభారతి"లో మొదట వచ్చింది అని చెప్పవచ్చు. అయ్యంకి వేంకటరమణయ్య సంపాదకత్వాన 1912 లో బందరునుంచి బయలు దేరినది ఆ పత్రిక. 1914 ప్రాంతాలలో తణుకునుంచి "మదరాసు కథలు" అనే సంపుటి వెలువడ్డది. అక్కిరాజు ఉమాకాన్తము 1914 లో "త్రిలింగ" మాసపత్రిక మదరాసులో ప్రారంభించి కథలకు తా విచ్చి నాడు. "ఆంధ్రపత్రిక" బొంబాయినుంచి మదరాసు వచ్చి, దినపత్రిక అయిన తర్వాత అప్పు డప్పుడు కథలు అచ్చు వేసేది. అందులో సారస్వతానుబంధము ప్రారంభ మయినతర్వాత కథాసాహిత్యానికి కొంత ఆక రము దొరకింది. చింతా భీమ శంకరము కథారచనలో కృషి చేసినాడు.

అయితే, ఆయన రచనలు Sir Arthur Conan Doyle వ్రాసిన అపరాధ నిరూపక కథలకు అనువాదప్రాయముగా ఉండేవి.

1915 లో కథకు ఆకారప్రకారాలు కొంతవరకు ఏర్పడిన వన వచ్చును. సాహితీ సమితి వారు తెనాలిలో "ఆఖ్యాయిక" అనే మాస పత్రికకోసము కృషి చేశారు. పత్రిక వెలువడక పోయినా, రచయితలు చాలా సాధన చేయడము సంభవించింది.

ఆంధ్ర పత్రికలో, కృష్ణాపత్రికలో అప్పుడప్పుడు చిన్నకథలు ప్రకటన అవుతూ ఉండేవి. విడివిడిగా కొన్ని ప్రాంతాలలో కథాగుచ్ఛములు కూడా బయలుదేరినవి.

1920 ఆంధ్ర సాహిత్య చరిత్రలో ప్రస్ఫుటాక్షరాలలో లిఖించ దగిన సంవత్సరము. సాహితీ సమితివారు "సాహితి" పత్రికా ప్రకటన ప్రారంభించారు. ప్రసిద్ధులైనకథకులు ఇంచుమించుగా అందరూ ఆ పత్రికకు తమరచనలు పంపేవారు. కథకు సర్వవిధ సౌష్ఠవము సాహితీ సమితి వారివల్లనే వచ్చిందని సహృదయ సాహిత్యకారుల సమ్మతి. ఆ రచయితలు ప్రాచ్య, పాశ్చాత్య సాహిత్యాలు మధించినవారు కావడము చేతనూ, నూతనోత్సాహపరులై వ్యావహారికబాషలో చెప్పడము చేతనూ, కథలు సజీవముగా ఉండేవి.

1922 ప్రాంతాలలో బందరునుంచి "శారద" మాసపత్రిక, 1923లో మదరాసునుంచి "కళ", 1924 లో "భారతి", 1926 లో గుంటూరు నుంచి "సఖి" బయలుదేరినవి. వీటివల్ల కథకు వైవిధ్యము, గౌరవము హెచ్చింది.

భారతీయులకు కథాకథనము ఉగ్గుపాలతో వచ్చిన కళ అని పాశ్చాత్య విమర్శకులు బహుపర్యాయములు లిఖించినారు. ఆధునిక విధానములో కథ అమెరికాలో ముందు పుట్టిం దని విజ్ఞు లన్నారు. 1833 లో EDGAR ALLEN, POE, 1840 లో HAWTHORNE, 1868 లో BRET HARTE, 1871 లో HENRY JAMES అమెరికా సంయుక్త రాష్ట్రాలలో కథను బాగా వృద్ధి చేశారు. ఇంగ్లాండులో 1877

నుంచి STEVENSON వల్లను, 1890 నుంచి KIPLING వల్లనూ కథ విశేషముగా వికాసము పొందింది. గత శతాబ్దిమధ్యలోనే ఫ్రాన్సు, రష్యా దేశాలలో కథ బాగా విజృంభించింది. ఫ్రెంచివారు వచన రచన లోను, కథానిర్మాణములోనూ గట్టివారు. ఐరోపా ఖండములోని అనేక సారస్వత విధానాలకు వారే విధాతలు. క్రమంగా అన్ని దేశాలవారూ కథారచనలో ఆరితేరినారు.

పాశ్చాత్యులు కథనములో అవలంబించిన అన్ని పద్ధతులూ ఆంధ్రులుకూడా అవలంబించినారు. కొందరు విశేషముగా అనుకరణము చేసినా చాలామంది రచనలో స్వాతంత్ర్యము వహించినారు. పశ్చిమ కథాసాహిత్య సంపర్కమువల్ల చక్కగా మార్పు చెందినవారి కథా ధోరణి జనసామాన్యానికి అవగతము కావడము కొంతకష్టము.

మొదట మొదట ఆంధ్రకథకులు పరివర్తనములే బహుళముగా చేసినారు. వంగదేశమువారు కథారచన చాలా ముందుగా ప్రారంభించడముచేత ఆంధ్రరచయితలు వాటిని అనువదించారు. ఇంచుమించుగా ఆంధ్రతోపాటే హిందీభాషలో కథానికాసృష్టి అయినది. ఆ కథలను కూడా మనవారు తెనిగిస్తూ మహారాష్ట్ర, కర్ణాటక, ఉర్దూ భాషలలోనుంచి కూడా అనువదించారు. మాతృకలు బయలు పెట్టకుండా కొందరు పాశ్చాత్య భాషలలోనుంచి అనువాదాలు చేశారు. 40 సంవత్సరాల నుంచి ఆంధ్రకథలు కర్ణాటక, తమిళ, హిందీ, ఆంగ్లభాషలలోనికి పరివర్తితము లవుతున్నవి.

వేదకథలలో యజుర్వేద కథాసంగ్రహ మొకటి తెలుగులోకి వచ్చింది. పాలిభాషలోనుంచి జాతకకథలు శివశంకర స్వామి అనువదించినాడు. అఖిల ప్రాకృతభాషాకోవిదు డైన పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి జైనుల అర్ధకథలు కొన్ని ఆంధ్రీకరించినాడు. శివశంకరస్వామి, కృత్తివాస తీర్థులు కలిసి సంస్కృతమునుంచి "కథాసరిత్సాగరము" అనువాదము చేసినారు. అపభ్రంశభాషలో ఉన్న కథనకావ్యాలను వచనములో వ్రాస్తే కథాసారస్వతము ప్రవృద్ధ మవుతుంది.



కథాశబ్దము జాతివాచకము. ప్రాచీనాలంకారికులు కథను గౌరవించి కథాభేదాలకు వివిధనామములు నిర్దేశించారు. అఖ్యాయిక, అఖ్యానము, అఖ్యానకము, కథానకము, ఇత్యాది నామధేయాలు కనపడతవి. సంస్కృత వాఙ్మయములో ఎంతో కథాసాహిత్యము లుప్త మైపోయింది. బాణభట్టు ఒకచోట 'భట్టార హరిచందస్య గద్యబంధో నృపాయతే' అన్నాడు. హరిచందుని గద్యకావ్యము తలమానికము వంటి దని తాత్పర్యము. ఇప్పుడు దానిపేరుకూడా తెలియదు. సుబంధుని వాసవదత్త ఖండకథ, బాణుని కాదంబరి పరికథ, హర్షచరితము అఖ్యాయిక, దశకుమారచరితము, బృహత్కథ అఖ్యాయికలే. వాదీభసింహుని గద్యచింతామణి కూడా అఖ్యాయికాప్రాయమే. ఈ విధముగా కొన్ని నామభేదములు గోచరిస్తున్నవి.

ఈ కాలములో చిన్నకథను ఏ మనాలి? కథ జాతివాచకము కావడం చేత ఎటువంటి దైనా కథ అవుతుంది. విశిష్ట మైనచిన్నకథను కథానక మనడము సమంజసము. భేతాళ పంచవింశతిలో ఒక్కొక్క కథకు కథానక మనే ప్రసిద్ధి.

> అఖ్యాయికా, కథా, ఖండకథా, పరికథా తథా
> కథాని కేతి మన్యంతే గద్యకావ్యం చ పంచధా.

అనే అగ్నిపురాణ శ్లోకమును బట్టి కథానిక అందాము. అలంకారిక నిర్వచనాలలో కథానికా శబ్దానికి ప్రాధాన్యము లేదు. ఖండిక, రూపిక, ఏకాంకిక, ఇత్యాది శబ్దాలు ప్రచారములోకి తెచ్చిన అస్మదాదులు శ్రవణ సుఖ మున్న దని కథానికాశబ్దాన్ని ఆమోదించారు.

ఇక ఈరోజులలో రచితము లయ్యే రకరకాల కథలకు నామనిర్దేశ మెలాగు? కొన్ని సంస్కృత శబ్దములకు ఇంగ్లీషు పర్యాయపదములు గమనింపదగినవి.

అఖ్యాయిక=A connected story.

ఆఖ్యానము = A Tale, especially a legend or a narrative.

ఆఖ్యానకము = An episode, a short legend.

ఖండకథ = A Short tale or sketch.

కథానకము, కథానిక = A story.

కథాపరిమితి ఎంత అని ప్రశ్న. ఒకపుట మొదలుకొని నూరుపుటల వరకు కథ వ్యాపించవచ్చు నని అన్నారు కొందరు. Henry James రచించిన 2 3 పుటల కథనమును కూడా కథ అన్నారు.

మనలో అనగనగా ఒకరాజు. ఆ రాజు కేడుగురు కొడుకులు, ఇత్యాది వాక్యసందోహముకూడా కథ అని ప్రతీతి చెందింది. చింతా దీక్షితులు, శ్రీనివాస శిరోమణి, మొక్కపాటి నరసింహ శాస్త్రి, అందే నారాయణ స్వామివంటి కథకుల సుదీర్ఘ రచనలుకూడా కథానికలే. కాబట్టి పరిమితి వల్ల ఇద మిత్థ మని నిర్ణయించ నవసరము లేదు.

అగ్నిపురాణములో—

భయానకం సుఖపరం గర్భే చ కరుణో రసః
అద్భు తోంతే సుక్ఌప్తార్థో నోదాత్తా సా కథానికా.

దీనిప్రకారము కథానిక పెద్దది కాగూడదు. విషయాలు సంగ్రహించాలి. సంఘటనలు ఆశ్చర్యజనకాలు కావాలి. కథాంతంలో అద్భుతాపాదక మయిన మలుపు తిరగాలి. ఘటన సుఖాంతమూ కావచ్చు, దుఃఖాంతమూ కావచ్చు; మధ్యలో కరుణసమ్మిళతము కావచ్చు; ఈ లక్షణములో వైశాల్యము మెండు.

లోకములో ఎటువంటి సన్నివేశ మయినా ఆదిమధ్యాంతాలతో సుఖ దుఃఖాలు తిలతండులాలవలె గాని, క్షీరనీరాలవలె గాని ఉండక తప్పదు. ఆదినుంచి అంతముదాకా కథ ఒకేధోరణిలో దుఃఖమయ మైనా సుఖమయ మైనా సొగసు లేదు. కథాసందర్భాలలో సంఘర్షణా, తుల్యబలవిరోధమూ ఉంటూ ఉంటే కథాధోరణికి దోహద మవుతుంది. ఇహలోకయాత్ర దుఃఖభూయిష్ఠ మైనప్పటికీ జీవితాన్ని కేవల దుర్దినమువలె ప్రదర్శించత

ఎండ వానలుగానూ చీకటి వెలుగులుగానూ, చిత్రించడములోనే సిద్ధ హస్తుడైన ఆఖ్యానకుడు కావలె ఆర్ద్రహృదయుడు.

కథానికను సరళకథనములో నడుపవచ్చు; సంభాషణక్రమములోనే సాగించవచ్చు; ఒక్కొక్కప్పుడు లేఖారూపకముగా రేఖలు తీర్చవచ్చు; దినచర్యాసరణిలో దిద్దవచ్చు; దీర్ఘస్వగతరూపముగా చెప్పవచ్చు. ఈ రీతు లన్నీ సమ్మిశ్రణము చేసి రచించవచ్చు. చైతన్యస్రవంతి (The stream of consciousness) భంగులలో ప్రౌఢముగా నానాను భవాలతో గ్రథనము చేయవచ్చు.

రచయితలలో ఉన్నట్టు పఠితలలో కూడా బాగా అధికారి భేదము ఉన్నది. గ్రహణశక్తినిబట్టి కథావిధానము కూడా. ఏదేమైనా కొన్ని సామాన్య లక్షణా లున్నవి. వీటిని గమనిస్తే కథ మధురముగా అంత మౌతుంది.

కథాబీజ మేదో ప్రథమములోనే నిపుణతతో నిర్ధారణ చేసుకోవాలి. కథోదయము చిత్తాకర్షకము చేయాలి. కథాముఖములో కావ్యార్థసూచన గర్భీభూతము కావాలి. కథాసీమములో బీజోపబృంహణమైన విన్యాసములో వివిధగతులు తొక్కి క్రమేణా కథ గమ్యస్థానము చేరాలి. నవలికాప్రా యము లైన కథలలో కథాంతరాలకు అవకాశ మున్నది. కాని కథాని కలో కథాంతరము విక్షేపహేతువై ఏకాగ్రతకు ప్రతిబంధక మవుతుంది. ఆదిమధ్యాంతక్రమము చూచుకొని విసుగు కలుగకుండా విరమించడము రసజ్ఞతాహేతువు.

కథాముఖము ఏవిధముగా నైనా ఉండవచ్చును. కొందరు స్వగత రూపముగానూ, కొద్దిమంది వాకోవాక్యధోరణిలోనూ, మరికొందరు పాటి గానూ, మరికొద్దిమంది అర్థాంతరన్యాసముతోనూ ఆరంభిస్తారు. ప్రతీక లోనే, అంటే, ప్రారంభవాక్య సందోహములోనే సూక్ష్మంగా నైనా స్థితిస్థా పన కావాలి. నిపుణత లేకపోతే ఆరంభదశలోనే కథ పదులుజడవలె వద వద లాడుతూ, అకర్షకము కాకపోతుంది.

కథాంతము కడుజాగరూకతతో నిర్వహించాలి. జనసామాన్యానికి

పూస గుచ్చినట్టు కథ చెప్పి, కొలికి పూస ముడివేసినట్టు ముగిస్తేనే గాని మోదము కలుగదు. పిట్టకథలలో పిల్లకథలలో, పుక్కిటిపురాణాలలో కథ కంచికి వెళ్ళింది అని ఉపసంహారవాక్యము కూడా ఉంటుంది. అప్పటికిగాని అహృదయాలకు ఆనందము కలుగదు. పూర్వము కాంచీ నగరము సమస్త విద్యలకూ, కళలకూ ఆలవాలము. అన్ని శాఖలలో ప్రవీణులు అక్కడ సమావిష్టు లయ్యేవారు. కథ కంచికి వెళ్ళిం దంటే అక్కడి కళావేత్తల అంగీకారముద్ర పొందిం దన్నమాట. అటువంటి కథాంతము వాచ్యరీతిలో జనాంగీకృతము. వ్యంగ్యవిధానములో ఉప సంహరిస్తే అనేకులకు అర్థము కాదు. ఆతరువాత ఏ మైన దనీ అడిగి తీరుతారు. అయితే అటువంటి ఉత్సుకత కలిగిస్తే కథ వ్యంగ్యవైభవంలో గట్టెక్కిం దన్న మాట.

కావ్యానికివలెనే కథకూ శరీరము, ఆత్మ విడతీసి వివేచించాలి. శరీర మన్నప్పుడు భాష, వాక్య నిర్మాణము, వాక్యసందోహము, ప్రకరణ విభాగము, కథానామము, నాయికానాయకాదుల నామధేయములు, గమనవిధానము, మొద లైనవి గమనించాలి. ఆపైన శరీరానికి లావణ్యమువలె కథకు శైలి కమనీయంగా ఉండేట్టు రచించవలె.

కథాత్మలో వస్తువు, తద్విశేషాలు, భావాలు, భావపర్యవసన్నత, రస ప్రతీతి, ఇవి లక్ష్యములో ఉండాలి. రచయితల రసికతను బట్టి హృదయంగమత్వము గాని, ధీప్రతీతి గాని ఉద్దీప్తమై ఉంటుంది. కేవల బుద్ధి వైశద్య విస్ఫూర్తికంటె హృదయాకర్షక మైన భావతత్పరత్వమే రమ్యతర మైన దని రసికజన సమ్మతి.

3

స్త్రీలు విద్యాభ్యాసం చేసి ధనసంపాదన చెయ్యడం యుక్తమా? కాదా? అనే విచారణలో పూర్వాచార పరాయణు డైన తండ్రి పొందిన మనః క్లేశమూ, ఈ సమస్యకు ఒకవిధంగా సమాధానమూ 'లోకం' అనే కథలో వర్ణిత మైనవి.

ఆంధ్రదేశంలో వివాహక్రమ విషయమై ఆడపిల్లలలో పెద్దదానికి ముందు, రెండవదానికి తరువాత, మూడవదానికి ఆ పిమ్మట పెళ్ళి జరుగుతూ ఉంటుంది. స్థితిగతులను బట్టి కొన్నితావుల్లో తారుమారు కాక తప్పదు. కన్యలే ఏ విధంగా దీనికి తోడుపడతారో 'అక్క పెళ్ళి' అనే కథలో చూడవచ్చును.

స్త్రీ బాగా చదువుకొని నవీన విధానంలో ముం దడుగు వేసి ఉత్సాహంగా సాంఘిక వ్యవహారాలు చాలారోజులనుంచీ నడుపుతూ ఉన్నది. పట్నాలలో నగరాలలో ఈమె నడవడీ, కార్యక్రమాలు పరిచితమై విడ్డూరంగా ఉండవు. కాని ఈమె పల్లె కాక పట్నం గాక ఉండే చోటికి వచ్చి ఆధునిక విధానంలో క్లబ్బు మొద లైనవి స్థాపించి, పురుషులతో ఎబ్బెరికం లేకుండా వర్తించి వెళ్ళిపోతే ఆ ప్రదేశంలో వివాదలు వస్తవి. ఈమె మీద అభిమానము గల పురుషులు ఒక్కొక్క స్థితిలో ఎలా ప్రవర్తిస్తారు ? ఆ వార్తలు తనకు తెలిస్తే ఈమె ఏం చేస్తుంది ? ఇటువంటి సందర్భాలు 'సంపెంగ పువ్వు'లో గుబాళిస్తవి.

ఆచరణ ఎలా ఉన్నా జనానికి సిద్ధాంతాలమీద పట్టుదల చాలా మెండు. భోగం అనుభవిస్తూ త్యాగాన్ని గురించి లోకం ఉపన్యసిస్తూ ఉంటుంది. తాము చెయ్యకపోయినా ఇతరులు త్యాగం చేస్తే లోకులు అభినందిస్తారు. సంఘానికి కలిగే ఇక్కట్లు నివారించడానికి జరిగే త్యాగం సర్వజనాదరణీయం అవుతుంది. త్యాగమూర్తులలో కొందరు బాగా యోచించి నిర్ధారణ చేసుకొని కార్యరంగంలోకి దిగుతారు. కొందరు సద్యఃస్ఫురణగా ఆవేశంలో అమాంతంగా సాహసకృత్యాలు చేస్తారు. 'శిలా ప్రతిమ' అనే కథలో దీక్షితులు వీటిని పరామర్శించి కరుణ, శౌర్యం, ఆశ్చర్యం వ్యక్తం చేశారు.

"మరువిష" మనే కథ మకుటాయమాన మైనది. నామధేయంలోనే విషయనిగరణం ఉంది. 'మ మేదం' (ఇది నాది) అని వ్యక్తులు, సంఘములు, జాతులు, కలహించడం, చివరకు యుద్ధాల్లోకి దిగడం, బీభత్సం జరగడం ఈ నాడూ చూస్తున్నాము. 'మరు విషయం'లో

ఇటువంటి జటిల సమస్యలు, ధర్మగ్లాని, ఉపప్లవం ఇత్యాదులు వర్ణితము లైనవి. చివరకు సమస్యా పరిష్కారం చిత్రంగా జరుగుతుంది. వైరత్యాగం అద్భుతంగా సంభవిస్తుంది. జ్ఞానోదయ మైతేనే కాని వైరస్యాలు విరమించవు. ఉత్తము లైన ఆచార్యపురుషుల ఉపదేశ ములు వింటే, వ్యక్తులు, జాతులు బాగుపడుతవి. హింసకు అహింసకు, భోగానికీ త్యాగానికీ, మాంద్యానికీ బోధకూ ఉండే తారతమ్యములు నోరి నరసింహ శాస్త్రి సరసముగా నిరూపించినాడు. కథ పూర్వకాలంలో జరిగినట్టు రచించినా ఇది సార్వకాలిక మని భావించవచ్చు. ఈ కథాన కము అత్యుదాత్తము.

సాధన చేస్తే కాని మానవునిలోని అధమగుణములు అంతరించి ఉత్తమ గుణాలు ఉద్దీప్తములు కావు. చిత్తవృత్తులను చెలరేగ నిస్తే అధఃపత నానికి అవకాశం ఎక్కువ. కొందరు విశృంఖలంగా ప్రవర్తిస్తూ అను కోని కొన్నిఘటనలవల్ల తమ జీవితాన్ని సింహావలోకనం చేసుకొంటారు. అంతటితో ఆగేవారు కొందరు, పశ్చాత్తాపం చెందేవారు మరికొందరు. ఇంకోరకం తమదుష్కార్యాలకు ప్రాయశ్చిత్తంకూడా చేసుకొనేవా రున్నారు. తీవ్రవేదన కలిగి బాగా యోచన చేసి తగిన శిక్ష విధించు కొనేవారుకూడా ఉన్నారు. 'ఆఖరు మాట'లో పార్థసారథి నాయుడు అలా చేసినాడు. ఆయన అవలంబించిన విధానం మాత్రం ఉచిత మని అందరూ అనరు.

సామాన్యంగా గ్రంథాలు బరువైన రచనలతో నిండి ఉంటవి. "న ప్రాప్నువన్తి యతయో రుదితేన మోక్షం, స్వర్గాయతిం న పరిహాసకథా ఋణద్ధి" అని మహేంద్రవర్మ తన ప్రహసనంలో అన్నాడు. నిజమే. కష్టాలు మరిచి పోవడానికి గాని, ఉల్లాసం పల్లవించడానికి గానీ, పరి హాస కథ చాలా అవసరం. మృదు హాస్యంతో క్లిష్టస్థితుల్లోంచి ఇవతల పడవచ్చు. ముని మాణిక్యం ఇటువంటి రచనల్లో సిద్ధహస్తుడు. చిత్ర మైన సన్నివేశాలు వర్ణించి కథకు పేరు ఇంగ్లీషులో ఉంచడంకూడా చమత్కారంగానే ఉంది.

అనేకులు సంతానవాంఛతో చాలా బాధ పడతారు. అందులోనూ పుత్ర సంతానం కావా లని మరీ ఏడుపు. పుత్రులు పుట్టీ ఏడిపిస్తారు, పుట్టకా ఏడిపిస్తారు అని తత్త్వవేత్త లన్నారు. స్త్రీసంతానాన్ని చూచి ఏవగించు కోటం, భారంగా ఎంచడం, కొడుకులకోసం అన్నిఅగచాట్లూ పడడం, చివరకు కలిగే ఫలితములూ 'పుత్ర సంతానం' అనే కథలో కనిపిస్తవి. ఇది విశిష్ట రచన.

చిన్నపిల్లకూ కొంచెము పెద్దవానికీ గాఢ మైన అభిమానం, దాని పరి ణామమూ, అటువంటి సన్నివేశ ఫలితం 'పొగడ దండ'లో ఆదర్శ ప్రాయంగా చిత్రిత మైనవి.

జానపదుల జీవితము, వీరి కోరి పెళ్ళాడిన అలుమగల వృత్తం, అంత రాయాలు, పరస్పర స్థైర్యం 'వాన'లో బాపి రాజు బాగా వర్ణించినాడు. "దేశము నా కిచ్చిన సందేశం" చాలా చమత్కారప్రదమైన విశిష్టకథ. ఇందులో రచనానైపుణ్యం హెచ్చు. ఉద్యోగి జీవితం ఎలాగో గడిచి పోతుంది. మొదటినుంచీ చివరిదాకా ప్రశ్న ఒకటే. ప్రచ్ఛకులు మాత్రం రకరకాలవాళ్ళు. ఈ ప్రశ్న బహుశా ఎప్పుడూ ఉండేదేమో— ఆర్థిక విషయం కావటంచేత. ప్రశ్నకు సూటిగా సమాధానం ఇవ్వకుండా చిత్రచిత్రంగా ఇందులో ప్రధానపాత్ర తప్పుకుంటూ ఉంటుంది. ఆ నేర్పు అద్భుతావహం.

'ఢు ము వు లు'. ఇందులో పేరు మొదలు శబ్దవిన్యాసం, వాక్య సందోహం, వర్ణన, సంభాషణ, నిర్వహణ—అన్నీ చమత్కార జనకములు. వస్తువు కవికుటుంబ జీవితం. రామకృష్ణ శాస్త్రిరచన అతిరమణీయము.

మధ్యతరగతి కుటుంబజీవితం ఉన్న దున్నట్లు 'ఇల్లు కొన్నాడు' అనే కథలో కనిపిస్తుంది. ఇల్లు కొనడం ఎంత కష్టమో, నిలుపుకొనడంకూడా అంతే! చివరకు మిగిలే దేమిటి? అనేది సమస్య. ఆంధ్రదేశంలో తరచుగా ఇదే గోచరిస్తుంది.

కథా రచనలో శివరామ శాస్త్రి గొప్పశిల్పి. ఏ విషయమైనా చిత్ర మైన దృక్కోణంనుంచి చూడగల నేర్పరి. ఉన్నత విద్య, ఆర్థిక స్థితిగతులు,

కుటుంబ జీవనం—మధ్య తరగతిలో—హాస్యరేఖతో జాలి కొలిపేటట్టు 'డిప్రెషన్ - చెంబు' కథ ప్రదర్శిస్తుంది. రచనలో చాలా వ్యుత్పత్తి ప్రతిఫలిస్తుంది.

"బాధ్యత" లేఖారూపంలో, 'డైరీ' పద్ధతిలో నడిచిన కథానకము. పాత్ర లన్నింటికీ బాధ్యత ఉన్నట్టే కనిపించి, లేన ట్టుంటుంది. బాధ్యత ఎవరిదో తెలియదు. వివాహంలో వైచిత్ర్యం దీనిలో ప్రధానాంశం. రచనా పాటవం ప్రచురంగా ఉన్నది.

కోరికలు అణుచుకుంటే మనస్సులో కల్మషం పెచ్చుపెరిగి కష్టాలకు కారణం అవుతుం దని మనస్తత్వశాస్త్రవేత్త లన్నారు. తీరని కోరిక లున్నవాళ్ళకు ఎవరు మంచి మాట అన్నా ఆశ్వాసం ఉండదు. 'అనాశ్వాసిత'లో ఈకాలం కోరికలు నిశ్శేషం చెయ్యక అణచిపెట్టుకొన్న అధునాతన ఆంధ్రస్త్రీ దృష్టి, వర్తనం, బాగా చిత్రించింది సరస్వతీ దేవి.

ఆంధ్రప్రదేశములో మంచి కథలు రచించగలవారు పురుషులు, స్త్రీలు, పరశ్శతముగా ఉన్నారు. ఇందులో కొందరు వివిధ బహుమానములు పొందినవారు, యావదాంధ్రఖ్యాతి, యావద్భారతఖ్యాతి కన్నవారూ ఉన్నారు. ఐనా కథా సంకలనములో కొందరి రచనలు మాత్రమే స్వీకరించ డానికి అవకాశ ముంటుంది.

కొత్త ఢిల్లీ లోని సాహిత్య అకాదమీవారు ఆంధ్రభాషలో 16 కథానకములు మాత్రమే ఏర్చి కూర్చవలసినదని నియోగించినారు. సమాలోచక సంఘము వారి సలహాలను అనుసరించి ఈ కథానికా సందోహము సంకలిత మయినది.

— శ్రీ —

విలంబ, చైత్ర, శుద్ధ, ప్రతిపత్,
మార్చి 21, 1958

# అనుక్రమణిక

---

పీఠిక

# లోకం

## శ్రీ బలివాడ కాంతా రావు

జననము 3–7–1927. స్వస్థలము శ్రీకాకులము జిల్లాలోని 'పదపాం'. విశాఖపట్టణములో విద్యాభ్యాసముచేసి- అక్కడనే ఉద్యోగము చేయుచున్నారు. 'అర్ధభాగాలలో భిన్నహృదయాలు', 'శ్రామికులు' మొదలగు కథానకములు; 'బూచి' 'అన్నపూర్ణ'; 'పరాజయము', సుగుణ మొదలైన పెద్దకథలు, 'గోడమీదిబొమ్మ' అను నవల రచించినారు.

నీలకంఠం తోడి గుమస్తా పెళ్లాం పోయినపుడు అన్నాడు "ఆరోజు వస్తే ఎవరూ ఆపలేరు. అయినా నువ్వింత యిదిగా వుండటం బాగు లేదు. చచ్చేవాళ్ళతో మనం చచ్చిపోతామా?" పొరుగింటాయన పెద్దకొడుకు కళ్లు మూస్తే "చావంటే మాసిన బట్టను వదిలి కొత్తది వేసుకోవటమేగా! ఆత్మకు చావులేదని తెలుసుకోరేం?" అనుకున్నాడు. ఆవీధిలో ఒకయింటిలో వారం రోజులవరకూ ఒకచావుకు మిగిలినవారు ఒకటేయేడుపు. "చావుకు యేడ్చే మనం ముస్లింలు, క్రైస్తవులకంటె యెంత వెనకబడ్డాం!"

నీలకంఠం ఎంతతేలిగ్గా అన్నాడో, అనుకొన్నాడో చావు గురించి, అంత చులకనగా అభిప్రాయపడ్డాడు.

పాతికేళ్ళపరిచయం వున్న భార్య గతించిం దీనాటికి. నీలకంఠంకు ఒక కాలు విరిగినట్లు, ఒక చెయ్యి తెగినట్లు, గుండె చిటలు తేరిన ట్లయింది.

చావు... భయం... భయంకరం...... విషాదం... లో జండా కడుపున నింపుకున్న దుఃఖాన్ని కటిక చీకటిలో డాబామీద కన్నీటిగా కొంత కార్చాడు.

ఉండటానికి ఇల్లు సంపాదిస్తా ననీ, భార్యకు పట్టు చీరెలు కొంటా ననీ, ఒంటినగలు నింపుతా ననీ, పెళ్ళయిన మొదట్లో అనుకోవటమే కాదు - పెళ్ళాంతో చెప్పాడు కూడాను - చెప్పటమే కాదు - ప్రయత్నించాడు. ఆ ప్రయత్నం ఊహలోనే జరిగింది. "అదృష్టంఉంటే అవే వస్తాయ్" అని ఆమె అన్నమాటకు సర్దు కున్నాడు.

తొమ్మిది మాసాలు నిండేవరకు తనకు ఎవ రైనా ఒకటే అనుకున్నా, కూతురు పుట్టగానే "ఇంటికి లక్ష్మికళ" - ఉత్సాహంతో ఊగులాడాడు. ఆ కూతురుకు వీణ నేర్పిస్తా నని, విద్యల సరస్వతి చేస్తా నని పొంగిరాడు.

"దాని రాత ఎలా వుందో? అప్పుడే ఎందుకనుకోవాలి" అన్న భార్యమీద చిరాకు పడ్డాడు. రాత - రాత - మనుష్యులు సోమరు లవటానికి - ఈ పిచ్చి అంటుకుంటుం దని, అభిప్రాయం వెలిబుచ్చాడు.

ఈ కూతురు పెళ్ళి ఘనంగా చెయ్యాలనీ, గొప్ప ఆఫీసరు అల్లు డవా లని, అనుకున్నాడు. అందుకు సర్వప్రయత్నాలు, మనోభావాలతో చేసేడు. ఒక కూతురు ఒక కొడుకూ అయితే చాలు, హాయిగా వుంటుం దనుకొంటే, రెండో సంతానం కూతురే !

మూడోసారి తప్పక కొడుకే అనుకొన్నాడు. దేవుని యొక్క నిజాయితీ చూద్దా మని, భార్యతోపాటు తనూ ఒకటి రెండు సార్లు ఉపవాస మున్నాడు. శివాలయానికి వెళ్ళాడు. కొడు కని కలలు

కన్నాడు. కొడుకు చదు వెలా వుండాలో వూహించుకొన్నాడు. ఈసారి కొడుకు తప్ప దని చెప్పుకున్నాడు. కొడుక్కీ తనకూ మధ్య యెలాంటి తగాదాలు ఉండ వనీ, తను రిటైరై కొడుకువల్ల సుఖపడతా ననీ తలచాడు. కానీ యీసారీ కూతురే! ఆ నిముషం నుంచీ దేవునిమీద భక్తి గౌరవాలు తగ్గాయి. పూజలు పునస్కారాలు బూటకం అనుకొన్నాడు.

మూడోపిల్లకు తల్లి ఎంతో గర్వంగా, ముగ్గురు పేరంటాళ్ళ పేర్లు కలిపి, "వెంకట సీతా మహాలక్ష్మి" అని పేరు పెట్టింది. నీలకంఠం యీ సన్యాసి యెక్కడ పుట్టిపోయిం దని, సన్యాసమ్మ అని పిలిచేవాడు. చివరకు ఆపేరే నిల్చిపోయింది.

పిల్ల యెప్పుడూ యేడుపే. నీలకంఠంకు ఎంతో చిరాకెత్తేది. చస్తే పీడా పోయే దని, ఆలోచించినా, అలా ఆలోచించటం పాప మని మళ్ళీ సర్దుకొనేవాడు.

సన్యాసమ్మ థర్డుఫారంచదువుతో చాలించ మంటే, యేడ్చి యేడ్చి, ఒకరోజు అన్నంకూడా మానేసింది. భార్య "పోనీ దాని సరదా యెందుకు చంపా"లని బ్రతిమాలటంవల్ల థర్డుఫారం వరకూ ఊరుకొన్నాడు.

తనకు ఆడవాళ్ళచదువుగురించి నిశ్చిత మైన అభిప్రాయం యీనాటికీ లేదు. ఏ మైనా యీనాటిచదువులు ఆడవాళ్ళకి పనికిరా వనిమాత్రం నిష్కర్షగా చెప్పగలడు. సీత, సావిత్రి, శకుంతల నేర్చిన చదువులాంటిది తన అమ్మాయిలకుకూడా చెప్పించాలని, అదే అస లైన చదువని తన అభిప్రాయం. ఆ సిలబసు చెప్పమంటే చెప్పలేడు. చాలమంది చదువుకున్న అమ్మాయిలు పెళ్ళి చేసుకోక పోవడమో, పెళ్లి చేసుకొన్నా మొగుడు చెప్పినట్లు

వుండకపోవటం, డొంకతిరుగుళ్లు తిరగటం, గర్వం, అహం భావంతో యెగిరిపోవటం - యిలా యెన్ని దృష్టాంతా లైనా తన వాదనను బలపర్చుకోవటానికి చెప్తాడు. ఎవ రైనా "నీ చిన్నమ్మా యిని యెందుకు చదివిస్తున్నా" వంటే తనకు తెగ కోపం వచ్చేది. వా ళ్ళా ప్రశ్న వేశా రని కాదు - ఆ అమ్మా యంటేనే కోపం.

సన్యాసమ్మ యిక చదవటం కల్లోమాట - ఏడుపు ! యిక పని చెయ్యలేదు - నాన్నజీతం అమ్మ భద్రంగా పెట్టిలో పెట్టడం చూసింది. ఆ మరుచటిరోజు యింట్లో, పెద్ద రభస జరిగింది - "సరే - మరేం చేస్తాం. పోనీ చదవనియ్యం"డన్న పెళ్ళాంమీద నిజంగా ఈ ఒక్కసారే కోపం వచ్చింది. పెంగతనం చేసి స్కూలుజీతం కట్టిన కూతుర్ని సమర్థించినందుకు, భార్యమీదకు యెగిరి పడ్డాడు.

తరువాత త నేదో తప్పు చేసా ననుకొన్నాడు. భార్యకు త నిచ్చిన వాగ్దానాలు జ్ఞాపకాని కొచ్చాయి. అందులో వెయ్యో వం తైనా తను తీర్చడం లేదు. అయినా ఆమె తనని కనిపెట్టు కొని వుంది. అప్పుడప్పుడూ తను దురదృష్టవంతు డని, అసమర్థుడ నని, తన భార్య సమర్థురా లనుకొపటం తనకు సరదా !

"ఏమీ అనుకో వ" ద్దని అన్నాడు.

"మీ రైనా అనకపోతే, యిం కెవ రంటా రని" నవ్వుతూ అంది.

అలాంటి భార్య యీనాడు చచ్చిపోయింది.

కొడుకు కావా లన్న ఆశ - ఆరాటమై...నిరాశై...చివరకు కూతుర్లు యెదుగుతుంటే...మంచి పెద్ద హోదాలోవున్న అల్లుళ్ళు కావా లన్నకోర్కె హెచ్చయింది.

ఈ కోర్కె తీర్చుకోవా లనే ఆరాటంలో —

సంఘం పాడై పోయిం దనుకున్నాడు. కట్నాలు రక్తం పిండినట్లు పిండుతున్నారు. ఆడపిల్ల లుండటం నేరం! ఉదాహరణలుగా యెన్ని కుటుంబాలనో వే లెత్తి చూపిస్తాడు.

చాలా సంబంధా లున్నాయని తెలుసు. అ వెందుకో తనకు నచ్చ వనుకొంటాడు. వాళ్లతో తనకు పొత్తు కుదరదు. మంచి మనసు కలవా ళ్ళయితే ముందుకు వచ్చేవారు!

ముఖ్యంగా తన పెద్దకూతురుపెళ్ళి మనసులో యిరవై నాల్గుగంటలూ వుండేది. ఆమెను ఒక చక్రవర్తి కిచ్చినా తన ఋణం తీరదు. ఆ కూతురు కడుపులో ఉన్నప్పటినుంచీ గర్వించాడు. రానురాను పలవరించాడు, రోడ్డుమీద యెవరైనా అందమైన కుర్రవాడు కనిపిస్తే తేరి జూచేవాడు. ఒక్కొక్కసారి నా కూతురికి తగినవా డీలోకంలో లే డేమో అనిపించేది. అందం ఉంటే గుణం పూజ్యం. గుణం వుంటే అందం తక్కువ!

ఒక్కొక్కసారి అనుకునేవాడు "ఈ కుర్రాడు చాలా మంచివాడు. కట్నం లేకుండా పెళ్ళి చేసుకోవా లని పట్టుదల. కానీ తండ్రి వేలమీద ఉన్నాడు. ఈ సంఘర్షణలో పాపం నలిగిపోతున్నా"డని విచారించేవాడు.

ఇంకో ముసలాయన్ని చూసి "ఈయన రెండువేపులా ఖర్చులు భరించుకొని, వున్న ఒక్క కొడుకును, పేదింటిపిల్ల నిచ్చి పెళ్ళి చేదా మనుకొంటున్నాడు. కానీ, పెళ్ళాం, కొడుకు కా దంటున్నారు." "ఉద్యోగం అయ్యాకగానీ పెళ్ళి చేసుకో"నని చెప్పే వాళ్ళు చాలామంది తనవూహకు వచ్చేవారు. ఈ వూహలోవచ్చినవాళ్ళలో పె ళ్ళయినవాళ్ళు, పిల్ల లున్నవాళ్ళు కూడా వుండేవారు.

తన వూహ ఒక్కసారే నిజమైంది. బాగా డబ్బు వున్నవాళ్లే ఆ అబ్బాయిని చూడగానే కమ్యూనిష్టనుకొన్నాడు. అక్షరాలా నిజమైంది. ఆ తండ్రి ఆ కొడుకుకోసం పడ్డ ఆరాటం! తండ్రిని ఎంగలా చూస్తాడేం ఆ కొడుకు? నీలకంఠం ఆ కుర్రాడు తనకు అల్లుడు కాకూడదనుకున్నా రెండురోజులవరకూ విచారించాడు ఈ లోకంలో ప్రజలు యెందుకు యిన్ని పార్టీలుగా విడిపోతారో తనకు అర్థం కావటం లేదు. తనకు మొదటినుంచీ యిప్పటి ఒకటే దృక్పథం. తను ఆ రోజుల్లో ఖద్దరు కట్టాలనీ, సత్యాగ్రహం చేయ్యాలనీ, జైలుకు వెళ్ళాలని, త్యాగపురుషుడవాలనీ, యెంతో ఉబలాట పడ్డాడు. ఏదీ జరగలేదు కాని, తనకు కమ్యూనిజమంటే పూర్తిగా తెలియకపోయినా, మనిషి కమ్చీతో కొట్టి పని చెయ్యిస్తుందని, అసహ్యంగా చూస్తాడు.

అయినా యీ ప్రజలు ఒకరి నొకరు అసహ్యించుకోవటం తనకు గిట్టదు. చిన్న కూతురుమీద తనకు అసహ్యం అంటే ఒప్పుకోడు. కూతురంటే అభిమానమే, కూతురు గుణాలంటే నచ్చవు. కాని ఈ లోకంలో ఎవరికి తగ్గ కష్టాలు వాళ్ళకి వున్నాయి. డబ్బుకోసం ఒకతెగ కష్టపడితే, మానసికంగా మరి కొందరు బాధపడతారు - అంతే భేదమని చెప్తాడు.

అల్లుళ్ళకోసం ప్రయత్నించింది తక్కువ - ఆలోచించింది యెక్కువ - మనసులో బాధపడింది బ్రహ్మాండం!

ఆఫీసులో తను డబ్బు రాబట్టుకో గల సీటులోనే ఉండే వాడు. ఈ కూతుర్ల పెళ్ళి ఒక్కొక్కసారి మనసును ఆవిషయం వేపు త్రిప్పేది. ఎంతోమంది పుచ్చుకొంటున్నారు కదా తను ఎందుకు పుచ్చుకోకూడదని పొరపాటున అనుకొన్నాడు. వస

అయ్యేవరకు బ్రతిమాలి డబ్బు చేత పెట్టారు, తరువాత శాపనాలు కురిపిస్తారు. అంతేకాకుండా డబ్బు పుచ్చుకుంటే తన్ను తనే తిట్టుకోవాలి! అనుమానించాలి. లోకం యెన్నికైన మనిషిని అసదు. దొంగని చూపించినట్లు వ్రేలుతో చూపిస్తుంది. తను వృత్తి గాలిబుట్టపలె తేలిపోతాడు. లంచాలు పుచ్చుకొన్న తోడి గుమస్తా పెళ్ళాం చచ్చిపోయిందే! తనలా చేస్తే తన పెళ్ళాం పోతుంది. వద్దు వద్దని వందసార్లు అనుకున్నాడు. ఈ బ్రతుకే చాలు......ఈ పెళ్ళామే మహాలక్ష్మి!

పెద్దకట్నం యెర చూపలేని తను పెద్దకూతురు పెళ్ళినాడు ఎంత బాధపడ్డాడు! ఈ సంఘంమీద యెంతగా యేడ్చాడో, తను అనుకున్న దల్లా జ్ఞప్తికి వచ్చి గుండె పగిలిపోయింది. అందం నెమ్మది ఆభరణాలుగా గల యీ కూతుర్ని - ముందూ వెనుక యెవరూ లేని తనలాంటి గుమాస్తాకే యిచ్చాడు! ఈ పెళ్ళయినా తను యేవగించుకొన్నా పెళ్ళాం పిసినారితనం వల్లనే జరిగింది.

గుండెలోపుండు యింకా మానలేదు. గునపాం పోటులా తగిలింది. విద్యల సరస్వతిగా, వీణా వాణిగా యింకా వూహలో నిల్చిన కూతురు విధవై కూర్చుంది! దేవుడు గ్రుడ్డివాడని యేడ్చాడు.

విధవా వివాహాలంటే తనకు ప్రీతి. వీరేశలింగం గారంటే భక్తి. ఎవరైనా అలాంటి వివాహాలు చేశారంటే ముచ్చట పడతాడు. కానీ తన కూతురుకు మళ్ళీ పెళ్ళి చెయ్యాటమంటే గిట్టని పని!

ఆడవాళ్ళు పవిత్రులనీ, వాళ్ళ పాతివ్రత్యమే, మన సంఘాన్ని, సాంప్రదాయాల్ని, యీ దొరలు రాజ్యం చేసినా, నిలి

పిం దనీ, తనగట్టినమ్మకం. తన భార్య యెప్పుడూ నాకిది కావా లని, అది కావా లనీ, కోరలేదు. తన మాటకు యెదు రాడలేదు. బాధపడటానికి జంక లేదు - అన్నిటికి తల ఒగ్గింది - యీ నర కాన్ని స్వర్గం చేసుకొంది.

అచ్చంగా ఆమెలానే, కూతుర్లూ వుండా లని, కాంక్షించాడు నీలకంఠం. అందుకే మొదటి యిద్దరి కూతు ర్లంటే తనకు తెగ అభిమానం. భార్యకు వీళ్ళకు తేడా - భార్య ఉత్తరం వ్రాయ లేదు - వీ ళ్ళిద్దరూ వ్రాయగలరు.

ఇన్నికష్టాలు పంచు కొన్న భార్య పోయింది. ఆలోచించాడు. ఆమెతో వున్న కాల మంతా నెమరువేసుకొన్నాడు — ఏకాకిగా యేడ్చాడు. ఆ వయసులో వా ళ్ళెపరూ అంతగా యేడవనట్లు యేడ్చాడు. అంతే కాదు. ఆభార్య చివరిగడియలు జ్ఞప్తికి వస్తే, యీ పాతికేళ్ళూ దగ్గరగా వున్నవాడు, ఆమెకు దూర మైనట్లు అని పించేది. ఆ ఆలోచన రాకుండా వుండా లని ప్రయత్నించేవాడు.

"ఆమె స్వంతలాభం చూసుకొంది. ఆమె జీవితంలో ఒక్క సారే - అదీ చనిపోయేముందు" - నీలకంఠందృష్టిలో! యింత కల్లోలంగా వున్న యింటినిచూసి ఎలా విడిచివెళ్ళింది? పుణ్యా స్త్రీ చావు రావా లని కోరుకుందే? ఏమిటోపిచ్చి! అంత మంచి మనిషి యేం కోరుకుంటే అది రాదూ? భార్య యింకా బ్రతుకు తా నని కోరుకొంటే నీలకంఠందృష్టిలో బ్రతికేదే!

ఆమెతో యిల్లు సంపాదిస్తా నన్నాడు. ఆమె అద్దెయింటి లోనే చనిపోయింది. ఒంటినగలు నింపుతా నన్నాడు - మంగళ సూత్రంతోనే మాయమై పోయింది. పట్టుచీరలు కొంటా నన్నాడు- మాసినబట్టలతోనే చనిపోయింది -! అయినా ఆమె యి వేవీ లేక

పోయినా ''నా కేం లోటు'' అంటుండేది! ఇదే తలపుకు వచ్చి, మరీ కళ్ళు నులుపుకున్నాడు!

ఇటు మనసులో మూలుగుతూ అటు పెద్దమ్మాయి లిద్దరి వేపు చూస్తూంటే గుండె తరుక్కు పోతూంది!

ఇద్దరూ ఆ తల్లిని తల్చుకుని యేడుస్తారు. వాళ్ళని తను ఓదార్చా లనుకున్నా ఓదార్చలేడు! తను అసమర్థు డని అను కోవటంకన్నా లోకం తనకు అన్యాయం చేసిం దని ఎవరితోనూ చెప్పుకోలేక పోతున్నాడు. తన ప్రస్తుత పరిస్థితిలో రెండో అమ్మాయి పెళ్ళి వూహించటాని కైనా వీలులే దని స్ఫురించింది. అంత నమ్రతతో బ్రతికిన యిల్లాలికి తను ఎంతైనా ఋణపడి ఉన్నాడు. ఆ ఋణం తీర్చుకోడానికీ, కార్యానికీ, మాసికాలకు, రూపాయకు నెలకు, అణా వడ్డీలకు అప్పు వాడటానికి జంక లేదు. ఒక మిత్రుని దయవల్ల ఒక షావుకారు దగ్గర యెటువంటి హామీ లేకుండా యీ మూడువందల చిల్లర దొరికింది! అలా దొరికిందీ అంటే ఆ భార్య మంచితనమే అనుకొన్నాడు.

నెలనాడు యిరువైరూపాయలు వడ్డీ కట్టాడే కాని, మనసు భయంతో నిండిపోయింది. అన్నమాట నిలపడటం తన విధి. తను గంజి తాగైనా అప్పు తీర్చాలి అని అనుకున్నాడు - ఆ విషయం అహోరాత్రాలు ఆలోచించేవాడు.

ఈ ఆలోచనలతో నీరసించటం అలా వుంచి చిన్నకూతు రొకసమస్య తెచ్చిపెట్టింది. తల్లిపోతే బెంగపెట్టుకొని కుమిలి పోవలసింది! నిజానికి ఆ తల్లి మిగతా యిద్దరికన్నా, యీ చిన్న కూతుర్నే బాగా చూసింది. వాళ్ళలా యీకూతురు కుంగిపోక పోవటం చూసి యెంత కృతఘ్నురా లని అసహ్యపడ్డాడు.

ఇంటరులో చేరుతా నని పట్టుపడితే తను పట్టలేనికోపంతో మాట్లాడలేక పల్లు పటపటలాడించాడు. స్నేహితురాళ్లు సహాయం చేస్తా మంటున్నారు. మీ రేమీ అడ్డుపెట్టకండి అంటే, వెటకారంతో యీ సడింపు మాటలాడాడు. దీనితో కూతురు యింట్లో మిగతా యిద్దరిలా దేవతా విగ్రహంలా పవిత్రంగా వుంటుం డను కొన్నాడు.

సన్యాసమ్మ యింటరులో చేరింది! ఎప్పుడూ లేనిది, నీలకంఠం కళ్ళు తడుపుకొని, తనకోపాన్ని దుఃఖంతో మిళితం చేసి మిగతా కూతుళ్ళదగ్గర వెళ్లగక్కాడు. భార్య ప్రయత్నం లేకుండానే జ్ఞాపకం వచ్చింది.

కాలేజీనుంచి యింటికి వచ్చిన చెల్లెల్ని యిద్దరూ మందలించారు. నాన్న కష్టాన్ని చెప్పారు. సన్యాసమ్మ తనను కాదన్నట్లుగా వూరుకొని, మళ్ళీ కూర్కులుకు వెళ్ళిపోతూ అంది "నాన్నకా పెంగతనం యెందుకు? నన్నేమైనా అనాలని వుంటే నాయెదురుగా అనకూడదేం?"

అసలు మన సంఘంలో యే యింటిలోనూ, జరగనిపని జరిగిం దని నీలకంఠం బాధపడ్డాడు!

దాని ప్రతిఫలం ఆ మరుచటినెల తను వూహించినట్లే కనబడింది. ప్రయివేట్లు కూతురు చెప్పటం చూశాడు. ఒకనాడు ఆఫీసునుంచి వస్తూ గోడలమీద రాతలను చూసి కళ్ళు పొడుచుకోవా లనుకున్నాడు. తన పెళ్ళాన్ని తలుచుకొని, మనసునిండుగా దుఃఖాన్ని నింపుకొన్నాడు. ఆ కోపంతో వచ్చి "చూడండమ్మా! మీ చెల్లెలిపేరు గోడ లెక్కిందే! కర్మ! కర్మ!" అంటూ తల బాదుకున్నాడు.

ఇద్దరు కూతుర్లకళ్ళలో నీటిపర్యంతం వచ్చింది. రెండో అమ్మాయి ధైర్యం చేసి చెల్లెల్ని మందలించింది.

"ఎవరో తెలివితక్కువ వెధవ లైతే నే నెందుకు బాధ పడాలి? రాయటమే కాదు - పేపర్లుకూడా పంచిపెట్టనీ" అంది. ఈ మాటలు ఒకచెవిని వింటున్నతండ్రికి ఒళ్లంతా జరజర లాడింది.

ఇంకోనెలలో కూతురు జోడు వేసుకోవటం చూశాడు. మడమలు కొద్దిగా యెత్తుగావున్నయ్. ఏదో బ్రహ్మాండం బ్రద్ద లైన ట్లుగా అనిపించింది. అది మన సంస్కారానికి తగ దనిపించింది. ముఖ మెత్తుకొని ఠీవిగా నడిచే ఆడవాళ్ళని తను నేర్చుకోలేదు. ఇన్నాళ్లూ ఆగాడు, కూతురు ఒకనా డైనా, ఒక కానీ అడుగుతుం దేమో అని,అడగకపోవటంతో తను యింటికి పెద్ద ననే విషయాన్ని గమనించ లేదని, యేవగించుకున్నాడు. చిన్నకూతురికి ముఖం చూపించడ మన్నా, ఆమెతో మాట్లాడడ మన్నా అసహ్యా మైనపని- తన మనసు ససేమిరా ఒప్పుకో లేదు. దీని కింకో కారణంకూడా వుంది. ఆవీధిలోనే కొందరు కాలేజీకుర్రా ళ్లున్నారు. ఒకనెల అవుసరానికి ఒక కుర్రాడ్ని అడిగి అప్పుతీసుకుం దని తెలిసి పోయింది. ఆ కుర్రా ళ్లంటే తనకు అసహ్యం. వాళ్లు తనపిల్లల కోసం చుప్పరిస్తూంటా రని! అలాంటితెగలోవాడిని అడిగింది!

ఈకోపం ఉంచుకోడానికి మనసులో చోటు లేక వెళ్ల గ్రక్కాడు. "ఆడవాళ్ళ ప్రతివిషయంలో మగవాళ్ళు మహా తెలిసినట్లు చొక్యం చేసుకోవటం అంత మంచిపని కా దక్కా! ఆడవాళ్లబుర్రలో మట్టి లేదుగా! ప్రతిదానికి నాన్నమీదనే ఆధారపడమంటావ్?కన్నందుకు కడుపునిండా తిండిపెడ్తున్నారు చాలదా?"

ఈ సమాధానంతో యిద్దరూ నోరు మూసుకున్నారు.

సన్యాసమ్మకు చదు విచ్చిన సంస్కారం, నడకలోను, వేషభాషల్లోనూ, కనిపిస్తూ నేవుంది. అందమైన ఆ ముఖానికి మెరుగు పెట్టిం దీచదువు. మాటల్లో ముత్యాలు రాలతాయి. నవ్వకుండానే, మోదాన్ని కొలిపే ముఖం. చిరునవ్వు వెలగబోస్తే చూచే వాళ్ళు చాలా సేపటివరకూ, ఆ ముఖాన్ని మనసునుండి తుడిచి వెయ్యలేరు. యౌవనం ప్రతి అవయవంలోనికి చొచ్చుకొనిపోయి విజృంభించింది!

ఇలాంటికూతుర్ని తను ఎంత స్వేచ్ఛగా విడిచిపెట్టాడు? లోకం ఏ మనుకుంటుంది? ఆమెకు చిన్ననాడు వచ్చినజబ్బులు కూడా తలపుకు వచ్చేయి. అనుకోకుండానే డాక్టరుని ఎందుకు పెట్టా నని తికమకపడ్డాడు.

ఈ కూతురుమనసుకు యిచ్చే ఆవేదనతోబాటు, అటు డబ్బుకుకూడా చిక్కులు పడ్తున్నాడు. ఇదివరకు ఒకరిడగ్గరికి వెళ్ళి చేయి చాపే అవసరం తనభార్య కలగ నివ్వలేదు. ఇప్పుడు తెచ్చినడబ్బు ఖర్చుపెట్టడంకూడా తనకు తెలియటం లేదు. తను ఒకసారి హెచ్చు ఖర్చుపెట్టిస్తున్నా నని, యింకోసారి పిసినారినై పోతున్నా నని, అనుకున్నా తనకు యెన్నడూ లేనిది డబ్బున్నవాళ్లు ఖర్చులతో తనఖర్చులు, వాళ్ళ నిజాయితీ, వాళ్ల కష్టాలతో తన కష్టాలను పోల్చుకోవటం అలవాటయ్యింది. ముఖ్యంగా నెలకు వడ్డీకట్టిననాడు, మన స్సంతో అటమటించి పోయేది. ఆబాధతో ఎందరో తనలాంటి గుమస్తాలగురించి కుటుంబాలగూర్చి, కడుపుసొదతో, అడుక్కొనేవాళ్ళ విషయం ఆలోచించేవాడు. ఆ రాత్రంతా నిద్దర వుండేది కాదు. రష్యాలో

అంతా ప్రభుత్వమే చూస్తుం దట. – మనదేశంలో అలాంటి ప్రభుత్వం లేదే అనిపించేది. మిగతాడబ్బు యింట్లో చాలక యే స్నేహితుడినో, అడిగితే అడిగేవాడు. లే దన్నపుడు, మెడకు వురి పోసుకోవా లన్నంతగా మనస్సు చచ్చిపోయేది.

రానురాను ఆర్థికంగా కష్టం వూహించటమే కాకుండా, అనుభవించటం జరుగుతోంది. రోజుకురోజు మనిషి బెంగతో నీరసించి పోతున్నాడు. త నెందుకా అప్పు తీర్చాలనికూడా ఆలోచించక పోలేదు. మధ్యను ఒకడ్ని పెట్టాడే - అందులో ఆ డబ్బు భార్యకోసం వినియోగించాడే - మాటపోదూ ?

తనకు యిదివరలా ధృఢంగా ఉండే నమ్మకాలుకూడా చెదర జొచ్చినయ్. నిజాయితీ ఏమి టనుకున్నాడు. తన తహాశీల్దారు రెండుకుక్కల్ని పెంచుతున్నాడే ! - తన హెడ్గుమస్తా స్వంతమేడలో వుంటున్నాడు ! తనకు తెలిసినవాళ్ళల్లో నిజాయితీగా వున్న వా ళ్ళెవరూ కనబడలేదు. తను నిజాయితీగా వుండి మాత్రం యేం సుఖపడ్డాడు ? తన పెళ్ళామూ పోయింది. తన కూతురా విధ వైంది - తనకా మగసంతానం లేదు. ఆడపిల్లలున్నందుకు బాధ్యత తీర్చుకోలేక పోయాడు.

ఇదే నిశ్చయానికి వచ్చి, తనకు డ బ్బిచ్చేవా ళ్ళెవరూ కనబడలేదు. ప్రతీదానికీ మీదనున్నవాళ్లే తడుముకుంటుంటే తన వరకూ వచ్చే దేమిటి ? - బేడకు, పావలాకు కక్కూర్తి పడేది బదులు వూరుకొంటే వుత్తమం. డబ్బున్నవాళ్లు మరింత పెరగడానికి, పేదవాళ్లమీద సవారీ నిజంగా చేస్తా రని, వాళ్ల మానసిక బాధలకు, ఈ సవారీ సరిగ్గా చెయ్యలేక పోయా మనేదే, కారణ మని తోచింది. ఇన్ని పార్టీలుగా ప్రజలు విడిపోవటంలో బేస

బబు ఏమీ లేదనిపించింది, సుఖం లేనిది ప్రజ లంతా ఒకతాటని ఎలా నడుస్తారు ? కొందరి కడుపులు మాడుతూంటే, మరికొందరి కడుపులు నింపుగా వుంటాయ్. - కొందర్ని చూసి మరికొందరు అసహ్యించుకొంటారు - ఒకరినొక రింకొకరు చూడలేరు. పేప ర్లలో పెద్దపెద్దవాళ్ళు ప్రపంచ శ్రేయ ప్రభుత్వ మని, ప్రజా ప్రభుత్వ మని, - ఇలా పెద్దగా యిచ్చే ఉపన్యాసాలు చూస్తూంటే యిదివరలా తను యిప్పుడు ఆసక్తి చూపించలేక పోతున్నాడు. సంస్కృతిగురించి ఎవ రైనా మాట్లాడితే, యిదివరలా చెవి యొగ్గ లేక పోతున్నాడు. ఆకలితో ఉన్న కడుపుకు అన్నమే సంస్కృతి- బాధ పడేమనిషికి సుఖమే సంస్కృతి-ఈ సుఖం కమ్యూనిజంలో వస్తుం దని విన్నాడు. దానిగురించి కొంత తెలుసుకున్నాడు. ఎల క్షనులో ఆపార్టీకి వోటు వేశాడు. రాజకీయచైతన్యం లేనందువా బ్రతక కూడదని తోచిం దతనికి. తను రిటై రయ్యేలోగా ఈ దేశంలో అంతా ప్రభుత్వం చూసుకొనే పరిస్థితి వస్తే ఎంత అదృష్టం అనుకున్నాడు.

ఈ డబ్బువిషయంలో తప్ప మిగతావిషయాలలో రష్యా సంపాదించిన అభ్యుదయాన్ని తను కోరలేదు. రష్యాలో స్త్రీలు గద్దెక్కి మాట్లాడతారు, సైకిళ్లు తొక్కుతారు, విమానాలు నడుపు తారు. మొగాళ్ళతో సరిసమానంగా ఉంటారు - వాళ్ళపనిని పంచుకుంటారు. అది యీదేశానికి పనికిరా దని నీలకంఠం నిశ్చి తాభిప్రాయం. మన బతుకులు వేరు. ఏమైనా, మన జీవితా శయం వేరు. ప్రపంచంలో మన మతానికి ఒక విశిష్ట మైన స్థానం, మనకు గొప్ప సాంప్రదాయాలు వున్నాయ్. ఆడది పూజింప తగ్గ పవిత్రవస్తువు. వాళ్లు గృహలక్ష్ములు. భర్తయందు గౌరవం, -

నవ్వుతూనే కష్టాలు అనుభవించే సహసం గలవాళ్లీ దేశపు స్త్రీలు !

అర్థిక సంబంధమైన ఆశయాల్లో మార్పు వచ్చినా, నీల కంఠం నిజస్వరూపం అట్టే మారలేదు. అంచేతనే, తనకూ, చిన్న కూతురుకూ తగాదా వచ్చింది.

ఈ సారి కూతురిమీద అనుకోకుండానే విజృంభించాడు. సన్యాసమ్మ వెంటనే జవాబు చెప్పకుండా తరువాత తండ్రికి వినిపించేటట్లు పెద్దఅక్కతో అంది "అభ్యుదయం అనేవాళ్లే అలా తీసుకొంటే నే నేం చేస్తాను. మనుషుల నాలుకకు హృదయానికి పోలిక లే దెప్పుడూ! వాళ్ళని నాన్న పెద్దమనుషులుగా భావించడ మెందుకో ?"

ఈ రక మైన మాటలు తనకు మరింత వె ర్రెత్తించినయ్. ఏం లేకపోతే లోకం పూరికే అనదు. తన కూతురు ఆ డిమాజ్ స్ట్రేటరు వలలో చిక్కు కుందనే ధృఢమైన వూహ. తనను వూరుకోనియ్యలేదు. కాలేజీ కుర్రాళ్ళు తననుచూచి అనలేదే! వాళ్ళు దారంట పోతూ అనుకొంటూంటే తను విన్నాడు. కూతుర్ని రేపట్నించి కాలేజీకి వెళ్లొ ద్దన్నాడు.

" చాల్లె ద్దూ యీ చదువు" అంది రెండోఅక్క. సన్యాసమ్మ నెమ్మదిగా "నాకు తెలుసు. చదువుకుంటే ఆడదాని శీలం చెడుతుం దని, యీ రకంవాళ్ళ వుద్దేశ్యం! అమాయకురాలిగా కనబడని ఆడదాన్ని గౌరవించలేనివాళ్లు, ఆత్మవంచన చేసుకొంటున్నారు. అందు కేమైనా అంటారు. ఆ డిమాజ్ స్ట్రేటరుకు జవాబు చెప్పకుండా వుంటే యెంతగర్వం అనేవాళ్ళు లేకపోరు !"

ఇంకా కూతురు చలించకండా కళ్లలో నీరు లేకుండా మాటాడటం నీలకంఠం కోపం రెట్టింపుకావటానికి ఆధార మైంది. యింక యిల్లు కదిలితే కాలు విరగగొట్టా నని అరిచాడు. కళ్లల్లో కోపం నీటిని గిరగిర త్రిప్పింది. ఎవరి నైనా క్షమించగలడు గాని, శీలం లేని ఆడదానిని క్షమించలేడు. నేను చదువు మాన నని కూతురు వెంటనే చెప్పటంతో పళ్లు పటపట కొరుక్కున్నాడు. పెదాలు కరుచుకున్నాడు. ఈ కూతురు, ఎవరితోనో లేచిపోయి, తను వురి పోసుకునేటట్లు చేస్తుం దని అనుకొన్నాడు.

ద్విగుణీకృత మైన కోపంతో సిగ్గు తెచ్చుకో మని యింకా నానామాటలు అన్నా, సన్యాసమ్మ అక్కడనుంచి జవాబు యివ్వకుండా కదలిపోయింది. ఇద్దరు అక్కలు నాన్న కాళ్ళమీదపడి క్షమాపణ కోరుకో అన్నట్లుగా చూస్తూంటే, చివరకు నెమ్మదిగా అంది "చస్తాను గానీ......".

ఈమాట స్ఫుటంగా చెవులో పడగానే నీలకంఠం మనసు అదోలా అయిపోయింది. ఆరాత్రి పడుకుందా మన్నా ఈమాటే మనసులోనుంచి కదల్లేదు. తెల్లవారి లేవగానే చావు మనసులో తిరిగింది. గబగబ అద్దంలోచూసుకున్నాడు. త నెంతగా చిక్కిపోయాడు? నిజంగా సగానికి సగ మయ్యాడు. బలం లేనిది బ్రతు కేమిటి? తను అప్పులతోనే కుంగిపోతున్నా నని, ఆ పడ్డీలు పుచ్చుకొనేవాళ్ళు తనని పిప్పిచేస్తున్నా రని, వాళ్ల నెందుకు తను పోషించా లని యిలా యెంతో వూహించటం జరిగింది.

ఆవేళ పేపర్లో చావుగురించి పడినవార్త చదవటానికి జంకేడు. ఆ మరుచటిరోజు యేదో శవం వెళ్ళిపోతూంటే తల దించి ప్రక్కరోడ్డుగుండా వెళ్ళిపోయాడు.

చిన్న కూతుర్ని చూస్తే తన కేదో భయం ఆవరించింది. ఆమెను ఒక అసహ్యపుముద్దగా పరిగణించాడు. ఈరోజుల్లో యెంత ఆలోచించకూడ దనుకున్నా మనసులో ఆ చావువిషయమే తిరుగుతోంది. రోజుకురోజు ఆ భయం పోతోం దని అనుకోవా లనుకున్నా అది హెచ్చవుతోంది.

అబ్బబ్బ! ఏమిటి యింతపిరికి' అనుకున్నా - అమ్మో నేను యిలా ఎండిపోయూనే, యే నిముషంలో ఒంటి కే మొస్తుందో, నన్నుభయం, ఈ అప్పుల భయంతోపాటు, నరా లన్నిటినీ పీకేస్తున్నాయ్.

తను చిన్న దగ్గు దగ్గినా, చిన్న రొంప చేసినా, పెద్ద కూతుర్లిద్దరివేపూ జాలిగా చూసేవాడు. ఒకనాటి రాత్రంతా వాళ్లిద్దరి గురించే ఆలోచించాడు. ఆ రాత్రి తను త్వరగా చచ్చిపోతా నన్న అనుమానమే తన్నులా కృంగతీసింది.

ఆమరుచటిరోజునుంచీ తను శ్రమపడకుండావుంటే బ్రతుకుతా నని, అనుకున్నా, శ్రమపడుతూనే ఉన్నాడు. జీతం అందుకుని వడ్డీ కట్టూనే వున్నాడు. తను అన్నం కొద్దిగానే తింటున్నాడు.

రానురాను ఒక దయ్యంలా యీ చావు భయం తన్ను బాధిస్తూనే వుంది. తన నీడనే చూసి భయపడేవాడు. ఏ రాత్రిమీద తెలివి వస్తే అరుంధతి చుక్క కనిపిస్తుందో లేదో నని చూచేవాడు. ఒక్కొక్కసారి కనిపించేది కాదు. దానితో మనసు వికల మయ్యేది. తన భార్యచావు జ్ఞప్తికి వస్తే - యిదివరలా ఆ చావు తలచుకోలేకపోయాడు!

తన యిద్దరి కూతుర్లమీద, అభిమానమే తన నింతగా భయపెట్టోం దనుకున్నా, ఆ అభిమానం రోజు రోజు రెట్టిం

పవుతోంది! ఒక్కొక్కసారి ఆలోచనలు చాలాదూరం వెళ్ళి పోయేవి! తను చచ్చిపోతే, - వాళ్లు అడుక్కుంటారు......అడుక్కుంటే యెవరు కానీ వేస్తారు...యిచ్చినా యెన్నాళ్ళు......

నిజంగా తనకు ఒకనాడు జ్వరం వచ్చింది. కూతురే అంది "జ్వరం వచ్చింది! ఆఫీసుకు వెళ్ళవద్దని." తనకు జ్వరం వచ్చిందనుకోవటం యిష్టం లేదు. ఏమీ లేదని మొండికెత్తి ఆఫీసుకు వెళ్ళేడు. త్రోవలో తల తిరిగిపోతూంటే, లోకం, వ్యక్తులూ, వ్యవహారాలు, అంతా ఒక బూటకం అనిపించింది. తహసీల్దారు నుంచి బంట్రోతువరకూ, లంచగొండిగాను, కుర్రవాడి దగ్గర నుంచి ముసలాళ్ళవరకు, స్వలాభపరులుగాను, కనిపించారు. చివరకు తన్ను తానే అసహ్యించుకోజొచ్చాడు. తానొక పచ్చి అసమర్థుడని తోచటమే కాదు, నిర్ధారించుకొన్నాడు. యిలా తను అనుకోగల్గేడంటే ఆ కూతుర్లమీదనున్న అనురాగమే!

చిన్నమ్మాయి, డాక్టరుకు చూపిద్దామంటే, కోపం వచ్చింది. లంకణాలు చేసిన మనిషి మరింత నీరసించిపోయాడు. కాని జ్వరం తగ్గలేదు. యిల్లు కదల లేనిపరిస్థితి వచ్చింది. మంచం ఎప్పుడైతే యెక్కేడో, ప్రతిక్షణం, బలం లేని మనస్సుకు చావు తలపు బాగా అంటుకుంది.

నాలుగురోజులు గడిచాయి గాని, జ్వరం తగ్గే అవకాశా లేవీ కనబడలేదు. ఏనిముషంలో తను చచ్చిపోతానో అనుకొనే వాడు గుండె ఆగిపోతూన్నట్లనిపించేది.

తనకు దేవునిమీద భక్తి పూర్తిగా చచ్చిపోలేదు. యిలాంటప్పుడు తను గంటల తరబడి ప్రార్థించేడు. తన దేవునికి పూజా పురస్కారాలు చేయకుండా అపరాధం చేసినా, తన పెళ్ళాం,

యిద్దరు కూతుర్లు, అపరాధం చేయలేదు. అంచేత వాళ్ళిద్దరికోసం తను చచ్చిపోకుండా ఉండే వరం ప్రసాదించ మన్నాడు. చావు రాదు - రాదనే కోరిక ప్రతీక్షణంలో నింపుదా మనుకొనే, అధైర్యాన్ని నింపుకొన్నాడు.

ఇద్దరు కూతుర్లు దగ్గిర వాడిన ముఖాల్తో కూర్చుంటే, కడుపులో కత్తితో పొడిచిన ట్లయ్యేది. అవును - తా నొకడే యీ లోకంలో అసమర్థుడు !

జబ్బుకంటే మనోవ్యాధే మనిషిని కూల్చేసింది. అలా ఒక్కొక్కసారే తలపుకు వచ్చి "అబ్బే! నా కేం జబ్బు? తిండి లేక నీరసించిపోయాను కాని, నాది గట్టిశరీరమే! నేను చచ్చిపోడ మేమిటి?"

ఈ ధైర్యం ఒక లిప్తలోనే మటుమాయమై పోయేది. చిన్న కూతురు డాక్టరుని తెచ్చిపెట్టింది. తనకు డాక్టరు మాటలు రుచించలేదు. డబ్బు గుంజుకోడానికి యింతది, అంతచేస్తారని, తనకు లేనిజబ్బుని తెచ్చిపెట్టారని, అసహ్యం!. నాల్గురోజులు గడిచినా, మనిషి నాలుగింతలు నీరసించాడు. ప్రతి నిముషం "నేను చచ్చిపోను" అనే అనుకొంటున్నాడు.

ఆరాత్రి తనకు అనుమానం హెచ్చిపోయింది. తనభార్య చావు కళ్లకు కట్టుతోంది. తనపెళ్ళాం పిలుస్తున్నట్లుగా తోచింది! తన ఒంట్లో అంతనీరసం వుండనే వుంది - అబ్బా! చావు...... చావు......నేను చచ్చిపోవటమే......అయ్యో దేవుడా !...... నా కూతుర్లగ తేం గాను......".

కన్నులు మూతలు పడలేదు. ప్రతిక్షణంలోనూ యేడుస్తున్నాడు. దేవుడు గుడ్డివాడని, యీ ప్రపంచంలో న్యాయంగా

పోయేవాడికి కూడు లే దని, విలపించాడు. వెక్కి వెక్కి యేడ్చాడు. పెద్దకూతురు కూర్చునే కునుకుతూంది. ఆ కూతురు ముఖం చూస్తూంటే, అతనికి యెక్కడలేని అభిమానం కప్పేసింది! "అవును నాతల్లి......యెంత వృత్తమురాలు! యిలాంటప్పుడు గాజులు గలగల్లాడుతూ, నుదుటికుంకుమతో...పిల్లలతో వచ్చి నాదగ్గర కూర్చునివుంటే......నే నెంత హాయిగా చచ్చిపోదును" వెక్కుతున్నాడు. ముక్కు నులుపుకుంటున్నాడు.

ఆ ప్రక్కనే రెండోకూతురు నిద్రపోతూంది! హరికేన్లాంతరు మసకమసగ్గా వెలుగుతోంది! ఎప్పుడు ఆరిపోతుందో...! తనప్రాణం అంతే అనిపించింది!

తను యిం కెంతసేపో బ్రతక నని నమ్మకంగా అనుకొన్నాడు. ఆ యిద్దరికూతుర్లవేపు చూస్తూంటే, గుండె పీక్కుపోతూంది! తను చచ్చిపోతాడు! యిల్లు కదలనితల్లులు, యింటింట అడుక్కుంటారు! లోకం వాళ్ళని కనికరించదు. - వాళ్ల యౌవనాన్ని దోచుకోవా లని ఎందరు వెంటపడ్తారు! ఆకలితో మానం అమ్ముకున్న ఆడవాళ్ల గురించి తను యెన్ని కథలు చదివాడు.

యెంతమంది చెప్పగా విన్నాడు. యౌవనంతో తొణికిసలాడుతున్న తనకూతుర్లుమాత్రం యే మౌతారు? అన్ని మంచి గుణాలూ ఆకలిపొట్టలో ఆహుతి అయిపోతాయి! అలా ఆలోచించేవా రెందరూ? ఫలానా నీలకంఠంకూతుర్లు వీధినపడ్డారు- రంకులాటయ్యా రని అంటారు! ఎంత అప్రతిష్ఠ! ఇప్పుడే ఇంత యెగురుతోంది కదా, నేను కళ్లు మూస్తే, నాచిన్నకూతురు యెవడితోనో యెగిరిపోదూ?"

నీలకంఠం దుఃఖానికి అంతూ పంతూ లేకపోయింది. ఆ దుఃఖంతోపాటు యే నిముషంలో కళ్ళు మూస్తానన్న భయంకూడా కొండం తయ్యింది. ఈ భయంతోపాటే కూతుర్ల నోటివెంబడి మాటలు విందా మని కోరిక హెచ్చయింది!

అమ్మా! అని పిలిచాడు. పెద్దకూతురు అతృతతో దగ్గరగా వచ్చింది. రెండోకూతురు లేచిపోయింది. నా బంగారు తల్లులు - వాళ్ళముఖాలు కనిపిస్తూంటే అలాంటి పవిత్రమైన పిల్లలని విడిచి వెళ్తున్నానే అని బావురు మని పైకి యేడవలేక, లోన గగ్గోలుపెట్టి యేడుస్తున్నాడు.

చివరకు హీనమైన గొంతుకతో దుఃఖాన్ని మిళితం చేసి "సరమ్మా సరి!" అందా మని అనలేక గొనుక్కొన్నాడు. యిద్దరి కూతుర్ల కన్నీళ్ళు తనమీద వ్రాలేయి. కొంతసేపటివరకూ ఆ దృశ్యాన్ని చూడలేక కళ్ళు మూసేశాడు. ఈ క్షణంవరకూ ఈ ప్రపంచంలో తను అసహ్యించుకోకుండా వున్న వీ రెండుజీవాలే!

తను అందా మనుకొన్న వెన్ని ఉన్నా ఒకమాటా అనలేక పోతున్నాడు. "ఎటు చూస్తే అటు చీకటిలా" కనిపిస్తోంది. మళ్లీ కళ్ళు తెరచి, ఆముఖాలవేపు చూసి వెయ్యి గొంతుకలు కలిగినట్లుగా పాకు చావురావ ధ్వని యేడ్చుకొన్నాడు.

ఏ నిముషంలో మాట పడిపోతుందో? ఏ క్షణంలో గుండె ఆగిపోతుందో? తను కోరికను వెళ్లగ్రక్కాలి. కాని యే మని చెప్పగలడు? తనకు కావలసింది, తన కూతుర్లు తను చచ్చిపోయాక వాళ్ళశీలాన్ని కాపాడుకుంటా మని వాగ్దాన మివ్వాలి. కడుపుకు లేకపోతే చచ్చిపోతాం గానీ, లోకం వేలెత్తి చూపించేట్లుగా వుండ మని హామీ యివ్వాలి!

ఎంత సంక్షోభించెందినా ఆమాట తను బయటకు అనలేక పోయాడు. కూతుర్లు తెగించి అంటా రని కాంక్షించాడు! కాని వాళ్ళు తల్లిశరీరంలో బాగు లేనప్పుడు ఎలా యేడ్చారో ఆలానే యిప్పుడూ ఏడుస్తున్నారు. వాళ్ళఏడుపుకు కారకుడు తనేగా! వాళ్ళకు యీ రక్త మాంసాలతో తప్పించి యింకేమి వుంచాడు?

ఒక్కమూలుగు బాధతో మూలిగాడు! కూతు లిద్దరూ, మరీ దగ్గరకు జరిగారు. యిద్దరిచేతులూ పట్టుకొని, కళ్ళల్లో నీ రుబికి ప్రవహిస్తూంటే, యిద్దరూ వెక్కి వెక్కి యేడుస్తున్నారు. "సరమ్మా ... సరి......మీ అమ్మదగ్గరకు వెళ్ళిపోతాను...... మీ గతి......!"

ఉద్భృతంగా వచ్చే దుఃఖంమాటలను రానియ్య లేదు. కూతుర్ల నోటివెంబడి మాట విందా మని మహా ఉబలాటపడు తున్నాడు.

నిముషాలు దాటిపోతున్నాయి. ఏడుపు తప్పించి ఒక్క మాటా రాలేదు. ప్రతిక్షణం యిదే ఆఖరుక్షణం అనుకుంటూనే ఆ ఒక్కమాటా విందా మని నిరీక్షణగా చూస్తున్నాడు. కాలం దొర్లిపోతూంది. తనకాంక్ష భృంగిపోతూంది! నిరాశతో నిట్టూర్పు లను విడుస్తున్నాడు. రానురాను "మా కేం నాన్నా" అనైనా యీ కూతుర్లు అంటా రేమో నని, ఆమాట వినైనా చచ్చిపోదా మని యెదురు చూశాడు.

మళ్ళీ అన్నాడు "పాడు మనుషులు - యీ పాడు లోకంలో—మీరు బ్రతకటానికి - యేమీ వుంచలే దమ్మా! ఎలా వుంటారో?"

ఈమాటలకు మరింత యేడుపు తప్పించి మాటలు రాక పోటంతో చిరాకు, దుఃఖం, కోపం, జాలి, అన్ని అనుభూతులూ ఒక్కసారి కల్గాయి.

తనభార్యచావు జ్ఞప్తికి వచ్చింది! ఎంతహాయిగా చచ్చి పోయింది! తనకు అదృష్టం లేకపోయింది. యీజన్మ ఉత్త పనికిమాలిన దైవం దని తలపుకు వచ్చింది తను చచ్చిపోతున్నాడు ......ఏడుస్తూ చచ్చిపోతున్నాడు......ఆ క్షణంలో తనకు తను విడిచిపెట్తున్న యీ లోకంలో అన్నీ అసహ్యించుకొన్నవే...... తన యిద్దరు పెద్దమ్మాయిలుకూడాను!

కళ్లు నిలబెట్టి అలా చూస్తూంటే, కూతుర్లిద్దరికి భయంవేసి కావు మన్నారు. చిన్నకూతురు లేచి గబగబ వచ్చింది. తండ్రి మంచంమీద కూర్చోగానే నీలకంఠం ముఖం ప్రక్కకు త్రిప్పి వేశాడు.

సన్యాసమ్మ యేడుస్తున్న యిద్దరి అక్కలవేపు తీక్షణంగా చూసింది. నాన్న వంటిమీద చెయ్యి వేసి "యిం కేమీ రాదర్రా మీకు! యిలా యేడుస్తూ నాన్నని అధైర్యపరచ కండి! ఊరు కుంటారా లేదా?" అంటూ ఒక్కగసురు విసిరేసరికి యిద్దరూ చెల్లెలివేపు చూశారు.

ఈమాటలు తను వినకూడ దనుకున్నా విన్నాడు. ఏమీ అనుకోకూడ దనుకున్నా అనుకున్నాడు. తను నిజంగా చచ్చిపోతు న్నాడా? లేక తన అధైర్యమే తను చచ్చిపోతున్నా నని అనుకో నిస్తుందా?

చిన్నకూతురు "నాన్నా నాన్నా......" అని పిలిచింది. అనుకోకుండానే వూఁ అని మూలిగేడు. "అధైర్య పడకండి!

డాక్టరు చెప్పాడు. నీరసం తప్పించి యిం కేం కా దని! నాలుగు రోజులలో లేచి కూర్చుంటారుగా! కొద్దిగా నోరు తెరవండి...... బార్లీనీరు పోస్తా!"

తనకు జబ్బూ లేదూ తను చచ్చిపోవడంలేదూ! అబ్బబ్బే తను చచ్చిపోతున్నాడే!"

కూతురు నోటిలో బార్లీ పోస్తుంటే, త్రాగకూడ దనే గుటక వేశాడు. గుటక వేశాక తను గుటక వెయ్యగలిగా నని, తను బ్రతుకుతా నని కొద్దిగా ఆశ కలిగింది!

చిన్నకూతురు అంతతో చాలించ లేదు. ఆమె గొంతు విప్పితే తన కేదో క్రొత్త అనుభూతి కలుగుతోంది! అసహ్యం, అధైర్యా లనే మంచుకొండల్తో తను కప్పబడ్డాడు! ఆమెమాటలు సూర్య రశ్మిలా వాటిని కరిగిస్తోంది!

అయినా ఆమెవేపు కన్నెత్తి చూడలేదు. లోలోనే యెన్నో న్నో అనుకుంటున్నాడు!

సన్యాసమ్మ కల్లోలంలో ఒక చల్లని కబురు చెప్పింది. తను కలలోనైనా యీమాట తనకూతురి నోటివెంబడి వస్తుం దని వూహించలేదు. కాలేజీ మానేస్తా నని కూతురు చెప్పగానే మనిషి ముఖం నిగనిగలాడింది. పోయినప్రాణాలు తనబొందికి చేరు కున్న ట్లనిపించింది. కూతురు తియ్యగా అన్నది: "మీ రధైర్య పడికండినాన్నా! ఈ అప్పులు తీర వని బెంగపడకండి. ఇప్పు డెలా ప్రయివేట్లు చెప్తున్నాగా, చదువు చాలిస్తాను. మరికొందరికి చదువు చెప్పొచ్చు! ఉద్యోగం దొరికేవరకూ యిలా కానిస్తాను!"

ఈ ముక్కల్లో వెయ్యోవంతు కాంక్షించి, నిరాశ చెందిన నీలకంఠంకు లేచి కూర్చోవా లనిపించింది. చిన్నకూతురు అంతతో

వూరుకోలేదు. ''ఇద్దరిజీతం యేం చేసుకుంటాం నాన్నా? చిన్నక్క పెళ్ళి చేద్దాం! అంత ముందు కొచ్చే మగా డుంటే. పెద్దక్క పెళ్లీ కూడా చేద్దాం! మన కేం? మనడబ్బే ఒకరు తినె పరిస్థితి వస్తుంది!''

నీలకంఠం కళ్ళల్లో నీరు వుబికింది. ఒక్కసారి శరీర మంతా వుబికిన ట్లయింది. ఏడుస్తూనే నవ్వుతున్నాడు! తన కూతురు పుట్టి ముందు కొడు కని పడ్డఆరాటం మనసులో తిరిగింది. దేవుడు తనకు కొడుకుకంటే హెచ్చయిన రత్నాన్ని యిచ్చాడు. దేవుని దూషించినందుకు, యీ కూతుర్ని అసహ్యంగా చూసి నందుకు, విచారించాడు. తనభయంతో తను మెడలో వేసుకున్న వురిని యీ కూతురే తప్పించింది!

అయ్యో! తను జీవితంలో ఎంత తెలివిలేని పని చేశాడు? తన పెద్దకూతు ర్లిద్దరిని చదివించివుండాలసిందే!!

# అక్క పెళ్లి

శ్రీ కొడవటిగంటి కుటుంబ రావు

---

28–10–1909 లో తెనాలిలో జననము. విద్యాభ్యాసము గుంటూరులో, విజయనగరములో, కాశీ హిందూ విశ్వవిద్యాలయములో జరిగినది. పత్రికలకు, రేడియోకు అనేక కథలు, నాటికలు, వ్యాసములు, ప్రసంగములు రచించినాడు. "సవతితల్లి" అను నాటికను Drama Festivalలో చేర్చి వివిధ బాషలలో బహుపర్యాయములు ప్రసారించినారు. యువ (1936), కినేమా, (1952–55) ఆంధ్రవార పత్రిక (1940–42; 1949–51) లకు సంపాదకుడు. ఆంధ్ర దిన పత్రికకు కొంతకాలము సంపాదకుడు. "చందమామ" సంపాదకవర్గములో నున్నాడు. 'వీరాభిమన్యు', 'తారుమారు', 'జ్యోతి' Film Scripts వ్రాసినాడు. ముద్రితగ్రంథములు: 12 కథాసందోహములు, 6 నవలికలు, 3 popular science పుస్తకములు, 1 రేడియోనాటికల సంపుటి, ఆంగ్లరష్యన్ కథానువాదములు, షెరిడన్ నాటకానువాదము కలవు. సంగీతము, ఫొటోగ్రఫీ, హోమియో వైద్యము ... వీనిలో అభినివేశము.

---



"ఆయన కేం? మహారాజు! ఇంకా ఇద్దరు కూతుళ్లున్నా అవలీలగా సంబంధాలు తీసుకురాగలడు!" అని తనను గురించి

ఎవరన్నా స్నేహితులు అనుకున్నప్పుడు శ్వేతాంబరానికి కొద్దిగా గర్వమూ, అంతకంటె ఎక్కువ భయమూ కలిగేవి.

తన శక్తిలో తనకే లేని నమ్మకం తన స్నేహితుల కెందుకుండాలి? ఒకవేళ తాను హనుమంతుడల్లే తన శక్తిసామర్థ్యాలను గుర్తించలేకుండా ఉన్నాడా? అయితే, తనకూ, హనుమంతుడికీ ఒక్క విషయంలో మట్టుకు పోలిక లేదు—హనుమంతుడు పొగిడితే విజృంభించేవాడు; దిక్కుమాలిన పొగడ్త తనను కుంగదీస్తోంది.

రెండు సంవత్సరాలుగా తాను కల్యాణికి తగినవాడెక్కడన్నా దొరుకుతాడా అని వెయ్యికళ్ళతో చూస్తున్నాడు. భూమ్యాకాశాలమధ్య అటువంటి వాడెవడూ ఇంతవరకు కనిపించలేదు. "ఎవరన్నా కాస్త సహాయపడండర్రా!" అని అప్తులనూ మిత్రులనూ అడుగుదామన్నా వాళ్ళు తన అసహాయస్థితిని గుర్తించేటట్టు లేరు.

"శ్వేతు పెద్దదానికింకా పెళ్ళిచేశాడు కాడేం?"

"ఆఁ! ఇవాళ అనుకున్నాడంటే రేపు చేసేస్తాడు. మనవాడికది ఏమంత కష్టమైన పని కాదులే!"

తన బంధువులిద్దరిమధ్య జరిగిన ఈ సంభాషణను శ్వేతాంబరం తన చెవులారా విన్నాడు. తాను వింటున్నట్టు వాళ్ళకి తెలీదు. అందుచేత అవి ఇచ్చకాల మాటలనుకోటానికి లేదు.

అవును, తన అసమర్థత ఒక్కరూ గమనించరు. ఆ కారణంచేత తాను బొత్తిగా ఒంటరిగాడై పోయినాడు. అంతకంటె తనకు కలిగిన లాభం అవగింజంతకూడా లేదు. అన్ని విష

యాలలోనూ తనను నిశితంగా విమర్శించే తన భార్య గుణమణి కూడా, "మీరు పనిపెట్టుకొని వెతికితే క్షణంలో దానికి సంబంధం కుదరక పోయిందా? మీ కసలు ఈగ వాలిన ట్టయినా ఉంటేగా?" అంటుంది తప్ప "ఇది నీవల్ల అయేపని కాదు. మ రెవరికన్నా పురమాయించు" అనదు...

తనలో ఇంత మందికి విశ్వాసం ఉండటానికి గల కారణాలు శ్వేతాంబరానికి తెలియకపోలేదు. ఆరేడువందల రూపాయల జీతగాడు, పలుకుబడి గలవాడు. 'నా కూతురికి పెళ్ళి చేస్తున్నాను' అన్నా డంటే ఎంతమందో కుర్రాళ్లు ఎగబడక పోతారా అని కొందరు బంధువుల నమ్మకం! ఎంతమంది స్నేహితుల కూతుళ్ళకో సంబంధాలు కుదిర్చాడు. తన కూతుళ్లకు కుదర్చ లేడా అని మరికొందరి ఉద్దేశం.

ఇ దంతా నిజమే అనుకున్నా, కళ్యాణికి మొగుణ్ణి తీసుకు రావటానికి చిన్నమెత్తు ఉపకరించలేదు. అది అస లైన నిజం. కొందరు పెద్దమనుషులు తమకు తామై వచ్చి "మీ పిల్లను మా వాడికి చేసుకుంటాం," అని అడగటమూ, ఇతరులద్వారా అడిగించటమూ జరిగింది. కాని, అట్లా వచ్చిన సంబంధాలలో ఒక్కటికూడా గుణమణి ఆమోదించలేదు.

గుణమణి ఆక్షేపించటంలో అఖండురాలు. ఎటువంటి వాళ్ళకైనా వంకలు పెడుతుంది-వాళ్ళంటే తనకు ఇష్టం లేకపోతే! "ఆవిడికి హృదయ నేత్రమే తప్ప. మనో నేత్రం లేదు-ఒకప్పుడుండే దేమో. ఇప్పుడు పువ్వేసిపోయింది" అని ఒక కవి మిత్రుడు తాను పూర్వం ప్రేమించిన ఒక గొప్పఇంటి ఇల్లాలిని గురించి శ్వేతాంబరం దగ్గిర విరక్తిగా అన్నాడు. అపర్ణన గుణ

మణికికూడా వర్తిస్తుందని శ్వేతాంబరానికి ఎన్నోసార్లు అనిపించింది. గుణ మానవు లందర్నీ రెండు తరగతులుగా విభజించింది. తన కిష్టు లైనవాళ్ళూ, కానివాళ్ళూ! ఇష్టు లైన వాళ్లలో ఆమెకు ఏ ఒక లోపమూ కనిపించదు. అథవా కనిపించినా ఎంతో హృదయవైశాల్యత కనబరిచి ఆ లోపాన్ని క్షమిస్తుంది, సమర్థిస్తుంది, వీ లయితే మెచ్చుకుంటుంది కూడా! గుణకి తన పెద్దకూతురు కల్యాణిమీద చాలాప్రేమ. "పాపం, దానికి ఏమీ తెలియదు-సీత ఇంకా గడుసుదిగాని!...అందుకే దానికి మంచి సంబంధం చూడాలి!" అనేది. ఈ "మంచి" సంబంధం ఎట్లా ఉంటుందో శ్వేతాంబరానికి ఎన్నడూ అర్థం కాలేదు. కల్యాణిని చేసుకుంటా మని వచ్చిన సంబంధాలలో చాలాభాగం తనకూ నచ్చనిమాట నిజమే గాని, తాను కష్టపడి వెతికినా ఇంచుమించు అటువంటి సంబంధాలు తప్ప కల్యాణికి రా వని అయన నమ్మకం.

ఆమాట అంటే గుణ, "మీకు అ దంటే చాలా తేలిక లేస్తురూ!" అంటుంది. "నీ కళ్ళకి నీ కూతురు రంభల్లే కనిపించగానే సరా?" అంటాడు శ్వేతాంబరం.

"అదే నాకర్థం కాదు. మీకళ్లకిమాత్రం రంభల్లే ఎందుకు కనిపించకూడదూ? మీ కూతురు కాకపోయిందా?" అంటుంది గుణ.

"నీమాదిరిగా ఆత్మవంచన చేసుకోవటం నాచేత గాదు."

"ఇష్ట మైతే అన్నీ చాతవుతై!"

"పోనీ ఇష్టంలేదే అనుకో!"

"ఎందుకు లేకపోవాలీ? అదే నాకర్థం కాదు."

"ఇష్టమైతే అదే అవుతుం దని నేనుకూడా అనవచ్చా?... ఒక పావుగంటసేపు ఈధోరణిలో పడ్డాక, తాము ప్రారంభించిన విషయానికీ, మాట్లాడుతున్న మాటలకూ సంబంధం లేకుండా పోయిం దని శ్వేతాంబరానికి అర్థ మయ్యేది.

"నీతో ఏది మాట్లాడా లన్నా చిక్కే. అసలు విషయం వదిలేసి ఎటో ఈడుస్తావు!" అని విసుక్కునేవా డాయన.

"నేనా! ఇంకానయం! మీరే ఈడుస్తారు. దాని పెళ్ళి విషయం ఎత్తితే చాలు మీకు కోపం! అ దంటే మీకు బొత్తిగా గిట్టదు. అందు కని మీరే మాట మార్చేసి, ఇం కేదో మాట్లాడు తారు," అనేది గుణ పూర్తి నమ్మకంతో.

తన భర్తను కల్యాణి అంటే ఇష్టం లే దని రుజువు చెయ్య టానికి గుణమణిదగ్గర బోలెడంత సాక్ష్యం ఉంది. ఊళ్ళోవా ళ్ళందరికీ సంబంధాలు కుదర్చగలడు గాని, తన కూతురుకి కుదర్చడు! తాను పెళ్ళికొడుకు తండ్రి అయినట్టుగా కల్యాణిలో లోపా లెన్నుతాడు! అదికూడా ఎందుకు?—మంచి సంబంధం వెతక్కుండా తప్పించుకోవటానికి. సరస్వతమ్మగారి సుశీలకు ఈయనేగా సంబంధం కుదిర్చిందీ! దానికి అంత మంచి మొగుడు వస్తా డని సరస్వతమ్మ కల్లోనైనా అనుకొని ఉంటుందీ? ఊళ్ళో వాళ్ళ కూతుళ్ళకు చేసేదానికన్నా కూతురుకు ఎవరన్నా కాస్త ఎక్కువగానే జరుపుకోవాలా, వద్దా?

తన భార్య ఈ ధోరణిలో పడ్డప్పుడు శ్వేతాంబరం అస్త్ర సన్యాసం చేసి వింటూ ఉండిపోయేవాడు. ఎందుకంటే గుణ అనే మాటల్లో వాక్యానికి రెండేసి అబద్ధా లుంటాయి. సరస్వతమ్మ కూతురు సుశీలకూ, కల్యాణికీ ఏమీ పోలిక లేదు. సుశీల చాలా

తీర్చైనపిల్ల, తెలివిగలది. ఆ పిల్లకు వచ్చిన సంబంధం గుఱు చెప్పేటంత గొప్పది ఏమీ కాదు. పిల్లవాడికి ఆస్తి లేదు. రెండు వందలు సంపాదిస్తున్నాడన్న మాటే గాని కనుబొమలమీది వెంట్రుకల్లాగా ఎదుగూ బొదుగూ లేని ఉద్యోగం. ఇంకా పదేళ్ళు చేసినా అదేజీతం రావచ్చు, లేదూ, రేపే ఉద్యోగం ఊడనూ వచ్చు. ఈ జీతంరాళ్ళల్లో ఇద్దరు తమ్ములకు చదువులు చెప్పిస్తున్నాడు. అందులో ఒకడు కాలేజి చదువు...ఇంతా చేసి కుర్రవాడికి పలచని జుట్టూ, మెల్లకన్నూ! తోలు ఎర్రగా ఉంటే అందగాడై పోయాడా? ఇన్నిటికన్నా ముఖ్యమైన విషయమేమంటే ఈ సంబంధం కుదిర్చింది శ్వేతాంబరం కానేకాదు. ఆ కుర్రవాడి పినతండ్రి శ్వేతాంబరానికి బాల్యస్నేహితుడు. అందుచేత ఆ అబ్బాయి పిల్లను చూడటానికి తననుకూడా వెంటపెట్టుకు వెళ్ళాడు...

కాని గుఱు స్టీమ్‌రోలర్‌ను నడిపించిందంటే దాని ముందు ఏ నిజమూ ఆగలేదు. దానికింద పడి అన్ని నిజాలు రూపుమాసిపోవలసిందే! అందుచేత శ్వేతాంబరం మాట్లాడక ఊరుకునేవాడు.

౨

సీత చాలా విషయాల్లో తండ్రిపోలికే. శ్వేతాంబరానికి గల నిగ్రహమూ, తీక్ష్ణమైన బుద్ధీ వచ్చాయి. అంతే గాక, ఆమె తండ్రిలాగా మానసికంగా ఏకాంతవాసిని. ఆ పిల్ల తండ్రితోగాని, తల్లితోగాని అక్కతోగాని చెప్పకుండా తన కడుపులో దాచుకున్న ఆలోచనలు చాలా ఉన్నాయి. ఆ సంగతి శ్వేతాంబరానికి తెలీదు

గాని గుణమణికి తెలుసు. "మీరు మాట మాట్లాడితే సీతను వెను కేసుకొస్తారుగాని, అది వట్టికూచి! దొంగ! అమ్మో!" అనే దావిడ తన భర్తతో.

తమకు కలిగిన ఇద్ద రాడపిల్లలనూ భార్యా భర్త లిద్దరూ కూడబలు క్కున్నట్లుగా పంచేసుకున్నారు. కల్యాణి అమ్మ పిల్ల! సీత నాన్నపిల్ల! శ్వేతాంబరం భార్యతో "నీ కూతురు" అంటే నూరింట తొంభైపాళ్ళు కల్యాణి అన్నమాటే. అదేవిధంగా గుణమణి కూడా సీతను గురించి మాట్లాడేటప్పుడు ముఖ్యంగా దెప్పుగా మాట్లాడేటప్పుడు — "మీ కూతురు" అని తీరేది.

ఈ పంపకం గురించి సీత చాలా చిన్నతనంనుంచీ ఎరుగును. అంతే కాదు, ఇందులో ఏదో క్రూరత్వం ఉన్నట్టు ఆపిల్లకు తోచేది. ఒక్క ఇందులోనే కాదు, భార్యా భర్తలమధ్య ఉండే సంబంధాలూ కూడా అత్యంత క్రూర మైనవిగా సీత బుద్ధికి తోచేవి. తన తల్లీ తండ్రీ ఎప్పుడు ఏ విషయం మాట్లాడినా వారి మాటలవెనుక ఏదో పరస్పర విద్వేషం దాగి ఉన్నట్టు ఆ పిల్ల తెలుసుకో గలిగేది. వాళ్లు కూతుళ్ళ నిద్దరినీ పంచుకున్నా రేమో, ఒకరిమీద ఒకరికి గల తేలిక భావాలు, కసీ, విసుగూ ఒకరి పిల్లలమీద ఒకరు చూపించుకునేవారు. అదికూడా గోప్యంగానే!

సీత నిత్యమూ ఘర్షణ పడేదంపతులను కూడా చూసింది. కాని అట్లా పోట్లాడుకోవటంకంటె తన తల్లి దండ్రులు సాగించే మూఢయుద్ధం మరింత క్రూరంగా ఉన్నట్టుండేది. "శ్వేతాంబరం గారూ, గుణమణిగారూ కూడా నిజంగా ఎంతో అన్యోన్యంగా ఉంటారు" అని ఎవరన్నా అనుకుంటూంటే సీత ఆశ్చర్య పోయేది.

ఆ పిల్లమీద తన ప్రభావం ఏమీ లేదని గుణమణి బాగానే గుర్తించింది. కాని, శ్వేతాంబరం మటుకు సీత అచ్చు తన లాంటిదే అని ఆత్మవంచన చేసుకునే వాడు. ఒకటి నిజం, సీత మనస్సుమీద తలి తండ్రు లిద్దరి ప్రభావమూ తక్కువే. జన్మతః ఆమెకు చాలా వరకు తండ్రి పోలికలూ, కొంతవరకు తల్లి పోలికలూ వచ్చాయి. ఆమె ఎనిమిదేళ్ళు వెళ్ళేదాకా తన తల్లి దండ్రులలో ఎవరు రైటో, ఎవరు తప్పో తెలుసుకో లేక పోయేది. ఆ తరువాత ఇద్దరూ చాలా వరకు తప్పే ననే నిర్ణయానికి వచ్చింది. ఇప్పుడు సీతకు పద్దెనిమిది నిండాయి. ఈ పదేళ్ళుగా ఆమె మీద తల్లి దండ్రు లిద్దరి ప్రభావమూ కూడా లేదు.

తాను మానసికంగా దృఢంగా, బలంగా ఉండ గలందుకు సీత చాలా ఏళ్లుగా ఎవరూ ఊహించని కృషి చేసింది. ఈ కృషి సఫల మయింది. కాని, దాని ఫలితాలు తల్లికి ఒక విధంగానూ, తండ్రికి ఒక విధంగానూ కనపడేవి. "అది కఠినురాలు, కఠినురాలు!" అనేది తల్లి. "నాపోలికే... పట్టుదల... ఉండాలిసిందే!" అనేవాడు తండ్రి. "పట్టుదల ఏం కాదు - మొండితనం!" అనేది తల్లి.

సీత మానసిక దార్ఢ్యం కోసం కృషి చెయ్యటానికి కారణం కల్యాణే. కాళ్ళలో సత్తువ లేనివాళ్లు దేన్నయినా ఆనుకుని నిలబడ్డట్టుగా, కల్యాణి ఎవరినో ఒకరిని ఆనుకునేది మానసికంగా; తన కన్న పెద్దదై ఉండి తననే అనుకొనేది.

ఎవరు కూడా కల్యాణి మోస్తరుగా ఉండరా దని సీత నమ్మకం. అయితే సీతకు తన అక్కమీద కోపం ఏమీ లేదు.

ఆమెకు ఎవరి అశక్తత మీదా కోపం లేదు. అక్కడే శ్వేతాంబరా నికీ, సీతకూ తేడా. ఇతరుల అసమర్థత పట్ల శ్వేతాంబరం చాలా క్రూరంగా ప్రవర్తించే వాడు. తన భార్య తన కన్న తెలివి తక్కువ మనిషి అని తెలిసినాక ఆమె తెలివితక్కువతనాన్ని తన తెలివితో భర్తీ చెయ్యటానికి దాన్ని రెట్టింపు చెయ్యటానికి తన తెలివితేటలు ధారపోసేవాడు. గుణమణి మామూలు తెలివితేటలు గలవాణ్ణి చేసుకుని ఉంటే ఇంతకన్న రాణించి ఉండేది!...కల్యాణి విషయంలో కూడా తండ్రి ప్రవర్తన చాలా క్రూరంగా ఉన్నట్లు సీతకు తోచేది. ఒక ఇంట్లో, ఒక కుటుం బంలో ఉన్న మనుషులు ఒకరి కొకరు పరీక్షకు పెట్టి మార్కులు వేస్తూ కూచోవటంతోనే సరిపోతే, ఇక వీళ్లు కలిసి జీవించే దెప్పుడు ? ఒకరి కొకరు సహాయపడే దెప్పుడు ?

తనను చూసి తండ్రి గర్వపడే సంగతి సీతకు తెలుసు. కాని, అందు కామె పెద్దగా సంతోషించేది కాదు. ఆయన కల్యా ణిని చూసి ఎందుకు అవమానపడేవాడో అందుకే తనను చూసి గర్వపడేవాడు స్వాతిశయం ! అంతకన్నా ఏమీ లేదు. నిజంగా తండ్రి సహాయం ఎక్కువగా కావలసినది కల్యాణికి. అయినా కల్యాణి విషయం వచ్చేసరికి తండ్రి చేతులు ముడుచు కున్న ట్టుగా ప్రవర్తించేవాడు.

కల్యాణి పెళ్ళి ప్రయత్నాలు విషయం చూడరాదా ? ఆయన సరి అయిన ప్రయత్నం చెయ్యటం లే దని తల్లి చేసిన ఆరోపణను సీత కూడా చాలా వరకు ఆమోదించింది.

"రేపు సీతకు సంబంధం చూడా లంటే ఇట్లాగే తాత్సారం చేస్తారా ?" అన్నది గుణమణి.

"సీతకి సంబంధం తీసుకురావటానికి అరనిమిషం పట్టదు." అన్నాడు తండ్రి.

ఈ మాటకు సీత సంతోషించ లేదు. తనకు సులువుగా సంబంధాలు వచ్చే పక్షంలో ఆయన తన సర్వశక్తులూ ధారపోసి తన అక్కకే సంబంధం తీసుకు రావచ్చు గద!

సీతకు ఇంకో విషయం కూడా తెలుసును. కల్యాణికి మంచి సంబంధం రావటానికి తను అడ్డుగా ఉన్న దని తన తల్లి నమ్మకం! ఆవిడ అట్లా అనుకోవటంలో తప్పేమీ లేదు. కొన్ని సంబంధాల వాళ్ళు, "మీ రెండో అమ్మాయిని చేసుకుంటాం," అని అనటం జరిగింది.

తన అక్కకు చాతయితే, సహాయ పడా లని సీత ఉద్దేశం గాని, ఆమెకు ప్రతిబంధకంగా ఉండా లని లేదు. కాని, తాను చేయగలిగిన దేమీ ఉన్నట్లు కనపడలేదు.

"జీవితం ఎంత క్రూర మైనది! ఎంత నిర్దాక్షిణ్య మైనది!" అనుకున్నది సీత.

## 3

కల్యాణికి సంబంధం వచ్చింది. వరుడు పాతికేళ్ళవాడు. వాళ్ళ కేమీ లేదుట. ఇతను మటుకు రెండు వందలయాభై తెచ్చు కుంటున్నాడు. ఈ కాలంలో పాడి బియ్యే అక్షరాలతో రెండు వందల యాభై తెచ్చుకోవటం ఘనమే. కాని, ఈ అబ్బాయి ప్రకాశం విషయంలో అంత ఘనంగా చెప్పు కోటానికి లేదు. ఎందు కంటే అతనిపైన పెద్ద కుటుంబ భారం ఉంది. అతని అన్న చని పోయాడు. ఆయన ప్రకాశం కంటె తొమ్మిది పదేళ్లు పెద్ద

వాడు. క్రిమినల్ లాయర్‌గా మంచి ప్రాక్టీసుండేది. ప్రకాశం చదు వంతా ఆయనే చెప్పించాడు. ఆయనకు అయిదుగురు పిల్లలు. అందులో ముగ్గురు ఆడపిల్లలు! ఆయన ఆకస్మికంగా చనిపోవటంతో ఆయన కుటుంబభారం ప్రకాశం పైన పడింది.

"అందుచేత నా సంపాదన నాకు ఏ మూలా చాలదు. మా అన్న పిల్లల్లో ఆఖరు వాడు తప్ప అందరూ చదువు కుంటు న్నారు. నేను న్యాయంగా పెళ్లి చేసుకోనే రాదు. నే చేసుకోబోయే భార్య తరపునుంచి ఏ దైనా ఆర్థిక సహాయం ఉండే పక్షంలోనే పెళ్లాడతాను" అని ప్రకాశం పెళ్ళి చూపులకు వచ్చినప్పుడు కుండ పగలేసి చెప్పేశాడు.

అతను వెళ్ళటానికి లేచినప్పుడు శ్వేతాంబరం "సరే, నాయనా! నువ్వు వెళ్ళి రెండు మూడు రోజులలో నీ నిర్ణయం తెలియ జెయ్యి. ఈ లోపల మేం కూడా ఒక నిర్ణయానికి వస్తాం," అన్నాడు.

"నా నిర్ణయం నేను ముందే చెప్పేశాను గద! అథమం ఇంకో అయిదేళ్ళ పాటు నేను మా అన్న కుటుంబాన్ని పోషిం చాలి. అప్పటికి పెద్ద కుర్రాడు కాస్త తన కాళ్ళమీద నిలబడ గలుగుతాడు. ఆ తరువాత అంత ఇబ్బంది ఉండదు. కట్నంగా ఇచ్చినా సరే, నెల నెలా రెండు వందలకు తక్కువ కాకుండా నాకు సహాయం చెయ్య గలిగినా సరే నేను పెళ్ళికి సిద్ధంగా ఉన్నాను." ప్రకాశం చప్పున నవ్వి, "ఇది ఒక బేరం కింద అడుగు తున్నా ననుకోండి. నాకు వెనుక ఆస్తి ఉంటే నే నడిగే దానికి మూడింతలు అడక్కుండానే ఇచ్చి ఉందురు! ... కాని, ఇది నా పరిస్థితి. దాన్ని దాచి లాభం లేదు," అన్నాడు.

"సరే, ఆలోచిద్దాం!" అన్నాడు శ్వేతాంబరం. గుణమణి ఎంతో ప్రయత్నం మీద తనను తాను నిగ్రహించుకుని ఉండాలి. ప్రకాశం గడప దాటగానే ఆవిడ అగ్నిపర్వతంలాగా బద్దలయింది.

"ఛీ ఛీ! ఎంత నాగరకత లేనిమనిషి! 'నువ్వూ వద్దు, నీతో సంబంధమూ వద్దు,' అని చెప్పెయ్యాక, ఆలోచిస్తా మంటా రేమిటి? ఏమి టుంది ఆలోచించటానికి? ఈ సంబంధానికి నేను చచ్చినా ఒప్పుకోను!" అన్న దావిడ.

"ఆ మాటే ఒక కార్డుముక్క రాస్తే పోలా? అతను మొహానే అనా లని ఏ ముందీ? అది మాత్రం ఏం నాగరికతా?" అన్నాడు శ్వేతాంబరం.

"అటువంటి వాళ్ళతో అట్లాగే ప్రవర్తించాలి!"

ఇది ఆవిడ తరుచు అనేమాటల్లో ఒకటి. తనకొక నాగరికత ఉన్నట్టు ఆవిడ ఎప్పుడూ ఒప్పుకునేది కాదు. అవతలి వాళ్ళను బట్టి కూడా ప్రవర్తించా లని ఆవిడ సిద్ధాంతం. ఈ సిద్ధాంతాన్ని శ్వేతాంబరం ఏనాడూ అర్థం చేసుకోలేదు; గుణమణి ఆసిద్ధాంతాన్ని విసర్జించనూ లేదు.

"అతన్ని మర్యాదగా పంపినందువల్ల నష్టం లేదులే. అతను కుండ పగలేసి మన పరిస్థితి అంచనా వేసుకోవటం మంచిది కాదూ?" అన్నాడు శ్వేతాంబరం.

"ఇది పోగొట్టుకుంటే కల్యాణికి ఇంతటి సంబంధం మరి రా దనేగా మీ రనేది?" అన్నది గుణమణి తీవ్రంగా.

"నే నామాట అనటం లేదు గాని ఈసంబంధం మనం అనుకున్నంత తీసేసినది కా దేమో నని నా ఉద్దేశ్యం," అన్నాడు శ్వేతాంబరం చాలా ఓర్పు అభినయిస్తూ.

" ఇంతకన్న చచ్చు సంబంధం మీరు కావాలన్నా తీసుకు రాలేరు! " అన్నది గుణమణి ఛాలెంజి చేస్తున్న దానిలాగా.

" నాకళ్లకు కుర్రాడు చాలా అందంగా ఉన్నాడు. అతను కాస్త ప్రయత్నిస్తే ఏ సినిమావాళ్ళయినా ఎగరేసుకు పోవచ్చు!"

"ఇంకేం? ఆపనే చేసుకో మనండి! చాతయితే మీరు కాస్త సహాయం కూడా చేసిపెట్టండి!"

"కాస్త తాపీగా ఆలోచించవలసిన సమయంలో నువు కాస్త వేడెక్కి పోతావు. నే చెప్పేది కాస్త శ్రద్ధగా విను. ఇతని అన్న నెలకి రెండువేలు చొప్పున సంపాదించేవాట్ట. ఆయనే ఇప్పుడు బతికుంటే ఈ సంబంధం మంచి దని నువు ఒప్పుకునే దానివేనా ?"

"బతికి లేడుగా ?"

"ఆమాట నాకు తెలీదూ ?" అన్నాడు శ్వేతాంబరం ఓర్పు కాస్త పోగొట్టుకుంటూ.

"తెలిసి ఎందు కడుగుతారూ ? ఇది మంచి సంబంధ మని నా చేత అని పించటమేగా మీ ఉద్దేశం ? ఇతనికి ఓ లక్ష రూపాయల ఆస్తి ఉంటే మంచి సంబంధ మేనా, అని అడగరాదూ ? ఉన్న సంబంధం ఉన్నట్టుగా ఆలోచించాలి గాని అయితేలు, గియితేలు ఇప్పు డెందు కండి!" అన్నది గుణమణి.

శ్వేతాంబరం అందామనుకున్న మాట అనే అవకాశమే లేక పోయింది. ఆయన హేతు బద్ధంగా మాట్లాడుదా మను కున్నప్పుడల్లా గుణమణికి మరింత ఆవేశం వస్తుంది. ఈ సంగతి సీత తన చిన్నతనం నుంచీ కళ్ళారా చూస్తున్నది.

"మనం ఇంత ఘర్షణపడేకన్న అమ్మాయి ఏ మంటుందో తెలుసుకోవటం మంచిది కాదూ ?" అంటూ శ్వేతాంబరం కల్యాణి కేసి చూశాడు.

కల్యాణి ఒక్కసారి తల్లి వంక చూసి, "ప్రైవేట్ మాస్టర్ని పెట్టినట్టు నెల జీతం మీద నాకు మొగుణ్ణి పెడతారా ? నా కిష్టం లేదు. ఆ మనిషి అంత స్పష్టంగా డబ్బుకోసం పెళ్ళి చేసుకుంటుంటే నే నెట్లా ఇష్ట పడతానూ ?" అన్నది.

శ్వేతాంబరానికి ఒర్పు కాస్తా పోయిన ట్టుంది. "నాకు తెలీ కడుగుతాను. నీ అందం చూసి మురిసి చేసుకునేవాడే అయితే వా డేపాటి అందగాడై ఉంటాడు ? ఇంకోరి బండారం ఎంచే ముందు మన బండారం కూడా ఎంచు కోవాలిగా!" అన్నా డతను.

"అట్లా అయితేగాని ఇష్టం ఎందు కడుగుతారూ ? డ బ్బుంది గనక దాని కొక మొగుణ్ణి కొని పారెయ్యండి, ఉద్ధరింపు అవుతుంది. అసలు మన కున్న సంస్కారమే అంత ! అంతకంటె ఎక్కువ ఉన్నట్టు నటించటంకూడా దేనికీ ?" అన్నది గుణమణి.

"ఒకవేళ ఆ ప్రకాశం కోరిన షరతులు ఒప్పుకుని పెళ్ళి నిశ్చయించా ననుకో, నేను నా కూతురుకు పనికిమాలిన సంబంధం చేశా నని నలుగురూ న న్నాడి పోస్తారా ?" అని అడిగాడు శ్వేతాంబరం.

"నలుగురూ అనుకునేదానికి, పెళ్ళాం పిల్లలు అనుకునే దానికీ ఏమీ తేడా లేదా ?"

"పెళ్ళాం పిల్లలు పైత్యాన బడి తెలుపును నలుపంటే దాన్ని శిరసా వహించాలిసిందేనా ?"

"ఇక వీళ్ళు ఒకరి కొకరు ప్రశ్నలు తప్ప వేసుకో లేదు?" అనుకున్నది సీత. తన తల్లి దండ్రుల ఘర్షణలో వివిధ దశలు ఆ పిల్లకు కొట్టిన పిండి.

"ఎందు కండీ ఈ డొంక తిరుగుడుమాటలూ ? ఈ సంబంధమే సీతకు వస్తే ఇంత ఆత్రంగా ఒప్పేసు కుంటారా ?" అని అడిగింది గుణమణి. ఆవిడ అంచనా ప్రకారం ఇది తన భర్తకు మర్మాఘాతం ! పడికట్టు రాళ్ళలాగా ఆవిడకు ఇటు వంటి ప్రశ్నలు కొన్ని ఉన్నాయి. వాటిని ఆవిడ చాలా 'టాక్టి కల్'గా ఉపయోగించేది. ఒక్కొక్కసారి అవి ఫలితా లిచ్చేవి కూడానూ.

"అయితే గియితేలు నీకు సుతరామూ సరిపడవుగా ?" అన్నాడు శ్వేతాంబరం వెటకారంగా.

"నే నడిగిన దానికి సమాధానం చెప్పరేం ?" అన్నది గుణమణి.

"నాకు నువ్వనుకునే పక్షపాతా లేమీ లేవు. సీతకు సమ్మత మైతే నే నభ్యంతరం చెప్పను" అన్నాడు శ్వేతాంబరం.

"దానికి ఇష్టం లే దంటే శాపనార్థాలు పెట్టరుగా?" అన్నది గుణమణి.

శ్వేతాంబరం ఉక్కిరి బిక్కిరి అయాడు. తన కీసంబంధం ఇష్టం లే దని కల్యాణి అనగానే చర్చ ముగించి ఉంటే ఆయన కింత విపత్తు రాకపోవును.

తలవని తలంపుగా సీత ఆయనకు సహాయము వచ్చింది.

"నే నైతే ఈ సంబంధానికి ఒప్పుకుంటా నమ్మా" అన్నది సీత.

గుణమణి ఏదో అనటానికి నోరు తెరిచింది, కాని ఏమీ అనలేదు.

"అక్కకి మరోసంబంధం చూసి పెళ్ళి చేసే దాకా ఇతను ఆగి ఉండేటట్టయితే నేను తప్పక చేసుకుంటాను. తనకు అన్న చదువు చెప్పించినందుకు కృతజ్ఞత కలవాడు బొత్తిగా మొరటు మనిషి అయి ఉండడు. మనకన్న నయమే అనుకుంటాను. అయిన వాళ్ళ మీద ఆపేక్ష చూపే వాళ్ళను గురించి మనం—మనం—వేళాకోళంగా మాట్లాడు కోవటం నా కేం బాగా లేదు" అంటూ సీత కూర్చున్న చోటినుంచి లేచి అవతలికి వెళ్ళి పోయింది. మిగిలిన ముగ్గురూ ఆపిల్లకేసి నోళ్ళు తెరుచుకు చూస్తూ ఉండి పోయారు.

# సంపెంగ పువ్వు

శ్రీ త్రిపురనేని గోపీచంద్

కవిరాజు రామస్వామి చౌదరిగారి పుత్రుడు. బి. ఎల్. అయినను న్యాయవాది వృత్తిలో ప్రవేశించ లేదు. మార్క్సిజాన్ని బాగుగా గ్రహించినాడు. కొంత కాలము ఆంధ్ర రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ కార్యదర్శి. "రైతుబిడ్డ" "గృహప్రవేశం" అనే చిత్రాలకు సంభాషణలు వ్రాసినాడు. "లక్ష్మమ్మ", "ప్రియురాలు" మొదలైన చిత్రములకు దర్శకుడు. ఆంధ్ర ప్రభుత్వములో Director of Public Relations పని చేసినాడు.

కథలు, నాటికలు, వ్యాసములు, నవలలు, రేడియో రచనలు అనేకము చేసినాడు. ఆంధ్రదేశములో పల్లె జీవితమును వాస్తవిక దృష్టితో చిత్రించినాడు. "పోస్టు చెయ్యని ఉత్తరాలు" అను తత్త్వగ్రంథము చేసినాడు. ఈయన రచన సునిశిత హాస్యముతో కూడి, ఆలోచన రేకెత్తించుచుండును.

"ఆమె ఈ బండికి వస్తుం దని నీ కెట్లా తెలిసింది?" అని శాస్త్రిని అడిగాను. అప్పుడు ఆరు గంటలు అవుతుంది. బొంబాయి నుంచి రైలు వచ్చే టైం. నేనూ శాస్త్రి ప్లాటుఫారంమీద నుంచొని మాట్లాడుకుంటున్నాం.

"ఇవ్వాళే వైరిచ్చింది" అన్నాడు శాస్త్రి. ఆమె శాస్త్రి స్నేహితురా లట. ఆమె ఈ బండికి వొస్తుం దని చెప్పి నన్ను వెమ్మట పెట్టుకొచ్చాడు శాస్త్రి.

శాస్త్రి ఆమెని గురించి చెప్పిన మాటల్ని బట్టి ఆమె విచిత్ర వ్యక్తి అనిపించింది నాకు. ''బలే మనిషి, బలే మనిషి'' అంటాడు శాస్త్రి. ఏ మడిగినా '' నువ్వే చూస్తావుగా '' అంటాడు. '' ఏమో నబ్బా, నాకు చెప్పటం చాతకాకుండా వుంది. మన సంఘంలో ఇటువంటి మనిషి వుండదు. వొచ్చే సంఘంలో ఆడవాళ్ళు ఇట్లా వుంటా రేమో! ఇప్పుడు రష్యాలో ఏ మన్నా వున్నారేమో!'' అంటాడు.

'' అయితే ఆమెభర్త ఏం చేస్తుంటాడు?'' అని అడిగాను. ఆమెని గురించి ఇంకా ఇంకా ఇంకా తెలుసు కోవా లనిపిస్తుంది నాకు.

'' ఏదో చేస్తూనే వుంటాడులా గుంది. ఆమె మాట్లాడితే 'కామేశ్వరుడు అటువంటివాడు, ఇటువంటివాడు, ఎంత చలాకీగా వుంటా డనుకున్నావ్!' అని చెవుతూ వుంటుంది.''

''భర్తంటే చాలా ప్రేమ కాబోలు......''

'' ఆమెకు మొత్తం నలుగురు పిల్లలు—ఒక మొగపిల్ల వాడూ ముగ్గురు ఆడపిల్లలూ'' అన్నాడు శాస్త్రి కొంటెగా.

నిజంగా ఆమెకు పిల్ల లనేటప్పటికి నామనస్సు కలుక్కు మన్నది. మిగిలిన ఆడవాళ్ళకు మల్లే ఈ బలేమనిషి కూడా పిల్లలా? ఎందుకోగాని ఈ భావాన్నే నేను భరించలేక పోయాను.

ఇంతలో ''అదిగో రైలు వొస్తూవుంది'' అన్నాడు శాస్త్రి. ఆమాటకి నా హృదయం దడదడ కొట్టుకుంది.

అకస్మాత్తుగా ప్లాటుఫారానికి చలనం కలిగింది. ఇద్దరు ప్రయాణీకులు ప్లాటుఫారం అంచునుంచి సామాను సర్దుకొని దూరంగా నుంచున్నారు. ఒక ముసలమ్మ మూట నొక చేత్తో

మనుమణ్ణి ఒకచేత్తో పట్టుకొని నిలబడింది. ఒక రైతు నుంచున్న వాడు నుంచున్నట్టుగానే హఠావిడి పడుతున్నాడు. కాసేపు కర్రని చుట్టా, చుట్టని కర్రా అనుకున్నాడు.

రైలు ఆగీ ఆగటంతోనే "మూడో తరగతి" అని జ్ఞాపకం చేశాడు లక్ష్మణ శాస్త్రి. ఆమె ఎప్పుడూ మూడో తరగతిలోనే ప్రయాణం చేస్తుం దిట. ఆమెకు ఒంటరితనం గిట్టదుట. అందు కని జనసమ్మర్దంగా వున్న మూడో తరగతి చూచి అందులో ప్రయాణం చేస్తుం దిట. ఆమెకు ఎంత ఇరుగ్గావుంటే అంత సరదాగా వుంటుం దిట! నాకు ఆమెను వెతకా లని వుంది గాని కాళ్లాడక అక్కడే దిక్కులు చూస్తూ నుంచున్నాను.

అది చిన్న స్టేషను. ఎక్కువమంది దిగరు.

"అదిగో దిగుతూ వుంది," అని గార్డు పెట్టె వైపుకు చూపిస్తూ అన్నాడు లక్ష్మణ శాస్త్రి.

నేనూ చూశాను. నాకు కనపడలేదు. అటూ ఇటూ చూశాను. కనపడలేదు.

"హాల్లో"—ఎదురుగా వొస్తున్న ఒక వ్యక్తితో కరస్పర్శ చేస్తూ అన్నాడు లక్ష్మణ శాస్త్రి. ఆ వ్యక్తి ఓవర్ కోట్‌లో వుంది. చేతిలో తోలు సంచి వుంది.

"మీరు రా రను కున్నాను," అంటున్నాడు.

"అ దేమిటి ? ఎందుకు అలా అనుకోపటం?" అంటున్నది. ఆ ఓవర్ కోటులో వున్న వ్యక్తి ఆమే అని అప్పుడు నాకు తెలి సింది. మామూలు స్త్రీ ఆకారం కోసం వెదుకుతున్న నా చూపులు ఓవర్ కోటులో వున్న ఆమెను పట్టుకోలేక పోయినయి. నేను మళయాళంలో వున్నప్పుడు ఇటువంటి అవస్థలోనే వుండే వాణ్ణి.

గూడ కట్టుకొని తుండు గుడ్డ భుజాన వేసుకునే ఆ స్త్రీలు నా కంటికి ఎప్పుడూ పొరపాట్న అయినా స్త్రీలుగా కనిపించే వాళ్లు కారు. ఇప్పుడూ ఆ దుర్గతే పట్టింది.

లక్ష్మణ శాస్త్రి అంటున్నాడు—"ఆపేక్ష వున్నచోటే భయం కూడా వుంటుంది. మీరు రావా లనేఆపేక్షతోపాటు మీరు రా రనే భయం కూడా ఎక్కు వైంది."

ఆమె నవ్వి, "కామేశ్వరుడు కూడా ఇట్లాగే మాట్లాడు తాడు" అంది.

ఆమె భర్త పేరు ఎత్తేటప్పటికి లక్ష్మణ శాస్త్రి కించపడి టాపిక్ మార్చటానికి ప్రయత్నించాడు. నన్ను పరిచయం చేస్తూ, "ఇతడు శరశ్చంద్ర బాబు. నాకు పరమ స్నేహితుడు. కథలు రాస్తూ వుంటాడు. సినిమాలతో సంబంధం వుంది. మంచి......"

ఆమె లక్ష్మణశాస్త్రి చేతిని వొదల కుండానే నన్ను ఎగా దిగా చూచి, "మీ కథలు కొన్ని చదివాను. మీ కథలే బాగుంటై" అంది......ఆమె శాస్త్రి ఇంట్లో దిగింది!!

ఆ రాత్రి నిద్ర పట్టక పోటం వల్ల తెల్లవారి కొంచెం ఆల స్యంగా లేచాను. త్వరగా కాల కృత్యాలు తీర్చుకొని ఆమెను చూట్టానికి లక్ష్మణ శాస్త్రి ఇంటికి వెళ్దామా వొద్దా అని ఆలోచిస్తూ కూర్చున్నాను. ఇంతలోకి లక్ష్మణ శాస్త్రి వొచ్చాడు. "ఒకసారి మా ఇంటికి రావోయ్. ఆమె పిలుచుకు రమ్మన్నది" అన్నాడు.

"ఎందుకు?" అని అడిగాను. లోపల వెళ్దా మని వుంది. ఆమె ఊరికేనే పిలుస్తూ వుం దని తెలుసు. అయినప్పటికీ అప్రయత్నంగా ఇలా అడిగేశాను.

లక్ష్మణ శాస్త్రి నన్ను విచిత్రంగా చూచి, కాసేపు ఆగి, "సరేలే, రా" అన్నాడు. నేను బయల్దేరాను.

మేము వెళ్ళేటప్పటికి లక్ష్మణ శాస్త్రి స్నేహితులూ, ప్రాణ్కో కుర్రవాళ్ళు కొంతమందీ వున్నారు. ఆమె వాళ్లమధ్య కూర్చొని కబుర్లు చెపుతూ వుంది. నన్ను చూచి, "ఏమంటే పిలిస్తేగాని రావొద్దనుకున్నారా?" అని నవ్వుతూ అడిగింది.

"మా వాడికి ఆడవాళ్ళని చూస్తే సిగ్గు," అన్నాడు శాస్త్రి.

అంతా నవ్వారు. ఆమె మాత్రం చిన్నబుచ్చుకుంది. కారణం నాకు బోధపడలేదు గాని ఎందుకో బాధ పడుతున్నట్టు మాత్రం స్పష్టంగా కనిపించింది. అయినా కాసేపే! మళ్లీ యథా ప్రకారము అందరితోనూ కులాసాగా కబుర్లు చెప్పటం మొదలు పెట్టింది. తన అనుభవాలు, కథలు కథలుగా వర్ణించి చెప్పింది. చివరకు "మీకు నాకున్న అనుభవంలో పదోవంతు కూడా లేదు" అంది.

నిజమే. అందరూ అంగీకరించారు. "కాబట్టి వయస్సు మాట ఎట్లా వున్నా మీ అందరికీ నేను తల్లిని" అంది.

ఈమాట మా మధ్య పిడుగు పడినట్లు పడింది. కొందరు సిగ్గుపడి తల వొంచుకున్నారు. కొందరు వెకిలినవ్వు నవ్వారు. కొందరు తెల్లబోయారు.

నాకు ఇంకొక లోకంలో వున్నట్లు వుంది. ఆమె మాత్రం వీటిని గమనించినట్లు యథా ప్రకారం మాట్లాడుతూనే వుంది. అందరినీ ఒకే మోస్తరుగా పలకరిస్తూ మాట్లాడింది. సెక్సుని గురించి ఆమె ఫ్రీగా మాట్లాడుతూ వుంటే, కుర్రవాళ్ళంతా కిక్కురు మనకుండా విన్నారు. అవునూ, కాదూ అంటానికన్నాడా వాళ్ళకు

ధైర్యం లేకపోయింది. ఈ కొట్టటానికే వాళ్లకు సిగ్గు వేసింది. 'నేను స్త్రీని' అనే భావం ఆమెకు వచ్చినా గుర్తుకు రాలేదు. నాకు చాలా సంతోషం వేసింది. కాని "పూర్వం సంతానానికి స్త్రీ పురుష సంపర్కం అవసరంలేనట్లు కనిపిస్తుంది. ఇప్పుడు అవసరం; కొన్ని సంవత్సరాలకు మళ్లీ అవసరం లేకుండా పోవొచ్చు" అని ఆమె చెపుతూ వుంటే, నా మనస్సు కూడా చివుక్కు మంది.

కొంచెం సేపు అయిం తర్వాత మేము కాఫీహొటలుకి బైలు దేరాం. ఆమె కూడా మాతో వొచ్చింది. చూస్తే ఎవ్వరు ఏ మనుకుంటారో అని నాకు అమిత కంగారుగా వుంది. కాని ఆమెకు ఏమని చెప్పటం?

మేము దారినే వెళ్తుంటే జనం గుంపుగుంపులు పడి విచిత్రంగా చూస్తూ హేళన చెయ్యటం నేను గమనించాను. ఆమెను గురించి ఒకటి రెండు మాటలు నాచెవిని పడినై. హొటలునుంచి బయటపడి కొంపకి జేరదామని అంతా త్వరగా కాఫీ ముగించారు. ఆమె మాత్రం తొందర పడలేదు.

"ఏదీ ఆ హల్వా ఇట్లా వుంచండి," అని సుబ్బా రావు ప్లేట్లో వున్న హల్వాలో సగం తీసుకుంది. "ఈ బూంది కొంచెం తీసుకోండి," అని శాస్త్రి ప్లేట్లోకి తన బూందిని చెంచాతో సగం నెట్టింది.

ఇక మిగతా టేబిల్సు చుట్టూ వున్న జనం రుస రుసలు చెప్పాలీ!

సాయంకాలం పార్కుకి వెళ్ళాం. అక్కడా ఇంతే, అక్కడి వాళ్లంతా మమ్మల్ని మ్యూజియంలో జంతువుల్ని చూచినట్టు

చూట్టం మొదలు పెట్టారు. ఏం జరుగుతున్నా ఆమెలో మాత్రం ఏమీ మార్పు కనపట్టంలేదు. కాని నేను కనిపెట్టిన వాటిల్లో మరీ విచిత్రం అయిన విషయం ఏమి టంటే ఆడవాళ్ళతో మాట్లాట్టానికి ఆమె నా కంటే సిగ్గు పడేది. లక్ష్మణ శాస్త్రి భార్యతో తల వంచు కొని మాట్లాడేది. ఆమె వేసే ప్రశ్నలకు జవాబులు చెప్పటానికి అమిత సిగ్గు పడేది.

"మీకు పిల్లలు ఎంత మం దండీ?"

" ... ... ... "

"మీ పెద్దపిల్ల, పెళ్ళి యీడుకు వచ్చిందా?

" ... ... ... "

"మీ రిట్లా తిరుగుతూ వుంటే మీ పిల్లలకు ఆలనా పాలనా ఎట్లా జరుగు తుంది?"

" ... ... ... "

"ఈ చీరె ఎక్కడ కొన్నారు? దీని రంగు నిలవదండీ!"

" ... ... ... "

"ఈ జాకెట్టుకు కుట్టు కూలి ఏం యిచ్చారు?"

ఇటువంటి ప్రశ్నలకు జవాబులు చెప్పలేక ఆమె తబ్బిబ్బు పడేది. మర్యాదగా జవాబులు చెప్పా లని ప్రయత్నించేది గాని జవాబులు దొరకకో, అలవాటు లేకో, ఉక్కిరి బిక్కిరి అయ్యేది. ఇంతే కాదు. పసిపిల్లల్ని చూపినా అంతే! మేం అంతా మాట్లాడు తునే సమయంలో శాస్త్రి పిల్లవాడు, "అమ్మా" అంటూ ఆమె వొళ్ళో దూరితే ఆమె పడిన భయం నే నెప్పుడూ మరచి పోలేను. వొళ్ళో తేలు పడ్డట్టు ఉలిక్కి పడ్డది. శాస్త్రి భార్య, "తిరగ మోత మాడులూ వుంది. కొంచెం పిల్లవాణ్ణి చంక వేసు కోండి. చూచి

వస్తాను” అని చెప్పి ఆమెకు పిల్లవాణ్ణి అందించి నప్పుడు ఆమె పడ్డ యాతన ఆ పరమాత్ముడికే తెలియాలి. పిల్లవాణ్ణి చంకన వేసు కోవటం చాత గాక శాస్త్రి భార్య పొయ్యి మీద చట్టిని పట్టు కున్నట్టు పట్టు కుంది. కాని ఎంత బాధ అయినా ఆమె మరు క్షణమే మరచి పోయేది. ఇవతలికి వొచ్చి ఏమీ జరగనట్టు గానే యథాప్రకారం మా అందరి తోనూ కులాసాగా కబుర్లు చెప్పేది. ఆ సంగతే ఎత్తేది కాదు.

భోజనం చేసి ఆమెను గురించి ఆలోచిస్తూ కూర్చున్నాను. ఇంతలో ఆమె కూడా శాస్త్రి ఇంట్లో భోజనం పూర్తి చేసుకొని వొచ్చి "సినిమాకి వెళ్దాం రండి," అని అడిగింది.

నేను కొంచెం తటపటాయించి. "శాస్త్రి ఏడీ?" అన్నాను.

"శాస్త్రి లేకపోతే మీరు రారా?"

"ఎందుకు రాను?"

"ఇంకేం? రండి."

"బండి పిలిపిస్తాను."

"నడచి పోదాం."

ఇద్దరం బయల్దేరాం. రోడ్డు మీద ఎవ్వరూ నడవటం లేదు. మ్యునిసిపల్ లాంతరు స్థంభాలు మిణుకు మంటూ కాపలా కాస్తున్నై. దూరంగా అప్పు డప్పుడు గుర్రపు బళ్ల వోటి మోత విని పిస్తూ వుంది. మే మిద్దరం పక్క పక్కనే నడు స్తున్నాం. చలికి ఆమె శాలువా కప్పు కుంది. అందు కని నాకు ఆమె స్త్రీగా కనపట్టం మానేసింది. కొంచెం సే పయిం తర్వాత ఆమె ఒక్క నిట్టూర్పు విడిచి, ఇలా అంది—"మీ వూరు చాలా వెనకబడి వుం దండీ!"

నా కేమీ తోచక "శాస్త్రి కూడా వొస్తే బాగుండేది"అన్నాను.

ఆమె ఒక్క క్షణం ఆగి, "చాలా వెనకబడి వుంది," అని తనలో తాను అనుకుంటు న్నట్లు అన్నది.

"లేకపోతే బొంబాయి వున్నట్లు వుండమంటే ఎట్లా వుంటుంది?" అన్నాను.

"వూరు సంగతి కాదు. మనుషుల సంగతి. నేను వొచ్చి నప్పటి నుంచీ చూస్తున్నాను. మీరు మాంధాత కాలంలో వున్నారు. అబ్బా, మీ రీ వూళ్ళో ఎలా బతుకు తున్నారో! ఒకరితో మాట్లాడితే ఇం కొకరికి కోపం. అందరితో మాట్లాడితే అందరికీ కోపమే! దీన్నే ఈర్ష్య అంటారు కాబోలు. శాస్త్రి ఇంట్లో మీ అందరి సంగతి చూచాను. కాఫీ హోటలుకి వెళ్ళి టప్పుడు వూళ్లో వాళ్ల సంగతి చూచాను. ఏం అన్యాయం? అన్నీ ప్రిమిటివ్ లక్షణాలే! ఆడవాళ్ళపని మరీ అన్యాయంగా వుంది. ప్రతి భార్యా తన భర్తని యితర స్త్రీల నుంచి కాపాట్టమే తన ధర్మంగా నటి స్తుంది. తన భర్తతో మాట్లాడే ప్రతి స్త్రీ తన భర్తను కాజెయ్యటానికే ప్రయత్నిస్తూ వుంది అనుకుంటుంది. ఎంత ప్రిమిటివ్! మీ రంతా మాంధాత యుగంలో వున్నారు."

నే నేమీ మాట్లాడ లేదు. ఆమె మాటలు యదార్థం అని నాకు తెలుసు. ఆమె వొచ్చిం దగ్గర నుంచి మా జీవితం లోని అమానుషత్వం నాకు స్పష్టంగా కనిపిస్తూనే వుంది.

"మీరు తెలివి గల వాళ్లు. చాలా మంది కంటే తెలివి గల వాళ్ళు. మీరు అనుకుంటున్న దాని కంటే తెలివి గల వాళ్ళు. అందు కని మిమ్మల్ని చూస్తూ వుంటే నాకు ముచ్చటగా వుంటుంది. కాని ఏం లాభం? మీ చుట్టూ వున్న సంఘంలో మీరూ వొకరు అవటం వల్ల మీలో కూడా ప్రిమిటివ్ ఇన్‌స్టింక్ట్స్

చాలా వున్నయ్. మొదటి నుంచీ నేను మిమ్మల్ని గమనిస్తూనే వున్నాను. మీ రిక్కడ వుండి చెడి పోతున్నారు. మీ కొక్క సలహా చెపుతాను. మీ రిక్కడ స్త్రీల క్లబ్బు ఒక దాన్ని ఆర్గనైజ్ చెయ్యండి. ఆడ వాళ్లని కొంచెం కలిసి మెలిసి తిరిగే టట్లు చేస్తే తప్ప ఈ పశుత్వం పోదు. నా మాట వినండి."

ఈ మాటలు మేం బతుకుతున్న బతుకు నంతా ఒక్క సారి జ్ఞాపకానికి తెచ్చినయ్. భార్యల్ని ఇళ్ళల్లో పెట్టటం—బజార్ల వెంట తుకిడీలు తుకిడీలుగా తిరగటం—ఏ స్త్రీ అయినా కనిపిస్తే కోతి చేష్టలు చెయ్యటం—ఆడవాళ్ళ సంగతే సదా మాట్లాడు కోవటం—అంతా అసహ్యంగా కనిపించింది. ఈ మధ్య మా వూళ్లో ఆడవాళ్ళ కోసం జరిగిన హత్యలు జ్ఞాపకం వొచ్చినై. వీ టన్నిటికీ కారణం ఆమె చెప్పిం దేనా? ఆమె మాటలకు సమాధానం చెప్ప కుండా ఆలోచనలో పడ్డాను. ఆమె కూడా గ్రహించి నట్లు వుంది. మళ్ళీ ఆసంగతి ఎత్త లేదు.

హాల్లో ప్రవేశించిం తర్వాత ఆమె మొత్తం మూడు సార్లు మాట్లాడించింది. ఒక సారి "నాకు, ఛార్లెస్ బోయర్ అంటే యిష్టం. కామేశ్వరుడికి గ్రేటాగార్బో అంటే యిష్టం" అంది.

"ఛార్లెస్ బోయర్ అంటే ఎవరికి యిష్టం వుంటుందో నాకు తెలుసు. కాని మీకు యిష్టం అవటం చాలా ఆశ్చర్యంగా వుంది" అన్నాను.

"ఎందుకని?"

"అతడు చాలా మాస్క్యులైన్‌గా వుంటాడు. అతడు ముద్దు పెట్టు కుంటూ వుంటే తెర చిరుగుతుం దేమో నని భయం వేస్తుంది నాకు."

ఆమె చిరు నవ్వు నవ్వుతూ, "చిరిగితే చిరిగిందిలే! అని పిస్తుంది నాకు" అంది. కొంచెం సేపు వుండి," విరుద్ధ స్వభావాలు ఆకర్షించు కుంటాయి అనుకోవటం పాత సిద్ధాంతం "అని నెమ్మదిగా చెప్పింది.

ఇంకా కొంచెం సేపు వుండి, "మీ రన్నమాటకి నా కొక్క విషయం జ్ఞాపకం వస్తూ వుంది. మీతో చెప్పక పోవటం ఎందుకు? మా వూళ్ళో ఒక మహిళా సంఘంలో సభ్యురాలినిగా చేర్చుకో మని అప్లికేషన్ పెట్టు కున్నాను. వాళ్ళు నా అప్లికేషన్ తిరగ గొడుతూ, 'ఈ సంఘం స్త్రీలకు మాత్రమే', అని రాసి పంపారు" అని బిగ్గరగా నవ్వటం మొదలు పెట్టింది. నాకు మాత్రం ఆమెను చూస్తే జాలి వేసింది.

మళ్ళీ సినిమా చూస్తూ కూర్చున్నాం—

మొదటి రాత్రి తెల్ల వారగానే కథానాయకుడూ, కథా నాయికా ఉత్సాహంగా చెట్టు కొమ్మ పట్టు కుని ఒకళ్లు పువ్వు వాసన చూస్తూ, ఒకళ్లు డ్యూయెట్ సాంగ్ పాడుతూ వుంటే, "ఈ సీను మీకు ఎట్లా వుంది ?" అని అడిగింది.

"బాగా లేదు. ఆమె కాసేపు సిగ్గు అభినయిస్తే బాగుం డేది!" అన్నాను.

"ఎందు కని ?"

"గత రాత్రి అనుభవం ఆమెకు ప్రథమం చూడండీ. అందు కని అతని మొహం చూసీ చూట్టం తోనే సిగ్గు జనించడం సహజం," అన్నాను.

"ఆమెకు ఆ అనుభవం ప్రథమం అని మీ కెట్లా తెలుసు?" అని నవ్వింది. నవ్వుతూ తన చేతులో వున్న సంపెంగ పువ్వు

నా చేతిలో పెట్టింది. నాకు పువ్వు లంటే యిష్టం లేక పోయినా వాసన చూస్తూ కూచున్నాను.

"గ్రేటాగార్బో క్వీన్ క్రిస్టినా చూశారా?"

"ఆఁ"

"ఆ సీను ఎట్లా వుంది?"

ఆమె ఏ సీనుకు రిఫర్ చేస్తూ వుందో నాకు తెలిసింది. ఆ సీన్లో గ్రేటా గార్బో పక్కన పడుకునే వరకూ ఆమె కుర్ర వాడు అనుకుంటాడు హీరో. అకస్మాత్తుగా తెలుస్తుంది ఆమె కుర్ర దని. ఆ సీను ఎట్లా వుందని ఆమె నన్ను అడుగుతూ వుంది.

"బాగుంది"

"......ఆ షాట్ ఎట్లా వుంది?"

ఆమె ఏ షాట్ను గురించి అడుగుతూ వుందో నాకు తెలిసింది. కాని ఆమె ఆ షాట్ అందం అడగటం లేదు. ఆ షాట్లో వున్న గ్రేటా గార్బో సంగతి అడుగుతూ వుంది. గార్బో ఒదు లొదులుగా వున్న చొక్కాలో నిలబడి వుంది. లోపల మ రేమీ లేదు. అది ఎట్లా వుంది? అని అడుగు తూంది నన్ను.

"అసలు గార్బో చిత్రాలు చూస్తూంటే నాకు ఊపిరి సల పక ఒక రకంగా వుంటుంది. అట్లా అవటం నా కిష్టం వుండదు."

ఆమె మాట్లాడ లేదు.

సినిమాహాల్లో నుంచి బయటికి రాగానే ఆమె ఇట్లా అన్నది: "ఇక ఈ ఫూళ్ళో నేను బతక లేను. మీ రంతా ప్రిమిటివ్‌పీపుల్. నాలుగు వందల సంవత్సరాల క్రిందటి జీవితాన్ని ప్రస్తుతం మీరు గడుపు తున్నారు. మిమ్మల్ని చూస్తూ వుంటే, బారువా చిత్రాల లోని కోయ వాళ్లు జ్ఞాపకం వొస్తున్నారు. బారువా నవ నాగరిక

కుటుంబాలను చూపించి, చూపించి అకస్మాత్తుగా కోయగూడెంలో ప్రేక్ష కుల్ని పడేస్తాడు. ఇతర చోట్లు చూచి, మీ ప్రాపు వెచ్చిన నా పని ఇప్పు డట్లా వుంది. ఇక ఇక్కడ నేను బతకలేను. రేపే వెళ్ళి పోతాను. ''

ఆమె ఇంకా కొన్నాళ్లు ఈ వూళ్లో వుండాలని నాకు వుంది. ఆమె వుంటే మా జీవితాలు కొద్దిగా నైనా మారవెచ్చు అనే ఆశ కూడా వుంది. కాని నా వుద్దేశా లన్ని ఆమెతో చెప్పుకోలేక '' రేపు ఒక్క రోజు వుండ కూడదూ ? '' అన్నాను.

'' వుండను. నేను నిజంగా చెప్తున్నాను. ఈ వాతావర ణంలో ఒక్క క్షణం కూడా బతకలేను. టార్జాన్ చూశారుగా ! ఆ మృగాల మధ్య, ఆ మహారణ్యంలో, ఆ టార్జాన్ పక్కన వున్న పిల్లని చూస్తే నాకు అమిత భయం వేసేది. ఇప్పుడు మీ వూళ్ళో మీ మధ్య నా పని ఆ పిల్ల పనిలాగే వుంది. ఎలా వుండగలను ! వుండను. ''

మర్నాడు పొద్దున్న నేనూ లక్ష్మణ శాస్త్రీ మరి కొంతమంది స్నేహితులం కలిసి ఆమెను బొంబాయి రైలు ఎక్కించి వచ్చాం. ఎక్కించి వచ్చాం అంటే ఆమె ఎక్కింది, మేం చూస్తూ నుంచున్నాం.

ఆమె నా జీవితాన్ని మార్చి వేసింది. నా దృష్టి పూర్తిగా మారి పోయింది. ఇంతకు ముందు ఏపని చెయ్యబోయినా ఇన్ సెంటివ్ వుండేది కాదు. ఇప్పుడా తత్వం పోయింది. హుషారు ఎక్కు వైంది. ఇది వరకు ఎవ్వరైనా ఉపన్యాసానికి పిలిస్తే వెళ్ళ బుద్ధి అయ్యేది కాదు. ఇపు డలా కాదు. కథలు రాయాలనీ, ఉప న్యాసా లివ్వా లనీ, పదిమంది చేత మెప్పులు పొందా లనీ అపేక్ష

కలిగింది. అన్నిటి కంటే పెద్ద మార్పు, చేతులూ, కాళ్లూ, మొహం రోజూ వీలు చిక్కినప్పుడల్లా శుభ్రంగా తోము కోవటం నాలో కలిగిన మార్పుకి ఇవి ఉదాహరణలు మాత్రమే ! ఏ పని చెయ్య బోయినా, ఎవ్వరితో మాట్లాడ బోయినా ఏదో జీవిత రహస్యం తెలుసుకున్నట్టు, తారక మంత్రోపదేశం పొంది నట్టు, సంతోషంగా వుండేది. ఆమె మాటలూ - ఆ చనువుగా వుం డీ వుండకుండా వుంటం - చనువుగా వుంటూనే లొల్లిగా వుండ కుండా వుంటం నిర్భయంగా అన్ని విషయాలూ చర్చించటం - ఆమెనితలుచు - కొన్నప్పు డల్లా హృదయం ఉప్పొం గేది. స్త్రీ మొగ వాడితో తిరిగితే పాడై పోతుంది అంటారే ఎంత పొరపాటు మాట !!

ఆ నాటి సాయంకాలం లక్ష్మణ శాస్త్రి ఇంటికి వెళ్ళాను. అతనితో ఆమెను గురించి కాసేపు ముచ్చటిద్దా మనే వుద్దేశంతో వెళ్ళాను. ఆమెని గురించి తలుచు కున్నా, ఆమెని గురించి మాట్లాడినా, ఆమె పక్కన కూర్చుని నవ్వు తున్నట్లు వుండేది నాకు. నేను వెళ్ళే టప్పటికి లక్ష్మణ శాస్త్రి ఇంట్లో సుబ్బారావూ, కృష్ణారావూ వెంకటేశ్వరరావూ వున్నారు. లక్ష్మణ శాస్త్రి వాళ్ళ కేదో చెపుతున్నాడు. వాళ్లు కూడా ఆమెను గురించే మాట్లాడు తున్నారని నేను కనిపెట్టాను. పాపం వాళ్ళని చూస్తే నాకు జాలి వేసింది. వాళ్లు దిగులుగా కూర్చున్నారు. ఆమె వెళ్ళి పోగానే వాళ్ళ జీవితా లన్నీ ఒక్కసారి అయోమయం అయి పోయినై. చెట్టు ఆశ్రయం పోయిన పక్షుల్లా అయిపోయారు. తల్లి ప్రేమను పోగొట్టు కొన్న పిల్ల లాగా కూర్చున్నారు. 'నేను మీ తల్లిని' అని ఆమె చెప్పిన మాట నా చెవుల్లో గింగురు మంది.

నేను వెళ్ళి కూర్చోగానే లక్ష్మణశాస్త్రి "ఏమోయ్ మన కృష్ణారావు ఏమంటున్నాడో విన్నావా? ఆమెను మళ్లీ పిలిపించి మహిళా సంఘాలు ఆర్గనైజ్ చేయించా లంటున్నాడు."

"మంచిదేగా! తగిన సన్నాహాలు చేసి పిలిపించండి" అన్నాను. నా కక్కడా ఆ కోర్కె వుందని చెప్పటం నాకు ఇష్టం లేక అలా అన్నాను.

"పిలిపించండి అంటే కాదు. మేము రాస్తే వస్తుందో లేదో నువ్వు రాయాలి......" అన్నాడు కృష్ణారావు.

"మన కోసం వస్తుందా? ఎవ్వరు రాసినా ఒకటే" అన్నాను.

"అదేమిటి? స్నేహం మంచి చెడ్డా వుండవ్? నువ్వంటే ఆవిడకు గురి......" అన్నాడు సుబ్బారావు. సుబ్బారావు చూపులూ, వైఖరీ నాకేమీ నచ్చ లేదు. అసలు మొత్తం అంతా విచిత్రంగా వుంది. వాళ్ళ స్వభావమే విచిత్రంగా మారి నట్లు వుంది. వాళ్ళ ధోరణి చూస్తే నాకు కోపం వచ్చింది.

"అందరం స్నేహితులమే! ఇందులో కాం దెవరు?" అన్నాను.

"మా స్నేహాల దేముందిలే! మావన్నీ ఉత్తుత్తి స్నేహాలు. మాతో స్నేహం చెయ్యటానికి, మేమేమన్నా కథలు రాస్తామా? హ్యూమరస్‌గా మాట్లాడి నవ్విస్తామా? సినిమాలకు వెంటబెట్టుకు పోతామా?" అన్నాడు సుబ్బారావు.

ఆఖరి మాటకు అంతా విషపు నవ్వు నవ్వారు. కృష్ణారావుకి ఎన్నడూ ఆరోగ్యం సరిగ్గా వుండక పోవటం వల్ల ఏ మొచ్చినా ఆపు కోలేడు. విరగ బడి నవ్వటం మొదలు పెట్టాడు. వాళ్ళ సంభాషణ

మాట అటుంచి, వాళ్ళ నవ్వు కూడా నాకు సహజంగా కనపడ లేదు. క్షణ క్షణానికీ నాకు కోపం ఎక్కువ అవుతూ వుంది.

నేను సుబ్బారావు వంక తీక్షణంగా చూచి, "నీ తెలివికి సంతోషించాను. ఇక కైనా ఆపు!" అన్నాను.

లక్ష్మణశాస్త్రి చిలిపినవ్వు నవ్వుతూ, "ఎందుకోయ్ అంత ఉలుకూ? వాళ్ళన్న మాటలో తప్పేముంది. మీరు సినిమాకి తిరిగిన మాట నిజమేనాయే! మా అందర్లోకీ ఆమెకు నువ్వంటే మన స్సన్న మాట అందరికీ తెలిసిన విషయమే! మొగా ఆడా అన్న తర్వాత, కలిసి తిరగటం మొదలు పెట్టింతర్వాత......"

"శాస్త్రీ......!!" అని గద్దించాను.

అతడు నామాట లెక్క చేయలేదు. వింత ధోరణిలో మాట్లాడుతూ వున్నాడు.—"తప్పేముందోయ్? ఆమె నంగ నాచా?......"

అంతా గొల్లున నవ్వారు.

నాకు తపన పుట్టింది. "ఆమెను ఒక్క మాట అన్నావా, నేను వూరుకోను," అని గట్టిగా అరుస్తూ లేచి నుంచున్నాను.

నాకు కోపం ఎక్కువ అవుతున్నకొద్దీ శాస్త్రికి చిలిపితనం ఎక్కువ అవుతూంది. కొంటెనవ్వుతో అతని మొహం నిండి పోయింది.—"చూశారా, ఆవిడమాట అంటే అతనికి ఎంత కోపమో! మనం ఆమెని ఒక్కమాటకూడా అనగూడదట! మీరు శ్రద్ధగా వినండి—ఒక్కమాటకాదు, వెయ్యి మాట లంటా. ఆమె మహా పతివ్రత. ఈమధ్య సినిమాలో ఆమె పాతివ్రత్యం కాపాట్టానికి ఇతగాడు ప్రయత్నించాడు. ఆమె......"

ఇంతవరకే అన్నాడు. కాని ఆమెని అతడు అనబోయే మాటలన్నీ నాకు ముందే వినబడినై. ఆమాటలు నా చెవిని పట్టం నాకు యిష్టం లేదు. క్షణక్షణం పెరుగుతూ వచ్చిన కోపాన్ని తట్టుకో లేక పోయాను. ఇంతలో శాస్త్రి "పుష్పం, మకరందం భ్రమరం" అంటున్నాడు.

ఇ కేముందీ? అమాంతంగా శాస్త్రిమీదకు వెళ్ళాను. అతన్ని నేను ఎన్ని దెబ్బలు వేశానో, తర్వాత ఏ మయిందో నాకు తెలియ లేదు. కాసేపటికి నేను నుంచున్నాను. సుబ్బారావూ, కృష్ణారావూ వెంకటేశ్వరరావూ కింద పడివున్న శాస్త్రిని నెమ్మదిగా లేపు తున్నారు. అతని చూపులు చూస్తే నాకు జాలివేసింది. నేను ఇటువంటి పనికి పూనుకుంటా నని అతడు ఎప్పుడూ అనుకుని వుండడు. నన్ను జాలిగా చూస్తూ అతడు "నీకు పిచ్చె త్తిం" దన్నాడు.

* * *

నేను చేసినపనికి నాకు ఏమాత్రం పశ్చాత్తాపం కలుగ లేదు. ఎందు కల్గుతుంది ? మంచీ, చెడూ తెలియకుండా, అనే మాటా, అనని మాటా, తెలియకుండా నోరు పారేసుకుంటే ఎట్లా ఓర్చుకోవటం ? వాళ్ళు నాకు స్నేహితులే కావచ్చు. అయితే మాత్రం ? అందులో ఆమెని గురించా ?

ఆమె అటువంటి మనిషేనా? ఆమాత్రం వాళ్లు తెలుసుకో వొద్దూ ? ఆమె పక్కన కూర్చున్నా, ఆమెతో కలిసి మాట్లాడినా, ఆమెతో కలిసి నవ్వినా, అటువంటి చెడు ఆలోచనే రాదే ! ఏదో లోకంలో, మబ్బుల్లో, శరీరాలే జ్ఞాపకానికి రాని భావనలో సంచారం చేస్తున్నట్టు వుంటుందే ! అటువంటి ఆమెకా ఇటు

వంటి నీచ స్వభావం అంట గట్టటం? వీళ్లుకూడా అందరికి మల్లే స్త్రీ పురుషుడితో తిరిగితే చాలు చెడిపోయి తీరాలి అనే అభి ప్రాయంలోనే వున్నారు. ఇక స్నేహితు లైతే మాత్రం వీళ్ళని నేను ఎందుకు సహించాలి?

నిజంగా నేను చేసినపనికి నాకు చాలా సంతోషం వేసింది. వాళ్ళకు తగినట్టు బుద్ధి చెప్పా ననే తృప్తి కలిగింది.

ఒక్కొక్కప్పుడు, జరిగింది జరిగినట్టు ఆమెకు రాద్దా మని పించేది. మళ్ళీ ఆమె మనస్సుని కష్టపెట్టిన వాళ్ళం అవుతా మేమో నని పస్తాయించి వూరుకునే వాణ్ణి. అటువంటి ఆమె కొంతమంది తనని గురించి ఇట్లా అనుకుంటున్నా రని తెలిసినా, కొంతమంది మనుషులు ఎంత నీచంగా ఆలోచిస్తారో తెలిసినా, ఎంత బాధపడుతుందో, ఆమె పవిత్ర హృదయం ఎంత కొట్టు కుంటుందో నాకు తెలుసు. అందు కని ఇక్కడ జరిగిన సంగ తులు ఆమెకు ఏమీ రాయకుండా వూరుకున్నాను.

కాని అయిదో రోజు ఆమె దగ్గరనుంచే నాకు వుత్తరం వొచ్చింది. నాకు ఎంత ఆశ్చర్యం వేసిం దని! ఇక నా ఆనందానికి అంతే లేదు. గబగబా ఉత్తరం చించి చదివాను. ఆ వుత్తరం రావటం నాకు ఆశ్చర్యం కలిగిస్తే, ఇక ఆ వుత్తరంలోని సంగ తులు చదివేటప్పటికి, నా హృదయం ఆగిపోయిన ట్లయింది. ఆమె ఉత్తరం ఇది ... ...

"నేను బాగానే ఉన్నాను, ఇంటికి నలగని పువ్వల్లే చేరాను. వొచ్చినప్పటి నుంచీ మీకు ఉత్తరం రాద్దా మనుకుంటు న్నాను. కాని మీకు వుత్తరం ఎలా రాయాలో బోధపట్టం లేదు. ఏం రాస్తే ఏ మనుకుంటారో, నేను రాయదలచింది మీకు అర్థం

అయ్యేట్టు రాయగలనో లేనో అని భయంవేసి మెదలకుండా పూరుకున్నాను. నేను నిజం చెప్పుతున్నాను. మీకు అర్థం అయ్యే భాష నాకు రాదు — ఒకవేళ వొచ్చినా మరచిపోయి వుంటాను.

"ఇవ్వాళ లక్ష్మణశాస్త్రి దగ్గరనుంచి వుత్తరం వొచ్చింది. మీ రేమీ ఆశ్చర్యపడ వొద్దు. మే మిద్దరం స్నేహితులం అనే విషయం మీకు తెలిసిందేగా! ఆ వుత్తరంలో అతడు సంగతు లన్నీ విపులంగా రాశాడు. అత డేమీ అబద్ధాలు రాయలేదు. అతనికీ మీకు జరిగిన పోట్లాట అంతా రాశాడు. తన తప్పుని కప్పిపుచ్చు కోటానికి ఏ మాత్రం ప్రయత్నించ లేదు. అక్షరాలా జరిగింది జరిగినట్టు గానే రాశాడు. ఆ వుత్తరం చదువుతూ వుంటే నాకు అపరాధ పరిశోధక నవల చదువుతూ వున్నట్లు వుంది. స్టంట్ పిక్చర్ చూస్తూ వున్నట్లు వుంది.

"ఏ మండీ, మీరు నా ఆనర్ డిఫెండు చెయ్యటానికేనా శాస్త్రితో పోట్లాడింది? అతన్ని కొట్టటం కూడా నా కోసమేనా? నిజంగా ఆ దృశ్యం ఊహించు కుంటూ వుంటే — మీ రేగిన ఉంగరాల జుట్టూ, ఎర్రబడ్డ కళ్ళూ, ఆవేశంతో చేతులూ కాళ్ళూ ఒణకటం, లక్ష్మణశాస్త్రి కింద పట్టం, మీరు మీదకు దూకటం, జుట్టు పీకటం, మొహం రక్కటం, — ఇ వన్నీ ఊహించు కుంటూ వుంటే నాడియా మీద నాకు అభిమానం హెచ్చుతూ వుంది. మాట వరసకు అంటం కాదు. నాడియా అంటే నాకు పూర్తి అభిమానం. జనాన్ని గుంపులు గుంపులుగా పడేసి హంటర్‌తో ఏం కొడుతుండంటి! "మీరు చూపిన షివల్రీ నన్ను ఆకర్షిస్తూ వుంది. గాలి పటం మీద ప్రయాణం చేసి, మీ ముందు నా కృతజ్ఞత చెప్పుకోవా లని పిస్తూవుంది. మీ ముందు కూర్చొని

అయ్యేట్టు రాయగలనో లేనో అని భయంవేసి మొదలకుండా పూరుకున్నాను. నేను నిజం చెప్తున్నాను. మీకు అర్థం అయ్యే భాష నాకు రాదు — ఒకవేళ వొచ్చినా మరచిపోయి వుంటాను.

"ఇవ్వాళ లక్ష్మణశాస్త్రి దగ్గరనుంచి వుత్తరం వొచ్చింది. మీ రేమీ ఆశ్చర్యపడ వొద్దు. మే మిద్దరం స్నేహితులం అనే విషయం మీకు తెలిసిందేగా! ఆ వుత్తరంలో అతడు సంగతు లన్నీ విపులంగా రాశాడు. అత డేమీ అబద్ధాలు రాయలేదు. అతనికీ మీకు జరిగిన పోట్లాట అంతా రాశాడు. తన తప్పుని కప్పిపుచ్చు కోటానికి ఏ మాత్రం ప్రయత్నించ లేదు. అక్షరాలా జరిగింది జరిగినట్టు గానే రాశాడు. ఆ వుత్తరం చదువుతూ వుంటే నాకు అపరాధ పరిశోధక నవల చదువుతూ వున్నట్లు వుంది. స్టంట్ పిక్చర్ చూస్తూ వున్నట్లు వుంది.

"ఏ మండీ, మీరు నా ఆనర్ డిఫెండు చెయ్యటానికేనా శాస్త్రితో పోట్లాడింది? అతన్ని కొట్టటం కూడా నా కోసమేనా? నిజంగా ఆ దృశ్యం ఊహించు కుంటూ వుంటే — మీ రేగిన ఉంగరాల జుట్టూ, ఎర్రబడ్డ కళ్ళూ, ఆవేశంతో చేతులూ కాళ్ళూ ఒణుకటం, లక్ష్మణశాస్త్రి కింద పట్టం, మీరు మీదకు దూకటం, జుట్టు పీకటం, మొహం రక్కటం, — ఇవన్నీ ఊహించు కుంటూ వుంటే నాడియా మీద నాకు అభిమానం హెచ్చుతూ వుంది. మాట వరసకు అంటం కాదు. నాడియా అంటే నాకు పూర్తి అభిమానం. జనాన్ని గుంపులు గుంపులుగా పడేసి హంటర్‌తో ఏం కొడుతుందండీ! "మీరు చూపిన షివల్రీ నన్ను ఆకర్షిస్తూ వుంది. గాలి పటం మీద ప్రయాణం చేసి, మీ ముందు నా కృతజ్ఞత చెప్పుకోవా లనిపిస్తూవుంది. మీ ముందు కూర్చొని

మీకు నా కృతజ్ఞతను తెలుపు కుంటూ నమస్కరిస్తే మీరు నా చేతులు పట్టుకొని లేపి, "దీనికి మీరింత పొగడాలా? నా ధర్మం నేను నెరవేర్చాను..." అంటారు కదూ! ఇటువంటి సీను ఏదో సినిమాలో చూచినట్టు జ్ఞాపకం. ఇటువంటి సీన్లు నాకు బా గుంటాయి కూడాను.

"కాని ముందు మిమ్మల్ని ఒక్క మాట అడగా లని వుంది. దానికి మీరు సవ్యంగా జవాబు చెప్పితే రెక్కలు కట్టుకొచ్చి మీ ముందు వాలి, ఆ సీను యాక్టు చేసి పోతాను. ఆ మాట ఏమి టంటే, అసలు నేను, నంగనాచి నని మీ కెట్లా తెలిసింది ? మీరు నన్ను గురించి అలా అనుకోటానికి ఆధారా లేమిటి ? నా మాటలు గానీ, నా చేష్టలు గానీ, అటువంటి అవకాశం కలిగించి నయ్యా ? అలా కలిగించి వుండవు. ఎందు కంటే నేను నిజంగా నంగనాచిని కాదు. లక్ష్మణ శాస్త్రి మీకు యదార్థమే చెప్పాడు. నాకు నంగనాచిని కావా లనే అపేక్ష కూడా లేదు. "మీరు నన్ను అపార్థం చేసుకో వద్దు. ఉన్న సంగతి వున్నట్టుగా చెపుతున్నాను. మీరు చూపిన షివల్రీ విషయంలో కూడా నాకు ఒక అనుమానం వుంది. ఆడవాళ్లని రక్షించ వలసిన బాధ్యత పురుషుల మీద వుంది అనే అభిప్రాయమే ఈ షివల్రీకి కారణం అనిపిస్తూ వుంది నాకు. ఈ అభిప్రాయానికే, స్త్రీ పురుషుడి ఆస్తి అనే అభిప్రాయానికీ చాలా దగ్గర సంబంధం వుంది. నా ఆస్తి అనుకున్నప్పుడూ, ఆ ఆస్తి తన్ను తాను కాపాడుకో లేని స్థితిలో వుంది అనుకున్నప్పుడేగా రక్షించ వలసిన అవసరం కలిగేది? నేను ఒక రోజు మీతో తిరిగి, ఒక రాత్రి కలిసి సినిమా చూసి నంత మాత్రాన నన్ను గురించి మీ రిట్లా అనుకోటం — నా అనర్హ

కాపాడ వలసిన బాధ్యత మీ మీద ఉం దను కోటం చాలా అన్యాయం. లక్ష్మణ శాస్త్రి మొద లయిన వాళ్ళకీ మీకూ భేదం ఏ ముంది ? నేను ఇం కొకళ్ళ ఆస్తి సయ్యా ననే అసూయతో వాళ్ళు మీ దగ్గర నేటికి వచ్చినట్లు మాట్లాడారు. మీ ఆస్తిని హేళన చేస్తున్నా రనే భావంతో బాధ పడి, అవమాన పడి మీరు వాళ్ళతో దెబ్బ లాడారు. ఇక భేదం ఎక్కడ? మీరు నా కోసం పోట్లాట్టం ఖాళీ కోటని రక్షించ టానికి ప్రాణాలు పెట్టి పోట్లాడే రస పుత్ర వీరుని శౌర్యం, ధైర్యం, సాహసం జ్ఞాపకానికి తెస్తు న్నది. "మీకూ, మీ కథలకూ ఎంత భేదం వుందండీ ! మీ ప్రవ ర్తన వేరు, మీ రచనలు వేరు. ఒకటి వెనక్కి లాగుతూ వుంటే ఒకటి ముందుకు లాగుతూ వుంటుంది. ఆలోచించు కొన్న కొద్దీ ఆ కథలు రాసింది మీ రేనా అనిపిస్తూ వుంది నాకు. నేను చాలా మంది రచయితల్ని ఎరుగుదును. ఎక్కువ మంది యింతే ! వాళ్ళ రచనల్లో వెలిబుచ్చే అభిప్రాయాలు ఎంత అభివృద్ధి దాయకంగా వుంటై ! కాని ప్రవర్తన మామూలు మనిషి ప్రవ ర్తన కంటే అధ్వాన్నంగా వుంటుంది. దీనికి, భావాలను, ఆలో చనలను, ఆచరణ లోకి, అనుభవం లోకి తీసుకు రావా లనే ప్రయత్నం లేక పోవటమే కారణం అనుకుంటాను. మీ విష యంలో యిట్లా వుండ దని కుతూహల పడ్డాను. కాని మీరూ అంతే ! సాధారణంగా రచయితల్లో వుండే బలాలు, బలహీన తలూ, ఉద్దేశాలూ, ఆవేశాలూ అన్నీ మీలోనూ వున్నాయి.

"మీరు మారాలి — దయచేసి మారాలి. ఈ మాట నేను మీకు మీ వూళ్ళో వున్నప్పుడే చెప్పాను. మళ్ళీ చెపుతున్నాను. నేను ఇంతగా ఎందుకు చెపుతున్నా నంటే, మీలో ఇన్ని బలహీన

తలు ఉన్నా మీ రంటే నాకు యిష్టం. అందు కని మిమ్మల్ని బాగు చెయ్యాలనే కోర్కె నాలో గాఢంగా వుంది. దీనికి నాకు ఒక్కటే దారి కనిపిస్తూ వుంది. మీరు లేడీక్లబ్ ఒక్కటి అర్గ నైజ్ చెయ్యండి. ఆ క్లబ్బుకి మీరే సెక్రెటరీగా వుంటే మరీ మంచిది. నేను చాలా సంతోషిస్తాను. అశ్రద్ధ వొద్దు. జాడ్యం ముదరనిస్తే తరువాత ఎంత ప్రయత్నించీ లాభం వుండదు.

"లేడీస్ క్లబ్బుకి సెక్రెటరిగా వుంటే నాకు ఊపిరి సలపదు. నాకు అట్లా అవటం ఇష్టం వుండదు," అని మహా పతివ్రత పోజు పెట్ట కండి. వూరికే అట్లా అంటారు గాని ఊపిరి సలపక ఏమవు తుంది? ఎంతసేపూ "నేను అందంగా, తెలివిగా మాట్లాడు తున్నానా లేదా?" అనే గొడవే గాని సహజంగా మాట్లాడుదాం అని గానీ, యదార్థం మాట్లాడుదాం అని గానీ మీకు ఎందుకు వుండదు? సంఘానికి జడిసి బానిస అయి చిటచిట లాడుతూ, రుసరుస మంటూ కాలం గడిపే పతివ్రతగా మీరు వుంటం నాకు ఇష్టం లేదు.

"ఇక సెలవు. నేను మన సిచ్చి, రాయదలచు కుం దంతా రాశాను. మీరు కూడా అట్లాగే ప్రవర్తించా లని నా కోర్కె. తప్ప కుండా జవాబు రాయండి.

"అయితే, ఏమండీ, అడగటం మరచి పోయానూ, సిని మాలో సంపెంగ పువ్వు చేతి కిస్తే, సినిమా అయ్యే దాకా వాసన చూస్తూ కూర్చుంటారా? వాసన చూట్టాని కేనా సంపెంగ పువ్వు విచ్చేది? పువ్వులు ఎందుకు పుట్టినయ్? వాసన చూట్టానికి; సెల యేరు వెందుకు ప్రవహిస్తూ వుంది? గానం చెయ్యటానికి; మంచి గంధం చెట్టు ఎందుకు పుట్టింది? పాములకు ఆశ్రయం

యివ్వటానికి. ఇంతే గాని వీ టన్నిటికీ మానవుడు పరిస్థితుల్ని బట్టి కొత్తకొత్త అర్థాలు సృష్టించు కుంటాడని గాని, మాటలతో చెప్పకో టానికి వీల్లేని భావాలను వీటి ద్వారా చెప్పుకుంటా డని గానీ మీకు తెలియదు. మీ రంతా ఎంత ప్రిమిటివ్‌గా వున్నా రంటే! పైగా నేను నంగనాచినని ప్రచారం! నేను కూడా ప్రిమిటివ్‌గా వున్నా ననేనా మీ వుద్దేశం?— ఉండా లని అపేక్ష కామాలు.

ఇట్లు,

" మీ "

P. S.

లక్ష్మణ శాస్త్రి రాసిన వుత్తరం కామేశ్వరుడు చూశాడు. చూడగానే గుక్కలు పట్టి నవ్వుకున్నాడు. ఇప్పటికీ జ్ఞాపకం వెచ్చినప్పు డల్లా, ఒంటరిగా వున్నా సరే, అలా నిలబడిపోయి నవ్వు కుంటూ వుంటాడు. ఒక మాట చెప్పటం మరచి పోయాను. ఆ వుత్తరం చూసి నప్పటి నుంచీ కామేశ్వరుడికి మీ మీద చాలా ప్రేమ కుదిరింది.

"............"

ఇదీ ఉత్తరం—ఆమె దగ్గర నుంచి వెచ్చిన వుత్తరం. ఈ వుత్తరం చదువు కొని నేను ఏ మయ్యానో మీకు తెలుసు కోవా లని వుంటుంది — నెల రోజులు ఖాయిలా పడ్డాను.

# శిలా ప్రతిమ

## శ్రీ చింతా దీక్షితులు

జననము 1891 లో, తూర్పు గోదావరి జిల్లాలో. రాజమహేంద్రవరములో 1913 లో బి. ఏ. 1915 లో సైదాపేటలో ఎల్. టీ. బహు ప్రదేశములలో ఉపాధ్యాయ వృత్తిలోను, బహు కాలము పాఠశాలల ఇన్‌స్పెక్టరు గాను పని చేసినాడు. 1919 లో "పరిణామ వాదము తన్నిదర్శనములు (Science)" అను గ్రంథమునకు రామారాయణింగారి బహుమానము లభించినది.

రచనలు: రాజగిరిరాజు (నవల: 1913); ఏకాదశి (కథలు: 1925); దీక్షితుల కథలు; దాసరి పాట (కథా సంపుటి); "వటీరావు కథలు"; శబరి (నాటకము); ప్రజా వాఙ్మయము (వ్యాసములు); లక్క పిడతలు (గేయములు); (Fairy Fales), బాల వాఙ్మయమ్ము, నాటికలు అనేకము రచించినాడు.

ఆంధ్రదేశ రచయిత లందరిలో ఉన్నత దేహుడు; ఒక్క చేతితో గోదావరి పూర్తిగా ఈదినాడు. రమణ మహర్షి భక్తుడై, ఆధ్యాత్మిక జీవితము గడపుచున్నాడు.

---

౧

"త్యాగం అంటే ఏమి టండీ" అన్నాను భైరవ శాస్త్రుల్లుగారితో.

భైరవ శాస్త్రుల్లు గారు అప్పుడే భోజనము చేసి అంగాస్త్ర ముతో చేతులు తుడుచు కొంటూ వచ్చి అరుగు మీద కూర్చు న్నారు. రాత్రి ఎనిమిది గంట లయింది. ఆ సమయానికి ఆ చుట్టు పట్లు కాపుర మున్న నేనూ యితర గృహస్థులూ భైరవ శాస్త్రుల్లు గారి అరుగు మీద చేరి పిచ్చా పాటీ చెప్పు కోవడం అలవాటు. భైరవ శాస్త్రుల్లు గారికి కథ లంటే మహా సరదా. ' ప్రశ్న అడిగినా ఆ ప్రశ్నకు సమాధానంగా ఒక కథ చెప్పుతూ వుంటారు.

"త్యాగం అంటేనా ?" అని శాస్త్రుల్లు గారు ఒక మారు త్రేన్చి, కడుపు సవరించు కొని, అంగాస్త్రం నడుం చుట్టూ తిప్పి మోకాళ్ళ కింద కట్టి పర్యంక బంధం వేసుకొని "త్యాగం అంటేనా ?" అన్నారు.

"చిత్తం, త్యాగం అంటే తమ రేమి సెల విస్తారో వినా లని వున్నది శాస్త్రుల్లు గారూ" అన్నాను.

"భగవద్గీతలలో త్యాగం అన్నప్పుడు సర్వ కర్మ ఫల త్యాగమే త్యాగముగా ఎన్నుకో వలసి ఉంటుం దని చెప్పబడ్డది. అట్టి త్యాగమున్నూ సత్త్వ రజ స్తమో గుణాల ననుసరించి ముప్పిధముగా ఉంటుంది అని చెప్ప బడ్డది. కాని దరిమిలాను త్యాగార్థము అనేక విధాలుగా మారింది. త్యాగానికి ప్రసిద్ధార్థము ఈవి. ఋషితో సమాన మైన కాళిదాసు గారుకూడా "త్యాగాయ సంభృతార్థానాం" అన్నారు.

"అతడికి యెంత మాత్రమూ త్యాగం లేదన్నా, త్యాగ బుద్ధి లేదన్నా లోకములో, ఈవి లేని వాడు అనే అర్థమునే చేసు కొంటాను."

"ఇది ఇలా ఉండగా ఈ కాలములో ఆత్మ త్యాగ మనే మాట తరుచుగా వాడు తున్నారు. దీని కర్థము దేహ త్యాగ మనే; అనగా ఉదాత్త మైన కార్యా న్నుద్దేశించి తన ప్రాణములను విడిచి పెట్టడమే. ఆత్మ త్యాగ మనే మాటలో ఆత్మకు దేహ మనే అర్థం చెప్పాలి. ఎందువల్ల నంటే ఆత్మ అనే దానికి త్యాగ మంటూ ఉండదు కదా. ఆత్మ త్యజించేదీ కాదు, త్యజించ బడేదీ కాదు." అని శాస్త్రుల్లు గారు పొడుంకాయ కోసం యిటూ అటూ వెతుక్కోవడం మొదలు పెట్టారు. కథ చెప్పడానికి బదులు వాక్యార్థం చేస్తున్నారు. అడ్డు ప్రశ్న వేస్తేనే గాని ఈ ధోరణి తగ్గ దని అన్నాను గదా — "శాస్త్రుల్లుగారూ! ప్రాచీన కాలంలో నైతే నేమి, ఈ కాలంలో నైతే నేమి ఉత్కృష్ట మైన త్యాగం చేసిన వాళ్ళు చాలా మంది ఉన్నారు గదండీ?" అని.

శాస్త్రుల్లు గారు పొడుం పట్టు పట్టుకొని, "తొందర పడకు, విశ్వం తొందర పడకు: వస్తున్నాగా - అయితే ఈ త్యాగమున్నూ అనేక విధాలగా వుంటుంది. మన విశ్వం చెప్పి నట్లు గొప్ప గొప్ప త్యాగాలు చేసిన వాళ్ళు పూర్వ మందూ ఇప్పుడూ కూడా ఉన్నారు. అజ మహారాజు, రఘు మహారాజు, శ్రీరామ చంద్రుల వారూ, శ్రీకృష్ణ చంద్రుల వారూ —"

"అయితే శాస్త్రుల్లుగారూ — వీరు వీరు చేసినటువంటి త్యాగాలు —"

"తొందర పడ కయ్యా, విశ్వం — చెప్ప వచ్చిన మాట ఏమి టంటే — మహా పురుషు లైతే నేమి, స్త్రీ లైతే నేమి, పూర్వ కాల మం దైతే నేమి, ఈ కాల మం దైతే నేమి, చేసిన త్యాగాలు అనేక విధములుగా ఉండు కుంటున్నవి. శ్రీ కృష్ణ

చంద్రుల వారిని సత్యభామా అమ్మవారు నారదుల వారికి దానము చెయ్యడ మనేది బహు ఉత్కృష్ట మైన త్యాగ మని పించు కుంటుంది. మరిన్ని మరణించిన భర్తలతో పాటు సహగమనము చెయ్యడము అనే దేహ త్యాగము ఏదైతే కలదో అదిన్ని ధర్మ ప్రేమ పరమావధిగా గలది అయినప్పటికిన్ని అమ్మవారి త్యాగముతో సరి తూగదు.

"ఇది ఇలా ఉండగా — శైవ సంప్రదాయ దీక్షితులైన భల్లాణ మహారాజులుం గారు జంగమ రూపమున అతిథిగా వచ్చిన శ్రీ మహేశ్వరుల వారి భోగా ర్థమై నిజ ధర్మ పత్నిని త్యాగము చెయ్యడ మనేది శైవులలో భక్తి పారమును తెలియ జేస్తుంది."

"అయితే శాస్త్రుర్లుగారూ, ఇట్టి త్యాగము శైవుల లోనే గాకుండా మనలో కూడా ఉన్నట్లు భారతము చెప్పుతున్నది గదండీ — "

"అతిథి నిను గోరె నేనియు మతి గింకిరి పడక యోల మాన గొనక నీ పతని సపర్య సలుపుము-అన్నాడు కదా."

"అవును, ఆ మాట నిజమే. అతిథి అభ్యాగతులు విష్ణువుతో సమాను లని ప్రమాణ వాక్యము లున్నవి. కాబట్టిన్ని, మన దేహ ప్రాణ మానములు భగవంతునివే కాబట్టిన్ని, యిట్టి త్యాగ మున్నూ భల్లాణ చక్రవర్తి త్యాగము వంటిదే అవుతుంది. మరిన్ని దేశ క్షేమము కోసము యోధు లున్నూ దేవతా ప్రీతి కోసం ప్రాకృత భక్తు లున్నూ ఎట్టి త్యాగ మైనా చేస్తారు. అన్ని కాలాలలోనూ ఎక్కువగా చేయబడే త్యాగం స్త్రీ ప్రేమ కోసం అని మీకు తెలిసే ఉంటుంది. అన్ని త్యాగాలకంటె అత్యుత్తమ

మైన త్యాగం ఏమి టంటే, ముక్తి కోసం సర్వ సంగ పరిత్యాగం చేసే సన్యాసిది. ఏల నంటే — ”

“దీని కేదైనా కథ ఉన్నదా శాస్త్రుల్లు గారూ ?” అన్నాను ఉండబట్ట లేక.

కథ మాటకు వస్తే కథ ఉన్నది. దీనికి కాదు గాని — అయితే వినండి చెప్తాను.

౨

ఇప్పటి సుమారు రెండు వందల యేళ్ళ క్రితం సంగతి. ఆ కాలంలో రాఘవ రాజు గత్తర అని ప్రజలు భయంతో చెప్పు కుంటూ ఉండే వారు. మొన్న మొన్నటి దాకా వీరాపురంలో ముసలి వాళ్ళు కూడా ఒకమారు ఈ రాఘవ రాజును తలుచు కొని భీతావహు లవుతూ ఉండేవారు. రాఘవ రాజు అనే ధైర్య శాలి ఏ కులంవాడో తెలియదు. కాని తనవంటి ధైర్య సాహసాలు కలిగి నటువంటిన్ని తనవలె బలాఢ్యులై నటువంటిన్ని జెట్టీలను యాభైమందిని పోగు చేసి, అదును చూచి, గ్రామాల మీద పడి, దోచుకుంటూ ఉండే వా ‌ఃు. ఆ కాలపు రాజులకు అట్టి దోపుళ్లు తెలియనే తెలిసేవి కావు. ఒకవేళ తెలిసినా వాళ్లు ఏమీ చేయ లేక పోయేవారు. ఏల నంటారా — దొరతనము వారి సిబ్బంది ఒక తట్టు నుంచి వస్తే, రాఘవ రాజు ముఠా యింకో తట్టుకు పారి పోయేది.

నానాటికి రాఘవ రాజు తొందర ఎక్కువయి పోతోంది. ఏవిధంగా నైనా ఇతగాడిని రాజ సైన్యము చేత పట్టిద్దామన్నా, ఇతగాడి నివాసము కొండల్లో. కొండలలో ఒక కోట కట్టుకొని,

తానూ సహచరులూ మాత్రము ఉండేవారు. వారికి కుటుంబా లున్నవో లేవో, ఒకవేళ ఉంటే అవి ఎక్కడ ఉంచబడ్డవో ఎవ రికీ తెలియదు.

ఈ రాఘవ రాజు తొందర తట్టు కోవడము చుట్టు పట్టుల నున్న గ్రామాలకు చాలా కష్ట మౌతున్నది. ఉన్న ధనమూ, జవాహిరీ, బట్టలూ భోషాణాలలో దాచుకొన్నా లాభము లేకుండా ఉంటున్నది. కోటల పంటి యిళ్ళలోని మోతుబరుల కిచ్చి దాచి పెట్టమన్నా లాభము లేకుండా ఉన్నది.

ధనము పోతే పోయె ! అతగాడు పెట్టే బాధలు సహిం చడం బహు కష్టంగా ఉడడం వల్ల గ్రామస్థులకు ఏమి చేయ డానికీ తోచలేదు. తాము పన్నులు చెల్లిస్తున్నప్పటికీ, తా మెన్ని మారులో మొర పెట్టుకొన్నప్పటికిన్నీ తమ యేలిక యేమీ చెయ్యలేకుండా ఉన్నాడు. అతగాడిని అడిగి లాభము లేదు గదా ! ఇక చేయువలసిం దేమిటి ?

ఆయా గ్రామాలలో ఉంటే పెద్ద లందరూ సమావేశ మయ్యారు. కర్తవ్య మాలోచించారు. తమ యేలికకు పన్ను లిచ్చే బదులు ఈ రాఘవరాజుకే యేటేటా పన్నులు చెల్లిస్తూ, ఈయన్నే తమ యేలికగా ఏర్పాటు చేసుకొంటే, తమకు ఇంత ధన నష్టమూ ఉండదు, బాధలూ ఉండవు, క్లేశమూ ఉండదు.

అయితే ఇందుకు రాఘవరాజు సమ్మతిస్తాడా ? దేశాలు దోచుకొనే దొంగ అని పించు కోవడం కంటె గ్రామాల నుండి పన్నులు వసూలు చేసు కొంటూ, అందుకు ప్రతి ఫలంగా గ్రామస్థులను రక్షించు కొంటూ, రాజ చిహ్నములు ధరించి ఏలిక అనిపించు కోవడమునకు అతడు సమ్మతించడా ?

ఈ యేర్పాటులో మరీ వక చిక్కు ఉన్నది. అదేమి టంటే, తమ్ము ఇంతవరకున్నూ పాలిస్తున్నా యేలిక తమకు పన్నులు చెల్లించడం లేదనే కారణం వల్ల ఈ గ్రామాల మీదికి దండెత్తి వచ్చి ధ్వంసము చేస్తే, అప్పుడు చెయ్య వలసిన దేమిటి ? ఈ రాఘవరాజు గత్తరకన్నా ఆ యేలిక దండయాత్ర బహు క్రూర ముగా ఉండ వచ్చు. చెప్ప రాని బాధలు అప్పుడూ అనుభవించ వలసి ఉండవచ్చు. ధన ప్రాణ మానముల కప్పుడూ అపాయము కలుగ వచ్చు. అయితే దీని కుపాయ మేమిటి ?

తమ యేలిక తమ్ము శిక్షించ వలె ననే క్రోధముతో ఒక వేళ దండెత్తి వస్తే తమ గ్రామాలను కాపాడే బాధ్యత రాఘవ రాజే వహించ వలసి ఉంటుం దనిన్నీ, అట్టి బాధ్యత వహించే పక్షమందే అతగాడికి తాము పన్నులు చెల్లించ వలసి ఉంటుం దనిన్నీ వారు నిర్ణయం చేసుకొన్నారు.

అందుకొరకై రాఘవరాజుతో రాయబారాలు నడపడము నకై గ్రామస్థులలో కొందరు పెద్దలు ఏర్పాటు చేయ బడ్డారు. ఈ రాయబారము బహు ప్రమాద కరమైన కార్యము. ఏ మం టారా, తా నెంత సాహస వంతుడైనా, ఎన్ని ఊళ్ళు తాను నిరా ఘాటముగా దోచుకొంటూ ఉన్నా, తన కెంత బలగం ఉన్నా, రాఘవరాజు నిరంతరమూ భయముతోటే మెలగుతూ ఉండే వాడు. ఏ మూలనుంచి ఏ సైన్యము వచ్చి పడుతుందో, తనపై కసి తీర్చుకోడానికి గ్రామస్థులు ఎట్టి కుట్రలు పన్నుతున్నారో, ఏ చెట్టు వెనుక ఏ శత్రు వున్నాడో ఎక్కడ గొయ్యో, ఎక్కడ నుయ్యో అని అతగాడి భయం.

ఈ రాయబార కార్యాన్ని అతడు కుట్రగా భావించి రాయబారుల నందరినీ చంపివెయ్య వచ్చు. లేదా వారి నా కొండలలో బంధించ వచ్చు. వారిని చిత్ర వధ చెయ్యవచ్చు. ఏమి చేసినా చెయ్యతగ్గ వాడే కదా. ఇట్టి సందర్భంలో రాయబారం నడప దలుచుకొన్నా గ్రామ పెద్దలు ప్రాణాలకు తెగించే ఈ కార్యానికి పూను కొన్నారని వేరే చెప్పనవసరం లేదు కదా. ఆటవికుల వల్లనూ, చారుల వల్లనూ, గ్రామస్థులు రాఘవరాజు కోట కొండ లలో ఎక్కడ ఉండేదీ తెలుసు కొన్నారు. రాయబారులు భత్యాలు మూట గట్టుకొని ప్రయాణం సాగించారు. గుట్టలు దాటారు, సెలయేళ్ళు దాటారు, కొండలు దాటారు, ఎక్కడా మనిషి అలికిడి లేదు. జంతువులూ లేవు. పక్షులు మాత్రం అక్క డక్కడ దృగ్గోచర మయ్యేవి.

నిర్ధారణగా రాఘవరాజు కోట యిక్కడ ఉన్నదని తమకు చెప్పేవారు ఎవరూ లేరు. స్వతంత్రముగా తెలుసుకొనే ప్రయత్న ములు విఫల మౌతున్నవి. ఆ నాటి సాయంకాలం వారు ఒక కొండ ప్రక్కనే విశ్రమించ వలె ననుకొన్నారు. అక్కడ నీ రున్నది. విశ్రమించ టానికి ఎత్తయిన బండ లున్నవి. మృగ భయ ముంటుం దనే అనుమానం తోస్తే నెగళ్ళు వెలిగించు కోవా లనుకొన్నారు. ఈ విధంగా ఆలోచించు కొంటూ వారు మూటలు దింపుకొంటూ ఉంటే, పదిమంది సాహసికులు ఎక్కడి నుంచో వచ్చి వాళ్ళను బంధించారు. వాళ్ళ మొలల్లో కటా రులు దోపుకొని ఉన్నారు. చేతుల్లో కత్తు లున్నవి. గిరజాల జుట్లు. చల్లడాలు తొడుక్కొన్నారు. వాళ్ళు మాటాడకుండా రాయ బారుల చేతులు వెనకకు విరిచి కట్టివేశారు. కళ్ళు కనిపించ

కుండా గట్టిగా గుడ్డలతో బిగించారు. మూటలు బుజాలకు కట్టి వేసి వాళ్ళను నడిపించుకు పోయారు. రాయబారులకు సగము ప్రాణాలు పోయినవి. వాళ్లు కాళ్ళతో తడుము కొంటూ రాళ్ళూ, పేళ్ళూ కాళ్ళకు తగిలినపుడు తూలుతూ పడుతూ, కొమ్మలు మొహాలకు తగిలినపుడు బుర్ర వంచుతూ, నెమ్మదిగా నడుస్తూ పోయారు. ఎప్పటికి ఈ బాధ అంత మౌతుందో తెలియ లేదు. వాళ్లు మట్టుకు వాళ్ళు నడిపించుకు పోతూనే ఉన్నారు. వీళ్లు వాళ్ల ననుసరించి పోతూనే ఉన్నారు.

ఎవరు నాయనా, మీరు? నిరపరాధు లైనమమ్మల్ని ఈ విధముగా ఏల బంధిస్తిరి? మా వల్ల వచ్చిన అపరాధ మేమిటి? మమ్మల్ని ఇట్లా చెయ్యడం వల్ల మీకు వచ్చే లాభం ఏమిటి? అని రాయబారులలో ఒక డన్నాడు.

సమాధానం లేదు.

సూర్యు డస్తమించాడో లేడో వారికి తెలియదు. ఎండు టాకుల చప్పుడు తప్ప మరేశబ్దమూ వినబడడము లేదు.

నెమ్మదిగా నడిచి వెళ్లుతూ ఉండగా ముందు నడుస్తున్న వాళ్ళు అగినట్టు రాయబారులకు తోచింది. వాళ్ళూ ఆగారు. వాళ్ళను ఎత్తి, గాడిదల మీద వేసి కట్టి పెట్టినట్టు గుర్తించారు. గాడిదలు ఎంత సేపో నడిచినవి. అవి ఏ దిక్కుగా నడిచినవో, ఎంత దూరము నడిచినవో వాళ్ళకు ఆనుపానులు చిక్క లేదు. ఎప్పటికి ఈ యాత్ర అంతానికి వస్తుందో వాళ్ళకు గోచ రించలేదు.

3

వాళ్ళ చేతుల కట్లూ కళ్ళ కట్లూ ఎవరో విప్పారు. చేతులు స్వాధీనానికి రాలేదు — మొద్దు పారినవి. అంతా చీకటిమయం, వాళ్ళు నిలబడ్డ చోటనే నిలబడి పోయారు.

కొంతసే పైనతర్వాత వాళ్ళకు కొండ వంటి పదార్థం కనిపించింది. నిదానంగా చూడగా అది కొండల మధ్య కట్టిన యిల్లని వాళ్ళు గుర్తించారు. ఆ యింట్లోకి రాయబారులను వాళ్లు తీసుకుపోయి, అక్కడ వదలి వెళ్ళి పోయారు. విస్మయము, భయము, ఆశ, నిరాశల మధ్య ఊగులాడుతూ వాళ్లు ఆ రాత్రి ఆ కొండ యింట్లో కలత నిద్ర పోయారు.

తెల్లవారింది. అడవి పక్షులు కిల కిల లాడుతున్నవి. వాళ్ళు కళ్ళు నులుముకు లేచారు. కాల్య కృత్యాలు తీర్చుకొన్నారు. కర్తవ్యం ఆలోచిస్తూ ఉండగా ఇద్దరు ఆజాను బాహులు వచ్చి వాళ్ళను రమ్మని సైగ చేశారు. తర్వాత రాఘవ రాజు సమక్షానికి తీసుకు పోయారు. అది కొండ గుహ అయినప్పటికీ చాలా విశాలంగా ఉన్నది. మంచములు, పరుపులు, దిండ్లు, పీకుదానులు వగైరా సామానులు గుహ నిండా ఉన్నవి. రాఘవరాజు ఒక పరుపు మీద దిండు అనుకొని కూర్చున్నాడు. ఆయన ఆజాను బాహువు, పర్చస్వి.

రాయబారులు చేతులు జోడించి ఎదుట నిలుప బడినారు. వారిలో నాయకుడు ముందుకు వచ్చి ఈ రీతిగా విన్నవించుకొన్నాడు: మహాప్రభూ, తమ కీర్తి దిగంత విశ్రాంతము. తమ సాహస పరాక్రమాలు అర్జునున్ని మరపిస్తవి. తమ హృద

యము దయార్ద్రము. మహాప్రభూ, మేము తమ దర్శనం చేసుకొని తమతో ఒక్క మాట మనవి చేసుకోవలె నని వస్తూ ఉండగా పుణ్యాత్ము లెవరో తమ సమక్షానికే మమ్మల్ని తీసుకు వచ్చారు. వెతక బోయిన తీగె కాళ్ళకే తగిలింది. ఆడ బోయిన తీర్థము ఎదు రయింది. శకునాలు మంచి వయినవి. తాము ఉదారులు : మా కార్యము తమ వల్ల కాకపోదు, మహారాజా !

"ఎవరు మీరు ? ఏమిటి మీ కార్యము ?"

"తాము పాలించే గ్రామాలలో నివసించే బీద గ్రామస్థులము మేము మహారాజా !"

"మేము ఎట్టి గ్రామాలూ పాలించడము లేదే !"

"తమరు పాలించడానికి సమర్థు లయి ఉండిన్నీ, సాహస విక్రమార్కు లయి ఉండిన్నీ, ఎందువల్లనో యథా క్రమంగా గ్రామాలను పాలించక పోవడము యథార్థమే కావచ్చును. మహారాజా ! కాని మేముమాత్రము యాభై గ్రామముల కాపురస్థులము. మీకు సమీపమందు ఉండే గ్రామాలలో నివాసం చేస్తున్న వాళ్ళము. తమరినే ధర్మ ప్రభువులనుగా ఎంచుకొంటూ తమరే మా యేలికగా భావించుకొంటూ ఉన్నాము. మహారాజా ! కాబట్టి తమరు మాకు ఏలికగా ఉండి, మా వల్ల తాము పన్నులు గ్రహిస్తూ మమ్మల్ని రక్షించే భారము వహించరా మహాప్రభూ ?"

"అందుకా మీరు వస్త ?"

"చిత్తము మహాప్రభూ !"

"మీ యేలికకు పన్నులు చెల్లించకుంటే అతనివల్ల మీకు ఉపద్రవము సంభవించదా ?"

"తమరి అండ జేరిన మాకు ఎట్టి ఉపద్రవాలూ సంభవించవని మా ధైర్యం. తమరు నిజంగా విజృంభిస్తే తమ పరాక్రమమును ఎవ్వరు తట్టుకో గలుగుతారు ధర్మప్రభూ!"

రాఘుపరాజు, వారు చెప్పిన మాటలన్నీ విన్నాడు; తన సహచరులతో ప్రసంగించాడు. ఇటువంటి తరుణం పోగొట్టు కోవడము మంచిది కాదను కొన్నాడు. ఈ రాయబారములో మోసము లేదని తెల్సు కోవడము కోసమున్నూ, గ్రామస్థుల సద్భావమును పరీక్షించడమునకున్నూ, తాను ఏలిక అయ్యే పక్షమందు తన పదవిని దృఢపరచు కోవడమునకున్నూ కొన్ని షరతుల ఏర్పాటు చేశాడు. ఆ షరతుల ప్రకారము వారు నడిచే పక్షమందు తాను వారికి ఏలికగా ఉండి, ఎట్టి ప్రమాదములూ గ్రామములకు రాకుండా కాపాడుతా నని చెప్పాడు. తక్షణం యాభై గ్రామాలవారూ తనకు ఆయేటి పన్నులు చెల్లించడం మొదటి షరతు. గ్రామములలో ఉండే పురుషులలో యుక్త వయస్సు వచ్చిన వాళ్ళందరూ తన వద్ద తరిఫీదు పొంది, అవసర మైనప్పుడు తనకు యుద్ధ కార్యాలలో సహాయము చెయ్యాలి.

ప్రాకారము, బురుజులు, కందకము మొదలైనవాటితో అతనికి ఒక కోట అను వైనచోట గ్రామస్థులే కట్టించ వలెను. ప్రతి గ్రామమునకున్నూ ప్రాకారములు, బురుజులు, కందకములు ఆ గ్రామస్థులే ఏర్పాటు చేసుకో వలెను.

రాయబారులు ఈ షరతుల కంగీకరించారు. వారిని గౌరవించి, బహూకరించి కొంతవరకూ తన మనుష్యులను తోడిచ్చి, సాగనంపించాడు రాఘుపరాజు.

౪

రాఘవ రాజుకు మొదటి దఫా పన్నులు చెల్లినవి. గ్రామస్థులు సద్భావముతో ప్రవర్తిస్తున్నా రని అతడు గ్రహించాడు. తన అనుచరులతో తన స్వాధీనమం దుండే గ్రామాదుల నన్నింటినీ చూచినాడు. గ్రామస్థులను పురికొల్పి ప్రతి గ్రామమునూ చిన్న కోటగా మార్చి వేసినాడు. అన్ని గ్రామములలోనూ గరిడీ లేర్పాటు చేసినాడు. యుద్ధ పరికరాలు చేయించి నాడు. యుక్త వయస్సు కల పురుషుల నందరినీ కూర్చి సైన్యము తయారు చేశాడు.

అన్ని గ్రామాదులకూ అందుబాటుగా ఉండ గలందుల కున్నూ, తాను తన ప్రజలు కొందరితో నివసించ గలందుల కున్నూ ఒక కోట కట్టడానికి అనువైన స్థలం నిర్ణయము చేశాడు.

కంటకబాధ తీరినందుకు ప్రజలు సంతోషించారు. కాని తమ మొదటి యేలిక నుండి యెట్టి చిక్కులు వస్తవో అని భయపడు తున్నారు. రాఘవరాజు ఆ భయము తీర్చినాడు. ఆ యేలికతో రాయబారాలు నడిపినాడు. కొంత కప్పము తాను చెల్లించ డానికి క్రమముగా ఒప్పు కొన్నాడు. తనను సామంత రాజుగా అంగీకరించ మని కోరినాడు. యాభై గ్రామాలవారూ తన చెప్పు చేతలలో ఉండ డానికి అంగీకరించా రనిన్నీ, తన ద్వారా వారిసేవ ఏలిక పొంద వచ్చు నని న్నీ నచ్చ జెప్పాడు. ఇట్టి తరుణము పోగొట్టుకొంటే ధన ప్రాణములకు అపార నష్టము కూడా సంభవించ గల దని కూడా సూచించి నాడు. ఎన్నడూ

సక్రమముగా పన్నులు వసూలు కాని కారణము చేత ఆ యేలిక యీ యేర్పాటులకు ఒప్పు కొన్నాడు. గ్రామస్థులు సంతోషించారు.

అయితే భైరవ శాస్త్రుర్లు గారూ, అయితే ఈ కథలో త్యాగ మనేది ఆ రాయబారులు చేసినట్లా, ఈ రాఘవరాజు చేసినట్లా? మీ అభిప్రాయ మేమిటి? అన్నాను. వేళ అతిక్ర మిస్తోంది. కళ్లు బరువెక్కు తున్నాయి. ఎంతకీ కథ ముగియడం లేదు

"మళ్ళీ తొందర పడుతున్నావు విశ్వం. జరిగిన కథలో లేదు త్యాగం; ముందు వస్తోంది. కథ కావచ్చిందిలే అన్నాడు భైరవశాస్త్రుర్లుగారు. "చిత్తం, కానీ యండి."

౫

పూర్వ కాలాల్లో రాజులకు కోట కట్ట వలసి వస్తే నరబలి లేకుండా జరిగేది కాదు. కోటకు సౌభాగ్యము, దేశమునకు కల్యాణము ఈ నరబలి వల్లనే చేకూర గల వని ఆ నాటి నమ్మకము. రాఘవరాజు కోట చురుకుగా తయా రవుతోంది. ప్రాకారాలు లేచినవి. కొంతవరకు కందకములు తవ్వడ మైనది. కందకములకు నీరు కొండ సెలలనుంచి తీసుకొని వచ్చుటకు కాలవలు తవ్వు తున్నారు. మూడు దిక్కులా మూడు బురుజులు తయా రయినవి. నాలుగవ దిక్కున బురుజు కట్ట వలసి ఉన్నది. అది కట్టడానికి ముందు అక్కడే నరబలి జరగ వలసి ఉన్నది. నరబలికోస మని బలవంతాన మనుష్యులను తీసుకు రావడం ఆనాటి ఆచారం కాదు. ఐచ్ఛికముగా ధైర్యోత్సాహము

లతో ఎవ్వరైనా అట్టి బలికి సంసిద్ధులు కావచ్చును. అట్టి బలిలో ఆ ధైర్యవంతులు దేశ సేవ చూడవచ్చు. అట్టి బలిలో వారు మోక్షము చూడవచ్చు. దేహాన్ని బలి యిచ్చి నంతనే దేశ కల్యాణము, ధర్మ స్థాపన, మోక్షము కలుగు నని నమ్మక మున్నప్పుడు దేహాభిమానులు కానివారు ఇట్టి నరబలి కియ్య కొందు రంటే ఆశ్చర్య మేమిటి? ఇట్టి ఆశయములకే ఎందరు ఈ కాలములో దేహ త్యాగం చెయ్యడం లేదు? నాలుగో బురుజు కట్టి ప్రాకారము పూర్తి చెయ్యవలసి ఉన్నది. బురుజుకు పునాదులు నర దేహము మీదనే పడవలె. నరబలికి ముహూర్తము ఏర్పాటయింది. బురుజుకు పునాదుల కోసము పెద్ద గొయ్యి తవ్వినారు. ముత్తైదువలు ఆ గోతిలో పసుపు కుంకుమ చల్లినారు. పెద్దలూ, పిన్నలూ, స్త్రీలూ, పురుషులూ - అబాల గోపాలమూ ఆ గోతిలో పళ్ళో, బట్టలో, నాణెములో, పసుపో, కుంకుమమో, పువ్వులో, ఏదో ఒకటి వేస్తూ వచ్చారు. ముత్తైదువులు మంగళహారతి పళ్ళెములు పట్టుకొని గోతికి కొంత దూరముగా నిలబడ్డారు. మేళ తాళాలవాళ్ళు వారికి ముందుగా నిలిచినారు. గోతి చుట్టూ వీర పురుషులు పునాది రాళ్ళ దగ్గర నిలబడ్డారు.

ముహూర్తం సమీపిస్తోంది. ఎవరు నరబలికి ఆ ముహూర్త కాలానికి సరిగా వచ్చి ఆ గోతిలో దూకుతారో తెలియడం లేదు. వ్యగ్రోత్సాహులై అశేష జనమూ కనిపెట్టి చూస్తున్నారు. వారి ఉత్సాహములో భయమూ, జాలీ, ధర్మబుద్ధీ తాండవ మాడుతున్నవి. ముహూర్తం సమీపిస్తున్నది. దూరాన ఒక చక్కని స్త్రీ కన్నుల నుండి బాష్పములు జారుతున్నవి. పసుపు రాచుకొన్న

మొహమై నప్పటికీ వెల్లదనము కనిపిస్తున్నది. అవిడ కెదురుగా నిలబడ్డా డొక పురుషుడు కండలు తిరిగిన శరీరముతో. ఆమె ఆ శరీరానికి పసుపు కలిపిన మంచి గంధం పూసింది. అపురుషుని మెడలో మందార పుష్ప మాల వేసింది. ఆత డామె చేతులు పట్టుకొన్నాడు. దిగులు పడ వద్దని అతడికళ్లు ఆమెతో చెప్పినవి.

ఆమె ఆతని భార్య. అతడు బలి కావడానికి దేశక్షేమము కోసము, ధర్మము కోసము బలి కావడానికి ఆమె సమ్మతిం చింది. అతడు కడసారి మాటు ఆమెను చూచాడు, తల తిప్పు కొన్నాడు, ఆమె చేతులు వదలినాడు, సీత్కారము చేస్తూ గోతి వైపు దుమికి నాడు.

ఆమె అక్కడనే నిలిచి ఉన్నది. ఆమె దృష్టి ఆతని మీదనే నిలిచి ఉన్నది. ఆమెకు రెప్పపాటు పడలేదు. దేహము కదల లేదు. సీత్కార శబ్దము ప్రజలు విన్నారు. ఒక్క మారు ఆతనికేసి చూశారు. హరహర మహాదేవ శంభో ఆని ఒక్కమారు వేయి గొంతుకలలో నుంచి బయులు దేరింది. తూర్య నాదాలు చెలరేగినవి. స్త్రీలూ పురుషులూ ఆతని మెళ్ళో పుష్ప మాలికలు వేస్తున్నారు. ఆతనికి కొత్త బట్టలు కప్పు తున్నారు. ముత్తైదు వలు కర్పూరాలు వెలిగించి, మంగళ హారతులు పాడ మొదలు పెట్టారు.

ఆమె అక్కడే నిలిచి ఉన్నది. ఆమె దృష్టి అతని మీదనే నిలిచి ఉన్నది. ఆమెకు రెప్పపాటు లేదు. దేహము కదల లేదు.

వీర హుంకారాలూ, తూర్యనాదాలూ, హరనామ స్మరణలూ, మంగళ హారతులూ ఈ ఘోషలో ఆ వీర పురుషుడు శంభో అని ఉచ్చైస్స్వరముతో అర్చి, ఒక్క గంతు వేసి, గోతిలోకి దుమి

కాదు సరిగా ముహూర్త కాలానికి. చుట్టూ నిలిచిన పురుషులు పునాది రాళ్లు గోతిలోకి తోశారు. వాద్యఘోష మిన్ను ముట్టింది. రాళ్ళతో గోయి నిండింది. హరహర శంభో నినాదాలు దిక్కులు నిండినవి.

ప్రజలు ఇంటి ముఖము పట్టారు. బురుజు కట్టడానికి అప్పుడే పూనుకొన్నారు. క్రమంగా జన సమ్మర్దం తగ్గింది కాని-ఆమె అక్కడే నిలచి వున్నది. ఆమెకు రెప్పపాటు లేదు. దేహము కదల లేదు.

రాఘవరాజు నరబలి చూచాడు, ప్రజల ఉత్సాహము చూచాడు. ఆ వీరుని ధైర్య సాహసాలు మెచ్చు కొన్నాడు. ప్రజలు ఇళ్ళకు వెళ్ళడం చూచాడు. అందరూ ఇళ్ళకు వెళ్ళినా ఒక్క స్త్రీ మాత్రము కదలక మెదలక ఒక్క చోట నిలబడి ఉండడం గమనించాడు. కారణము తెలుసు కొందా మని ఆమెను సమీపించాడు. అత డామెను చూచాడు, ఆమె అతన్ని చూడలేదు. పలకరించాడు, మాటాడలేదు. భయపడి తిరిగి వెళ్ళాడు. ఆ రాత్రి అక్కడ కాపలా ఉంచాడు. మర్నాడు వచ్చి మళ్ళీ చూచాడు. అక్కడ స్త్రీ దేహము లేదు. స్త్రీ ప్రతిమ ఉన్నది. అక్కడ, ఆమె నిలిచి ఉన్న తావుననే, ఆమె కళ్ళే, ఆమె దేహమే, ఆమె ముఖమే, ఆమే!

ఆమె అక్కడే నిలిచి ఉన్న ట్టున్నది. ఆమె దృష్టి అతని మీదనే నిలిచి ఉన్న ట్టున్నది. ఆమెకు రెప్పపాటు లేదు.

ఒక్క కలికాల ఖండములో, ఒక్క సతి, ఒక్కనాటిలో శిలా ప్రతిమగా మారి తన సతీత్వమును ఘనీభవింప జేసింది.

ఆనాటినుండీ ఆ శిలా ప్రతిమను ప్రజలు పూజించారు. రాఘవపాలెము జమీందారుగారి కోట దగ్గిర శిలా ప్రతిమ నేటికీ కనిపిస్తుంది. కాని అది శిల్పి మలిచిన విగ్రహ మను కొంటారు.

రాఘవపాలెం జమీందారుగారు రాఘవరాజుగారి సంతతి వారే అని చెప్పుకొంటారు. ఈ మధ్య వారికి "రాజా" అనే బిరుదు దొరతనము వా రిచ్చా రని వదంతి.

* * *

అయితే భైరవ శాస్త్రుల్లుగారూ, అతగాడు చేసిన త్యాగం సాత్వక, రాజస, తామసాలలో ఏదిగా ఎన్నుకోవలసి ఉంటుం దండీ అన్నాను లేచి.

"అబ్బాయీ, విశ్వం, అతగాడు చేసిన త్యాగం గొప్ప దైనా, అంతకన్నా గొప్ప త్యాగం చేసిన అతని భార్య సంగతి ఎత్తుకో వేమి?"

"చిత్తం, ఆమాట నిజమే — ఇక సెల విప్పిస్తారా?"

"మంచిది. త్యాగ మన్నపుడు అంతకు మించిన త్యాగ మెక్కడా నాకు కనిపించలేదు సుమా!"

"చిత్తం, సెలవు!"

# మరు విషయము

శ్రీ నోరి నరసింహ శాస్త్రి

---

జననము 6–2–1900 గుంటూరులో. 1925 లో బి. ఎల్. 1927 నుండి రేపల్లెలో న్యాయవాదవృత్తి. జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీ మాంతాచార్య పాదులు దీక్షాగురువులు. 1947 లో కవి సమ్రాట్ బిరుదము. సంస్కృత, కర్ణాటకభాష లభ్యసించినాడు.

| | |
|---|---|
| గీత మాలిక (ఖండకావ్య సంపుటి) | 1921 |
| సోమనాథ విజయము (గద్యనాటకము) | 1923 |
| భాగవతావ తరణము (పద్యనాటిక) | 1933 |
| నారాయణ భట్టు (ఐతిహాసిక నవల) | 19‹9 |
| శ్రీ దేవీ భాగవతము (3 స్కంధములు) | 1950 |
| రుద్రమ దేవి (ఐతిహాసిక నవల) | 1950 |
| కర్పూర ద్వీప యాత్ర (పిల్లల కథ) | 1954 |
| వాఘిరా (బౌద్ధయుగ నవల) | 1955 |

1950 లో తెలుగు బాషా సమితివారు "నారాయణ భట్టు" నవలను బహూకరించినారు. మల్హారెడ్డి (నవల) అనేక కథలు, నాటికలు, ఖండకావ్యములు, వ్యాసములు అముద్రితములు.

1945 నుండి సాహితీ సమితి సంస్థకు ప్రధాన కార్యదర్శి.

---

౧

అడవిలో చల్లని వెన్నెల కాయుచున్నది. శూన్య వీధులో పొరము తేరి గాడిన మబ్బులు విచ్చల విడిగా తిరుగు

చున్నవి. మధు వింకి పోయిన పూల కడుపుల లోనికి తమ కొండీలు దూర్చి మధుపము లాశ తీరక తవుడు లాడుచున్నవి. ధర్మాసనమున గూర్చున్న అంగరాజుకు రహస్యాలోచనా మందిరము నుండి పిలుపు వచ్చినది. ఎంతో తొందరపని యైన గాని మంత్రు లట్టి సాహస మొనర్పరు.

సంపన్నులైన శ్రేష్ఠి సోదరు లిద్దరు తెచ్చుకొన్న వ్యవహారము అంగరా జిప్పుడు విచారణ చేయుచున్నాడు. ఇది బహు దినములుగా సాగుచున్నది. దీని వల్ల అవసర వ్యవహారము లితరము లెన్నో కట్టు వడినవి. అందువలన దీనికై ఉదయము అపరాహ్ణమే కాక ప్రత్యేకముగా రాత్రులు కూడ ధర్మాసన మెక్కి విచారించు చున్నాడు. ఐనను ఇది తెగుట లేదు. సాక్షుల నెందరనో వినెను. పత్రములు శతాధికముగా పరిశోధించెను; సీమా చిహ్నము లెన్నియో స్వయముగా పరీక్షించి వచ్చెను. ధర్మ సూక్ష్మము లనేకము ప్రాడ్వివాకుల నడిగి తెలిసికొను చున్నాడు. మనుష్యులు ప్రవేశించుటకే కష్టసాధ్యమగు మరు విషయములో ఆ సోదరుల కున్న భూముల వివాదము లింకను వినుట తరువాయిగా ఉన్నది. శ్రద్ధగా ధర్మ దీక్షతో మహారాజు సమస్తము ఆలకించు చున్నాడు.

"మీకు కావలసినంత ధనము, భూములు ఉన్నవి. మీరు సోదరులు. ఈ వివాదములు వదలి ఏదో విధముగా మీలో మీరే సరిచేసి కొనరాదా ?" అని వారికి చెప్పవలెనని అంగరాజు కెన్నియో మారులు స్ఫురించి నది. కాని తాను ధర్మ ప్రభువు ! తనకు ధర్మమని తోచిన పక్షమున జయ పత్ర మిచ్చుట తన విధి గదా ! తనచే పరిపాలితు లగు వారిని తా నర్థించుట తన

ప్రతిష్ఠకు భంగము గదా అని తలంచుచు పలు మారు తన్ను దా వారించు కొనెను.

ఈ నాడీ తొందర వార్త రాగానే మహారాజు ధర్మాసనము చాలించి ఏకాంత మందిరమునకు బయలు దేరెను. వెండి బెత్తముల వారు దారి చేయ వంది మాగధులు పీచోపు లిచ్చిరి.

ఏకాంత మందిరమున మహారాజుల ప్రశ్నార్థక మగుచూపందుకొని ఆప్త మంత్రి నమస్కరించుచు, 'మహా ప్రభూ, విదేహ సేనలు మన మరు విషయములో నలువది విండ్ల బారున ప్రవేశించినవి' అని వ్యగ్రతతో నివేదించెను.

ఆ వార్త విన్నంతనే అంగరాజు అదరి పడెను. ముఖము జేవురించెను. అతని కన్నులు రెండును రత్న దీపముల కాంతిలో రెండు ఆర్ద్రా నక్షత్రములవలె ఎర్రగా మెరసినవి. పాతాళ కుహరమునుండి వెలువడి వచ్చు నేల ఉరుము వంటి కంఠముతో నాతడు, 'మన సేన లేమైనవి ?' అని ప్రశ్నించెను.

మంత్రి వడకుచు, 'నూరు విండ్ల ప్రమాణము లోనికి చొచ్చినవి,' అని నివేదించెను.

కాని ప్రభువు తృప్తి పడ లేదు.

౨

ఈ మరు విషయమును గూర్చి అనాదిగా అంగరాజులకును విదేహ రాజులకును మహా యుద్ధములు జరుగుచు వచ్చినవి.

పూర్వ మెన్నడో జనక మహారాజు పాలనలో ఈ విషయము పాడి పంటలు గలిగి జన సమూహములతో కల కల లాడు చుండెడి దని విదేహ వాసులు చెప్పు చుందురు. "ఇక్కడ నాగటి చాలులో సీతాదేవి దొరకినది — శ్రీరాముడు ధనుర్భంగము చేసిన దిక్కడ! – జనకుని యజ్ఞశాల ఇక్కడ నుండెను. ఇక్కడ సీతారామ కల్యాణము విశ్వామిత్రుని సమక్షములో వసిష్ఠ శతానందులు జగన్మంగళ కరముగా నిర్వర్తించిరి—' ఇట్లే ఎన్నో తావులు చూపి వారిది విదేహ రాజ్యములో భాగ మని వాదింతురు. ఆ ప్రదేశములలో జనులు పోయి ఇప్పటికి నేటేట ఆ ఉత్సవములు చేయు చుందురు.

మరి అంగదేశములో? "పూర్వము అంగరా జగు కర్ణుడిక్కడనే తన సహజ కవచ కుండలములు దేవేంద్రునకు దానమిచ్చినాడు. అప్పు డాతడు ప్రతిష్ఠించిన వృషభరా జిదుగో!" అనుచు సమున్నత మైన మహానంది మూర్తిని వారు వేలు పెట్టి చూపుదురు. ఆ వృషభ మూర్తియు మనోజ్ఞ గంభీరమై మరుభూమి కంతటికి మధ్యగా ఉత్తరాభి ముఖమై దేవేంద్రుడు స్వర్గమునకు పోయిన మార్గము నిర్దేశించు చున్నట్లుండును.

అది ఎవరి దైనను నిరంతర సంగ్రామముల వల్ల ఆ భూభాగ మంతయు ప్రస్తుతము నిర్మానుష్య మైనది. వర్షములు కురియుట కూడ మాను కొన్నవి. అది పెద్ద ఇసుక ఎడారిగా మారి అటు విదేహ రాజ్యము లోనికిని ఇటు అంగ రాజ్యము లోనికిని చొచ్చుకొని పోవు చున్నది. ఒక్క వృషభ రాజము వద్ద తప్ప అందులో ఎక్కడను నీరు లభింపదు. ఉభయ రాజ్యముల

లెక్కలలో అది 'మరు విషయము' అను పేరనే వ్యవహరింపబడు చున్నది.

కాని ఇప్పటికి కొంత కాలముగా ఈ మరు విషయము మొత్తము మీద అంగ రాజ్యములోని దైనట్లే పరిగణింప బడు చున్నది. ఇప్పటి విదేహ రాజు తండ్రి దాని నాక్రమించుటకు చేసిన దండయాత్ర విఫల మైనది. విదేహు లందులో నేటేట చేయు ఉత్సవములు ముందుగా అంగరాజు అనుమతి పొందియే చేయు చున్నారు.

నేటి విదేహ రాజు అందులో చేసిన మొదటి వ్యతిక్రమ మిదే!

## 3

అంగరాజులు విదేహ రాజులు అనాదిగా శత్రువులు. ఇరుగు పొరుగు రాజు లౌట చేత వారి శత్రుత్వము సహజము. అది గాక వారి పేరులే విరుద్ధ మైనవి. ఒకరు అంగు లగుటచే సదేహులు, ఒకరు విదేహులు నాయెను! అ ట్లైనను నేటి అంగ రాజుకు విదేహ రాజుకు గాఢ మైత్రి ఐనది. అ దంతయు ఒక పెద్ద గాథ!

వా రిరువురు నూతన యౌవనముననే రాజ్యాభిషిక్తు లైరి. సరిగా వారు రాజ్యములకు వచ్చిన ఆ కొత్త రోజులలోననే భరత భూమిలో శ్వేతహూణుల అలజడి అతిశయించినది. అప్పటి హూణనాయకు డగు మిహిరగులుని ఘాతుక కృత్యములు చరిత్ర కారులు ప్రపంచ చరిత్రలో రక్తము తోడను మసితోను వ్రాయుచుందురు. హూణు లప్పుడు చేసిన క్రూర కార్యములు

మానవుల ఊహలకే అందరానివి. అంతవరకు పరస్పర కలహములతో సతమత మవుచున్న భరతరాజు లీ ప్రమాదము లందు ఏక మైనారు. రాజు లెందరో హూణుల నెదిరింప తమ తమ సేనలతో పోయిరి. అంగరాజు విదేహ రాజు చెరి ఏబది వేల సేనతో పోయిరి.

హూణులు పంచనద భూమి పాడువెట్టి, గంగా యమునల అంతర్వేది కొల్లగొట్టి అప్పుడు మాలవ దేశము చొచ్చి యుండిరి. మాలవనాథుడు ఇరువది వేల సేనకంటె కూర్చ లేక పోయినాడు. ఎందరో భరత రాజులు వచ్చినను వారిలో సర్వ సైన్యాధిపత్యము ఎవరు వహింపవలె నను విషయమున ఏక వాక్యత కుదురలేదు. మిహిరగులుని దూతలు వచ్చి భరత రాజులను నీచ మైన ఒప్పందములు చేసి కొండని కోరుచు, వారిలో వారికి తలలు కూడకుండుట చూచి సంతోషముతో నవ్వుకొనుచున్నారు.

ఆ రాజ సభలో ఎన్నో తర్జన భర్జన లైనవి. అందరలో గర్విష్ఠి అని పేరువడ్డ విదేహ రాజు ఒక్క మాట కూడ మాటాడక ఏదో పరధ్యానముగా ఉన్నాడు. అట్లు మౌనముగా ఉండి ఉండి శాంతముగా లేచి మాలవ పతియే సర్వ సైన్యాధిపత్యము వహించుట భావ్య మని సూచించినాడు. అప్పుడు తామందరును శత్రువులును గూడ ఉన్నది మాలవ రాజ్యము కనుక అదియే సమంజస మని క్లుప్తముగా సమర్థించినాడు. అంగరాజే ముందుగా ఆ సూచన బాగున్న దనెను. వెంటనే రాజు లందరు సమ్మతించిరి.

“మీ ప్రభువుకు యుద్ధాతిథ్యము ఈయ సిద్ధముగా ఉన్నాము. బ్రదుక దలచినచో మీ ప్రభువును వెంటనే స సైన్యా

ముగా భరత భూమి విడిచి పోవలసిన దని మా శాసనముగా తెలుపుడు !''

మాలవపతి సకల రాజానుమతితో ఇట్లు చేసిన ఆదేశము విన్నంతనే హూణదూతల ముఖములలో చిరునవ్వు లింకి పోయినవి. ఆశతో వారు సభలో రాజు లందర వంకను కలయ జూచిరి. ఎక్కడను వారికి సందు దొరక లేదు. వారి తెల్లని ముఖములలో దట్టముగా నెత్తురు చిమ్ముటచే పొగ కమ్మిన అగ్నుల వలె వికృతాకారములతో వారు సభ నుండి నిష్క్ర మించిరి.

మరునాడే మిహిరగులుని మూకలు ఝరీ వేగముతో ముం చెత్తినవి. వింధ్య పర్వతము వలెనే భరతసేన వారిని ప్రతి ఘటించినది. హూణుల సంఖ్య రెండు మూడింత లున్నను సుశిక్షిత మైన భరత సేనల ముందు హూణ సేన విరిగి పోయి నది. భారత గజ యూథములు శత్రుసేనలలో చేసిన యలజడి ఇంతింత కాదు. మరల మరల ఎన్నో తావుల ఎన్నియో యుద్ధము లొనర్చి భరత సేనలు హూణ సేనలను భరత భూమి నుండి తరిమి వేసినవి. పాతికేళ్ళ నుండి మహామారి వలె బాధించు చుండిన శ్వేత హూణుల ఉపద్రవము నుండి భరత భూమి శాశ్వతముగా ఈ యాత్రతో నిర్ముక్త మైనది.

ఈ దీర్ఘ యుద్ధ యాత్రలో అంగ విదేహ రాజులు కష్ట సుఖములలో కలసి వ్యవహరింప వలసి వచ్చినది. పరస్పర మవగత మొనర్చు కొనుటచే చిరకాల వైరము మరచి వారు మిత్రు లైరి. గట్టి చిక్కు వేళల విదేహ రాజును విచిత్రమైన పర ధ్యాసము వంటిది ఆవేశించును. అప్పు డాతడు చూడ ముగ్ధ

మనోహరుడై కనిపించును. అతని మనస్సు ప్రస్తుత విషయము నకు మరలి నంతనే ఎంతటి చిక్కును విడదీయు సూక్ష్మోపాయ మాతడు నిర్దేశించును. తర్వాత అది ఆచరణలో పెట్టుటలో అంగరాజు అద్భుత ప్రజ్ఞ ప్రదర్శించును. వా రిద్దరకు గల ఆ గుణములే వారల నన్యోన్య మాకర్షించినవి. అవియే నారాయణుని శంఖ చక్రముల వలె భరత సేనల రక్షించి వానికి విజయ పరంపర సాధించి పెట్టినవి.

౪

ఈ విధముగా అంగ విదేహులకు ప్రాప్తించిన మైత్రి వారి మంత్రి సామంతాదుల కిష్టము లేదు. వారల కది లాభ కారియు కాదు. ఈ మైత్రి వలన ప్రభువులకు తమతో అవ సరము తగ్గి పోవును. అది గాక వారి కది కొత్త. ఆ మైత్రి నిలుచున దని వారికి నమ్మకమును లేదు. ఐనను వారు తమ యనిష్టము ప్రభువులకు చెప్పరు. మిత్రు డగు విదేహ రాజు సూక్ష్మబుద్ధిని అంగరాజు ప్రశంసించు చున్నచో అనుచరులు మౌనము వహించి ఆలకింతురు; మాటాడుట తప్పని సరి యైనచో ఒకటి రెండు పొడి మాట లాడి ప్రభుని ఉత్సాహము కుంటువడ జేయుదురు.

అంగ మంత్రికి ఇప్పుడు అదను చిక్కినది. మహారాజు కోప దృష్టికి మంత్రి జంకక వినయముతో, 'మహారాజా—' అని ఆగెను. మంత్రి వైఖరి రాజుకు చిరాకు కలిగించినది. 'మునుపు విదేహునితో మైత్రికిని వీ రడ్డమే. ఇప్పుడు వైరమునకు నడ్డమే!' అనుకొనుచు అతడు మంత్రి నిట్లు ప్రశ్నించెను:

"వారు మరుభూమిలో అస లెందుకు ప్రవేశించిరో తెలిసినదా ?"

అవ్యక్త మైన చూపుతో సంశయ శతములు ఇనుమడింప జేయుచు మంత్రి ప్రత్యుత్తర మొసగెను :

"విదేహ ప్రభువు ఒకనా డాకస్మికముగా—నేను వృషభ రాజు సందర్శనము చేయవలె - అనె నట. మహారాజా, తమ రెరుగుదురు గదా, ఎక్కడనో చూచుచున్న వానివలె, ఈ లోకమే పట్టని యోగీశ్వరుని చూపు అభినయించుచు మరియు నాతడు, 'వృషభరాజు నోటికి స్తంభన మైనది - అది తెరువవలె !—' అని శివ మెత్తిన వాని వలె పలికె నట—"

అంగరాజు తన ఆప్తమంత్రిని గూఢచరులను తేరిపార జూచెను. విదేహునిలో ఏ లక్షణము తన్ను ఆకర్షించెనో, ఏది తాను గౌరవించెనో, దానినే ఈత డిట్లు ఈసడించు చున్నాడు. తాను ఆ నటన తెలిసికొనలేని తెలివిమాలిన వా డన్నమాట ! ఇట్టి యాలోచనలతో తన పైన మంత్రి పైన అనుచరుల పైన విదేహుని పైన లోకమంతటి పైనను అంగ రాజుకు ఆగ్రహము వివృద్ధ మగు చుండ, మంత్రి కొంచె మాగి మరల ఆరంభించెను:

"అత డా మాట లన్నదే తడవుగా మంత్రులు యాత్ర చాటింప బంచిరి. ఎంతకాలము నుండియో సన్నద్ధము చేసి యుంచిన సేనలను సేనాపతులు కదలించిరి. వెంటనే మన గూఢచరులును వార్త పంపుటచే, అన్నిటికి సిద్ధముగా నున్న మన సేనలును కదలినవి. మన సైన్య మింకను ముందుకు సాగి ఉండెడిదే కాని తమ రేమందురో అని ఆపి తమ కిట్లు శీఘ్రముగా నివేదించుకొంటిమి !—"

ఆ మాటలకు అంగ రాజు మండిపడెను. అక్కడ విదేహుని మంత్రి సేనానులు, ఇక్కడ తన మంత్రి సేనానులు గూడ తమ విరోధము వాంఛించుచు యుద్ధ ప్రయత్నములు చేసి రన్న మాట! ఇట్టి యనుచరులను నమ్మ టెట్లు? రాజాజ్ఞ యైనది:

"మేమే స్వయముగా మన సేనలను నడిపింతుము. యాత్ర చాటింప జేయుడు!"

౫

మహారాజు స్వయముగా నడుపుచుండుటచే అంగసేనలు మహోత్సాహముతో మరు భూమి లోనికి చొచ్చుకొని పోవు చున్నవి. కాని ఆ యాత్ర బహు దుస్తర మైనది. దారిలో నీటి చుక్క దొరకదు. ఊరు లేదు. పల్లె లేదు సరిగదా, విశ్రమించు టకు చెట్టు నీడ కూడ ఉండదు. చిన్న తుప్పలు తప్ప పశు గ్రాస మైన మొలవదు. పైన గ్రీష్మ కాలపు సూర్యుడు తల మాడ్చు చున్నాడు. క్రింద కాలు పెట్ట వీలు కాకుండ ఇసుక వే డెక్కి మాడి పోవుచున్నది. పగ లంతయు వడ గాలి తోలును. రాత్రులు గాలి బిగిసి పోయి కుంపటిలో పెట్టి నట్లు కుమల్పజేయును.

ఇట్టి ప్రదేశములో మహాసేనలోని వీరులకు వారి పరి వారములకు, ఏనుగులకు, గుఱ్ఱములకు, బరువులు మోయు ఒంటెలకు ఎద్దులకు రాసభము లకు, పాలు పెరుగులకై తర లింపబడిన గోవులకు వాని వత్సము లకు, మరియు నెన్నిటికో నెల రోజులకు కావలసిన ఆహార పదార్థములే కాక, స్నాన పానాదులకు కావలసిన ఉదకము, వంటలకొరకు వంట చెరకు,

ఇత్యాదిక మంతయు వారి వెంటనే రావలసి వచ్చినది. ఇట్టి పరిస్థితులలో ఎంత యుత్సాహ మున్నను సేన ముందుకు సాగుట కష్టతరముగా నున్నది.

ఎండవేడికి పగటి ప్రయాణము కష్టము. ఎటు పోవు చున్నదియు గుర్తించు కొనుటకు సీమా చిహ్నములే లేని సము ద్రము వంటి ఎడారిలో రాత్రుల ప్రయాణము దుస్తరము.

ఈ మరు భూమిలో తమకు వివాద గ్రస్తములుగా ఉన్న ప్రదేశములు మహారాజుకు చూపింతు మని శ్రేష్ఠి సోదరు లిరు వురు తమ తమ పరివారములతో తరలి వచ్చుచు అంగరాజుకు దారిలో 'ఈ ప్రదేశము నాది! — కాదు, నాది!' అని చెప్పుచు వివరించు చున్నారు. వారు చూపెడి గుర్తులు మహారాజు కర్థము కాకున్నను ఓర్పుతో ఆలకించు చున్నాడు.

తన సేనలకు పట్టిన దురవస్థ అంగరాజు చూడ లే కున్నాడు. గొప్ప సేనానులకు తమ సేనలపై పుత్ర వాత్సల్య ముండును. తన సేనలు పడుచున్న కష్టము చూచిన కొలది అంగరాజుకు విదేహునిపై కోప మతిశయించు చున్నది. మనస్సు ముందుకు దూకు చున్నది. సేన లా తొందర ననుగ మింప లేకున్నవి.

ఈ అంగమములు ఆత్మ కెంత భారమో. కొంత యిప్పుడు స్ఫురించు చున్నది!

సుకుమార ప్రాణు లగు లేగ దూడలు ఆ ఎడారికి తమ ప్రాణములు బలి యిచ్చినవి. ఈనుటతో ఎత్తు వడిన పాడి యావులు తమ వత్సముల ననుగమింప సాగినవి. అది చూచి సహింప లేక, 'గోవు లన్నియు వెనుకకు పంపివేయ బడు

గాక!' అని అంగరా జాజ్ఞాపించెను. మజ్జిగ నీరు లేకుండ సామాన్య భటుడే భోజనము చేయ లేడే! మరి రాజులు మంత్రులు సేనాపతులు పాలు పెరుగులు లేకుండుటా? ఐనను రాజాజ్ఞ మేరకు గోవు లన్నియు వెనుకకు తరలింప బడినవి.

భగవత్స్వరూపముగా పూజించు గోవుల దర్శనము దూర మైనందుకు అంగరాజు చింతా క్రాంతు డయ్యెను. గోవులు లేకున్నను సేనా గమనము నానాటికి తగ్గు చున్నది. ఏడవ నాటికి సేనలు స్తంభించియే పోయినవి.

మరి యావల విదేహ సేనలో? వాని వేగము నానాటికి పెరుగు చున్నదని నమ్మక మైన వార్తలు వచ్చు చున్నవి. వారి గోవు లెట్లున్నవి? సర్వ సమృద్ధముగా నున్నవి. తన గోవులు మరలుట అంగరాజుకు అప శకునముగా తోచినది. దానితో జంకు, ఆపైని నిర్దాక్షిణ్యము అతనిలో ప్రవేశించినవి. మరునాటి వేకువ నాతడు సేనలకు కఠిన మగు ఉత్తరువు లొసగెను.

"ఈ నాటి నుండి బాగుగా చీకటి పడు వరకు సేన లాగక ముందుకు సాగుచునే యుండ వలెను—మధ్యాహ్న వేళ ఐదు గడియల కంటె విశ్రాంతి తీసికొన రాదు!"

సేనలు రాజాజ్ఞ ప్రకారము సాగినవి. ఆనాడు సేనలో దశాంశము దారిలో నశించినది. కాని మరు నాటను వాని నష్టే రమ్మని అంగరాజు తానే ముందు దారి తీసెను.

గజములు ఆ ఎడారి వేడి భరింప లేక పోయినవి. బలిష్ఠము లగు వాని శరీరములే వానికి భార మైనవి. వానికి చాలినంత నీరు లేదు. ఊపిరి ఆడుట లేదు. కొన్నిటికి ఉన్మాద మెక్కినది. మహారాజు చూచు చుండగనే అతని భద్ర గజము

ఇసుక వేడికి కాళ్లు బొబ్బ లెత్తి నిలువ లేక పడిపోయినది. వెంటనే ప్రక్క నంటిన ఇసుక వేడికి తాళలేక లేవ బోయి కాళ్లూనక మరల పడినది. ఇట్లది పడుచు లేచుచు యాతనతో తొండ మెత్తి ఘీంకరింప సాగినది. ముందు దిక్కు లదిలించిన ఘీంకృతి అంత కంతకు హీన హీనమై తుదకు గాడ్పులో కలసి ఊర్పుగా నడగి పోయినది.

భద్ర గజ మట్లు కొన యూపిరితో గిల గిల లాడు చుండ ఆ ప్రదేశమే నాది నాది యని శ్రేష్ఠి సోదరులు అంగరాజుకు తమ పత్రములు చూపుచు తగవు పెట్టుకొను చుండిరి.

ఆ నాటితో అంగరాజు గజ బలము చితికి పోయినది. గజ బలమే అతని సేనకు ఆయువు పట్టు. అదియే పూర్వ మాతడు శ్వేత హూణులను జయించు టకు సాయ పడినది. ఏకాంతమున మహారా జిది తలంచు కొని కన్నీరు వదలు చుండ మంత్రి యాతని దర్శింప వచ్చెను. రా జాతని కసరి పొ మ్మనెను.

మరునాడు సేనలు మరల తమ నిర్విరామ యాత్ర సాగించినవి. అశ్వము లీ నాడు తాపమునకు నిలువ లేకున్నవి. ఎగరొప్ప ప్రారంభించినవి. అపరాహ్ణ వేళకు అవి ఒక్కొకటే రాలిపో సాగినవి. కొనయూపిరి ఉన్నంత వరకు ముందుకు సాగుచు నోట నురుగులు గ్రక్కుచు అకస్మికముగా నవి పడిపోవు చున్నవి. అంగరా జెక్కిన పారశీకాశ్వము మహారాజు కాళ్ళ క్రిందనే ప్రాణములు వదలినది. రాజుకు కన్నీరు ధారగా కార సాగినది. రొప్పుచున్న సేవకులు మరియొక యశ్వము తెచ్చిరి. అదియు రొజుచు ప్రక్క లెగురవేయు చున్నది. దాని నధిరో

హింప మహారాజుకు మనస్కరింప లేదు. ఆ పైని మహారాజు పాదచారియై యాత్ర సాగించెను.

ఆ నాటితో అశ్వసేన అడగినది. నిన్నను నేడును ప్రాణములు వదలిన భటులకు లెక్కయే లేదు. సేన స్థితి దీనాతి దీనముగా నున్నది. ఈ నాడు రాజ దర్శనము నకు బోవ మంత్రి సాహసింప లేదు. కాని అంగరాజే స్వయముగా మంత్రిని సేనాపతు లను తన కుటీరమునకు పిలిపించుకొని కర్తవ్య మడిగెను.

"అతి దూరము వచ్చితిమి. ఇప్పుడు వెనుదిరుగుట అసాధ్యము!" అని ఆప్త మంత్రి ముందు నివేదించెను.

మహారాజు : వృషభరాజు నెన్నిరోజులలో చేరికొందుము?

మంత్రి : ఇట్లు పోయిన మూడు దినములు!— కాని ఇందులో మిగిలి యుందువా రెందరో మరి, మహారాజా!

"నెమ్మదిగా పోయిన?"

"వారము రోజులు!"

"అమాత్య శేఖరా, మన వేగము తగ్గింతము!— శత్రు సేనల వార్త లేమైన దెలిసినవా?"

"చిత్తము. మొన్నటికే వారు వృషభ రాజు నొద్ద విడిసినారట!"

"ఆ సేన లెట్లున్నవో?"

"చెక్కు చెదర కున్న వట!"

"మనపై నిది ఏమైన మారణ ప్రయోగమా?"

"అభిచారిక మనుకొనను. పైన ఎండవేడి, క్రింద ఇసుక వేడి. ఉండగా వేరుగా మారణ కర్మము కావలెనా, మహారాజా!"

మంత్రి ఈ మాట లనుచు నాలుక కొరికి కొనెను. అయితే మహారాజుకు కోపము రాలేదు.

"మంత్రీశ్వరా, ఈ హింసా కాండకు మేమే కారకులము! ముందు విదేహుని శిక్షించి, ఆ పిమ్మట పాపమునకు పరిహార మాలోచింతము!"

"ఈ సేనతో పోయి విదేహులపై వైర నిర్వృతి చేసికొను భాగ్యము కనుచూపు మేరలో కనుపించుట లేదు!"

"శత్రు సేన లెట్లు అంత శీఘ్రముగా వృషభ రాజును చేరికొనెనో?"

"అదృష్టము! వెనుక ఎప్పుడో యుద్ధ యాత్రలకై వేసిన గట్టి దండు బాట ఆ మధ్య కొట్టిన గాలి దుమారమునకు బయట పడిన దట!— ఆ గాలి దుమారమే మన వైపున దండు బాటల నన్నిటిని మటు మాయము చేసినది!"

"వృషభ రాజు సమీప భూమిలో పుష్కలముగా ఉదకము, విశ్రమించుటకు వనములు ఉండు నన్నది నిజమేనా?"

"సత్యమే. కాని యవి యన్నియు శత్రు సేన లిప్పటికే ఆక్రమించుకొని యుండును."

౬

మరు నాటి నుండి అంగ సేనలు ప్రయాణ గమనము తగ్గించెను. ఇప్పు డిదియే సేనకు సుఖ మనిపించు చున్నది. ఈ ప్రదేశములో నేల వేడి కూడ చిత్రముగా నంత కంతకు తగ్గు చున్నది. అది ఇంద్రు డిచ్చిన వర మని ప్రతీతి. అనుకొన్న

కంటె రెండు దినములు ముందుగనే అంగరాజు సేనలతో మహానందిని చేరికొనెను.

శత్రువును సమీపించు చున్న కొలది అంగరాజుకు కోప మతిశయించుచు అతని ముఖ మంత కంతకు ధూమకేతువు వలె నల్లవడ సాగినది. ముందు దారి చూడ బోయిన వేగరులు వచ్చి, మహానందికి తూర్పున నున్న వనములు విదేహ సేన లాక్ర మింప లేదనియు అక్కడి జలాశయము శుద్ధముగా నున్న దనియు నివేదించిరి.

అది విని సంతోషించుటకు బదులు అంగ రాజు శంకిం చెను. 'ఇట్లు మిత్రుని రాజ్యములోనికి దొంగవలె ప్రవేశించినవాడు సౌప్తిక వధకు మాత్రము జంకునా ?'— ఇట్లు పరి పరి విధ ముల సందేహించుచు ఆ రాత్రి స్కంధావారమునకు గట్టి కాపు పెట్టి అంగరాజు మేల్కొని యుండి స్వయముగా పర్యవేక్షణ మొనర్చెను. ఎట్టి ప్రమాదమును రాలేదు. ఆవలి సేనలలో కదలికయే లేదు.

మరునా డుదయమే అంగరాజు దూతలను విదేహ విభుని కడ కంపెను.

"మీరు మీ సేనలతో వెంటనే మా మరువిషయము వదలి పోవలెను. కాకున్న మేము యుద్ధముతో బలవంతముగా పంపి వేయ వలసి వచ్చును!"

వ్యవధి లేకుండనే విదేహ రాజు ప్రత్యుత్తము వచ్చినది.

"ఇది మా విషయము! ఇప్పటి కిందులో సగమే వచ్చి నాము. మీ యందు మాకు గల ప్రసన్న భావముచే మిగిలిన సగము ఆక్రమింప నిష్టము లేక పోయినది. మీకు యుద్ధమే

ఇష్ట మైన మేమును సిద్ధమే. మీ సేనలు విశ్రాంతి పొందిన పిమ్మటనే యుద్ధ మారంభింప వచ్చును !"

విదేహుని వార్తలోని సౌమ్యత అంగరాజుకు కోప మెక్కువ చేసినది. 'రేపు ఉదయమే యుద్ధము ప్రారంభము !' అని చివరి వార్త అత డంపినాడు.

ఉభయ సేనలు యుద్ధ ప్రయత్నము లొనర్చినవి.

౭

భారతీయ సంప్రదాయము లోని రాజుల మధ్య తప్ప మరి ఎక్కడను ఎవ్వరును కని విని యుండ నట్టి యుద్ధము మరునాటి ఉదయము నుండి అంగ విదేహ సేనల మధ్య ఆరంభించినది. విదేహ రాజు తన గజాశ్వ బలము లను యుద్ధము లోనికి రానీయ లేదు.

పగ లంతయు యుద్ధము భయంకరముగా జరుగును. సేనలు స్కంధావారములకు చేరిన తర్వాత యుద్ధ భయ మెవ్వారికి లేదు. ఆయుధములు విడిచినవారికి అలసినవారికి నిద్రించు వారికి ప్రాణభయము లేదు. ఇది నిజముగా యుద్ధమా, క్రీడా యుద్ధమా, అనిపించును క్రొత్తవారలకు !

కాని యుద్ధము జరుగుచున్నంత సేపును దాని దారుణ రూపము ప్రత్యక్ష మగును. ఉభయ పక్షములలో వెన్ను చూపు వీరుడు మందుకైన కానరాడు. రణములో శత్రువును జయించినచో సంతోషము ! శత్రు హస్తములలో తాను మృతి నందినను

అంతకంటె సంతోషము! వీర స్వర్గము వారికి ప్రక్క వీధిలో నున్నట్లె స్పష్టముగా పొడకట్టు చుండెను.

యుద్ధము చాలించిన వెంటనే వారు తమ తమ అభిమానములకు అనుగుణముగా పండితుల తోడనో, కవుల తోడనో గాయకుల తోడనో వినోదకుల తోడనో కాలక్షేప మొనర్తురు.

విదేహ రాజు తన గజాశ్వ బలములు ప్రయోగింపకుండుటచే ఉభయ బలములు సమాన మైనవి. తన సేనానులు పరి పరి విధముల నర్థించుచున్నను విదేహరాజు తన గజాశ్వ బలములను యుద్ధము లోనికి తెచ్చుట ఖండితముగా నిషేధించెను. "వీరధర్మము పాటింపక సాధించిన జయ మెందులకు!"

రెండు పక్షములలో వీరు లందరు తెగి పడిపోయిన గాని యుద్ధము తేలు నట్లు లేదు.

అంతలో రాజధాని నుండి అంగరాజుకు అదనముగా గజాశ్వ బలములు వచ్చినవి. ఆ వార్త ఆతడు విదేహ విభునికి ముందుగా తెలిపెను. మరునాడు చతురంగ బలములతో ఉభయ సేనలు తలపడినవి. నష్ట మతిశయించినది. పలుమారు అంగరాజును విదేహ రాజును ఎదుర్కొని మూర్ఛ లందు వరకు ఘోరముగా పోరిరి.

౮

సరిగా మహానంది యున్నచోట గల వనమున నాశ్రమము నిర్మించుకొని విశ్వామిత్ర గోత్రములోని పుణ్యాత్ము డొకడు

అందులో తపస్సు చేసికొనుచుండెను. అతని పేరును విశ్వామిత్రుడే. ఉభయసేనలు విశ్వామిత్రుని తపోవనము పరిహరించుచుండుటచే అతని తపస్సునకేమాత్రము ఈ సంగ్రామము వలన భంగము వాటిల్లకున్నది. ఆ తపస్విని ఇరువాగుల వారు రాత్రులు దర్శించి మ్రొక్కి వచ్చుచున్నారు.

ఈ రాత్రి అంగరాజు విశ్వామిత్ర దర్శనార్థము పోయెను. ఆ యాశ్రమ ప్రదేశములో తమ వివాదములకు సంబంధించిన తావులు కొన్ని చూపుదుమని శ్రేష్ఠి సోదరులిద్దరు రాజువెంట బయలుదేరిరి. అప్పుడే విదేహరాజును అక్కడికి వచ్చెను. ఉభయులు భక్తితో తపస్వికి మ్రొక్కి వినీతులై ఒకరి కొకరు దూరముగా కూర్చుండిరి.

యథాప్రకారమానాడు ఆ యాశ్రమ స్థలము ప్రశాంతముగా లేదు. అంగభూమి నుండి వచ్చిన పూర్వ మీమాంసా శాస్త్ర పండితు డొకడును, విదేహమునుండి వచ్చిన ఉత్తర మీమాంసా విద్వాంసు డొకడును విశ్వామిత్రర్షిని మధ్యవర్తిగా నుంచుకొని శాస్త్రార్థము చేయుచుండిరి. 'శాస్త్రవిహితమైన కర్మలు అచరించుచుండుటయే జీవిత పరమావధి!'' అని మొదటివాని వాదము. 'సర్వకర్మ సన్యాసమే పరమావధి!' అని రెండవవాని వాదము. ఇద్దరు యుక్తులు చూపుచు వేద వాక్యములుదాహరించుచున్నారు. ఒకరి నొకరు హేళన చేయుట దూషించుట అంతకంటె ఎక్కువగా ఉన్నది. వారి కంఠములును పెద్దవై కంచుగంటల వలె మ్రోగుచు చెవుల గింగురుమనుచున్నవి.

అంతలో దూరమునుండి ఇరువురు పోరాడుచు వేయుచున్న కేకలు ఆ వాద ధ్వని చీల్చుకొని వినవచ్చెనవి. ఆ కేకలు

సమీపించుచు ఇద్దరు పిల్లలు పోరుచు ఒకరి ప్రాణ మొకరు తీసికొన బోవుచున్న కీచుధ్వనియై ప్రక్కనే వినవైనది. పండిత వాద మాగినది. విశ్వామిత్రుని చూపందుకొని సమీపముననే యున్న శ్రేష్ఠి సోదరులు వెళ్లి బలవంతముగా ఆ పిల్లల నిద్దరను వారు వివదించుచున్న వస్తువుతోగూడ ఋషియెదుటకు తెచ్చిరి. అక్కడకూడ పిల్లలు పోరు చాలింపలేదు.

"అది నాది. నంది నోరు తెరచినది నేను.—నాకే ఇయ్యవలె!"

"నీ దెట్లా? అది ముందు చూచి తీసినది నేను—నాకే ఇయ్యండి!"

"నీ దంటావా?" అనుచు పెద్దవాడు చిన్న వానిని తన్నెను.

"నీ దంటే చంపుతాను!" అనుచు చిన్నవాడు పెద్దవాని గొంతు పట్టుకొనెను.

ఆ పిల్లలు మహాశిల్పుల వంశములో పుట్టిన సోదరులు: తల్లి దండ్రులు చిన్నతనముననే గతించినందున వారల నా ఋషియే వాత్సల్యముతో పెంచుచున్నాడు. వారు వివరించు చున్న వస్తువు ఇప్పుడు ఋషిచేతిలో నుండగా, చూచుటకు చినిగిన రంగు కాగితపుముక్క వలెను, పాతగుడ్డ పేలికవలెను కానవచ్చు చున్నది. విశ్వామిత్రుడు చిరునవ్వుతో దివిటీ కాంతిలో దానిని పరీక్షించుచున్నాడు.

పిల్ల లిద్దరను శ్రేష్ఠి సోదరులు చెరియొక వైపునకు లాగి పట్టి, "ఈ పనికి మాలిన దానికై పెద్దల యెదుట ఇంతగా పోరుచున్నారు. అన్న దమ్ములకు మీకు సిగ్గు లేదా?" అనిరి.

అది విని విశ్వామిత్రుడు మందహాస మొనర్చుచు, "అంగరాజు విచారించుచున్న మీ వ్యవహార మెంతవరకు వచ్చినది ?" అని ప్రశ్నించెను.

శ్రేష్ఠి సోదరులు తలలు వాల్చిరి. "మహాత్మా, ఇప్పుడే అవి యన్నియు ఉపసంహరించు కొనుచున్నాము!" అని వా రేక కంఠముగా నివేదించిరి.

అంగరాజుకు పెద్దబరువు తీరిన ట్లనిపించినది. అంతలో నతనికి 'మా యుద్ధమో మరి ?' అని తోచి విదేహరాజు వంక తలయెత్తి చూచెను. విదేహరాజు మహాయోగివలె సమాధిదశలో నుండి అంగరాజు నాకర్షించెను.

శిల్పిబాలురు తెచ్చిన పత్రమును విశ్వామిత్రుడు దివిటీకి మంటవద్ద పెట్టెను. దానిపై నక్షరములు స్పష్టముగా కానవచ్చినవి. అది గాలికి నీటికి అగ్నికి చెడవి పత్రము ! విశ్వామిత్రుడు దానిని ఉత్తర మీమాంసా పండితుని చేతి కిచ్చి మహారాజులకు వినిపింపు మనెను.

అది పూర్వ మెన్నడో విదేహరాజును అంగరాజును సూర్య చంద్రులు దిక్కులు కాలము సమస్త దేవతలు ధర్మవు సాక్షులుగా వ్రాసికొన్న సంధిపత్రము ! ఈ ప్రతిష్ఠించిన మహానందియే దాని చూపుతో రెండు దేశములు సరిహద్దులు నిర్దేశించుచున్నది. దీనికి వ్యతిక్రమము జరిగిన నా డిది మరు విషయ మగుగాక అను శాపవచనము కూడ మహర్షుల పేర్లతో అందులో నున్నది.

అది విన్నంతనే అంగరాజును విదేహరాజును అదరిపడి ఒక్కసారిగా లేచి ప్రేమతో ఒకరి నొకరు కౌగలించుకొని పశ్చా

త్తాప బాష్పములు కార్చుచు విశ్వామిత్రుని పాదము లభిషేకించిరి.

అంతట విశ్వామిత్రుడు మీమాంసా పండితులవంక చూచి, "మరి మీ శాస్త్రముల సరిహద్దులో ?" అని ప్రశ్నించెను.

పండితు లిద్దరును తలలు వాల్చిరి. "చిత్తము. ముందు శాస్త్రోక్త కర్మ లాచరించిన గాని చిత్తశుద్ధి అలవడదు. అట్టి చిత్తశుద్ధి సంపాదించిన పిమ్మట సర్వకర్మ సన్యాస మొనర్ప వలెను! చిత్తము!" అని ఉభయులు నివేదించిరి.

విశ్వామిత్రు డా శిల్పి బాలుర బుజ్జగించి, "ఈ పత్రము ఎక్కడ నుండెనో మరల అక్కడనే భద్రపరచండి నాయన లారా!" అనెను. శిల్పి బాలురవెంట విశ్వామిత్రుడును పండితులును మహారాజులును శ్రేష్ఠులును సభవారును మహానంది యొద్దకు బయలు దేరిరి.

చిన్నవా డా పత్రము చుట్టి మహానంది నోటిలో దూర్చెను. పెద్దవాడు దానిపై వజ్రలేప మతికించి నంది నోరు బిగించెను.

"నంది నోటికి మీ రిందాక చేసినపని దీని శ్రవణములకు చేయండి!"

విశ్వామిత్రుని యాజ్ఞచే ఆ బాలురు వృషభరాజు ప్రక్కలకు ప్రాకి దాని రెండు చెవులలోనున్న వజ్రలేపము తొలగించిరి. ఆకాశములో మేఘుడు శ్రావ్యగంభీరముగా గర్జించెను.

నంది చెవులలోనుండి ముం దేదో కొంచెము ఊట వలె వచ్చినది. అంతలో లోపలినుండి బుడబుడధ్వని పుట్టినది. ఆ ఊట క్షణక్షణ మెక్కువై జహ్నుమహాముని కర్ణనిర్గతమైన పవిత్ర గంగా ప్రవాహమువలె రెండు మహాధారలై, ఒకటి అంగ

విషయము వైపునకును, ఒకటి విదేహవిషయము వైపునకును ప్రవహింప సాగెను.

" ఈ శిల్పి బాలు రిద్దరు, మీ మీ మరువిషయములను కాలువలతో పరచి ఈ పాతాళగంగతో సస్యశ్యామలము చేయ గలరు! " అని విశ్వామిత్రుడు సెలవీయ, మహారాజు లిద్దరు నా ఋషిని ఆ విషయములు పరిగ్రహించి తమ్మనుగ్రహింప వేడికొనిరి.

" సర్వసంగ పరిత్యాగ మొనర్చిన మా కెందు కిది! ధర్మ కర్మలు నిరంతర మాచరించుచు ధర్మవృషభము నారాధించు ధర్మకేతువు లగు ఉత్తమ కర్మిష్ఠులకు సమర్పింతురు గాక! "

## ఆఖరు మాట

శ్రీ మొక్కపాటి నరసింహ శాస్త్రి

జననము 1892 లో తూర్పు గోదావరి జిల్లాలోని గంగ్రేడు గ్రామములో. బందరులో విద్యాభ్యాసము. 1914–18 లలో స్కాట్‌లాండులోని ఎడింబ్రో విశ్వ విద్యాలయములో వ్యవసాయ శాస్త్రాధ్యయనము. కొంత కాలము "శక్తి" "కళ" పత్రికలు నడిపి నాడు. రచనలు : బారిష్టరు పార్వతీశం (నవల), ఏకోదరులు (నవల), ప్రతిబింబములు (కథలు); కన్నవి – విన్నవి (కథలు), మ్రొక్కుబడి (ఏకాంకికలు), రేడియో నాటికలు, కథలు అనేకము రచించినాడు. హాస్యరసమును గూర్చి పెద్ద గ్రంథము చేసినాడు.

---

పార్థసారథి నాయుడు తన కడసారి ప్రయాణాని కంతా సిద్ధం చేసుకున్నాడు. అధైర్యం కాని బెంగ కాని ఏమీ లేదు; అదివరదాకా కొంత అధైర్యమూ భయమూ కలిగినా ఈ అవతారం చాలించడమే ఉత్తమ మని నిశ్చయించుకున్న తరువాత ఆ భయం గియం అన్నీ పోయినాయి.

రాత్రి సుమారు రెండు గంట లవుతుంది. బయట పండు వెన్నెల. చల్లని మలయ మారుతం. అన్ని వైపులా పుష్ప సౌరభము. ప్రకృతి అంతా తన్ను సంతోషంతో సాగనంపుతోన్నట్లుంది. అంతకంటె కావలసిన దే మున్నది ?

ఒక్క విషయమే మధ్యమధ్య చురుక్కు మనిపిస్తోంది. కొద్దిరోజులలో ప్రభుత్వమువారు సర్ బిరుదు ప్రసాదిస్తా రని నిశ్చయంగా ఆ రోజుననే తెలిసింది. అదికాక ఈ సారి ఎన్నికలలో తనకు మంత్రి పదవి తప్ప దని తమ పార్టీవారు ఏకగ్రీవంగా అన్నారు. Mayor కావడానికి తగ్గ అవకాశములుకూడా లేక పోలేదు. ఇంతకాలం ఉండి తన కోర్కెలు కొద్దో గొప్పో సిద్ధించ పోతున్న సమయంలో తన ప్రాణ త్యాగం చేసుకోవలసి వచ్చి నందుకు మట్టుకు కొంచెము బాధగానే ఉన్నది. కొంచెము సే పుంటే అదీ పోతుంది.

తన కాగితాలూ రికార్డులూ ఎక్కడి వక్కడ అన్నీ జాగ్రత్త పెట్టాడు. జమా ఖర్చు పుస్తకా లన్నీ సవరించి ఒకచోట పెట్టాడు. రాయవలసిన ఉత్తరా లన్నీ రాశాడు. కాని ఇంక అఖరు ఉత్తరం రాయడానికి మట్టుకు చెయ్యాడలేదు కొంత సేపు. తన కొడుక్కి వ్రాయాలి. పంచప్రాణాలు వాడిమీద పెట్టు కొని, వాడి నేదో మహామహుణ్ణి చేదా మనుకొని, అనేకము లైన ఆశలూ, వాంఛలూ, వానిలో కల్పించి, ఇప్పు డవన్నీ మట్టిలో కలిపి వాడిని ఫకీరుని చేసి పోతూ ఏ మని వ్రాయడమా అని కొంచెము సందేహించాడు. కాని రాయక తప్పదు కదా అని ఆరంభించాడు.

ఇంటా బయటా కూడా అంతా నిశ్శబ్దంగానూ ప్రశాంతం గానూ ఉంది. ఒక్కసారి కిటికీలోనుంచి నవ్వుతున్న చంద్రుణ్ణి చూచాడు. ఉత్తరం వ్రాయడ మారంభించాడు...అవును. ఆత్మ హత్య చేసుకోవడము చాలా కష్టమే. కాని బ్రతుకుకంటే చావె సులభంగా తోచినప్పుడు ఇంక చెయ్య్య తగిన దేమున్నది. పిరికి

తనమే కావచ్చు. ఈ కర్మఫలం ఎప్పుడో ఒకప్పు డనుభవించక తప్ప దంటారు మనవాళ్లు. కాని ప్రస్తుతం మన్ని ఖండ ఖండా లుగా చించి చెండాడ వలె నని వేచి ఉన్న ఈ నరసింహముల నుండి తప్పించుకొని దాటిపోతే తరువాత అనుభవం సంగతి అప్పుడు చూడొచ్చు... ఈ ఆస్తి అంతా నా చేతులతో సంపా దించాను. నా చేతులతోనే తగలేశాను. ఇం కొకళ్ళ ననవలసినపని లేదు. ఏలా వచ్చిందో తెలియదు. ఏలా పోయిందో అంతకంటె తెలి యదు. కాని ఒక విషయం-అప్పుడు ఎవళ్లు చెప్పినా ఒప్పుకో లేదు. కాని ఇప్పుడు ఒప్పుకోక తప్పదు. అన్యాయార్జిత విత్తం నిలవదు—ముమ్మాటికీ నిలవదు. అనేకమంది కూలి నాలి చేసి ముష్టి ఎత్తుకొని సంపాదించు కున్నవాళ్ళు, అనేకమంది వితంతువులు, తిండి కూడా మానుకొని ఆఖరుకు తమ ముప్పు గడవడం కోసం కూడబెట్టుకొన్న చిన్న మొత్తాలు, అందరూ నన్ను నమ్మి ఏదో వడ్డీ వస్తుం దని నా దగ్గర దాచిపెట్టారు... అవన్నీ నా స్వాధీనం చేసుకున్నాను. ఏ కోర్టువారూ నన్ను శిక్షించ లేదు. కాని ఇంతమంది ఉసురూ తగలదూ! న్యాయం విచారించి శిక్షించ గలిగిన సాహసుడైన ప్రభువే ఉంటే ఈవ్యాపా రస్థులలో ధనికులలో ఎంతమంది ద్వీపాంతరవాస మనుభవిస్తాం దురో! మా బదులు ఆ శిక్షలన్నీ అన్యాయంగా నిరుపేద లనుభ విస్తున్నారు. నేను ఎప్పుడు ఏ పని చేసినా, దేనికీ పశ్చాత్తాప పడేవాడిని కాను. తెలియక చేసిన దానికి పశ్చాత్తాపము కాని, తెలిసి ఉండి కష్టనష్టములు ఆలోచించి చేసే పనికి పశ్చాత్తాప మేమిటి? ధనార్జన చెయ్యవలె నని నాకు బుద్ధి పుట్టినప్పుడు, మంచి చెడ్డ, ఉచ్చ నీచ అనే విచారణకూడా లేకుండా ధనార్జన

చేశాను; స్త్రీవాంఛ కలిగి నప్పుడు ఏ పద్ధతి నైతే నేమి నే కోరిన స్త్రీని సంపాదించి తీరాను. కాని సింహావలోకనం చెయ్యడం, చేసిన పనికి విచారించడం మట్టుకు ఎప్పుడూ లేదు. పుణ్యమో పాపమో వాటి ఫలితం నేను అనుభవించి ఎరుగను. ఇక ముం దెప్పుడో అనుభవిస్తా నంటే నాకు నమ్మకం లేదు.

కాని నేను చేసిన రెండు పనులకు మట్టుకు, నాటి నుంచి నేటి వరకు విచారిస్తున్నాను, భయపడు తున్నాను. వాటి ఫలి తమే ఇప్పు డనుభవిస్తున్నా ననే దృఢ విశ్వాసం కలిగింది నాకు. రెండూ అప్రయత్నంగా అనాలోచితంగా చేశాను. శాప మన్నా పాప మన్నా నమ్మకం భయంలేని మొండివాడికి, శాపభీతి పాపభీతి కలిగించాయి. ఏమి లాభ మిప్పుడు! అనుభవంలోకి వచ్చినతరు వాత గాని తెలియ లేదు. నమ్మకం కుదర లేదు. ఇప్పుడు నమ్మకం కలిగి ఏమి చేయడానికి వీలులేని పరిస్థితులు వచ్చినాయి.

ఇంతవరకు ఆ ప్రశంస ఎవ్వరి దగ్గరా తేలేదు. నాలో నేను అనుకోడానికి కూడా భయపడే వాడిని. ఏదో భయంకర మైన అపాయం వస్తుం దని తెలిస్తే ఫలాని మోస్తరు అపాయ మని తెలియనంత సేపూ చాలా భయంగా ఉంటుంది. ఫలానా అనీ అది అనివార్య మనీ తెలిసిన తరువాత ఇంక భయ మే ముంటుంది? రాయి చేసుకు కూర్చోడం తప్ప చేసేది మరొక్కటి లేదు. కాని ఆఖరు క్షణంలో నీతో చెప్పుతే కొంత హృదయ భారం తీరడమే కాకుండా, నీ ముందు జాగ్రతకు కొంత ఉపయో గంగా ఉంటుం దని నా నమ్మకం.

ఒకప్పుడు మన ఇంట్లో దొంగలు పడ్డారు. ఎలా వచ్చారో, ఎలా వెళ్ళారో తెలియదు. ఎక్కడా ఒక కన్నము తవ్వడం

గాని, ఒక తలుపు బద్దలు కొట్టడం గాని, ఒక తాళం బద్దలు కొట్టడం గాని జరుగ లేదు. ఎలాగైతే నేమి ఇంట్లో ఉండే వస్తువు లన్నీ సుమారు పదివేలు కిమ్మతు గలవి పోయినాయి. నాటికీ నేటికీ ఆ వస్తువుల జాడకాని దొంగల జాడగాని, తెలియలేదు.

మన ఇంటి కెదురుగుండా రోడ్డుమీద మర్రిచెట్టు కింద ఒక నిరుపేద కుటుంబము, భార్యా, భర్తా, ముగ్గురు పిల్లలూ ఉండే వాళ్లు, వా ళ్ళెవళ్ళో, ఎంత కాలం నుంచి అక్కడ ఉన్నారో, ఆ కుటుంబంలో ఎంతమంది ఉన్నారో, వాళ్ళకు జీవనం ఎలా గడుస్తోందో నే నెప్పుడూ విచారించ లేదు. నా కేమి అవసరం? కాని ఇప్పుడు వస్తువులు పోవడం తోటే మట్టుకు అనుమానం వాళ్ళ మీదికి పోయింది. పేదరిక మంటే అందరకూ లోకువే కదా. ముందు ఇంట్లో నౌకర్ల నందరనూ ప్రశ్నించి, వాళ్ళ సామానులూ ఇళ్లూ సోదా చూచి తరువాత నా అనుమానం మీద పోలీసులు ఈ చెట్టు కింద వాడినికూడా ప్రశ్నించి వాడి సామానులు కూడా అన్నీ వెతికారు పాపం! అన్నీ ఏ మున్నాయి? ఒక పెట్టా బేడా! ఏమీ లేదు. కుండలూ, దాకలూ, మూకుళ్లూ, ఎవళ్లో వీధులో పారేసిన సీనారేకు గొట్టాలు రెండూ, ఇదీ వాడి సంసారము; ఇందులో వాడి దురదృష్టము కొద్దీ, నా దురదృష్టము కొద్దీ, రెండు రవ్వల ఉంగరాలు, ఒక రవ్వల దుద్దూ దొరికి నాయి. ఇం కేముంది వాడిని పట్టుకొని Police station కి లాక్కు పోయారు. 'నాకు Spur Tank లో దొరికాయి' అని వాడు ఎన్ని విధాల మొత్తుకున్నా వాడి మాట వినే వా రెవరు? రోడ్డు మీదా చెరువుల్లోనూ రవ్వల ఉంగరాలూ, దుద్దులూ పడి దొర్లుతూ ఉంటాయా మరి.

ఇంక నక్కడ నుంచి మామూలు కథే! పోలీసువారు వాడిని కుళ్ళ పొడవడం, ఎంత కొట్టినా తన కారోజు ఉదయాన్నే అవి దొరికినవి కాని త నేపాపమూ ఎరగ ననీ వాటి విలువ కూడా తనకు తెలియ దనీ ఎన్ని విధాల చెప్పినా వినక వొళ్ళు స్వాధీనం లేకుండా కొట్టి రెండు సంవత్సరములు కఠిన శిక్ష వేశారు.

పోలీసువారు కొట్టిన దెబ్బలవల్ల లోపల అవయవములు నలిగిపోయి జబ్బు ప్రవేశించింది. ఖైదీలకు అందులోనూ ఇటు వంటి దరిద్రుడికి జబ్బు చేస్తే లక్షపెట్టేది ఎవరు? అడిగే దెవరు? ఆ జబ్బుతోటే ఆలాగే కాలక్షేపం చేసుకొని బయట పడ్డాడు. మన ఇంటి ముందునుంచి వాడి భార్యా బిడ్డలూ మకాము ఎత్తేసి మరొక చెట్టు కిందికి పోయారు.

రెండు మూడు సంవత్సరాలు గడిచాయి. ఈ సంగ తంతా నేను మరచి పోయాను. ఒక రోజు సాయంకాలం, సుమారు అయిదు గంటలకు రతన్ బజారులో చెల్లారాం షాపు దగ్గరకు వచ్చి లోపలికివెళ్ళి నాకు కావలసిన ఒకటి రెండు వస్తువులు కొనుక్కొని వచ్చి, కారు దగ్గర నిలబడ్డాను. లోపల నుంచి నౌఖరు ఆ సామాన్లు తెస్తున్నాడు.

ఇంతలోనే ఇద్దరు ముగ్గురు వీథుల్లో తిరిగే వాళ్లు ఒక మూకుడు పట్టు కొచ్చి, అక్కడ వాళ్ళ మనిషి ఒకడు చచ్చి పోయా డనీ, తీసుకుపోయి దహనం చేసుకోడానికి ధర్మం చెయ్యా మనీ అడిగారు. ముష్టి ఎత్తుకోడానికి ఇదొక దొంగ వేష మని నే ననుకొని పొమ్మన్నాను. ఎన్ని సార్లు చెప్పినా పోలేదు. ఇటు వంటి దొంగవేషాలు వేస్తే Police వారికి వప్పచెపుతా నని గట్టిగా కేక వేశాను. చుట్టూ పదిమంది మూగారు. పోలీసులకు చెపుతే

మా కేమి భయమా, మేము దొంగతనము చేశామా, చూడండి అక్కడనే శవ మున్నది. గొప్పవారు కదా అని ఇటువంటి కష్ట ములో ధర్మ మడుగుతే బెదిరిస్తా రేమి టని అందులో ఒకతను ఎదురు తిరిగి సమాధానం చెప్పాడు. సరే ఏదో పారేద్దా మని జేబులో చేయి పెట్టేసరికి తల విరియ బోసుకొని గుండెలు బాదు కుంటూ పెద్దపెట్టున ఏడుస్తూ శోక దేవతలాగా ఒక ఆడ మనిషి వచ్చింది. నన్ను చూడడం తోనే మరింత కేకవేస్తూ వీడే నా మొగుణ్ణి చంపినవాడు. నాకూడు మంట గలిపాడు; నా పిల్లలను దిక్కుమాలిన వాళ్ళను చేశాడు; నా ఉసురు వీడికి తగలక పోతుందా? వీడి పిల్ల లిలాగే ఎప్పుడేనా ము ష్టెత్తుకోక పోతారా? అని గుక్క తిప్పకోకుండా నోటికి వచ్చిన ట్టల్లా తిట్టడ మారం భించింది. నాడు నేను నిర్హేతుకంగా ఖైదుకు పంపినవాని భార్య అని పోల్చాను. ఖైదు నుంచి వచ్చిన తరువాత లేవలే దుట. అలా తీసుకు తీసుకుని యమబాధపడి చచ్చిపోయా డుట. ఇ దంతా ఏమి తెలుసు నాకు? అంతకంతకు చుట్టూ జన సమూహ మెక్కు వయింది. జన మెక్కు వైనకొద్దీ ఆమనిషి ఏడుపూ తిట్లూ ఎక్కు వయినాయి. అందరూ ఆమనిషికి సానుభూతి చూపిన వారే! ఇక్కడనుంచి త్వరగా అవతలకు పోతే మాట దక్కుతుం దని, జేబులోనుంచి పది రూపాయిలు తీసి మొదట ముష్టికి వచ్చిన వాడి మూకుట్లో పడేశాను. వాడు పోబోతూంటే ఆ ఆడ మనిషి గభీ మని వాడి చేతుల్లోంచి మూకుడు లాక్కొని త్వరలోనే నిన్ను తగలెయ్యడానికి నీ కొడుక్కి అవసర ముంటుంది పుచ్చుకో అని ఆ రూపాయలనోటు నా మొహాన్ని వేసి కొట్టింది. అక్క డున్న జనసమూహ మంతా ఒక సారి 'బలే' అన్నారు. ఇంతలోనే

పోలీసు జవాను ఒక డొచ్చి ఏమిటి అల్లరనే సరికి అంతా తప్పు కున్నారు. నేనూ కారులో ఎక్కి ఇంటికి చేరుకున్నాను. కాని నా వొళ్లు అపాద మస్తకం కంపించి పోయింది. ఆ మనిషిని చూస్తేనే చేసిన పాపం నన్ను శిక్షించడానికి మూర్తీభవించి నట్లుగా కనపడ్డది. ఎప్పుడో ఒకప్పుడు ఆ మనిషి శాపం నాకు తగిలి తీరుతుం దను కొన్నాను. తరువాత ఆ సంగ తంతా మరచి పోయాను గాని మళ్ళీ ఈ సమయంలో జ్ఞాపకం వచ్చింది. ఆ శాప ఫలమే సుమా ఇది. ఆశ్చర్యంగా లేదూ!

ఇంక రెండో సంగతి. నాకు ఉత్సవా లన్నా జన సమూహా లన్నా చాలా సరదా. అపేక్ష ఏమీ లేకపోయినా ప్రజలుచూపే ఉత్సాహమూ, అక్కడ చేరే సౌందర్యమూ, చూడ వలెనని కుతూహలం. అందుచేత ఎక్కడ ఏ ఉత్సవమైనా తప్పకుండా వెళ్ళి కొన్ని గంటలు అక్కడ కాలక్షేపం చేసేవాడిని. ఆలాగే ఆనాటి ముక్కోటి ఏకాదశి రాత్రి ఉత్సవానికి పెందలాడే భోజనం చేసి పార్థసారథి గుడికి వెళ్ళాను. దేవుడి మీద భక్తిచేత కాదని వేరే చెప్పే దేమిటి?

ఇటువంటి సమయాల్లో సాధారణంగా నాకు కలిగే ఆనందం కంటె ఆనాడు నాకు పది రెట్లు ఎక్కువ ఆనందం కలిగింది. కారణం నేను చెప్పలేను, ఆ దీపపు వెలుగులు, ఆ స్త్రీ సమూహము, వారి శరీర కాంతీ, వాటి నతిశయింప జేసే వారి చీరల రంగులు, వారి అంగముల నలంకరించి యున్న రత్న ద్యుతులు, అక్కడి వివిధ పరిమళములు, పారవశ్యము కలిగించే సంగీతము, ప్రయత్నముగనో, అప్రయత్నముగనో లభించిన స్త్రీ స్పర్శా—వీటి అన్నిటివల్లా కలిగిన ఆనందం ప్రతి రక్త

నాళములోనూ ప్రవేశించి నన్ను ఉన్మత్తుని చేసింది. తనివి తీరగా సురాపానము చేసిన వానివలె ఈ సంతోషం నా తల కెక్కి శరీరం చులక బడి వాయువులో తేలిపోతూన్నట్టుగా ఉంది. ఇంక నక్కడ ఉంటే పిచ్చి యెత్తుతుం దేమో నని భయ పడి ఇంటికి పోదా మని బయలు దేరాను.

అప్పటికి సుమారు ఒంటిగంట పైగా అయింది. కొంత మంది జనం మళ్లు మొగం పెట్టారు. నేను నెమ్మదిగా సమర్దం తప్పించు కొని సుంకువారి వీధిలోనికి వచ్చి అక్కడ నుంచి వెంకటరంగం పిళ్ళె వీధిలోనికి మళ్ళాను. అక్కడ పది గజాల దూరములో కొంతమంది జనం కూడి ఉన్నారు. ఒక ఆడమనిషి కేకలు వినపడ్డాయి. నేను తొందరగా అడుగు వేసి అక్కడికి చేరుకొన్నాను. ఆ జనాన్ని చూచి 'ఏమిటి అల్లరి! మంచి పౌరుష శాలులే! ఇంత మంది చేరి పరదేశస్థురాలు ఆమెకు తెలియని భాషలో ఏమిటి అంటున్నారు! ఏదీ మొగాళ్లు! ఇప్పుడు మాట్లాడండి చూతాము. Police man కూడా సమీపం లోనే ఉన్నాడు' అనేసరికి ఇల్లే సామీ అని ఎవరి మట్టుకు వారు జారి పోయారు.

ఆ స్త్రీ ఒక్కర్తే వెక్కి వెక్కి ఏడుస్తూ తలవంచుకు నిల బడ్డది. నాకు జాలివేసి 'ఏ మమ్మా' భయం లేదులే. ఇంక ఎవళ్ళూ నీ జోలికి రారు. నీవు నిర్భయంగా వెళ్ళవచ్చును" అన్నాను.

ఆమె వైఖరిని బట్టి బట్ట కట్టునుబట్టి ఆంధ్ర వనిత అని ఊహించాను. నేను పలుకరించగానే ఆమె తల ఎత్తి నాకేసి నిదానంగా కన్నీటి చాటునుంచి చూచింది. విచారము చేత

పొంగిన కళ్లు కాటుక కంటినీటితో తడిసి మలిన మైన చెక్కిళ్ళు ముఖంలో కనబడుతున్న నిస్పృహా చూస్తే దైన్యము మూర్తీభవించినట్లు కనపడ్డది. వర్షపు మబ్బు చాటునుంచి తొంగి చూచే చంద్ర బింబము వంటి ఆమె ముఖం చూస్తే నిరుపమాన సౌందర్యవతి అని తెలుస్తోంది. ఆమె వయస్సు సుమారు ఇరవై సంవత్సరముల కంటె ఉండదు. ఆమె శరీరం చూస్తే శిల్పి చెక్కిన విగ్రహాన్ని మించిపోయి లావణ్య నిధివలె అగుపిస్తోంది. నేను అనేక వేలమంది స్త్రీలను చూచాను. అత్యంత సౌందర్యవతు లనుకునే వాళ్ళనుకూడా చూచాను. కాని ఆమె పక్కను నిలబడ తగ్గవాళ్లు ఎవరూ నా కప్పుడు స్ఫురణకు రాలేదు. ఆంధ్రులలో అందమూ, నాజూకూ ఏనాడో అంతరించిన వని అనుకునే వాడిని. ఆ అప యశస్సును పోగొట్టడానికి ఆ పిల్ల ఒకర్తె చాలు.

ఆమె మాట్లాడకుండా అలాగే నిలబడ్డది. 'ఏ' మమ్మా, ఎక్కడకు వెళ్ళవలెను? భయం లేదులే చెప్పు' అన్నాను. దానితో ఆమె మళ్ళీ కంట నీరు పెట్టుకొని, పొంగి వస్తూన్న దుఃఖాన్ని అపుకొని, 'తను బ్రాహ్మణ బాలిక ననీ, గోదావరి జిల్లా నుంచి ఈ వూళ్ళో బంధువు లింటికి వచ్చా ననీ, ఇంకా కొంద రాడవాళ్ళతో ఉత్సవం చూడడానికి వచ్చాననీ, జనసమూహంలో వాళ్ళనుంచి విడిపోయి దారితప్పి పోయాననీ, ఏమి చెయ్యడానికీ ఎక్కడికి వెళ్ళడానికీ తోచక వీధంటా వస్తూ దారి అడుగుతే ఆ మనిషి ఏదో అన్నాడనీ చెప్పి, తండ్రీ, సమయానికి దేవుడులా వచ్చారు. లేకపోతే నాగతి ఏమయ్యేదో అని మళ్ళీ కంట నీరు పెట్టుకుంది. 'మరి అయితే ఇంటికి వెళ్ళగలవా' అన్నాను.

తనకు దారి తెలియ దనీ ఆ వీధిపేరు కూడా బాగా తెలియ దనీ మైలాపూరులో తన బంధువు ఫ్లీడ రనీ చెప్పింది. 'సరే, అయితే నీ కేమీ భయం లేదు. నేను తీసుకు వెళ్ళి మీ యింటి దగ్గర దిగబెడతా' నని చెప్పాను. మొదట కొంచెము సందేహించింది. కాని మరొక దారిలేక నాతో రావడానికి అంగీకరించింది.

ఆ వీధి చివరనే ఒక రింటి దగ్గర నిలబెట్టిన నాకారు దగ్గరకు తీసుకువెళ్ళి ఎక్క మన్నాను. మళ్ళీ కొంచెము తటపటాయించింది. 'భయం లేదమ్మా ఎక్కు, లేకపోతే ఇందాకటి మోస్తరుగానే జరుగుతుంది' అన్నాను. దానితో భయపడి కారులో ఎక్కి కూర్చుంది.

నేనూ లోపలికి ఎక్కి Ice House రోడ్డులో నుంచి మెరీనాకు దారి తీశాను. చల్లగాలి, సముద్రపుహోరు, ఇవన్నీ నిర్మలమైన ఆకాశం, నా ప్రక్కన సౌందర్యరాశి నా సదుద్దేశాన్ని మార్చి నన్ను సాయంకాలం నుంచి దహించి వేస్తున్న కామోద్రేకాన్ని ద్విగుణీకృతం చేశాయి. నా మదనాగ్నికి తగ్గ ఆహుతి దొరికిందను కొన్నాను. ఆమె అంగీకరించ దేమో నన్న ఆలోచనే నాకు తోచ లేదు. మొదట కాస్సేపు బిగిసినా తరువాత నాచే జిక్కిన వెనక ఒప్పుకోక ఏమి చేస్తుం దనుకున్నాను.

ఆ పిల్లను మొదట చూచి నప్పుడు కలిగిన జాలి అంతా అంతరించింది. ఈ రూపం దాల్చిన చక్కదనాన్ని ఎప్పుడు కౌగిట చేరుద్దా మనే ఆతురత తప్ప మరొక టేమీ తోచలేదు నాకు. ఇటువంటి అవకాశములు అనేకం వచ్చినాయి నా జీవితంలో. అనేకసార్లు ఆ అవకాశములను ఉపయోగించు కున్నాను. ఇప్పుడు మట్టుకు అలా ఎందుకు కాకూడదు ? ఇటువంటి పిల్ల

నా భార్య అని చెప్పుకో గలిగిన ధన్యు డెలాటి వాడై ఉంటాడా అను కున్నాను. ఈ చక్కదనానికి తగ్గవా డవునా కాదా అనే ఆలోచన పోయింది. ఈమెకు తగిన వాడని చెప్పతగిన పురుషుడు సృష్టిలో ఉంటాడా అనిపించింది. నెమ్మదిగా Beach చేరి కారు ఆపాను. అదివరకు ఏమి ఆలోచించు కుంటోందో కాని కారు ఆగడముతోనే ఉలిక్కిపడి నాల్గు ప్రక్కలా చూచింది. నేను దిగి ఆమె కూర్చున్న వైపు తలుపుతీసి దిగ మన్నాను. తెల్ల పోయి 'ఎందుకు' అంది.

'కొంచెము సేపు ఈ చల్లగాలిలో కూర్చుని పోవచ్చును' అన్నాను.

'కాదు, నన్ను త్వరగా ఇంటికి తీసుకు వెళ్ళండి' అన్నది. 'ఆలాగేలే త్వరగా వెడదాము. రా' అని చెయ్యి పట్టుకున్నాను. కేక వెయ్య బోయింది. ఒక చెయ్యి నోటిమీద వేసి, రెండవ చెయ్యి ఆమె నడుము చుట్టూ వేసి బలవంతాన బయటకు లాగి సముద్రపు టొడ్డుకు తిసుకు వెళ్ళాను. ఆ ఇసుక తిన్నెమీద కూర్చుని, నా ప్రక్కనే కూర్చో పెట్టుకొని నోటిమీద చెయ్యి తీసి గట్టిగా కౌగలించుకొని, 'ఎందుకలా భయపడతావు. ఇప్పుడే తీసుకు వెళ్ళి మీ యింటి దగ్గర దిగ పెడతాలే' అన్నాను. 'మీరు తండ్రివంటివా రనుకొని మిమ్మల్ని నమ్మినాను. మీరూ ఇలాంటి వారేనా!' అంది ఏడుస్తూ. అప్పటికీ ఆ మనిషి స్వభావం తెలుసుకోలేక పోయాను. ఇవి మామూలు మాటలే అను కున్నాను. మరొక్క మాటేనా ఆడలేదు. కేక లన్నా వెయ్య లేదు. నా కౌగిటిలో నుంచి విడుపించుకునే ప్రయత్న మైనా చేయలేదు. నేను ఏ మనుకోను? నా కౌగిలి పట్టు ఇంకా బిగించి ఒక్క

ముద్దు పెట్టుకున్నాను. నిర్ఘాంత పోయి నాకేసి చూచింది. ఆ చూపు జన్మ జన్మాలకూ నాకు మరపు రానిది. భయము, సంభ్రమము, ఆశ్చర్యము, ఇంకా ఎన్నెన్నో భావాలు ఆ చూపులో కనపడ్డాయి. ఒక్క చూపులో ఏకకాల మందు ఇన్ని భావములు ప్రదర్శించటం సాధ్య మౌతుం దని నేను ఎన్నడూ అనుకోలేదు. మరొకళ్ళు అయితే ఆ చూపుకి భయపడి అంతటితో తమ ప్రయత్నమును మానుకొనే వారేమో! నేనైనా మరొక సమయంలో అయితే బాగా ఆలోచించి మరీ ముందుకు సాగే వాడిని. కాని ఆక్షణంలో నాకు వొళ్ళు తెలియలేదు. నా శరీరంలో ప్రతి రక్త బిందువూ ఉడికి పోతూంది. సర్వేంద్రియములూ స్వాధీనము తప్పిపోయినాయి. న్యాయా న్యాయ విచక్షణా విహీనుడనయి పోయినాను. ప్రమాద స్థితిని తెలుసుకో లేక పోయినాను. అంతే కాకుండా పతి వ్రతలంటూ ప్రపంచములో ఉన్నా రని నాకు నమ్మకం లేదు. ఎటువంటి స్త్రీ అయినా, ఏదో రూపంలో తగినంత ప్రతి ఫలం దొరుకుతే పరపురుషుడికి స్వాధీనం కావడాని కంగీక రిస్తుం దని నా దృఢ విశ్వాసము. వాడెవడో చెప్పినట్లు Every woman has her price అనే మాట ముమ్మాటికి సత్యం అని నామ్మకం; అనుభవం కూడాను. అటువం టప్పుడు ఈ పందొమ్మి దేళ్ళ పల్లెటూరు పడుచు వా రందరికీ అతీతురాలని ఎలా అనుకోను?

ప్రపంచ మంతా నిశ్శబ్దము. సముద్రపు హోరు కూడా ఆక్షణంలో నా చెవిని పడలేదు. చేతనా చేతన ప్రపంచ మంతా కూడా ఒకసారి ఊపిరి బిగబట్టి ఏమి జరుగుతుందో చూతా మని ఆశ్చర్యముతో వేచివున్న దను కుంటాను. ఆకాశము మట్టుకు

తన అనంతకోటి నక్షత్ర కాంతులతో నవ్వుతున్న ట్లున్నది. నా మదనా తురత నింక నణచుకోలేక పోయాను. ఆ పిల్లను నా వడిలోకి లాక్కొని రొమ్ముమీద చీర రవికా తొలగించి ఒళ్ళు తెలియకుండా లెక్కలేని ముద్దులు పెట్టుకున్నాను. ఒక్కొక్క ముద్దు పెట్టుకొన్న కొద్దీ నా ఆవేశము మరీ హెచ్చి పోయింది. ఆ పిల్ల నిర్నిమీలిత శూన్యదృష్టితో నాముఖం కేసి చూస్తూ ఊరు కుంది. గత్యంతరంలేక శరీరం నాకు ఒప్పగించింది అను కొన్నాను. మొదట నా చేతులలో ఆమె శరీరం కొంచెము బిగిసి పోతూం దను కున్నాను. క్రమేణా పట్టు తప్పిపోయినట్లు నా చేతుల్లో నుంచి జారిపోవడం మొదలు పెట్టింది. నే నీముద్దులతో ఊపిరి ఆడక ఆమెను ఇసుక మీదకు జారవిడిచి ఒక్క రెప్ప పాటు ఊపిరి తీసుకున్నాను. రెప్పవాల్చకుండా ఆమె అలాగే నాకేసి చూస్తోంది. ఎందుచేతననే ఆలోచన తోచలేదు నాకు. పునరాలింగన చుంబనాదుల కామెను లేవదీయ బోయాను. ఆమె శరీర మదొక మాదిరిగా బరువెక్కినట్లు తోచింది. తల వెనక్కు పడిపోయింది. ఇ దేమిటి మూర్ఛ పోయిందా అనుకుని మళ్ళీ పడుకోబెట్టి ఇటూ అటూ కదిపి పలకరిస్తే పలకలేదు. అరిచేతులూ అరికాళ్ళూ రాచాను. నీటి వొడ్డుకు పరుగెత్తుకు వెళ్ళి దోసిలితో నీళ్ళు తెచ్చి ముఖాన్ని చల్లాను. ఏమి చేసినా లాభం లేక పోయింది. ఇదొక జబ్బు కాబోలు, క్రమేణ తెలివి వొస్తుం దనుకున్నాను. అప్పటికి నా ఉద్రేకం చల్లారింది. ఒక విధమైన భయ మారంభ మైంది. ఇంటికి పోయేవాడిని పోక ఇ దెందుకు తెచ్చుకొన్నానా అనుకున్నాను. ఆలాగు అరగంటో ముప్పావు గంటో కూర్చున్నాను. ఎంతకూ ఆమెకు తెలివి రాలేదు. సరి

గదా క్రమేణా వొళ్ళు నఖశిఖ పర్యంతం చల్లపడి పోయింది. ఆ పిల్ల చనిపోయిం దని గ్రహించాను. వర్ణనాతీత మైన భయంతో నా శరీరం యావత్తూ కంపించి పోయింది. నా ప్రథమ చుంబన ముతో ఆమె ముఖమును నేను మలిన పరచి నప్పుడే ప్రాణం పోయి ఉండవలె నని ఊహించాను. ఆ నిర్నిమీలిత దృక్కుల భావ మది అయి ఉండవలెను. పాపం, యౌవనోదయవేళ తన వా ళ్ళందరకూ దూరమై, ఈ నిర్జన ప్రదేశంలో పరాయివాని చేతిలో ఈ నిర్భాగ్యపు బలవ న్మరణం రాసిపెట్టి ఉన్నది ఆ పిల్లకు. నేను హంతకుడిని. చేష్ట లుడిగి, రాతి బొమ్మలా కూర్చున్నాను. వొళ్ళు ముచ్చెమటలూ పోసి నీరు కారిపోవడం మొద లెట్టింది. ఆ పిల్ల మీద జాలి పోయి ముందు సంగ తేమిటనే ఆలోచన పోయింది. కూర్చున్న కొద్దీ ప్రతి క్షణమూ ప్రమాద కర మని తోచింది. అదివరకు నిర్జన మనుకున్న సముద్ర తీరం అనేకకోట్ల జీవరాసులతో నిండి ఉన్నట్లు తోచింది. నిశ్శబ్దంగా ఇంత వరకూ ఉన్న సముద్రం గర్భ నిర్భేదముగా రోదించడం మొద లెట్టింది. స్తంభించి పోయిన దనుకున్న వాయువు ప్రచండ వేగముతో నా చెవులు చిల్లులు పడేటట్లు కోటి గొంతుకలతో అరవడము అరంభించింది. దూరాన్ని వెడుతున్న మోటారు కారు ఒకటి ప్రళయ గర్జనతో నా మీద వచ్చి పడుతుం దను కున్నాను. నా వెనుక తిరువళిక్కేణి ఉత్సవములోని దీపపు కాంతులు నరక జ్వాలలులా కనపడ్డాయి. ఆకాశాన ఉన్న నక్షత్రకోటులు కన్నీరు కార్చడం మొద లెట్టినాయి. దిక్కు లేకుండా నిర్జన ప్రదేశంలో చనిపోయిన పిల్లకోసం చేతనా చేతన ప్రపంచం యావత్తు విచారిస్తున్నట్లు తోచింది.

అనిర్వాచ్యము అపూర్వము అననుభూతము అయిన మహా భీతి నన్నావరించింది. ఆ కళేబరాన్ని ఎవరి కంటా బడకుండా ఎక్కడో పారవేసి నేను ఇల్లు చేరడమే ప్రధాన కర్తవ్యమని తోచింది. భయముతో స్వాధీనము తప్పిపోయిన అవయవములకు వింత బలం వచ్చింది. మంచుకంటె చల్లనై కొయ్యబారిన కళేబరాన్ని తీసుకొని కారులో పడేసి మళ్ళీ కారు వచ్చిన దారినే తిప్పి కోట సమీపంలో కారు ఆపి ఈ వింత బరువును మోసుకొని సముద్రంలో వీలైనంత లోతుకు తీసుకువెళ్ళి నీళ్ళలో గిరవాటు వేశాను. అఖరు సారి ఆ అమ్మాయి ఆ Shocked Innocent చూపు తో నన్ను మందలించింది. నాటి నుండి ఈ అఖరి క్షణం వరకూ అహర్నిశములు జాగ్రత్స్వప్న సుషుప్తులలో కూడా ఆ కడసారి చూపు నన్ను వెంబడిస్తూనే ఉంది. అనేక జన్మ పరంపరలో నాటి మహా పాపమునకు తగ్గ ప్రాయశ్చిత్తము అనుభవించి పునీతుడ నయ్యే వరకు ఆ చూపు నన్ను వదల దను కుంటాను. కాని సముద్రుడు నా రహస్యమును దాచడాని కంగీకరించలేదు. మహాక్రోధంతో ఒక పెద్ద తరంగం నన్ను అవతలికి గెంటేసి ఆ పిల్లను నెమ్మదిగా వొడ్డుకు చేర్చింది. నే నక్కడ ఇంక నిలబడ లేక పోయాను.

తిన్నగా నా కారుఎక్కి వెయ్యిభూతములు ఆవహించినట్లు మనోవేగంతో వచ్చిపడ్డాను. అక్కడ కూడా ఆగ బుద్ధి పుట్టలేదు ఆ తడిబట్టలు విడిచి వేసి పొడిబట్టలు కట్టుకుని మళ్ళీ కారులో కూర్చుని బయలు దేరాను. ఎక్కడికో నాకే తెలియదు. కారు ఏ దారిన వెడుతూందో దారిలో ఏ మున్నదో చూచుకోలేదు. మరొకరెవ్వరో నడుపుతున్నట్లుంది. కాని నేనే నడుపు తున్నా

నను కోలేదు. కారుకి ఉన్న యావచ్ఛక్తీ వినియోగించి ఉంటాను. సుమారు ఏడు గంట లయ్యే సరికి నాకు తెలియకుండా బెంగుళూరు చేరాను. తిన్నగా మన బంగళాకు వెళ్లాను. ఈ చెప్పకుండా రావడం నా ముఖ వైఖరీ చూచి నౌఖరులు ఆశ్చర్యపోయారు. నేను ఎవ్వరితో మాట్లాడకుండా తిన్నగా కారులో నుంచి, దిగి పడక గదిలోకి వెళ్ళి కోటేనా విప్పకుండా పడుకున్నాను. నౌఖరు ఏదో అడిగాడు. నేను జవాబు చెప్పలేదు. ఇంక ప్రపంచ మెరుగను. తరువాయి సంగతి నీకు జ్ఞాపకం ఉండి ఉంటుంది. సుమారు నెలరోజుల వరకూ వొళ్లు తెలియని జ్వరం, స్మృతి లేక పోవడం, హటాత్తుగా త లంతా నెరవడం, డాక్టరు Brain fever అను కోవడం, 20 రోజులయిన తరువాత ప్రాణభయం లే దని వైద్యులు నిర్ణయించడం, విరామం లేని పని వల్లా, తీవ్రాలోచనవల్లా Nervous Break down వచ్చిం దని ఆరు మాసములు విశ్రాంతి తీసుకొని దేశాటన చెయ్య మనడం ఆ ప్రకారం మనం తిరగడం నువ్వు ఎరిగున్నదే. ఇది నేను చేసిన విరామం లేని పని. తీవ్రాలోచనాను......

ఇంక నీతో చెప్పవలసిన దేమీ లేదు. వప్ప జెప్పవలసిన ఆస్తి అంత కంటే లేదు కదా. నీ దారి నీవు చూచు కోవలసినదే. ... ... ... నాకు జీవితంలో రెండే ఆదర్శాలు ఉండేవి. నేను విశేషంగా ధనార్జన చేసి, ఏదో మహోన్నత పదవి పొందవలెనని ; రెండవది, నిన్ను పురుషోత్తమునిగా చేసి నీకేదో మహా సామ్రాజ్య పట్టాభిషేకం చేయవలె నని. ఇందులో ఏదీ కూడా చెయ్యలేక పోయాననే విచారం కొంతకాలం ఉండేది. కాని ఇప్పుడది కూడా లేదు. వారి వారి జన్మాంతర సంస్కారమును బట్టి

ఏవో కొన్ని సంకల్పములు కలగడమే కాని వాటి నిర్వహణము మట్టుకు మనది కాదు. నేను ఆత్మ హత్య చేసుకుందా మని నిశ్చయించి నప్పటినుంచి, నా అభిప్రాయాల్లో, దృక్పథంలో చాలా మార్పు వచ్చింది. మన జీవితంలో ప్రధాన మనుకున్న వన్నీ అప్రధానంగానూ అప్రధాన మనుకున్న వన్నీ ప్రధానంగాను కనుపిస్తున్నా యిప్పుడు.

సముద్రయానం చేసేటప్పుడు నావ ఒడ్డునుంచి దూర మైన కొద్దీ నిత్య జీవనాని కత్యావసర మనుకున్న సమస్త పదార్థ ములూ, రోడ్లు, బళ్లు, ఇళ్లు వాకిళ్లు, నదులు పర్వతములూ సమస్తమూ మాయమై పంచ భూతములూ తప్ప మ రేమీ గోచ రించ నట్లే నేను ఈ ప్రాణ ప్రయాణ సమయంలో ఇహ పర ముల మధ్య నిలబడి ఒక్కసారి సింహావ లోకనం చేస్తే వస్తు స్వరూపములూ, తత్వములూ. విలువలూ తారుమారై జీవితంలో మనకు కనపడే కృత్రి మాకారాలను విడిచి, నిజ స్వరూపంతో నిజ స్వభావంతో నిజ స్థానంలో కనపడుతూ ఉంటాయి. ఆఖరుకు బ్రతికి ఉన్నవాళ్లూ, వెర్రివాళ్లూ, అప్రయోజకులూ దేశ వినాశ కారకులూ అనుకున్న తత్వ వేత్తల మాటే - సత్యం, నిత్యం అనుకున్నది అసత్యం అనిత్యంగానూ, అనిత్యమూ, అసత్యమూ, అనుకున్నదే నిత్యము సత్యముగానూ కనుపిస్తోంది.

నీకు తత్వోపదేశం చేదా మని కాదు నా ఉద్దేశం. చేసినా నువ్వు వింటా వనే నమ్మకం లేదు నాకు. నా ముందు నడచిన మహానుభావుల మాట బ్రతికి ఉన్నన్నాళ్ళూ నేను విన్నాను గనుకనా !

ఇదివర కెన్నడూ ఈ రహస్యములను ఎవ్వరి తోటీ చెప్ప

డానికి భయ పడ్డాను. అందులోనూ ముఖ్యంగా నీతో చెప్పడానికసలే సిగ్గు పడ్డాను. ఏ తండ్రీ తన కన్న బిడ్డల ఎదట చులకన పడడానికి ఒప్పు కోడు కదా! ఇప్పుడు చెప్పకుండా ప్రాణం విడవలేక పోతున్నా ఇంక నెవ రే మనుకొన్నా నాకు విచారం లేదు. ఈ తుచ్ఛ ప్రపంచ ధూషణ భూషణ తిరస్కారములు అందని చోటికి పోతున్నాను. నేను ఉన్నస్థితిలో దారిద్ర్యాన్ని చూచి జాలిపడి చేతనైన సహాయం చెయ్యడానికి బదులు, ధన మదాంధతచేత, ఆ దరిద్రుణ్ణి అధః పాతాళానికి అణగ ద్రొక్కి వాడి చావుకి కారకుడను అయ్యాను. ఈ దుష్ట ప్రపంచంలో అదృష్టము, అలభ్యమూ అయిన అమాయికత్వమూ, పతివ్రతా కనపడినప్పుడు గౌరవించి పూజించ డానికి బదులు, వాటిని చంపేసి నట్టేటి పాలు చేశాను. ఇంత కంటే, ఒక్క జీవితంలో దుర్మార్గం ఏమి చెయ్యాలి!

నాయనా! నీవు నన్ను గురించి ఏ మనుకొన్నా సరే కాని నే చేసిన ఈ మహాపరాధములు రెండు మట్టుకు జ్ఞాపకం పెట్టుకో. నేను అనుభవించిన వాటి ఫలితం మరచి పోకు. ఆ అపరాధములు మట్టుకు నీవేనా నీజన్మ మధ్య మందు చేయకూడ దని నా తుది కోరిక ... బహుశా నీ సమీపములో ఉండి చూస్తూ ఉంటా నను కుంటాను ... వెళ్లనా నాయనా! సమయానికి దగ్గరేనా లేవు కదా! పోనీ ఇదే మంచిది......

పార్థసారథి నాయుడు ఉత్తరం అంటించేసి బల్లమీద పెట్టి లేచి ఒళ్ళు విరుచుకొని కడసారి ఇల్లంతా తిరిగి, తోటలో ఒక్కసారి తిరిగి వచ్చి, జేబులో మాత్ర తీసి, నోట్లో వేసుకొని, కాసిని మంచినీళ్ళు తాగి మంచం మీద పడుకున్నాడు.

# షష్టీ కేస్

## శ్రీ మునిమాణిక్యం నరసింహా రావు

1898 లో గుంటూరు జిల్లా సంగం జాగర్లమూడిలో జననము. గుంటూరులో, విజయనగరములో విద్యాభ్యాసము. బి. ఏ. ఎల్. టీ. బందరు హిందూకాలేజీ హైస్కూలులో 25 సంవత్సరములు చరిత్రాధ్యాపకుడు. కథాసందోహములు 30 పైగా నున్నవి. వక్ర రేఖ (నవల), శరద్రాత్రులు, రుక్కుతల్లి, రాధబాబు, తిరుమాళిగ (నవల), కాంతం కైఫీయల్ (కైఫియత్ శైలిలో), గృహప్రవేశం (నాటకము), స్తుతి, చమత్కార సంభాషణ, అనేక వ్యాసములు, వ్యంగ్య చిత్రములు, తర్జుబా - ఈ-ఉస్తాద్ (ఉపాధ్యాయుల కష్టాలు) ఇత్యాదులు ముద్రితములు.

గృహస్థ జీవితములో చిత్ర సన్నివేశాలను, చమత్కారాలను, మాధుర్యమును మనోహరముగా హాస్య ధోరణిలో విశేషముగా చిత్రించినాడు. కాంతం అను విశిష్ట పాత్రను సృజించినాడు.

---

౧

ఏజెంట్ల మీటింగు అయిపోయింది. అందరూ ఎవరిదారిని వారు వెళ్ళి పోతున్నారు. తాము ఆ సంవత్సరములో చేయించిన బిజినెస్‌కు, తమకు రావలసిన కమీషన్ తీసుకొని, సంతోషంగా వెళ్ళిపోయినారు చాలామంది.

ఈశ్వర రావు మట్టుకు ఒక్క దమ్మిడీ అయినా తీసుకో కుండా ఒట్టి చేతులతో వస్తున్నాడు. అందుకనే అతడు చాలా విచారంగా కూడా ఉన్నాడు.

జనరల్ మేనేజరు పిలుస్తున్నా రని ఈశ్వరరావుకు కబురు వచ్చింది. అతడువెళ్ళి ఆయనకు ఎదురుగా కూర్చున్నాడు.

మేనేజరు అన్నాడు, 'ఏమండీ, మీరు ఎజన్సీ పుచ్చుకొని అయిదారు నెలలు అయింది, ఒక్క కేసు అయినా పంప లేదు. ఏమిటి సంగతి ?'

'నా లోపం లేకుండా కృషి చేస్తూన్నాను. కాని కలసి రావటం లేదు. అదృష్టం లేదు' అన్నాడు రావు.

'మిస్టర్ రావు, ఇన్స్యూరెన్సులో అదృష్టమూ, దుర దృష్టమూ, అంటూ ఏమీ లేవు! నీవు బాగా పని చెయ్యాలి ?

'ఏమి చేయ మంటారు ?'

'నీవు ప్రతి నిమిషమూ కూడా ఇన్స్యూరెన్సును గురించి ఆలోచించాలి !'

'ఇన్స్యూరెన్సునుగురించి పుస్తకాలు చదువుతున్నానండీ!'

'చదువుతున్నావా ? అయితే ఆపేసెయ్యి. అల్లాంటి పిచ్చి పనులు ఏమీ చేయకు. పుస్తకాలు చదవటంవల్ల బిజినెస్ వృద్ధి గాదు. మానవ జీవితాన్ని తెలుసుకో, తెలిసిందా ?'

ఈశ్వరరావు తెలిసినట్లు తల ఊపాడు. మేనేజరు మళ్లీ ఇట్లా అన్నాడు: 'మనిషి తన భవిష్యత్తును గురించి సాధారణ ముగా ఆలోచించడు జరిగిపోతున్నంత కాలం. ఆవిషయం నీది. అతని భవిష్యత్తును — గురించి ఆలోచించ వలసిన పని నీది. తెలిసిందా ?'

'తెలిసిం దండి, ప్రతివాడూ తన ముందు గతిని గూర్చి ఆలోచించడు. వాడు చస్తే వాడి పెళ్లాం, వాడి బిడ్డల గతి ఏమౌ తుందా అని నేను దిగులు పడి వాడి కేదో ఒక ఉపాయం ఆలో చించి చెప్పాలి !'

'ఇన్స్యూరెన్సు ఏజెంటు పనే అది !' అన్నాడు మేనేజరు. నవ్వుతూ.

ఈశ్వరరావు చిన్నవాడు, పనికొచ్చేవాడు. అతనికి తగినంత ప్రోత్సాహ మిచ్చి ఎట్లాగైనా అతని ద్వారా బిజినెస్ రాబట్టా లని మేనేజరు గట్టిగా పట్టు పట్టాడు.

'మిస్టర్ ఈశ్వరరావు, పట్టుదలతో పనిచేయాలే నీవు. ప్రొద్దున లేచినప్పటినుండి అదే ఆలోచనలో ఉండాలె.'

'రైల్లో ప్రయాణం చేస్తున్నా వనుకో, ఆ కాలం వృథా చేయకూడదు. ఇన్స్యూరు చేయటం వలన కలిగే లాభాలూ, ఇన్స్యూరు చేయకుండా పోయిన వాళ్ళ పెళ్ళాం బిడ్డలు పడ్డ బాధలూ ఈ విషయాలను గురించి కథలు చెప్పాలె. అందులో ఒకడికో, ఇద్దరికో నీవు చెప్పింది నచ్చు తుంది. నీ కృషి ఫలిస్తుంది. పట్టుదల,' అని ఇల్లాగ ఎంతో సేపు ప్రోత్సాహకరమైన మాటలు చెప్పాడు. పాపం ఈశ్వరరావు ఒట్టి చేతులతో వెళ్ళు తున్నాడే అని జాలి కూడా కలిగింది. ఆయన అందు కని అతనికి ఒక యాభై రూపాయలు ఎడ్వాన్సు కూడా ఇప్పించి, దీవించి పంపాడు.

ఈశ్వరరావు సంతోషించాడు. బి. ఏ., ప్యాసు అయిన కుర్రవాడు, తెలుగులో కూడా బాగా మాట్లాడగలడు.

ఇప్పుడు అతనికి బాగా ప్రోత్సాహం కలిగింది. పట్టుదల

అతని గుండెపైన పీఠం వేసుకొని కూర్చున్నది. ఏమైనా సరే రోజుకు ఒక కేసు అయినా పట్టంది భోజనం చేయ కూడ దని నిశ్చయించుకొని స్వగ్రామం వెళ్ళిపోవటానికి బయలుదేరాడు.

ఈశ్వర రావు ఈ తభా గట్టి పట్టు పట్టాడు. బెజవాడ చేరటంతోనే మెడలు విరచి అయినా సరే ఎవరినో ఒకరిని ఇన్స్యూరు చేయిస్తాడు. అంత పట్టుదల అతని ముఖంలో స్పష్టంగా కనిపిస్తూనే ఉంది.

౨

ఈశ్వర రావు గబ గబా పరుగెత్తు కుంటూ వెళ్ళి రైలు ఎక్కాడు. ఖాళీగా ఉన్న ఒక పెట్టెలో ఎక్కి ఒక బెంచీపై కూర్చున్నాడు.

ఆ మేనేజరు చెప్పిన మాటలు, అతని చెవుల్లో గింగురు మంటూనే ఉన్నాయి. ఇది రైలుపెట్టెగదా అని ఊరుకోకూడదు. ఇక్కడ కూడా తన వేట సాగించాలె.

తనకు ఎదురుగా ఉన్న బెంచీపైన ఇరవై ఏండ్ల కుర్రవాడు ఒకడు కూర్చొని ఉన్నాడు. విచారంగా దిక్కులుగా చూస్తు న్నాడు. అత నేదో చిన్న ఉద్యోగిలాగ ఉన్నాడు. బీదవాడు కూడా ఐతే కావచ్చు. అయితే మట్టు కేం ఆలోచించవలసిన విషయమే!

ఈశ్వర రావు బాగా ఆలోచించాడు. తన ప్రయత్నాలు ఇప్పుడే ఆరంభిస్తే చాలా మంచిది. ఈతణ్ణి పట్టుకొని కొద్ది మొత్తాని కైనా సరే ఇన్స్యూర్ చేయిస్తే ఎల్లా గుంటుందీ అన్న ఆలోచన తట్టింది.

ఈ ఆలోచనే చాలా బాగుంది. ఇది అతని మొదటి కేసు. మొదటి ప్రయత్నం లోనే నెగ్గాలె.

ఈశ్వర రావుకు ఈ బిజినెస్ అంటే మొదటినుంచీ ఇష్టం. తన భవిష్యత్తును గురించి బాగా ఆలోచించే, చివరకు ఇన్స్యూరెన్సు ఏజెంటుగా కుదురుకున్నాడు.

ఇన్నాళ్లబట్టీ ఒక్క కేసు అయినా చేయించ లేక పోయిన మాట నిజమే కాని ఇవ్వాళ్ల అట్లా కాదు. ఆ ఎదురుగా ఉన్న కుర్రవాడిని చూచీ చూడటంతోనే తెలిసింది- ఈశ్వర రావుకు తన అదృష్ట రేఖ బైటపడ్డ దని.

అతడు తనకు కలుగబోయే అదృష్టాన్ని గురించి ఎక్కువగా ఊహించుకొంటూ పోయినాడు. ఇది తప్పకుండా నెగ్గుతుంది. ఆ తరువాత అతడు పట్టిం దల్లా బంగారం కావచ్చు, బిజినెస్ వృద్ధి అవుతుంది. నెలకు వందా, రెండు వందలు కూడా సంపాదిస్తూ ఉంటాడు. తరువాత రిన్యూయల్ ప్రిమియమ్ యొక్క కమీషను మీదనే హాయిగా జీవించే రోజులు రావటానికి కూడా ఎంతోకాలం పట్టకూడదు.

ఇంతకూ తనకు పట్టబోయే అదృష్ట మంతా ఈ మొదటి కేసులో తనకు విజయం కలగటం పైనే అధారపడి ఉన్నది. ఎట్లా గయినా సరే కుర్రవాణ్ని పట్టితీరాలె.

## 3

ఈశ్వర రావు ఆ కుర్రవాడి దగ్గర జేరి అతన్ని మెల్లగా మాటలలోకి దించాడు. అతని సంగతి అంతా తెలుసుకొనటానికి ఎంతోసేపు పట్టలేదు.

ఆ అబ్బాయి ఒక బడిపంతులు, కొద్ది జీతంమీదనే ఎల్లాగో జీవిస్తున్నాడు.

ఇక ఆ అబ్బాయి భవిష్యత్తును గురించి బాగా ఆలోచించ వలసిన బాధ్యత తనది, మానేజరు గారు చెప్పినట్లు.

సంసారం కొద్దే కాబట్టి ఇప్పు డెట్లాగో గడుస్తున్నది. ఆ అబ్బా యికి ముందు ముందు ఎల్లాగు ?

బ్రతికిఉంటే తల తాకట్టుపెట్టి అయినా సరే ఎల్లాగో పెళ్ళాము బిడ్డలను పోషిస్తాడు అనుకొందాము. కర్మం చాలక అతడు కాస్తా హరీ అంటే వాళ్ళసంగతి ఏమి కావాలె! కాబట్టి ఈ విషయం అత నొక పాలసీ పుచ్చుకొనే టట్లు చేయక తప్పదు.

అయితే, ఆ కుర్రవాడు ఏమంత తెలి వైన వాడులాగ కని పించ లేదు. ఏదో మందమతిలాగ ఉన్నాడు. ఎందుకూ అంటే ఆ జవాబులు ఏదో పరధ్యాన్నంగా, ఎక్కడో చూస్తూ ఏదో ఆలో చిస్తూ చెప్పాడు.

అయితే నేమి? అల్లాంటి వాణ్ణే కాస్త దారికి తీసుకొని వచ్చి ఒక పాలసీ తీసుకొనే లాగున చేస్తే ఒక బీద సంసారాన్ని రక్షిం చిన పుణ్యం దక్కుతుంది.

ఈశ్వర రావు పట్టుదలతో, పని ప్రారంభించి ఆ పంతులను క్రమంగా సంభాషణ లోకి లాగి జీవితం అశాశ్వతం అనే విషయం లోకి దింపాడు.

ఇట్లా అన్నాడు: చూడండి, ఈ బ్రతుకు శాశ్వతం కాదు. 'అనిత్యాని శరీరాణి' అన్నారు. ఇప్పుడు ఇల్లాగ కులాసాగా మాట్లాడు తున్నాము. కాని ఇంకా కాసేపటికి ఏమి జరుగుతుందో ఏమీ చెప్ప లేము.

ఆ అబ్బాయి ఊరుకొన్నాడు, విని విననట్లు. అవు ననలేదు, కా దనలేదు. ఏదో తియ్యాని మత్తులో ఉన్నట్లు చూస్తూ కూర్చు న్నాడు.

'చూశారూ, పంతులుగారు ! బండి ఇప్పుడు ఈ వంతెన మీదుగా పోతున్నది. కాని ఈ వంతెన దభీ మని విరిగిపోయి, రైలు పడిపోయి రైలులోని ప్రయాణీకులలో కొందరు చనిపో వచ్చు ! అల్లా చాలా చోట్ల జరిగింది !

అటు చూస్తున్న పంతులు ఇటు తిరిగి ఈయన చెప్పే మాటలు వింటానికి కాస్త ఆసక్తి కనపరచాడు.

ఈశ్వర రావు ధైర్యంతో మళ్లీ ఇట్లా అన్నాడు : 'నిత్యం సన్నిహితో మృత్యుః' అన్నారు. మృత్యు వనేది ఎల్లప్పుడూ మన లను అనుసరిస్తూ గబుక్కున మీద పడుతుంది ఎప్పుడో ఒక ప్పుడు ! ఏ రూపంతో వస్తుందో చెప్ప లేము. ఒకసారి, దారిని పోతూ ఉన్న రెండెడ్ల బండి విరిగి ఒక కుర్రవాడి మీద పడ్డది. వాడి ప్రాణాలు అక్కడే పోయినాయి.'

పంతులు ఈ మాటలు విని చాలా ఆశ్చర్యపడ్డాడు. అంత పని జరిగిందా అన్నట్లు తెల్లపోయి చూశాడు.

ఏజెంటు మహాశయునికి పట్టుదల ఎక్కువ అయింది. పంతులు వలలో పడేటట్లే ఉన్నాడు. ముఖం చూస్తే అల్లాగ ఉంది అందుకనే అత డొక చిన్న ఉపన్యాసం సాగించాడు. మధ్య మధ్య అతని ముఖంలోని మార్పులను గుర్తిస్తూ, ఉపన్యాసం అంతా విన్నాడు ఆ కుర్రవాడు—ఒక మాటైనా పలకకుండా.

చివరకు ఉపన్యాసకుడు అన్న మాట ఇది.

'సైకిల్ మీదనుంచి పడి అక్కడే ఆ క్షణంలో, ప్రాణాలు

విడిచిన వాళ్లుకూడా ఉన్నారు.'

ఆ అబ్బాయి ఏడ్పు ముఖం పెట్టాడు. అతని బుర్రలోకి ఈతని మాటలు ఎక్కినవి. ఏజెంటు ఈశ్వర రావు చాలా సంతోషించాడు. ఇంతకూ మేనేజరు చెప్పినట్లు పట్టుదల ఉంటే సరి. అదృష్టం అదే కలిసి వస్తుంది. తనమాటలు ఆ కుర్రవాడికి బాగా నచ్చినట్లు తెలుస్తూనే ఉంది. ఇక అతని చేత పాలసీ కొని పించటానికి ఎంతోసేపు పట్టదనికూడా గ్రహించి, ఈశ్వరరావు కొంచెం గంభీరంగా ముఖంపెట్టి ఇట్లా అన్నాడు :

'పంతులుగారూ, ఒక్క మాట చెబుతాను వినండి. మీరు ఏమీ అనుకోవద్దు, మీకు ఆస్తి ఏమీ లేదు. ఏదో పల్లెటూరిలో బడి చెప్పుకొని బ్రతుకుతున్నారు. ఏ ఆపదో వచ్చిం దంటె ఇల్లాంటి ప్రమాదం కలిగి, మీ ప్రాణాలు కాస్తా గుటుక్కు మంటే, మీ పెళ్ళాంగతి ఏమికావలె, బిడ్డలగతి ఏమి కావలె ! వాళ్లు అన్నం లేక మాడిచస్తారు : అవునా, కాదా ?'

దీనికి జవాబుగా పంతులు ఏ మంటాడో నని ఈశ్వరరావు అతనివంకే చూస్తున్నాడు. పంతులు అతడు అడిగినదానికి జవాబుగా అవు నని తల ఊపుతూ చూస్తు ఉండగానే గొల్లు మని ఏడ్వటం సాగించాడు.

అరె ! ఇంతపని జరుగుతుం దని ఆ ఏజెంటు అయినా ఎప్పుడూ అనుకోలేదు. అతను ఆసించినది అయినా ఏదో అయిదువందల పాలసీ : నెలకు రెండు రూపాయలు ప్రీమియమ్ కడితే చాలు.

ఈ పాలసీమాట ఎత్తకముందే ఈ పంతులుగారు ఇట్లాగ ఏడుస్తా డని ఆయన కలలో నైనా అనుకోలేదు. ఇది చాలా విచి

త్రంగా వుంది. ఆదీకాక అతనికి ఏమి చేయటానికి తోచలేదు.

ఆ ఏడ్పు చూచి, ఆ పెట్టెలో ఉన్నవా ళ్ళంతా అంతకు ముందు మాట్లాడుతూవున్న వాళ్ళల్లా చప్పున ఆగిపోయి ఆ కుర్ర వాడివంకా, ఆ ఏజెంటువంకా చూడడం మొదలు పెట్టారు. వాళ్ళకు ఏమీ తెలియదు. ఇద్దరూ కుర్రవాళ్ళలాగే కనపడ్డారు. వాళ్ళకు వీ ళ్ళిద్దరు కూడా మాటామాటా అనుకున్నా రేమో నని అనుమానం కలిగింది.

ఆ పంతులు ఏడ్పు ఆపలేదు. 'అంతే, నీవు అన్నది నిజం! నిజం కాకపోతే ఎందుకు అంటావులే!' అని అంటూ ముఖాన గుడ్డ అడ్డు పెట్టుకొని ఏడ్వటం సాగించాడు.

ఆ అబ్బాయి మీద అందరికీ చాలా జాలి కలిగింది. ఈ ఏజెంటు ఏదో మాట అంటే ఆ కుర్రవాడు ఏడుస్తున్నాడు. ఇదీ అంతా అనుకొన్నది.

'ఎందుకయ్యా, ఆ అబ్బాయిని ఏడ్పించటం,' అన్నారు కూడా ఒకరిద్దరు పెద్దవాళ్లు. పాపం, ఈశ్వర రావు మట్టుకు ఏమంటాడు! తెల్లపోయి చూస్తూ కూర్చున్నాడు.

ఆయనే కాదు, అందరూకూడా నిశ్శబ్దంగా కూర్చున్నారు. ఒక చిన్నవాడు అల్లాగ వెక్కి వెక్కి ఏడుస్తూ ఉంటే ఎవరికి బుద్ధి పుడుతుంది కులాసాగా మాట్లాడు కొంటానికి!

ఈశ్వర రావు తెల్లముఖంతో, భయంతో కూర్చోటం చూచి అంతా అనుకొన్నారు. 'వీ డేదో అనే ఉంటాడు, లేకపోతే ఆ కుర్ర వాడు, ఎందుకు ఏడుస్తాడు!, ఆ కుర్రవాణ్ని ఏడ్పించింది తానే నని అంతా అనుకోవటం ఈశ్వర రావుకు చిన్నతనంగానే ఉన్నది.

నాలుగు నిమిషాలు గడచిన తరువాత పంతులు కాస్త

తెప్పరిల్లాడు. ఆయన ఏడుప్పు ఆపటం చూచి ప్రక్కనే కూర్చున్న ముసలమ్మ అన్నది : 'నాయనా ఎవరో చిన్నవాడవు. నీ దుఃఖం చూస్తే నా కడుపు తరుక్కు పోతున్నది. ఏమిటి నాయనా ? ఎం దుకు ఏడుస్తావూ ? అని ఆమె కళ్ళ నీళ్లుకూడా తుడుచుకొన్నది.

పంతులు బాబుకు నోట మాట రాలేదు. కళ్ళ నిండా నీళ్ళు పెట్టుకున్నాడు. దుఃఖపూరిత మైన గొంతులోనుంచి అతి కష్టము మీద ఒక్క మాట పెగిలింది. ఏడుస్తూనే అన్నాడు 'నా భార్య చచ్చి పోతుంది.' ఇకపైన ఒక్క ముక్క అయినా అనలేక ఆ ముసలమ్మగారిని కౌగలించుకొని గొల్లున ఏడ్వటం మొదలు పెట్టాడు.

ముసలమ్మగారికి కూడా దుఃఖం ఆగలేదు. అకస్మాత్తుగా లభించిన ఈ మనమణ్ణి కౌగలించుకొని 'ఊరుకో నాయనా ! అమ్మాయికి జబ్బు ఎక్కువగా వుందా ? ఫరవాలేదు నాయనా, ఊరుకో, అని ఓదారుస్తూ, తానుకూడా పెద్దగానే ఏడ్చింది.

ఇల్లా ఓదార్పు మాటలు అంటూ ఉన్నపుడుమాత్రం కాస్త ఊరుకొని మళ్లీ ఏదో జ్ఞాపకం రావటం, ఏడ్వడం, ఇదీ అతని వరస !

ఈశ్వరరావు ప్రాణాలు ఎక్కడ పోయినయ్యో ! అతడు ఎక్కడున్నాడో, ఏమి వింటున్నాడో, ఏమి చూస్తున్నాడో కూడా తెలిసికోలేని స్థితిలో ఉన్నాడు.

౪

ఆ పెట్టెలో కూర్చున్న వాళ్ళందరికీ ఆ కుర్రవాడు ఎందుకు అంతగా ఎడుస్తున్నాడో సరిగ్గా తెలియదు. మొదటి బెంచీలో

వాళ్ళు అయన భార్యకు ప్రాణంమీదికి వచ్చిం దని అనుకొన్నారు. మూడో బెంచీలో వాళ్ళు ఆమె పోవటానికి కారణాలు కూడా పోగుచేస్తున్నా రు!

కొంతమందికి ఈశ్వర రావుపైన కోపం కూడా వచ్చింది. అతనివైపు కొరకొర చూశారు. ఈ వెధవ కబురు ఇక్కడే ఇప్పుడే చెప్పక పోతే నేం! రైలు దిగిన తరువాత చెప్పక పోయినాడా అని వాళ్ళు అన్నారు.

ఈశ్వర రావుకూడా ఆ అబ్బాయి ఎందుకు ఏడుస్తున్నా డని కొంచెం ఆలోచించాడు. అతనికి ఒక విధంగా తోచింది. అతని భార్య బహుశః చాలా జబ్బుగా ఉండి వుంటుంది. ఇంతకు పూర్వమే అయన ఈ విషయమై ఆలోచిస్తూ దిగులుపడి కూర్చుని ఉంటాడు. మొదట్లో తన మాట వినకుండా పరధ్యాన్నంగా, దిగులుగా, ఉండటానికీ కూడా అదే కారణం అయి ఉండాలె!

నీ భార్యా, బిడ్డలు, అన్నం లేక మాడి చచ్చిపోతారు అన్నాడే. ఆమాటలు, ఎందుకు అన్నా అననీ, ఏ సందర్భంలో అన్నా అననీ, అతన్ని మాత్రం చాలా కష్టపెట్టి ఉంటివి. చాలా బాధకలిగి ఉంటుంది. అతనికి ఇదివరకే ఉన్న విచారానికి ఇది తోడుకాగా, అతడు దుఃఖాన్ని అపుకోలేక పోయి ఉంటాడు. ఏజెంటు మహాశయుడు తనకు ఉన్న సైకో ఎనాలిసిస్ శాస్త్ర విజ్ఞానం అంతా వినియోగించి, ఈ నిశ్చయానికి వచ్చాడు.

ఇంతలో పంతులు కాస్త దారి కొచ్చాడు. ఏడ్వటం మాని దిగులుగా కూర్చున్నాడు. దుఃఖం కాస్త తగ్గింది కదా అని ముసలమ్మగారు ఇట్లా అన్నది: 'అట్లా ధైర్యంగా ఉండు, నాయనా! ఏడిస్తే ఏమి లాభం?' ఆ కుర్రవాడు పిచ్చి చూపులు చూస్తూ

ఊరుకొన్నాడు.

'వాళ్లిద్దరూ బావమరదు లేటమ్మా!' అని చివర బెంచీలో ఎవరో అన్నారు. వాళ్ళకు ఈ సంగతి ఎట్లా తెలిసిందో! ఎట్లాగు ఊహించారో మరి!

ముసలమ్మగారు ఇది నిజమో కాదో తెలుసుకొందా మని అడిగింది: 'ఏం నాయనా, అయితే ఆయన అక్కను నీ కిచ్చారా; నీ అక్కను ఆయన కిచ్చారా?'

ఈ మాటల వినేసరికి ఈశ్వర రావుకు పై ప్రాణాలు పైన పోయినాయ్. ఆ అబ్బాయికి తనకూ కూడా బంధుత్వం కలుపు తున్నారు వీ ళ్ళంతా కలిసి! దీనికి సమాధానం ఆయనే చెబు తాడో, తననే చెప్పమంటాడో, అని భయపడి చూస్తున్నాడు.

ఆ అబ్బాయి తలే ఊపాడో, చెయ్యే ఊపాడో, ఏమి జేశాడో, తెలియదు కాని, మొత్తంమీద అందరికి ఇట్టే అర్ధ మైంది, వా ళ్ళిద్దరూ బావ మరదులే నని!

ఇన్స్యూరెన్సు వ్యాపారం చేయటంలో ఇల్లాగ అని వార్యంగా క్రొత్త క్రొత్త బాంధవ్యాలు ఏర్పడుతా యని పాపం ఈశ్వర రావుకు తెలియదు. అందుచేతనే అతడు చాలా గాభరా పడుతూ, కూర్చున్నాడు.

౫

క్రొత్తగా ఏర్పడిన ఈ బాంధవ్యాన్ని సమన్వయ పరచు కొంటూ, ఈ ఏజెంటూ, ఆయన కెదురుగా ఆ పంతులూ కూర్చు న్నారు. ముసలమ్మగారు మళ్ళీ అడిగింది 'నాయనా నీ కేమన్నా బిడ్డలా?' అని.

పంతులు మాట్లాడకుండా ఒక వేలు ఎత్తి చూపాడు. 'ఒక బిడ్డా నాయనా? చిన్న తనంలోనే బిడ్డ కలిగింది' అంటూ ఆ అబ్బాయి తల నిమిరింది. బిడ్డ మాట ఎత్తేసరికి పంతులు, ఇందాకటికంటే కూడా పెద్దగా, భోరున ఏడ్వటం మొదలు పెట్టాడు.

ముసలమ్మగారు అన్నది. 'ఊరుకోవయ్యా, ఆ బిడ్డను చూచుకొని అయినా బ్రతకాలా?' 'ఆ బిడ్డకూడా బ్రతకదు!' అని అంటూ పంతులు ఏజెంటుగారి మెడను వాటేసుకొని బుజం మీద తల వాల్చి ఏడవటమే ఏడ్వటం. ఎవ్వరు. ఏమి చెప్పినా వినక ఘోరంగా ఏడ్వటం సాగించాడు.

పంతులు తనను కౌగలించుకొని ఏడ్వటం తన కెంతో కష్టంగా ఉన్నా, అక్క డున్న వాళ్ళెవ్వరికీ ఏమీ కష్టంగా లేదు. బావమరదిని కౌగలించుకొని ఏడ్వటంలో విపరీతం ఎవ్వరికీ కనపడలేదు. కాని తనుకూడా ఏడ్వక పోవటమే అందరికీ బహుశః విచిత్రంగా ఉండి ఉండాలె! ఎందుచేతనూ అంటే ఆ జబ్బుగా ఉన్న మనిషి సాక్షాత్తు తన అక్కేనాయె!

తాను కఠిన హృదయు డని అప్పుడే అందరూ అనుకొంటున్నారు! కా దంటానికి తనకు ధైర్యం ఎప్పుడూ లేదు అన్నట్లు, ఆ ఏడుస్తూ ఉన్న కుర్రాడు తన అక్క మొగు డని ఒప్పు కొంటానికి ఈశ్వర రావు నిశ్చయించుకొనే ఉన్నాడు. కాని, తానుకూడా ఏడవ వలసిన పరిస్థితి వస్తుం దని అతడు ఎప్పుడూ ఊహించ లేదు.

ఈ ఇన్స్యూరెన్సు ఇంత అవస్థలోకి దింపుతుం దని తెలిసి నట్లయితే మొదట్లోనే తప్పు కొనే వాడు ఏజెంటు.

కాని ఇప్పు డేమి చేస్తాడు ? ఏడవక తప్పింది కాదు. అక్క కూడా పోయిందాయె ! ఏడవకుండా ఎల్లాగ ! పంతులును కౌగ లించుకొని తప్పనిసరిగా ఏడ్చాడు.

అయితే ఒక్క సంగతి. అది బొల్లి బొల్లి ఏడ్పు మట్టుకు కాదు. ఏజంటు గారికి ఎందుకైనా కానీ, నిజమైన దుఃఖమే వచ్చింది. హృదయ పూర్వకంగా ఏడ్చాడు!

ఉన్న వా ళ్ళంతా 'ఊరుకోండి నాయనా ఊరుకోండి! ఎందుకు ఏ డ్వటం! ఏమి లాభం! అయిపోయిం దాయె! అంటూ బావ మరదుల నిద్దరినీ కూడా ఓదార్చారు.

ముసలమ్మ గారు ఈ పర్యాయము ఈశ్వరరావును దగ్గరకు తీసుకొని తల నిమురుతూ, అన్నది 'పిచ్చిపిల్లవాడా ! నీవుకూడా ఏడిస్తే ఎల్లాగ? కాస్త ధైర్యం తెచ్చుకో ! మీ బావ దిగులు పడి పోయినాడు. ఆయనకు కాస్త ధైర్యం చెప్పాలిసింది పోయి ఏడిస్తే ఎల్లాగ చెప్పు ?

ఏజెంటు మహాశయుడు ముసలమ్మ మాటలు విని, ఏడ్వటం మానేశాడు.

పంతులూకూడా మానాడు, కాని పూర్తిగా మానలేదు. కాసేపు ఊరుకొంటాడు. ఏదో జ్ఞాపకం వస్తుంది. మళ్ళీ ఏడు స్తాడు. ఇదీ అతని వరస!

దుఃఖం వచ్చిన వాడు తాను ఒక్కడే, తన ఇష్టం వచ్చినట్లు ఏడవక ఏజెంటు మహాశయుని కౌగలించుకొని ఏడుస్తూ ఉండడం మూలాన, ఆయన ఏడ్చి నప్పుడల్లా తాను కూడా ఏడ్వ వలసిన అగత్యం కలగటమే ఈశ్వర రావుకు ఇప్పుడు వచ్చిన కొత్త సంకటం.

దిగి పారిపోతే ఎల్లా ఉంటుందీ అని ఈశ్వర రావు ఆలోచించక పోలేదు. ఎట్లా దిగి పోవటం! అవతల బావను వదలి.

అంతగా మూర్ఖించి దిగితే, అంతా నీ కేమైనా బుద్ధి ఉందా లేదా? అని చీవాట్లు వేస్తారు. అంతటితో ఊరుకోరు కూడాను. అవతల అబ్బాయి కుళ్ళి కుళ్ళి ఏడుస్తూంటే నీవు ఎట్లాగ వెడతావయ్యా అని లాగి కూలేస్తారు. ఇంకా పెంకి తనం చేస్తే తలొక మొట్టికాయ మొట్టినా దిక్కు లేదు. ఈశ్వర రావు ఈవిషయమై చాలా బాగా ఆలోచించే, దిగి పోవటానికి వీలు లే దని నిశ్చయించుకొని అక్కడే కూర్చున్నాడు. వీ రైనప్పుడల్లా ఒక ఏడుపు ఏడుస్తూ, స్టేషనులు వచ్చి పోతున్నాయి. పంతులు ఎక్కడా దిగి పోవా లని ప్రయత్నం చేయటమే లేదు.

బెజవాడ దగ్గరలోకి వస్తున్నది. ఏదో ఒక స్టేషనులో బండి ఆగింది. ఆగే ఆగటంతోటే ఎవరో ఒక ఆయన వెళ్ళి వీళ్ళ పెట్టె దగ్గరకు వచ్చి తొంగి చూచి, 'ఇక్కడున్నాడ్రా!' అని పెద్దకేక పెట్టాడు. మరు క్షణంలో ఒక ముసలాయన కూడా పరుగెత్తుకుంటూ వచ్చి ఈ పెట్టెలోనే ఎక్కాడు.

ఆ వచ్చిన వాళ్ళు ఇద్దరూ పంతులుకు చెరో ప్రక్కనా కూర్చున్నారు. ఒకాయన అన్నాడు: 'ఓరి నీ దుంప తెగ! నీ కోసం వెదక లేక చస్తున్నాం ప్రతి స్టేషనులోనూ దిగి.' ఇంకో ఆయన, 'ఇక్కడి కెప్పుడు వచ్చావురా సన్యాసీ!' అన్నాడు.

వాళ్ళను చూచి పంతులు మళ్ళీ ఏడ్పు సాగించాడు.

ముసలమ్మ గారు అడిగింది వాళ్ళల్లో ఒకాయనను, 'నాయనా, ఆ అబ్బాయి మీ కే మౌతాడు?' అని.

'మా అబ్బాయి' అన్నాడు ఒక ముసలాయన.

'ఆయన' అని రెండో వ్యక్తిని చూపి అడిగింది. 'వాడి మేనమామ!' అని జవాబు చెప్పాడు ఈ ముసలాయన.

ఈ జవాబులతో ముసలమ్మ తృప్తిపడి ఆ వచ్చిన వాళ్లతో మళ్లీ అన్నది: 'ఇందాకటి నుంచీ ఒక్కటే ఏడుపు. మే మెంత చెప్పినా వినటం లేదు. ఆ బిడ్డను ఒంటరిగా వదిలేశారేం బాబూ?'

ఆ ముసలాయన పిల్లవాణ్ణి కసురు కుంటూ అడిగాడు 'ఎందుకురా ఏడుపు?' పిల్లవాడు పాపం బిక్క ముఖం పెట్టాడు.

ఈ బిక్క మొఖం చూచి ముసలమ్మ జాలిపడి అన్నది 'కోప్పడ బోకండి బాబుగారూ! ఏడుపు అంటే ఏడుపుగాక ఏ ముంది! పాపం ఒక్క బిడ్డ ఆయెను. ఆ బిడ్డకి ఇల్లాంటి ఇబ్బంది వచ్చిందేఅని తల్చుకొని ఏడుస్తున్నాడు. చిన్న వయస్సు ఆయె-మనకు మల్లే డక్కా ముక్కాలు తిన్నాడా ఏమన్నానా?'

ఆ ముసలాయన ముసలమ్మవంక విపరీతంగా చూచి 'వాడికి కూతు రెక్కడి దమ్మా' అన్నాడు విసుగ్గా.

'లేదూ? అయితే పాపం, భార్య చావుకే కామాలు ఏడుస్తున్నాడు' అన్నది ముసలమ్మ మళ్లీ.

'ఛా ఛా ఏమి టమ్మా నీ మాటలు! భార్య పోవటం ఏమిటి?'

'ఆ అబ్బాయి తన భార్య పోయిందనేగా ఇందాకటి నుంచీ ఏడుస్తూ వుంటా?'

'ఛా ఛా ఏమిటమ్మా అసహ్యపు మాటలు! వాడి కింకా పెండ్లి కాందే?' అన్నాడు ఆ అబ్బాయి మేనమామ.

పెండ్లి కాకపోతే, ఈశ్వర రావు అక్క మొగ డెట్లా అయినాడు! ఈశ్వర రావు కూడా ఎందుకు ఏడ్చాడు? ఈ ప్రశ్నలకు

సమాధానము ఏజెంటుగారే చెప్పాల్సి ఉంది. అంతా అయన వంక వింతగా చూస్తున్నారు.

ఈశ్వర రావు చాలా చిక్కులో పడి పోయినాడు. ఇంత దరిద్రపు అవస్థలో అతడు ఎప్పుడూ పడ లేదు. ఇప్పుడు తాను ఎవ రని చెప్పాలె! ఎందుకు ఏడ్చి నట్లు!

జరిగిన విషయ మంతా పూస గుచ్చి నట్లు చెప్పితే, అంతా నవ్వుతారు. హేళన చేస్తారు. చాలా అవమానం జరుగుతుంది. వాళ్లు ఒక సారి నవ్వి ఊరుకోరు. తన పేరూ, తన ఇంటి పేరూ కూడా అడిగి తెలుసుకొని అందరికీ కూడా చెబుతారు. ఊరంతా తెలుస్తుంది. ఊరూర చెప్పు కొంటారు ఫలాని ఇన్సూరెన్సు ఏజంటు అని ఇల్లాగ జరిగిందీ అని.

ఇంత గొడవ జరుగుతుంది. కాబట్టి ఏం చెయ్యాలె? ఒక్క క్షణం ఆలోచనలో పడ్డాడు.

ఈశ్వర రావు ఇట్లా అనుకొంటూ ఉండగానే ముసలమ్మ మళ్ళీ అడిగింది: 'అయితే, పెళ్ళామూ లేదు, బిడ్డా లేదు గదా ఎందుకు బాబూ, మరి అల్లాగ ఒక్క తీరున ఏడ్చాడు?'

ముసలాయన చీదరింపుగా అన్నాడు: 'వీడు ఏడ్వటానికి ఏంతే! వీడికి ఏదో గుబులు.'

పిల్లవాడి మేనమామ అన్నాడు: 'వాడికి నెల రోజులనుంచీ వంట్లో ఏమీ బా గుండటం లేదమ్మా......ఏదో ఒక రకం పిచ్చి పట్టుకొంది. కూర్చుంటే ఎవ్వరితోనూ మాట్లాడకుండా గంటల కొద్దీ కూర్చుంటాడు. లేకపోతే ఎవరినైనా కోప్పడ్డా వాడికి కష్టం కలిగే మాట అన్నా ఏడుస్తాడు. వాణ్ణి విశాఖపట్నంకు తీసుకెడుతున్నాము, మందు ఇప్పించటానికి.'

పంతులు ఈ మాటలు విని అప్పటికి నోరు విప్పి మాట్లాడాడు. 'పిచ్చి ఏమిటి నాన్నా! నేను ఎందుకు ఏడ్చానంటే, నాకు పెళ్ళి అయినాగూడా, నా పెళ్లాం చచ్చిపోతుం దనీ, నాకు బిడ్డ పుట్టినా తరువాత అదీగూడా పోతుం దని ఈయన చెప్పాడు!'

అంతా గూడా ఈశ్వర రావు వంక విపరీతంగా చూశారు. ఎందుకు అల్లాటి అభాగ్యపు మాటలు చెప్పాడా అని ఆశ్చర్యపోతూ!

'నేను కూడా పోతానట నాన్నా! ఈ రైలు విరిగో, వంతెన మీద నుంచి రైలు బండి పడిపోయో, నా మీదుగా ఒక కారు పోయో, నా మీద ఒక ఎద్దు బండి విరిగి నేను పోవటం నిశ్చయమే నట నాన్నా!' అని మళ్ళీ ఏడ్చాడు ఆ పిల్లవాడు.

ఈశ్వర రావు ప్రాణాలు పైనే ఎగిరి పోతున్నాయ్. ఏమి జవాబు చెప్ప గలడు, ఎందుకు అల్లాంటి మాటలు అన్నా వంటే.

శివ, శివ! ఈశ్వర రావు మనస్సులో పడుతున్న బాధ ఇంతా అంతా కాదు.

ముసలమ్మ అన్నది ఈశ్వర రావును చూస్తూ 'నీ కేం పొయ్యే కాలంరా! పాపం, పసిబిడ్డను పట్టుకొని అప్రాచ్యపు కూత లన్నీ కూశావు!'

ఒకాయన అన్నాడు, 'అక్కయ్యా చచ్చి పోయిం దని ఏడ్చావు! అ దేమిటి?'

అందరూ తన వైపే చూస్తున్నారు. ఇక లాభం లే దని బండి ఇంకా బాగా ఆగకముందే, ఈశ్వర రావు బెజవాడ ప్లాట్‌ఫారము మీదికి దూకి, మహా జనంలో కనపడకుండా కలిసి పోయినాడు.

ముసలమ్మా, ఆ పెట్టెలో ఉన్న ఇతర పెద్ద మనుష్యులూ అంతా గూడా అతనికి గూడా 'పిచ్చి' — అని నిర్ణయించారు.

# పుత్ర సంతానం

శ్రీ అందే నారాయణ స్వామి

జననము 1907 లో గుంటూరు జిల్లా, మంగళగిరిలో. 1930 లో పద్య కవిత్వము తొలుత చెప్పినాడు. 1934 లో తొలికథ వ్రాసి ప్రకటించినాడు. "ఆంధ్ర సేవా నాటక సమాజము" మూడు సంవత్సరములు నిర్వహించినాడు. సంగీతములోను, చిత్రలేఖనము లోను అభినివేశము కలదు. కొన్ని నాటికలు; "రజనీ కుమారి", "తొలుపంట" అను రెండు నవలలు రచించినాడు. "వ్యత్యాసములు" "స్నేహితుడు", "ఉపాసనా బలము" అను కథా సందోహములు ముద్రితములు.
రమారమి 100 కథలు రచించినాడు.

---

౧

సీతమ్మ నాలుగోసారి గర్భం దాల్చింది. ఇదివరకు పుట్టిన ముగ్గురుబిడ్డలూ ఆడపిల్లలు అవటంచేత ఈ దఫాగూడా ఆడపిల్లే పుడుతుం దేమో నని అప్పు డప్పుడూ చాలా చింతిస్తూ వుంటుంది. అంతా ఆడపిల్ల లవడంచేత మగపిల్ల లంటే పంచ ప్రాణాలు వదులుతుంది. మగపిల్లవాడిని ఎత్తుకున్న స్త్రీని చూస్తే ఆబిడ్డను చంకన వేసుకుని ముద్దులతో నలిపివేస్తూ, ఆ పిల్లవాడి తల్లి అడిగిందాకా తిరిగి బిడ్డను ఇచ్చేది కాదు. "ఏ మమ్మా ! నీకు

మగపిల్లలు లేరా ఏమిటి అని ఆమె అంటే ఇంత ముఖం చేసు కుని సీతమ్మ "నాబోటి మొఖాలకే నమ్మా మగబిడ్డలు పుట్టేది" అనేది. టోపీ, లాగూ, మేజోళ్ళూ, బూట్లూ, తొడుక్కొని వాళ్ళ వాకిటి ముందుగా వీధినే పోతూవున్న చిన్న మగపిల్లలను చూస్తే ఆమె బయటికి వచ్చి, వాళ్లు ఎంతో దూరం పోయిందాకా తనివి దీరా చూచి, "అ పాడుదేముడు కొండ మిరపకాయంత మగ నలుసును నా కివ్వరాదూ! దొరటోపీ మొద లైన వాటితో అట్లాగే అలంకరించుకుని చంకన వేసుకుని, నా జన్మ సార్థకం చేసుకుం దునే!" అను కునేది. అంతటి భాగ్యం ఎప్పుడు కలుగుతుందా అని తపించి పొయ్యేది. ఈ సారి అయినా మగ బిడ్డను దయ చేయ మని ఎందరో దేముళ్ళకు మొక్కుకున్నది. పిల్లవాడిని కొండకు నడిపించి తల నీలాలు తీయించి పిడికెడు రూకలూ పిల్లవాడి దగ్గర వున్న సొమ్ము యాపత్తూ నిలువుదోపు ఇస్తా నని ఏడుకొండలవాడికి ముడుపు కట్టింది.

కాషాయ గుడ్డలు కట్టుకున్నవా డెవడైనా సరే వాకిటి ముందుకు బిచ్చానికి వచ్చా డంటే అతన్ని సగౌరవంగా లోనికి పిలిచి "చెయ్యి చూడ్డం తమకు తెలుసునా?" అని ప్రశ్నిస్తుంది. వాడు అమె వల్ల ఏదో లాభం పొంద వచ్చని చేటంత మొఖం చేసుకుని "తెలియ కేమి తల్లీ" అంటాడు. "నాకు మగసంతానం ఏమైనా వున్నదేమో చూచి చెప్పండి" అని ఆమె చెయ్యి యిస్తుంది. వాడు మగ సంతానం వున్న దని చెపితే చాలు, కడుపునిండా భోజనం పెట్టి పత్రి, దక్షిణ, సమర్పించి ఆ రోజల్లా ఎంతో సంతో షంగా వుంటుంది. "నీకు మగ సంతానం లే దమ్మా" అని ఎవ డైనా ఖర్మం చాలక నోరు జారాడా అంటే వాడి మొఖాన కాసిని

గింజలయినా వెయ్యకుండా ఆ రోజల్లా చింతతో అన్నం తినేది కాదు.

ఆమె భర్త నరసింహం ఇష్టాగోష్టిలో "ఈసారి అయినా కొంచెం ముందుగా జాగ్రత్తపడు. చెప్పలేదనుకునేవు సీతా" అన్నాడు.

"చాల్లెండి! మీ వేళాకోళాలు. మన యిష్ట ప్రకారమే జరిగేటట్టయితే మనల్ని పట్టేటందుకు పగ్గాలుంటాయాండీ!" అన్నది సీత.

"ఏమో ముందుగానే చెప్పాను. తరవాత నీ యిష్టం" అన్నాడు భర్త.

నవమాసాలూ నిండినవి. ఒక రోజున సీతమ్మ ప్రసవించింది. మళ్ళీ ఎప్పటి మామూలుగానే ఆడ శిశువు కలిగింది. ఆమె చింతకు మేర లేదు. మేరుపర్వతం మీదినుంచి ఒక్కమారుగా కిందికి దొర్లినట్టయింది. ఈసారి అయినా మగపిల్లవాడు కలుగుతాడని ఆసించుకుని వుంటే ఆమె ఆశ వృధా అయింది. "ఎంతోమంది దేముళ్ళకు మొక్కుకున్నాను. దేముళ్ళూ లేరు, దయ్యాలూ లేవు. అంతా వట్టి తిండిపోతు రాయుళ్లు" అని విసుక్కున్నది. "మగపిల్లలు పూర్వ జన్మంలో ఎంతో పుణ్యం చేసుకుంటేనే గాని పుట్టరు. అందరాని పండ్లకు ఆసించడమే గాని నా బోటి పాపాత్ము రాలికి ఎందుకు పుడతారు. మా ఆడబిడ్డకు చూడు! నలుగురూ వరసనా మగపిల్లలే. ఆమెదే భాగ్యం. మగపిల్లలను కన్నాననే గర్వం ఆమె ప్రతి మాటలోనూ ఆ నడకలోనూ ఆ చేతులు తిప్పడంలోనూ ఎప్పుడూ కనబరుస్తూ వుంటుంది. ఎలా చేసినా ఆమెకు చెల్లుతుంది. చెల్ల కేమి?

రత్నాలవంటి మగబిడ్డలు! వాళ్ళను చూస్తేనే ఎటువంటి తల్లికైనా గర్వం పుట్టుకు చక్కావస్తుంది. ఎందుకు పుట్టదు? వాళ్ళు పెద్ద వాళ్ళయ్యాక కట్నాలద్వారా బోలెడు సొమ్ము వస్తుంది. కోడళ్లు వచ్చి కాస్తన్నా పని చెయ్యనివ్వకుండా సుఖపెడతారు. వాళ్ళు మళ్ళీ చక్కని బిడ్డలను కంటారు. ఒకచోట కూర్చుని వాళ్ళందరినీ ఏ పనీ చెయ్యకుండా సంతోషంతో ఎత్తుకుని ఆడించవచ్చు. మగపిల్లలను కన్న వాళ్ళదే జన్మ కాని నా బోటి దరిద్రురాలి దేమి జన్మ? ఇటువంటిది ఈ భూమ్మీద పుట్టడమే తప్పు!" అని తనలో అనుకుంటూ మగపిల్లలను గన్న తల్లులను స్త్రీ జాతిలో అదొక ఉత్తమమైన జాతిగా నిశ్చయించి వాళ్ళకు తన హృదయంలో గౌరవమైన స్థానాన్ని ఇచ్చింది.

ఆమె ఆడపిల్లను కన్నందుకు భర్త అయిదారు రోజులు ఆమెతో సరీగా మాట్లాడ లేదు.

"వరస పెట్టావు! నీ యిష్టం వచ్చినట్లు కానివ్వు! నువ్వు ఏ పాలఘాటులోనో పుట్టితే నీ బొజ్జ వరహాల బొజ్జని నీ మగడు ఎంత సంతోషించేవాడో" అన్నాడు నరసింహం.

"కానివ్వండి! ఇప్పుడు వీళ్ళని మాత్రం చెట్టున కోసుకు వచ్చామా? పెద్ద వాళ్ళను చేసి ఒక అయ్య చేతుల్లో పెడితే వాళ్ళదోవన వాళ్ళే పోతారు" అని తన దైన్యాన్ని పైకి కనబడకుండా అన్నది సీతమ్మ.

ఇక తనకు మగ సంతానం కలగ దని సీతమ్మ నిరాశ చెంది పోయింది. భర్త ఎప్పుడైనా కోప పడ్డప్పుడు "నాకే మగ పిల్లలు వుంటే మీ రిట్లా అంటారా" అని గుడ్ల నీళ్లు గుడ్ల కుక్కుకునేది. ఎవరైనా తన బంధువులలో తన్ను కాస్త బిగ్గరగా

మాట్లాడితే తనకు మగపిల్లలు లేని కొరత వల్ల అట్లా అంటున్నా రని ఎంచి "మగపిల్లలను గన్న వాళ్ళ గౌరవం రమ్మంటే నా కెలా వస్తుంది" అని చెప్పరాని బాధ పడేది. నలుగురు ఆడవాళ్లు కూర్చున్న చోటికి పోవడానికి తా నేదో అపరాధం చేసినట్టు సిగ్గు పడేది.

ఒకనాడు బిచ్చపుది చేరెడు గుడ్డ మాత్రం మొలకు చుట్టు కుని, చంక నొక బిడ్డను ఎత్తుకుని వాళ్ల వాకిట్లోకి వచ్చి, "అమ్మా! బాలెంతను, ముష్టి వెయ్యండి" అని అడిగింది. సీతమ్మ చూచి "ఏమి పిల్ల" అన్నది. "మగపిల్లో డుండి, అమ్మగోరు" అన్నది ఆ బిచ్చపుది. ఆశ్చర్యంతో ముక్కు మీద వేలు వేసుకుని "ఓసీ! నీ అదృష్ట మేమే, మగపిల్లవాడా!" అని "ఆ పాడు దేముడు కూడు లేక అడుక్కు తినే దానికి వెయ్యకపోతే అస్తమానం పలవరించే దానికి నాకు వేస్తే వాడి సొమ్మంతా ఏం మునుచుకు పోతుందో" అనుకుని, సీతమ్మ దాన్ని లోనికి రమ్మని పిలిచి, పిల్లవాన్ని మాడుకు కాస్త ఆముదం వేసి పాత చొక్కా పిల్లవాడికి తొడిగించి కొత్తకారు వదలని చీర దానికి కట్టబెట్టి, ఇంత అన్నం, ఇంత కూరా వేసి కడుపునిండా భోజనం పెట్టి పెండ్లి కూతురి లాగా సాగ నంపింది. అది పట్టరాని సంతోషంతో "అమ్మగోరూ! మీరు చానా దయ గలోరుండీ" అని కృతజ్ఞతా వాక్యాలతో వెళ్ళి పోయింది.

నరసింహం తెలుగు మాత్రం బాగా చదువు కున్నాడు. వారిది అల్యూమినియం వ్యాపారం. బజారులో పెద్ద కొట్టు వున్నది. చిల్లరగా టోకుగా గూడా అమ్ముతూ వుంటారు. అన్నదమ్ములలో పంచుకున్న యాభైవేల రూపాయల స్తిరాస్తి పదిహేను వేల

రూపాయిల నగదున్నూ, గాక ఈయన హయాములో పాతిక వేల కిమ్మతు చేసే స్థిరాస్తీ, ఇంకా కొంతడబ్బునూ సంపాదించి చేర్చాడు. వడ్డీ వ్యాపారం కూడా కొద్దిగా వున్నది. వారి పెద్దమ్మాయి శాంత తొమ్మిది సంవత్సరాలది. రెండో పిల్ల పద్మిని, మూడో పిల్ల రత్నం, ఇప్పుడు పుట్టిన పిల్ల హేమలత. రెండో పిల్ల వయస్సు ఏడు సంవత్సరాలు, మూడోపిల్ల వయస్సు నాలుగు సంవత్సరాలు. పెద్ద పిల్లలిద్దరూ బళ్లోకి పోయి చదువు కుంటూ వున్నారు. వాళ్లు ప్రతి సంవత్సరం క్లాసు తప్పకుండా పరీక్ష అవడం చూచి తండ్రి ఆడముండలకు ఇంత తెలివి తేటలు ఎక్కడనుంచి వచ్చినవి అంటూ వుంటాడు. రెండో పిల్ల చక్కగా సినిమా పాటలూ అవీ పాడుతుంది. మంచిగాత్రం.

భార్యకు మగపిల్ల లంటే ఎంత ప్రేమో భర్తకుకూడా అంత ప్రేమ వున్నది, గాని మగవా డవడంచేత ఆడవాళ్ల లాగా ఈ విషయంలో పైకి పొంగడు. చిన్నపిల్ల హేమలతకు సంవత్సరం దాటింది, తప్ప టడుగులు వేస్తున్నది. ఒకనాడు నరసింహం కొట్టువద్దకు వెళ్ళడానికి ప్రయాణం అవుతూ వున్నాడు. చంటిపిల్ల "నాన్న, నాన్న" అంటూ కాళ్ళకు చుట్టవేసుకున్నది. ఆయన పని తొందర వల్లనో ఎత్తుకోడానికి ఇష్టం లేకనో ఏమో గానీ, ఎత్తుకోలేదు. పిల్ల ఏడ్వడం మొదలు పెట్టింది.

తల్లి చూచి "కాస్త ఎత్తుకుందురూ! కాళ్ళకు చుట్టుకుని అ దలా అరచకాడుతూ వుంటే" అన్నది.

"ఇప్ప డెక్కడ? కొట్టువద్దకు పోవద్దూ" అన్నాడు నరసింహం.

"అబ్బ! ఇంతలోకే ఏమి వందలు సంపాదిస్తారు! పాపం బిడ్డ అలా గిలగిలా తన్నుకుంటూ వుంటే చూస్తూ వూరుకుంటారు! పిల్లల తరవాతనే సంపాదన. మనం సంపాదించే దంతా ఎవరికోసం? పిల్లలకోసమే గదూ! ఈ యిళ్లు వాకిళ్ళూ, ఈ భాగ్య భోగ్యాలూ, ఈ ధన ధాన్యాలూ, అన్నీ వాళ్ళకోసమే గదూ! పారిగింటి ప్రకాశం చూడండి! భార్యను కూర్చోబెట్టి వ్యాపారా న్నన్నా మానుకుని పిల్లలను ఎలా ఆడిస్తాడో" అన్నది సీతమ్మ భర్త కళ్ళల్లోకి చూస్తూ.

"నువ్వుగూడా ఆయన భార్యలాగే మగ పిల్లలను కనక పొయ్యావూ! నేను గూడా అలాగే ఆడించే వాడిని" అన్నాడు కాళ్ళకు చుట్టుకున్న పిల్లను నెట్టి ఒక అడుగు ముందుకు వేసి నరసింహం.

"అయ్యో అంతమాత్రం తెలివా ఈ మొఖానికి" అన్నది సీతమ్మ.

"పోనీ, ఆమె నడిగి తెలుసుకోలేక పొయ్యావూ? ఇప్పటికైనా మించి పోయిం దే మున్నది" అంటూ నడిచి పొయ్యాడు నరసింహం.

"ఇటువంటి మాటలకు మాత్రం వున్నారు" అంటూ పిల్లను చంకన వేసుకుని సముదాయించింది సీతమ్మ.

నరసింహం కూతుళ్లను అసలు ఎత్తుకోడు. ఎప్పుడైనా వాళ్లు దగ్గిరికి వస్తే కసురుకుంటాడు. భార్యాబలవంతం మీద ఏ సంవత్సరానికో ఒక తడవ ఎత్తుకున్నాడా అంటే తమ కేదో ఇంద్రపదవి లభించినట్టు వాళ్ళు సంతోషంతో పొంగి పోతారు.

దగ్గిరికి పోతే ఎత్తుకోకుండా వున్నాడా అంటే వాళ్ళు ఆసించిన ఏదో గొప్ప పదవిని కోల్పోయి నట్టు ఆ లేత హృదయాలు తపించి పోతవి. ఎంత ఏడ్చినా, ఎంత కిందపడి తన్నుకున్నా, ఆయన దగ్గిరికి తియ్యడు. ఆఖరుకు తల్లి వచ్చి సముదాయించ వలసిందే.

ఒకనాడు నరసింహం అప్పుడే కొట్టువద్ద నుంచి ఇంటికి వచ్చాడు. "ఏమండీ! పద్మిని రెండు రోజులనుంచీ మూసిన కన్ను తెరవకుండా పడి వున్నది. వంటి మీద గింజవేస్తే వేగి పోతూ వున్నది! కూడూ నీళ్ళూ లేవు. ఎవరి నన్నా పిలిపించి చెయ్యి చూపించి రెండు మాత్రలు ఇప్పించండి" అన్నది సీతమ్మ.

"దాని కెందుకే మాత్రలు? దండగచేటు! అట్లా చూస్తూ వుండు. మూడోనాటి కల్లా లేచి కూర్చుంటుంది. ఆడముండకూ, నాగజెముడుకూ చా వెక్కడిది? నువ్వు అన్నం పెట్టకుండా వుండు, నీళ్ళు పొయ్యగాకు, ఎక్కడన్నా పారవెయ్యి, పరవా లేదు. జీవం పోసుకుంటుంది. ఏట్లో పారవెయ్యి, ఎదురు తిరిగి వస్తుంది!" అన్నాడు నరసింహం.

"మంచివాళ్ళండీ మీరు! పాపం అదట్లా బాధ పడుతూ వుంటే జాలైనా లేకుండా మాట్లాడ తారు" అన్నది సీతమ్మ. తర్వాత రెండు రోజులకు పిల్లకు జ్వరం దానంతట అదే తగ్గింది.

౨

పిల్లకు రెండోఏడు దాటేవరకల్లా సీతమ్మ మళ్ళా గర్భం దాల్చింది. ఈ దఫా ఏ దేముడికీగానీ మొక్కుకోలేదు. ఆమె పుత్రవాంఛ చివికి జీర్ణమై విసుగు గలిగించటం చేత ఈ సారి

ఏ ఆశా పెట్టుకోలేదు. నవమాసాలూ నిండిన వెనుక సీతమ్మ ఒకరోజున మగశిశువును కన్నది. శుభవార్త మంత్రసానివల్ల వినగానే సీతమ్మ ముఖం పున్నమనాటి చంద్రుని వలె వికసించింది. తన అదృష్టరేఖ కళ్ళముందు మెరుపువలె తళుక్కున మెరసిన ట్టయింది. ఏదో ఎప్పుడూ లేని నూతన శక్తి ఆమెలో ఏర్పడినట్టు కనుపించింది. తనజన్మ సార్థకమయిం దని సంతోషించింది. తన నోములపంట ఫలించిం దని అనుకున్నది. తన బహుకాల వాంఛితము నెరవేరి నందుకు భగవంతునికి అనేక నమస్కారాలు చేసింది.

ఈ శుభవార్త కొట్టువద్ద వున్న నరసింహం విన్నాడు. పేదకు పెన్నిధి లభించి నట్టు ఉబ్బి గంతులు వేశాడు. లెఖ్ఖ పెడుతూ వున్న రూపాయలు అక్కడ పార వేసి అమితోత్సాహంతో రెండు మళ్ళ పంచదార కూలివానిచేత ఇంటికి పట్టించుకుని వెళ్ళి అందరికీ పుత్రోత్సాహం పంచి పెట్టాడు. అయన్ను చూచి ముత్తయిదులు "అంతా నీ అచ్చే నాయనా నీ కొడుకు" అన్నారు. "ఏదోలేం డమ్మా! ఈ నాటికి కాస్తంత నలుసును వేశాడు భగవంతుడు మీ చలవవల్ల! బిచ్చపువాడై బతకనివ్వండి" అని చిరునవ్వుతో అన్నాడు నరసింహం. "మ రేమీ పరవా లేదు. నూరేళ్ళూ సుఖంగా వర్ధిల్లు తాడు నీ కొడుకు" అని ఒక శతవృద్ధురాలు పట్టుకున్న కర్రను వణికిస్తూ అన్నది. "మీపెద్దవాళ్ల దయ ఉండాలి అవ్వా!" అని ఆమెకు దోసెడు పంచదార మళ్ళా పెట్టాడు నరసింహం.

మంత్రసాని శిశువుకు నీళ్ళు పోస్తూ వుండగా నరసింహం చూచి మురిసిపొయ్యాడు. ఆ తెల్లవారి నరసింహం భార్య వున్న

గదిలోనికి వెళ్ళి, "వళ్లు తేలికగా వున్నదా" అని ప్రశ్నించి మంచి చెడ్డలు తెలుసుకుని, "మగపిల్లవాడిని కన్నా ననే గర్వం చేత నాతో ఇక సరీగా మాట్లాడవు కామాలు" అని నవ్వుతూ అన్నాడు. "మీ ఎగతాళి చా ల్లెండి! అబ్బాయిని చూడండి" అని చేతుల మీదకు శిశువును తీసుకొని వెలుతురులో భర్తకు చూపించింది సీత. "చూడు, నువ్వు అంతగా శ్రమ పడ్డందుకు నీ శ్రమ వృథాగా పోనివ్వనులే. ఇరవై సవర్లకు తక్కువ లేకుండా చంద్రహారం చేయించి యిస్తాను-సరేనా" అని భార్య ముఖం వంక నవ్వుతూ వున్న కళ్ళతో చూస్తూ అన్నాడు నరసింహం. సీతమ్మ శుష్కించిన ముఖంలో నుంచి వెన్నెలను తిరస్కరించే లేత నవ్వు నవ్వింది.

లేక లేక మగశిశువు కలిగినందుకు వాళ్ల కొక బంగారు కొండ వరిగి నట్లుండడంచేత నరసింహం కొట్టు వద్దకు సరీగా పోకుండా పిల్లవాని మంచం దగ్గిరే కాలం గడుపుతూ వున్నాడు. ఆడపిల్ల లంటే ఇదివరకే వెగటు వేసింది. ఈ కుర్రవాడు పుట్టడం తోనే వాళ్ళ ఆలనా పాలనా లేకుండా, రాత్రిం బగళ్ళూ తల్లి దండ్రు లిద్దరూ కుర్రవానితోనే కాలం గడుపుతూ వున్నారు. కుర్రవాడికి మూడో నెల వచ్చింది. వంటినిండా బంగారపు తొడుపు దిగవేసి నట్టు మెడలో గొలుసు, చేతులకు రెండు పరసలు, మొళ్ళో మామిడి పిందెల మొలతాడు — వీటితో కుర్రవాడిని అప్పిడే అలంకరించారు. కుర్రవాడు "ఊ ఆ" అంటూ వుంటే తల్లి దండ్రు లిద్దరూ వాడు సర్వశాస్త్రాలూ వల్లె వేస్తున్నట్టు ఉబ్బి పొయ్యేవాళ్ళు. ఇది అయిదో కాన్పు అవడంచేత కుర్రవాడు దృఢంగా లేక, ఎప్పుడూ పాలు కక్కుతూ వుండడం, కాసిని

పాలు ఎక్కువ తాగితే జీర్ణించుకోలేక కడుపు వుబ్బడం, ఇట్లా జరుగుతూ వుండడంచేత వైద్యుణ్ణి పెట్టి మందిప్పించటం వల్ల కటిక్కారంతో పస్తులు చేస్తూ తల్లి చిక్కి శల్యమయి పోయింది. "ఏమేవ్, అపథ్యం చేసేవు సుమా! జాగ్రత్తగా నడుచుకో! అందులో మగపిల్లవాడు" అన్నాడు నరసింహం. "నాకు తెలియదాండి, నా బంగారు తండ్రి కోసం ఎటువంటి కష్టమైనా పడతాను" అన్నది సీతమ్మ. మూడో మాసంలోనే నామ కరణం చెయ్యాలని ఏ పేరు పెట్టేది తర్కించారు.

"మా తండ్రిపేరు పెడదాము" అన్నాడు నరసింహం.

"అబ్బే! ఆ పాతపేరు ఏం బాగుంటుం దండీ! ఏదయినా కొత్తపేరు చూచి పెడదాము" అన్నది సీత.

"ఏ పేరు పెడదాం చెప్పు?"

"మీరే ఆలోచించండి. ఆడదానికి నాకేమి మంచిపేర్లు తెలుస్తవి"

"మోహను డని పెడదామా?"

"అది ఏమంత మంచిపేరు?"

"ప్రభాకర రావు అని పెడదామా?"

"మా అక్క కొడుకు పేరు అదే. పాతపేర్లు వద్దని ముందే చెప్పాను కాదూ?"

"హృషీకేశు డని పెడదామా మరి?"

"ఆ పేరు ఎవరికి నోరు తిరుగుతుంది?"

"సరే నీకు నచ్చినపేరు చెప్పడం నావల్ల కాదు."

"ఇంకా నాలుగు పేర్లు చెప్పండి. అందులో నాకు నచ్చింది చెపుతాను."

"సరే నీకు నచ్చిన పేరుకు ముందు నేను చెప్పడం ఎందుకు? నీ ఇష్టమే గాని నా యిష్టం లే దన్నమాట! కష్టపడి కన్నందుకు అంతబాధ్యత చూపక పోతే ఎలాగు మరి" అన్నాడు, ఛలోక్తిగా భర్త.

సీతమ్మ నవ్వి "అది కాదండీ, పేర్లు పెట్టడం మీ మగ వాళ్ళకు సరీగా తెలియదండీ, అందువల్ల చెప్పమంటున్నాను."

"కరుణపాణి, సుగుణసాగరుడు," అని భర్త చెపుతూ వుండగా భార్య అడ్డు వచ్చి "ఆ పేరు బాగున్న దండీ. అబ్బాయికి సుగుణసాగరు డని పెడదాము" అన్నది సీత వికసించిన ముఖంతో.

"నేను చెప్పిన పేర్లలో నాకు ఏదైనా ఇష్టమేగా! రాణీ గారి ఇష్టమేగా ఇప్పుడు కావలసింది? సరే, ఆ పేరే పెడదాం" అన్నాడు భర్త.

ఒకనాడు నరసింహం భోజనం చేస్తూ వున్నాడు. భార్య వడ్డన పనిలో వున్నది. కుర్రవాడు ఏడుస్తూ వున్నాడు. అప్పుడు మూడోపిల్ల రత్నం ఏడ్చేకుర్రవాడిని చంకన వేసుకుని నత్తిమాటలతో "అమ్మోయ్ అబ్బాయి ఏలుత్తున్నాలు" అంటూ తండ్రికి వడ్డన చేస్తున్న తల్లి వద్దకు తీసుకు వచ్చింది. తల్లి చూచి తత్తరపాటుతో "అయ్యో! అయ్యో! కింద పడవేస్తే ఇంకే మున్నది! పసి గుడ్డు గదా. వాడి ప్రాణానికి ఏమాత్రం చిన్నదెబ్బ అయినా చాలదూ! వాడిని ఎత్తుకునే మాత్రపు ముండవటే నువ్వు!" అని పళ్ళు కొరుక్కుంటూ చేతిలో వున్న గరిటతో నెత్తి అదిరి పొయ్యేటట్టు దెబ్బకొట్టి చంకలో బిడ్డను తీసుకున్నది.

ముద్ద కలిపి నోట్లో వేసుకోబోతూ వున్న నరసింహం అది

చూచి, చేతులో ముద్ద అట్లాగే విస్తరిలో వదిలివేసి కొంప మునిగి పోయినట్టు చప్పున లేచి "ఓసీ ముండా! వాడి ప్రాణానికి ను వ్వెక్కడ తయా రయినావే! కుక్క తిన్నట్టు ఇంత తిని ఒక చోట పడి వుండక మొద్దు ముండా! వాడిజోలికి పోవు గదా! పోవు గదా!" అని ఆ ఎంగిలి చేత్తో అయిదువేళ్లూ పొంగేటట్టు పిల్ల వీపుమీద ఒక్క చరుపు చరిచాడు. అప్పు డా పిల్ల తల్లీ తండ్రీ కొట్టిన దెబ్బలు భరించలేక కెవ్వున కేక వేసి కింద బడి తన్నుకుంటూ ఏడవడం మొదలు పెట్టింది. అప్పుడు పెద్ద పిల్ల శాంత వచ్చి ఏడుస్తున్న రత్నాన్ని ఎత్తుకు వెళ్ళి ఓదార్చే వరకు గంట పైగా పట్టింది. నరసింహం తృప్తిగా భోజనం చేసి బేవు మని తేపుకుంటూ భార్యవద్ద ఉన్న కుర్రవాడిని తీసుకుని "చూడు ఎలా నలిపి వేసిందో వెధవముండ! నాయన వొల్లంతా కందింది" అన్నాడు. "కందడం గాదండీ! ఇందాక బాగా తోమి నీళ్ళు పోశాను. అలాగే వుంటుంది" అన్నది సీతమ్మ.

## 3

కుర్రవాడికి సంవత్సరం నిండింది. ఎన్నో రకాల దుస్తులూ టోపీలూ తెప్పించి, గంట కొకటి మారుస్తూ వాణ్ణి కింద దించకుండా ఆనందిస్తూ వున్నారు తల్లి దండ్రులు. జాస్తిగా ఎత్తుకోవడంచేత తల్లి కంటే తండ్రికే ఎక్కువ మాలెం అయ్యాడు. తండ్రిని చూడకుండా కొడుకూ, కొడుకును చూడకుండా తండ్రీ క్షణం వుండ లేని స్థితి ఏర్పడ్డది. నరసింహం ఎక్కడికి వెళ్ళితే అక్కడికి కుర్రవాణ్ణి చంకన వేసుకుని వెళ్ళవలసిందే. కొట్టు

వద్దకు వెళ్ళితే కొట్టు వద్దకూ, బజారుకు వెళ్ళితే బజారుకూ, ఎవరైనా నలుగురు మాట్లాడుతూ వున్న చోటికి వెళ్ళితే అక్కడికీ, ఒక చోట కని ఏమిటి - నరసింహం ఇంట్లో నుంచి అడుగు బయట పెట్టాడా కుర్రవాడు తయారు. చాయవలే ఎప్పుడూ కుర్రవాడు వెన్నంటి వుండవలసిందే. బిచ్చగాడు కోతిని బుజం మీద ఎక్కించుకుని మోసుకుంటూ ఇల్లిల్లూ తిరిగినట్టు కుర్రవాడితో ఈయన ప్రతిచోటికి వెళ్ళుతూ వుంటాడు. ఈ కుర్రవాడు పుట్టాక నరసింహాన్ని ఒంటరిగా వుండగా ఎవ్వరూ చూచి వుండరు. ఆఖరుకు నిద్రపొయ్యేటప్పుడు గూడా కుర్రవాడిని తండ్రి రొమ్ముపైన పండుకో పెట్టుకొని నిద్రపుచ్చ వలసిందే.

వాడు ఏది కోరితే అది నిమిషాలమీద ఎంత ఖరీదైనా సరే తెచ్చి యివ్వవలసిందే. కాస్త ఆలస్య మయిం దంటే చేతులో నుంచి జారి కిందపడి గిజ గిజా తన్నుకుంటూ కొండల పెట్టున ఏడుస్తాడు. వాడి ఏడుపు చూడలేక గడగడ లాడుతూ అడుగులకు మడుగు లొత్తుతూ వాడి నోటిమీదుగా మాట వచ్చిం దంటే నరసింహం తన పను లన్నీ వదులుకుని తక్షణం వాడి కోరిక చెల్లిస్తూ వుంటాడు.

ఒకనాడు చిన్నపిల్ల హేమ కానీకి ఏదో బెల్లపువుండ కొనుక్కుని తింటూ వున్నది. అది తండ్రి చంకలో వున్న సుగుణసాగరుడు చూచి వేలు చూపించి వచ్చీరాని మాటలతో తనకు కావా లన్నాడు. "ఒసే హేమా! నువ్వు తినేది అబ్బాయికి కాస్త యివ్వమ్మా" అన్నాడు తండ్రి. ఆ పిల్ల నేను ఇవ్వనని తింటూనే తల తిప్పింది. ఇవ్వనందుకు కుర్రవాడు అప్పుడే చంకలోనుంచి జారి కింద పడి ఏడవడం ప్రారంభించాడు. "అబ్బాయి ఏడుస్తు

న్నాడు. ఇవ్వవే నీ కొకటి అసిక్కొ కొనిపెడతాను'' అని తండ్రి కసురు కున్నాడు. హేమ ఇవ్వ నని అవతలకు పోయింది. కుర్ర వాడు తేలు కుట్టినట్టు ఏడుస్తూ గిజగిజా కాళ్ళూ, చేతులూ, నేలకు కొట్టుకుంటూ వున్నాడు. తండ్రి హేమ దగ్గిరికి పొయ్యాడు. ఆ పిల్ల తండ్రిని చూచి చేతులో వుంటే తీసుక వెళ్తుతా డని కామాలు వుండ వెంటనే నోట్లో వేసుకున్నది. తండ్రి పిల్లను పట్టుకుని నోట్లొ వేసుకున్నందుకు కోపంతో వీపుమీద కొట్టి ఏడ్చిన కొద్దీ పిల్ల నోరు విడదీసి నోట్లో మిగిలిన వుండను తీసి కుర్రవాడి కిచ్చాడు. అంతటితో వాడు ఏడుపు క్రమేణా చాలించాడు.

ఒకనాడు తండ్రి కారప్పూస పొట్లం తెచ్చి హేమకు కాస్త కాగితంలో పోసి యిచ్చి తతిమ్మా పొట్లం కుర్రవాడికి ఇచ్చాడు. కుర్రవాడు అది చూచి మొత్తం నాకే కావా లంటూ చేతిలో పొట్లం కిందకు గిరవాటు వేసి నేలమీద పడి తన్నుకోపటం ప్రారంభించాడు. అది చూచి హేమతండ్రి అడక్కముందే ''నాకు వద్దులే. నాన్నా, అబ్బాయికి ఇవ్వు'' అని తనకు ఇచ్చిన గింజ లన్నీ తండ్రికి ఇచ్చింది. తండ్రి నేలమీద గింజలు ఏరి అవీ ఇవీ కలిపి కుర్రవాడి కిచ్చాడు. కుర్రవాడు ఏడుపు మాని వేశాడు. ''చూడండీ, వాడంటే దానికి యెంత ప్రేమో. అది తినే గింజలు కూడా వాడికి ఇచ్చివేసింది'' అని ఇంట్లో ఏదో పని చేసుకుంటూ వున్న సీతమ్మ అన్నది. ''రేపు వాళ్ళను సంరక్షించేది వీడే నని వాళ్ళకు మాత్రం తెలియదా ఏమిటి?'' అన్నాడు నరసింహం.

రెండోఏడు వచ్చింది. కుర్రవాడు బాగా నడుస్తూ వున్నాడు. ఒకరోజున వాళ్ళ వాకిటిముందుగా మేళాలతో ఊరేగుతూ కొందరు కొన్ని మిఠాయి పళ్ళాలు పట్టుకుని వెళ్ళుతూ వుండగా వీధి

అరుగుపైన తండ్రివళ్ళో కూర్చున్న సుగుణసాగరుడు చూచి అందులో ఒక పళ్ళెంవంక చెయ్యి చూపించి ఆ మిఠాయి తనకు కావా లన్నాడు. "నాయనా, మనం బజారికి పోయి కొనుక్కుందాం" అన్నాడు నరసింహం. ఆ మాట ఏమీ వినిపించుకోకుండా కింద బడి దొర్లిగింతలు పెడుతూ ఏడవడం ప్రారంభించాడు కుర్రవాడు. "ఏడవ వద్దు" అని జేబులో వున్న అర్ధరూపాయి తీసి కుర్రవాడి చేతులో పెట్టి "ఇప్పుడే కొనిపెడతాను, ఏడవబోకు, మాతండ్రివిగదూ! మాఅమ్మవుగదూ! ఊరుకో నాయనా!" అని బతిమలాడాడు నరసింహం. వాడు లెక్కచెయ్యక చేతులో పెట్టిన అర్ధరూపాయి విసిరి పారవేసి కింద పొర్లాడుతూ పూర్వంకంటె అధికంగా ఏడుస్తున్నాడు. ఆ ఏడుపు చూచి నరసింహం గాభరా పడ్డాడు. దడ పుట్టుకు చక్కా వచ్చింది. వణికి పొయ్యాడు. వాడిని ఓదార్చే మార్గం ఏమీ కనుపించ లేదు. ఎత్తుకోబోతే చంకకు రావడం లేదు. ఎట్టాగో బలవంతాన చంకన వేసుకుని కొంత దూరం పోయిన ఆమేళం వద్దకు వెళ్ళి సిగ్గు విడిచి "మాబ్బాయి ఏడుస్తున్నాడు. ఏది యిచ్చినా ఊరుకోవడం లేదు. మీ దగ్గిరిదే వాడికి కావా లట. కాస్త మిఠాయి పెట్టి వాడి ఏడుపు పోగొట్టండి" అని అడిగాడు నరసింహం.

ఒకపేరంటాలు వాడు చూపించిన పళ్ళెంలో మిఠాయి కాస్త తీసి పెట్టబోయింది. వా డది తీసుకోకుండా చేత్తో కొట్టివేసి పళ్లెం మిఠాయి మొత్తం కావా లన్నాడు. ఇక ఊరుకో డని ఎంచి "అమ్మా ! ఖరీదు ఇస్తాము గానీ ఆ పళ్ళెం మొత్తం మా కివ్వండి, ఎంత అయితే అంత ఇస్తాను. వీ డిక ఊరుకునే టట్టు లేడు" అన్నాడు నరసింహం.

ఆ మాట అందులో ఒకాయన విని, "మంచి మర్యాద గానే వున్నది! కుర్రవాడు ఏడుస్తున్నాడు గదా అని కాస్త పెట్టవస్తే పళ్ళెం మొత్తం ఖరీదుకు ఇవ్వమంటున్నావు! ఇది దుకాణం అనుకున్నావా ఏమిటి? పాపం, ఒక పళ్ళెమే కోరావు! మీ అబ్బాయి మాయందు దయ వుంచి మొత్తం పళ్ళాలు కోరుకోలేదు. కొంప ముంచి కోరుకున్నట్లయితే ఈ మొత్తం మీ ఇంట్లో పెట్టి మేము చేతులు ఝాడించుకుంటూ వెళ్లవలసి వచ్చేది. చాలు చాల్లే పద వయ్యా! కుర్రవాడికి భయం చెప్పడం చేత గాక మీర బెట్టుకుని ఇట్లా అడిగితే ఏమన్నా అనుకుంటా రని గూడా అనుకోకుండా అడుగుతూ వున్నావు. వీపు చిట్లగొట్టితే అట్లా ఏడుస్తాడా? నే చూస్తూవుండగా చురుకు ముట్టించు, ఎందుకు వూరుకోడో చూస్తాను" అని గుక్క తిరక్కుండా అనివేశాడు.

నరసింహం ఇంత ముఖం చేసుకుని ఏడుస్తున్న కుర్రవాడితో కాళ్లీడ్చుకుంటూ ఇల్లు చేరాడు.

కొన్నాళ్ళు గడచినవి. ఒకనాటి అర్ధరాత్రి తండ్రి పక్కలో పండుకున్న కుర్రవాడు ఎందుకో ఏడవడం ప్రారంభించాడు. అది విని తల్లీ దండ్రి లేచి సముదాయించ బొయ్యారు. వాడు ఏడ్పు మానలేదు. ఏమి కావాలి నాయనా అంటే చెప్పడు. పక్కమీద ఏదైనా కుట్టిం దేమో నని దీపం పెట్టి చూచారు. ఏమీ కనుపించలేదు. పిల్లవాడి ఏడుపు ఎక్కువ అవుతూ వున్నది. ఇన్ని రూపాయిలు తెచ్చి ముందు పోశారు. వాటిని కాళ్ళతో తన్ని వేశాడు. ఆట వస్తువు లన్నీ చూపించారు. కా దని తలకాయ తిప్పి వెర్రి ఏడ్పు ఏడవడం ప్రారంభించాడు. అది చూచి తల్లి భయంతో "అయ్యో! కుర్రవాడు ఇంత ఏడ్పు ఎప్పుడూ ఏడవ

లేదు. వ ళ్ళంతా చిరు చెమటలు పట్టుతూ వున్నది. అయినా అర్ధ రాత్రి సమయంలో ఏడవడం ఏమిటి ? మన ముద్దూ ముచ్చటా చూడలేక ఎవ్వరో ఏదో చేశారు'' అని బావురు మని ఏడవడం ప్రారంభించింది. అంతకు ముందే గుండె చెదిరి పోయిన నర సింహం కళ్ళనీళ్లు పెట్టుకున్నాడు. ఈ సందడికి ఇరుగు పొరుగు వాళ్ళు నిద్ర మేలుకొని వీళ్ళింటికి వచ్చారు. అందరూ ఈ మాటా ఆ మాటా మాట్లాడ్డంలో అరొదకు ఆ పందు జన మంతా ఆ అర్ధ రాత్రి సమయంలో వీళ్ళింటికి వచ్చారు. బాగు చేసే వాళ్ళను పిలవం డని ఒకళ్ళూ, ప్రయోగం చేస్తే ఇట్లాగే ఏడుస్తా రని మరి ఒకళ్ళూ, కడుపు నొప్పేమో డాక్టరిని పిలవం డని ఇంకొకళ్ళూ, తలోమాటా అంటున్నారు. ఇట్లా వుండగా ఆ జనంలో నుంచి ఒకామె వచ్చి ''మీ రందరూ అరవగాకండి, నేను అడుగుతాను'' అని ''అబ్బాయీ ! ఇటు చూడు, మా సుగుణ మంచివాడు కాదూ! చెప్పమ్మా చెప్పు! నీ కేం గావాలి ? డబ్బులా, పకోడీలా, కారప్పూసా, చక్కెరాలా'' అని ఇంకా ఏ వేవో చెప్పబోతూ వుంటే కుర్రవాడు ఏడుపు మాని ''నాకు చక్కెరాలు కావాలి'' అన్నాడు. పోయిన ప్రాణం వచ్చినట్టు సంతోషించి తండ్రి ఒక రూపాయి ఆ వచ్చిన జనంలో ఒకరి చేతిలో పెట్టి చక్కెరాలు తీసుకుని త్వరగా ర మ్మని తరిమాడు. ''ఓరి నా తండ్రీ! వెధవ చక్కెరాల కోసమే ఇందాకటినుంచి అట్లా ఏడుస్తున్నా వటరా ! ముందుగా చెప్పక పొయ్యావు నాయనా! ఇందాకనే తెప్పించే వాళ్ళము, వ ళ్ళంతా అలసిపోయింది నా తండ్రీ!'' అన్నది సీతమ్మ.

ఇంతలోకే చక్కెరాలు తెబోయిన మనిషి కొట్టు వాళ్ళను

లేపుకుని పాతిక చక్కెరాలు తీసుక వచ్చాడు. అ వన్నీ కుర్రవాడి ముందు పోతురాజుకు కుంభం పోసినట్టు పోశారు. "నువ్వు మమ్మల్ని రక్షించావమ్మా! అ వుపాయం మాకు తెలియలేదు. ఏడుస్తుంటే ఎందుకు ఏడుస్తున్నాడా అని గాభరాలో మునిగి పొయ్యాము" అన్నాడు నరసింహం. తర్వాత ఎవరి ఇళ్ళకు వాళ్ళు వెళ్ళి పొయ్యారు.

కుర్రవాడికి మూడో ఏడు వచ్చింది. అక్కా వాళ్ళ పుస్తకాలు చించడం, పలకలు పగల కొట్టడం, అడిగితే ఇవ్వకపోతే మీద పడి రక్కడం, ఇట్లా నానా అల్లరీ చేస్తున్నాడు. వాడు ఎలా చేసినా తల్లీ తండ్రీ ఏమీ అనరు. పాపం ఆ పిల్లలు గూడా స్త్రీ జాతికి సహజంగా పుట్టుకలోనుంచే శాంతగుణం ఓర్పూ వుండడం చేత వాడు చేసిన దానికి ఏమీ తీరుగా చెయ్యరు. పైగా వాళ్ళు తిరిగి కుర్రవాడిని ఏమీ కూడా అనరు. చిన్నపిల్ల హేమ తల్లి పెట్టక పోయినా తాను పెట్టుకుని అయినా రోజుకు ముమ్మాటూ అన్నం తిని ఏలాటి జబ్బూ లేకుండా మంచి దృఢంగా ఆరోగ్యంగా వున్నది. కుర్రవాడు చిరుతిండికి అలవాటుపడి అన్నం తినే అలవాటు తప్పిపోయి నందున కదాచితు అన్నం తింటే జీర్ణించుకోలేక ఆరోగ్యం చెడి బక్క చిక్కి వున్నాడు. తండ్రి "ఆడముండకు అంత జీర్ణశక్తి, అంత ఆరోగ్యమూ దేముడు పెట్టకపోతే వీడికి పెట్టకూడదూ" అని అప్పు డప్పుడూ అంటూ వుంటాడు. కొట్టువద్ద నగదు పెట్టె వద్దకు కూతుళ్ళు ఎప్పుడైనా వెళ్ళి కూర్చుంటే తండ్రి వద్దని కసురు కుంటాడు. కుర్రవాడు అస్తమానం పెట్టెవద్దనే కూర్చుంటాడు. తండ్రి ఏమీ అనక వాడి భావి కాల వ్యాపారాభివృద్ధి మార్గానికి అది సూచనగా గ్రహించి తనలో

తాను ముసి ముసి నవ్వులు నవ్వుకుని మురిసి పోతాడు. పెట్టె తెరచి రెండు గుప్పెళ్ళ నిండా ఎప్పుడూ చిల్లరగానీ రూపాయిలు గానీ తీసుకుంటాడు. ఎవరైనా కదిలించా రంటే చాలు రెండు గుప్పెళ్ళలో డబ్బూ గవ్వల్లాగా వెదజల్లి కింద బడి తన్ను కుంటాడు. ఊ అన్నా అపరాధమే, ఆ అన్నా అపరాధమే. అందు వల్ల తండ్రి వా డెట్లా చేసినా ఏమీ అనడు.

నరసింహం కొట్లోకి వచ్చిన వాళ్లతో "మావా డివ్వాళ్ళ ఏం చేశా డనుకున్నారు? నేను ఎంత ఇవ్వ మంటే అంత పెట్టె తెరిచి డబ్బులు ఇచ్చా డండోయ్. అప్పుడే బేడలూ, పావలాలూ గుర్తుపట్టాడు. ఏం తెలివితేట లనుకున్నారు. మావాడివి" అనీ "తల్లి అన్నం పెడుతుంటే అడిగినంత నెయ్యి వెయ్యాలే దని దవడకేసి బాదాడండోయ్ తల్లిని. మావాడికి ఎంతకోపం అను కున్నారు! ఆరో జట్లా చేశాడు. ఈ రో జిట్లా చేశాడు"అని కొడుకు తెలివితేటలను పొగుడుతూ ఎప్పుడూ అదే సోదిగా చెపుతూ వుంటాడు.

ఒకరోజున అప్పుడే బ్యాంకినుంచి వచ్చిన అయిదు రూపా యల నోట్లకట్ట విప్పి తండ్రి లెక్క పెడుతూ వున్నాడు. కుర్రవాడు అందులో రెండు కాగితాలు తీసుకుని వెళ్ళి దగ్గరలో ఆడుకుంటూ వున్నాడు. తండ్రి అది చూచి "ఆ కాగితాలతో ఆడుకుంటూ వున్నాడు. తరువాత తీసుకోవచ్చులే" అని తనపనిమీద వున్నాడు. పదినిమిషాలకు కుర్రవాడి ఏడుపు విని చేస్తున్న పని వదిలి నర సింహం వాడి దగ్గిరికి వెళ్ళాడు. ఒక అయిదు రూపాయిలనోటు ముక్కలు ముక్కలుగా చించి వెదచల్లి వున్నది. రెండో నోటు మడత పడి అందులో కొత్తకాగితం అవడంచేత, చినగ నందుకు

కుర్రవాడు ఏడుస్తూ వున్నాడు. నోటు చినిగి పోయినందుకు ఏమీ అనుకోక కుర్రవాడి అరచేతులు ఎర్రగా కందివుండడం చూచి తండ్రి నొచ్చుకుంటూ ముఖం చిట్లించుకుని "ఏం అంత పెళ పెళలాడుతూ తాటాకుల్లాగా కాగితాలు తయారు చెయ్యకపోతే మెత్తగా మందం తగ్గించి చేస్తే వాళ్ల సొమ్మేం పోతుంది? అంతా విపరీతం." అని గొణుక్కుంటూ కుర్రవాణ్ణి ఎత్తుకున్నాడు.

౪

పెద్దపిల్ల రజస్వల అయి దాదాపు సంవత్సరం కావస్తున్నా తండ్రి పెండ్లి మాట ఇంకా తలపెట్టనందున సీతమ్మ భర్తతో ఒకనాడు ఇట్లా అన్నది: "ఏమండీ! పిల్ల పెండ్లి విషయం అంటే మాట్లాడరు. పెద్ద మనిషి అయినందుకే తలవంపులుగా వున్నది. ఇంకా ఎంత కాల మని ఆపుతారు. ఇంత డబ్బు వుండీకూడా పిల్ల అట్లా ఈడేరి ఇంటపడి వుంటే చూస్తూ ఊరుకుంటారు! దాని శ్రద్ధ మీకు కాకపోతే మరి ఎవరికి? తోడిపిల్లలు అక్కర గూడా అయ్యి బిడ్డలను గూడా కంటున్నారు. వేళకు వచ్చి మాత్రం భోజనం చేసి పోతారు. ఇటువంటి సంగతులు మీకు ఏమీ పట్టవు. సంబంధాలుగూడా వస్తూవుండే! ఏదో మంచి సంబంధం చూచి ముడిపెట్టి వెయ్యండి. వచ్చేది మాఘమాసం. పెండ్లిచేసే ఏర్పాటు చెయ్యండి."

ఆ మాటలకు నరసింహం "దాని పెండ్లికి ఇప్పు డేమి తొందర వచ్చింది? రజస్వల అయిన పిల్ల ఎంతకాలం వున్నా తప్పు లేదు. లోకమంతా ఆలాగే నడుస్తూ వున్నది. ఇప్పుడే

చేద్దామా అంటే నాలుగువేలూ, అయిదువేలూ కట్నాలు అడుగుతూ వున్నారు. చూస్తూ చూస్తూ అంత డబ్బు ఎలా పారబోసేది? ఆడపిల్లలు పుట్టినందున వచ్చే చిక్కు ఇది. అష్టకష్టాలు పడి పెంచి పెద్దవాళ్ళను చేసింది గాకుండా ఇదొక వృధా తగులుబాటు'' అన్నాడు.

''ఆడపిల్ల లంటే మీ కింత ఇది ఎందుకు? వాళ్లు మాత్రం ఊరికే వచ్చారా? ఏ చెట్టుకిం దన్నా రాలితే ఏరుక వచ్చామా? మగపిల్ల లయితే చూచేటట్టూ ఆడపిల్ల లయితే చూడ నట్టూనా? వాళ్లు తవ్వి తల కెత్తిం దేమిటి? వీళ్లు ఎత్తని దేమిటి? ఎక్కడో బైటపిల్లలను తీసుకుని వచ్చి పెంచి నట్లు మాట్లాడుతారు! కడుపున పుట్టిన బిడ్డ లని గూడా కా స్తన్నా మీకు ఇది లేదు. డబ్బు ప్రధానంగా చూస్తారు గానీ, కన్నబిడ్డ లని అయినా చూడరు'' అన్నది చురచుర చూస్తూ సీతమ్మ.

''సంపాదించ చేతగాక పోయినా డ బ్బంటే నీ కంత తిరస్కారంగా వున్నది! ఒక కానీ సంపాదించి చూస్తే దానిలో ఎంత కష్టం ఉందో దాని విలువ నీ కప్పుడు తెలుస్తుంది. చేతులారా కష్టపడి సంపాదించిన వాడికి చిల్ల పెంకుల్లాగా ఖర్చు పెట్టబోతే కష్టమే. నిజంగా మగపిల్లవాడికీ ఆడపిల్లకూ సంబంధం ఎక్కడ? ఆడపిల్ల పుట్టిన దగ్గిరనుంచీ చింతే. పైగా అత్త సరీగా చూడక పోయినా, మగడు ఏలక పోయినా, తిరిగి మళ్ళీ వీళ్ళ నెత్తినే విరుచుకుని పడుతుంది. ఆడపిల్లను గురించి డబ్బు దండుగే గాకుండా బతికినంతకాలం అనేక చింతలు పడాలి. ఇక అల్లుడు గారు వున్నా రంటే అత్తగారిని ఏలే వక ప్రభువు. ఆయన పండక్కూ పబ్బాలకూ విధించే పన్నులను సక్రమంగా చెల్లిస్తూ

ఆయన ఏలుబడిలో దాసోహం అంటూ కిక్కురు మనకుండా నడుచుకోవాలి. లేక ఏలినవారి ఆజ్ఞను ఉల్లంఘిస్తే వారు విధిం చిన పన్నుకు ఇబ్బడిగా వసూలు చేసేదాకా వాళ్ళ గడప తొక్కడు. ఆడపిల్లల్లో ఇటువంటివి అనేక చిక్కులు వున్నవి. ఇక మగపిల్లవాడు అంటే రాజా. వాడి పెండ్లికి నాలు గయిదు వేలు తిరిగి వస్తవి. పెద్ద వా డయిన దగ్గరనుంచీ సంపాదించి పోస్తాడు. కనుక్కున్నందుకు తల్లిదండ్రులను సుఖ పెడతాడు. పిల్లలను గని వంశవృద్ధి చేస్తాడు'' అన్నాడు నరసింహం.

''అట్లా అని పెండ్లి చెయ్యడమే అసలు మాని వెయ్యండి. నా దేం పోయింది! ఇంట్లో వుండే ఆడదాన్ని నా కేమి? కీర్తి వచ్చినా మీకే, అపకీర్తి వచ్చినా మీకే. డబ్బు చేతులారా సంపా దించక పోతే ఆకాశంనుంచి ఊడి పడుతుందా? ఆడ పిల్లలను కనుక్కున్న వా ళ్ళందరూ వాళ్ళకు ఖర్చు పెట్టే డబ్బు చేతు లారా సంపాదించింది కాదు కామాలు'' అన్నది సీతమ్మ.

''వృథాగా మాట్లాడ వద్దు. నే నేమీ పెండ్లి చెయ్యననడం లేదు. ఈ సంవత్సరం ఆగితే రెండో పిల్ల కూడా అక్కరకు వస్తుంది. అప్పుడు ఇద్దరి పెండ్లిండ్లూ ఒకసారి చేస్తే ఖర్చుల్లో కొంత తగ్గుతుంది. అప్పటి కేవో చూచి కట్నాలు తక్కువగావున్న సంబంధాలు చెయ్యవచ్చు'' అన్నాడు నరసింహం.

కుర్రవాడికి అయిదో ఏడు వచ్చింది. కొంత డబ్బు ఖర్చు పెట్టి కారుమీద మేళతాళాలతో ఊరేగించి పంతులకు కట్నాలూ, కానుకలూ, యిచ్చి అక్షరాభ్యాసం చేయించారు.

సీతమ్మ మళ్ళా గర్భవతి అయి ఇంకొక మగశిశువును కన్నది. వాళ్ల సంతోషానికి మేరలేదు. ''ఏ వరస పెడితే ఆవరసే

ఏమేవ్'' అని నరసింహం భార్యతో సరస మాడాడు. మామూలు ప్రకారం మూడోనెలన విద్యాసాగరుడు అని నామకరణం చేశారు. నాలుగో పిల్ల హేమను తల్లి దండ్రులు బడికి పంపించక పోయినా ఇరుగు పొరుగు పిల్లలతో కలిసి బడికి పోవడం మొదలు పెట్టింది. సుగుణ సాగరుణ్ణి బడికి పంపి సంవత్సరం దాటినా ఓనమాలైనా సరీగా రాలేదు. మొన్న మొన్న మొదలు పెట్టిన హేమకు అక్షరా లన్నీ వచ్చినవి. వెళ్ళ మని అనకుండానే ఎంతో శ్రద్ధగా ప్రతినిత్యం బడికి పోతుంది. కుర్రవాడు అలా కాదు, బడికి పో నని మారాం చెయ్యడం, తండ్రి బుజ్జగించి పావలో అర్ధో చేతులో పెట్టి రోజూ బడివద్దకు తాను తీసుక వెళ్ళి వప్ప గింత పెట్టిరావడం, ఇలా జరుగుతూ వున్నది.

సుగుణసాగరుడికి తొమ్మిదో ఏడు వచ్చింది. రెండో క్లాసులో ప్రవేశించాడు. హేమ నాలుగో క్లాసులో ప్రవేశించింది. సుగుణ సాగరుడికి వయస్సు వచ్చిన కొద్దీ ఇంట్లో, గూళ్లల్లో, పెట్టిన చిల్లరా, కొట్టువద్ద పెట్టెలో డబ్బూ తరుగుపోతూ వచ్చింది. నర సింహం ఒక్కడే డబ్బు వాడడం చేత గుమాస్తాలు మొదలైన వాళ్ళమీద అనుమానపడే అవకాశం లేనందున, మొదట మొదట తనదే పొరపా టని సరి పెట్టుకుంటూ వచ్చాడు. కుర్రవాడు పొద్దున బడికి పోతే మధ్యాహ్నం ఇంటికి అన్నానికైనా రాకుండా ఒక్కొక్కనాడు రాత్రికి రావడం మొదలు పెట్టాడు. మధ్యాహ్నం అన్నానికి రాలేదే మని తల్లి దండ్రులు అడిగితే నాకు ఆకలిగా లేక రాలేదనో, వాళ్ళ తాతగారి ఇల్లు ఆ గ్రామమే అవడంచేత తాతగారింట్లో తిన్నా ననో ఏవో సాకులు చెప్పేవాడు. ఒక రోజున పంతులు కొట్లోకి వెళ్ళి ''ఏ మండీ నరసింహంగారూ! మీ

అబ్బాయి నాలుగు రోజులనుంచీ బడికి రావడం లేదు. ఎందు చేత ?" అని అడిగాడు. ఆ మాటకు ఆయన ఆశ్చర్యంతో "రాక పోవడం ఏమి టండీ! ప్రతి రోజూ పలకా, పుస్తకాలూ, తీసుకుని వస్తూనే ఉన్నాడు" అన్నాడు. "అసలే బండపాకం. అందులో ఇది వకటా! అసలు రావడం లేదు. అ దేమిటో కనుక్కోండి" అని పంతులు వెళ్ళి పొయ్యాడు.

తరవాత నరసింహం ఆరాలు తియ్యగా పలకా, పుస్తకాలూ, వాళ్ళ తాతగారి ఇంట్లో పెడితే తల్లి దండ్రికి చెపుతా రని మరి ఒకళ్ళ ఇంట్లో పెట్టి ఈ సంగతి మా వాళ్ళకు తెలియనివ్వ వద్దని వాళ్ళను బతిమలాడుకుని వాడి ఇష్టం వచ్చినట్టు తిరుగుతూ వున్నట్టు తెలియవచ్చింది. కుర్రవాణ్ణి తల్లి "నీకు ఇ దేమి బుద్ధిరా నాయనా!' హాయిగా వేళకు ఇంత అన్నం తిని మంచి బట్టలు వేసుకుని రాజులాగా బడికి పోయి చదువు కోక ఇలా తిరగడ మేమిటిరా ? నువ్వు అడిగినంత డబ్బు మీ నాన్న ఇస్తూ వుండె. బంగారం లాగా బడికి పోయి చదువుకో వచ్చునే. మీనాన్న కొడతారు. అలా ఎప్పుడూ చెయ్యకు నాయనా!" అని చాలాసార్లు బతిమలాడి కుర్రవాడికి చెప్పేది. చెప్పినప్పుడు విని తలకాయ వూపేవాడు. తల్లి దండ్రీ కోపపడ్డ ఏ రెండు రోజులో బాగా బడికి పోతూ వేళకి ఇంటికి అన్నానికి వచ్చేవాడు. తరవాత మళ్ళీ మామూలే.

ఒక రోజున కొట్లో పది రూపాయలు తరుగు పోయినవి. ఇట్లా ఎన్నోసార్లు ఇదివరకు తరుగు పోయినవి. ఇక ఆరా తియ్యకపోతే కొంప కూలుతుంది. ఇవ్వాళ్ళ పది అయినవి, రేపు నూరు అవుతవి. చూస్తూ వూరుకుంటే వీ ల్లేదు అని నరసింహం అను

కున్నాడు. ఆరోజు గడిచింది. ఆ తెల్లవారి కుర్రవాడు ఇంటికి రావడం మానివేసి నందున అనుమానపడి కొట్లో గుమాస్తాను వెంట వేసుకుని ఊరంతా వెదకటం ప్రారంభించాడు. అయన చూడవలసిన చోట్లల్లా చూచాడు. ఎక్కడా కనుపించ లేదు. విసుగు పుట్టింది. ఊరు వెలపల వున్న సత్రాలూ, దేవాలయాలూ, గూడా చూచి మరీ పోదా మని అక్కడికి వెళ్ళాడు. సత్రాలు చూచారు. అక్కడా లేడు. దేవాలయంలోకి వెళ్ళారు. అక్కడ నలుగురు కుర్రవాళ్ళతో చీట్లాడుతూ వున్నకొడుకును కళ్ళారా చూచాడు నరసింహం. ఆయనకు ఎక్కడ లేని కోపం వచ్చింది. అందులో తిరిగి తిరిగీ విసుగుపుట్టి ఉన్నాడేమో వెంటనే అక్కడకు పోయి కుర్రవాణ్ణి ఒకబాదు బాది రెక్క పట్టుకుని "ఓరి దొంగవెధవా! నువ్వు బళ్ళోకని వచ్చి ఈ పనా చేస్తున్నది? అయ్యో, ఈ యీడు కప్పిడే నీకు జూదమా? ఇన్నేళ్లు వచ్చినవి, నాకా చీట్ల పేర్లయినా తెలియవు. నువ్వప్పిడే ఇంతవాడి వయ్యావా? ఇంటికి పద, నిన్నేం చేస్తానో" అని ఇంటికి తీసుక వచ్చాడు. తతిమ్మా ముగ్గురు కుర్రవాళ్ళూ చీట్లక్కడ పారవేసి పరుగెత్తి పొయ్యారు.

తండ్రి సుగుణసాగరుడి జేబు చూచేసరికి నాలుగు రూపాయల చిల్లర వున్నది. అయన అనుమానం స్థిరపడి "ఈ పైకం నీ కెక్కడిది" అని అడిగాడు. వాడు తల వంచుకుని ఏమీ చెప్పలేదు, "నిజం చెప్పు. కొట్లో పది రూపాయలు ఎత్తుకవెళ్లింది నిజమేనా?" అని చండించి అడిగాడు. వాడు అంతా ఒప్పు కున్నాడు. ఆయన కోపం పట్టలేక "పూర్వన్నించి చేస్తున్న దొంగవు నువ్వేనా!" అని మరివక దెబ్బ వేశాడు. కుర్రవాడు

పుట్టి దాదాపు పది సంవత్సరాలుగా చెల్లుగా వాడి ఒంటిమీద దెబ్బపడ్డరో జదే. గృహకృత్యాలు నిర్వర్తించుకుంటున్న తల్లి కుర్రవాడి ఏడుపు విని వచ్చి సహించలేక "కొట్టారా ఏ మండీ! కుర్రతనం, వాడి కేమి తెలుసు? పెద్దైతే వాడికే బుద్ధి వస్తుంది. అలా చెయ్యబోకురా నాయనా! ఆ పాడు సావాసాలు చెయ్యకు" అని కుర్రవాడిని ఇంట్లోకి తీసుకు వెళ్ళింది.

ఆరోజు సాయంత్రం నరసింహం కుర్రవాడి చేష్ట లన్నీ తల పోసుకుంటూ ఇంటి అరుగుమీద కూర్చున్నాడు. అప్పుడే బళ్ళో నుంచి పలకా పుస్తకాలతో వస్తున్న హేమ తండ్రితో "నాన్నా! నేను అయిదో తరగతి ఫస్టున ప్యాసయ్యా నని మా పంతులమ్మ గారు నాకీ పుస్తకాన్ని బహుమానం చేశారు" అని సంతోషాన విప్పారిన ముఖంతో పుస్తకాన్ని తండ్రికి చూపించింది. తండ్రి తనలో "ఆడముండకు ఎందుకు ఇంత తెలివి? ఏం వూళ్ళేలుతుందా? దీనితో చదవ వేసిన సుగుణగాడు రెండో తరగతి లోనే పడి ఏడుస్తుంటే ఇది అప్పుడే అయిదో తరగతి గూడా ప్యాసయిందట. ఇంత తెలివి వాడికి వుండరాదూ? ప్రతినిత్యం బడికి తప్పకుండా పోతుంది. ఏమీ అల్లరి చెయ్యదు. ఎప్పుడైనా వకకానీ యిస్తే తీసుకుంటుంది. ఇవ్వకపోతే ఏడిపించదు. ఈ సుగుణ సంపత్తి సరీగా బళ్ళోకి పోక నానా అల్లరీ చేస్తూ చేతికి అందినంత డబ్బూ పుంజీలకు పుంజీలు ఎగర కొడుతూ వున్న ఆ సుగుణగాడికి వుండరాదూ? బతికి పోతాడు!" అని ఏ వేవో అనుకున్నాడు.

పెద్ద పిల్ల శాంతకూ, రెండోపిల్ల పద్మనికీ చెరి రెండువేలూ కట్నా లిచ్చి ఇద్దరికీ క్లుప్తంగా వివాహాలు చేసి రివాజు ప్రకారం

ఇచ్చే వన్నీ యిచ్చివేసి అత్తవారి ఇండ్లకు వాళ్ళను పంపి వేశాడు తండ్రి.

౫

రెండో కుర్రవాడికి కూడా కొంత డబ్బు ఖర్చు పెట్టి అక్షరాభ్యాసం చేయించారు. శ్రద్ధగా బడికి పోవడంలో నేమి, చదవడంలో నేమి, ఈ కుర్రవాడు అన్నకు ఏమాత్రం తీసి పోలేదు. పంతులను చూస్తే పోయి వంట ఇంట్లో దాక్కునేవాడు-అక్కడకు పంతులు ఎట్లాయినా రా డని. అన్నదమ్ము లిద్దరికీ ఘడియ సరిపడదు. ఎప్పుడూ కవర్లాడు కోవడమే. నా పుస్తకాలు చింపాడనో, నా పలక పగలకొట్టా డనో, నామీద ఉమ్మి వేశా డనో, నన్ను కొట్టాడనో, ఇద్దరూ తల్లిదండ్రులవద్ద ఎప్పుడూ ఫిర్యాదులు చేస్తూ వుంటారు. వా ళ్ళిద్దరికీ ఒక్కొక్క రోజున మహాయుద్ధం జరుగుతూ వుంటుంది. ఆ యుద్ధానికి ఆయుధ సామగ్రి పలకలూ, రూళ్ళకర్రలూ, సిరాబుడ్లూ, కలాలూ, పుస్తకాలూ. అన్న రూళ్ళకర్ర ప్రయోగిస్తే తమ్ముడు పలకను వదలుతాడు. అక్కడనుంచి సిరాబుడ్లూ పుస్తకాలూ కలాలూ, శర పరంపరలవలె పైన ఎగురుతూ వుంటవి. ఆ మహాసంగ్రామానికి తల్లి దండ్రులు మధ్యవర్తులై వాళ్ళకు న్యాయం కలగచేసి సంధి కుదురుస్తూ వుంటారు.

యుక్తవయస్సులు రావడం వల్ల రత్నానికీ, హేమలతకూ రెండు సంబంధాలు చూచి అల్లుళ్ళకు చెరి రెండు వేలూ కట్నాలిచ్చి ఇద్దరికీ ఒక్కమారే పెండ్లిండ్లు చేశాడు నరసింహం. సుగుణ

సాగరుడికి పద్దెనిమిదో ఏడువచ్చింది. అప్పటికి ఇంగ్లీషు ముక్కలు ఏమీ రాకపోయినా తెలుగుమాత్రం చదవనూ, వ్రాయనూ వచ్చింది. ఇంకా చదవవేస్తే అంతకంటే ఏమీ అధికంగా అబ్బ దని ఎంచి,బడి మానిపించి వేసి కొట్లో పడవేశాడు తండ్రి. బడి మానివేశావే మని సుగుణసాగరుణ్ణి ఎవరైనా అడిగితే "చదు వెందు కయ్యా! అంత కష్టపడీ చదువుకోవడం డబ్బు సంపాదించడానికే గదా? మాకు డబ్బు ఉండనే ఉన్నది. ఇం కెందుకు వెధవ చదువు" అంటూ వుంటాడు. డబ్బు గలవా ళ్ళవటంచేత వాళ్ళూ వీళ్ళూ కట్నా లిచ్చి తమ పిల్లను ఇస్తా మని తిరిగి పోతూ వున్నారు.

ఒకరోజున ఒకాయన వాళ్ళ కొట్లోకి వచ్చి "బదులు తాలూకు నూరు రూపాయలు ఇస్తారా?" అని నరసింహాన్ని అడిగాడు. "ఎప్పుడు తెచ్చాము? మీకు బదులు తాలూకు ఏమీ ఇవ్వవల సింది లేదే" అన్నా డాయన. "నిన్న మీ అబ్బాయి తెచ్చాడు గదండీ! మీరు ఇంటివద్ద లేరా ఏమి!" అన్నాడు ఆ వచ్చి నాయన. తీసుక రాంది ఎందుకువచ్చి అడుగుతారు. వాడు నిజంగా తెచ్చే వుంటాడు. తెచ్చి అవి వాడు దుబారా చేసి వుంటాడు. తేలే దంటే తన కొడుకు ఇటువంటి నడత గలవా డని తెలిస్తే పరువు పోతుం దని అనుకుని, "నిన్న నేను ఇంటి వద్ద లేనండీ మావాడు తెచ్చాడు కామాలు, తీసుక వెళ్లండి" అని నూరు రూపాయలు ఇచ్చాడు. కొడుకును ఎందుకు తెచ్చా వని అడిగిందాకా ఆయన మనస్సు నిలవలేదు. పొద్దుటినుంచీ సుగుణసాగరుడు కొట్టువద్దకు రానందున ఇంటివద్ద వుంటా డని వెళ్ళాడు. అక్కడ లేడు. భార్యను అడిగాడు. "వాడు రాత్రిగూడా ఇంటికి రాలేదు. చెప్పకుండా సావాసగాళ్ళతో కలిసి నాటకాలనీ

సినిమా లనీ, పొరుగూళ్ళకు వెళ్ళడం మామూలేగా" అన్నది సీతమ్మ. "ఇంకేం, నూరురూపాయలూ కొట్టుక వెళ్ళాడు. అవి కాసినీ అయిపోందే ఇంటికి రాడు!" అని సంగ తంతా ఆమెతో చెప్పాడు.

ఆ మరుసటి దినం నరసింహం వ్యాపారం మీద బెజవాడ వెళ్ళాడు. పని పూర్తి అయ్యేవరకు సాయంత్రం ఆరు గంట లయింది. అప్పుడు రైలుబండి లేదు. అందువల్ల గాంధీపార్కుకు వెళ్లాడు. అప్పుడు. కొద్ది కొద్దిగా చీకట్లు వ్యాపిస్తూ వున్నవి, గానీ ఇంకా బాగా చీకటిపడ లేదు. చల్లటి మందమారుతం వికసించిన పుష్పాల సౌరభాన్ని తీసుక వచ్చి అక్కడ కూర్చున్న జనానికి హాయి గలిగిస్తూ వున్నది. రావి చెట్టుపైన పక్షులు ఉదయాన్నే ఆహారానికై పోయి అప్పుడే గూళ్ళు చేరుకుని తమ బిడ్డలను కలుసుకుంటూ హర్షధ్వనులు చేస్తున్నవి. నరసింహం చుట్ట కాల్చుకునే టందుకు అక్కడ అరుగుపై కూర్చున్న వారిని "అగ్గి పెట్టె ఉన్నదా" అని అడిగాడు. వాళ్ళు లే దన్నారు. కొంత దూరంలో ఒక చెట్టుచాటున ఎవ్వరో ఇద్దరు మాట్లాడుతూ వున్నట్లు మసక మసకగా కనుపించగా, వారి దగ్గిర అగ్గిపెట్టె ఉన్న దేమో నని అడిగే టందుకు వెళ్లాడు. గుప్పున బ్రాందీవాసన కొట్టింది. ఇం కే మున్నది! తన కొడుకు సుగుణసాగరుడ్నీ, చక్కగా అలంకరించుకున్న ఒక స్త్రీనీ, వారి ముందు ఒక సీసా ఒక గ్లాసూ చూచాడు. తన కళ్లు నమ్మలేక పోయినవి. తన కొడుకు ఇట్టి దుష్ప్రవర్తనకు లో నవుతా డని ఎప్పుడూ ఆయన అనుకో లేదు. అది కల లాగా అనిపించింది. ముందు అందంగా కనుపిం చిన ఆ స్త్రీ చూడగా చూడగా మృత్యుదేవత వలెనూ, ఎంతో

ప్రేమతో తన ప్రాణం వలె చూచుకున్న కొడుకు తనపాలిట యముడివలెనూ కనుపించారు. తల గిర్రున తిరిగిన ట్టయింది. అప్పుడు ఏమీ అనేటందుకూ, ఏమీ చేసేటందుకూ తోచలేదు. అట్లాగే రాతి బొమ్మలాగా నిలవబడి పొయ్యాడు. సుగుణసాగరుడు తండ్రిని చూచి కట్టె బారిపొయ్యాడు. ముఖం వివర్ణమై పోయింది. గుండె బహు తీవ్రంగా కొట్టుకో సాగింది. తలకాయ భూమిలోకి వంచుకున్నాడు. అంతవరకూ సంతోషంగా వుండి ఆయన్ను చూడగానే అతనిలో గలిగిన మార్పుకు అతనికి ఆయన ఏమైనా అవుతా డేమో నని గ్రహించి ఆ స్త్రీ లేచి వెళ్ళి పోయింది.

ఉండీ ఉండీ నరసింహం కోపం అంతా ఒక్కమారే పైకి పొంగింది. ఇక పట్టలేక పొయ్యాడు. చెయ్యి అప్రయత్నంగా పైకి లేచింది. ఈడ్చి ఈడ్చి రెండు బాదులు బాది తన కోపాన్ని కొంత చల్లార్చుకున్నాడు. "దొంగతనంగా నూరు రూపాయలు తెచ్చి ఈపనా నువ్వు చేస్తున్నది! ఈ యీడు కప్పిడే ఇ వేమి బుద్ధులు ? నా కడుపున చెడ పుట్టావు! ఆ రాక్షసి నీ కెక్కడ దాపరించించి! బాగుపడేవాడి లక్షణాలు ముందే తెలుస్తవి. ఇంటికి పద, ని న్నేం చేస్తానో !" అని చీవాట్లు వేసి, జేబులో చెయ్యి పెట్టి చూచాడు. పది రూపాయల కాగితాలు నాలుగూ, కొంత చిల్లరా చేతికి చిక్కింది. ఇం కేమీ అనకుండా వెంట తీసుకుని రైలుస్టేషనుకు వెళ్ళాడు.

ఇల్లు చేరిన తరవాత సుగుణసాగరుణ్ణి బైటకు కదల కుండా తల్లీ దండ్రీ కట్టు దిట్టాలు ఏర్పరచారు. పెండ్లి చేస్తే వాడి ప్రవర్తనలో మార్పు ఏదన్నా కలుగుతుం దేమో నని ఒక

సంబంధం చూచి, అయిదువేల కట్నం మీద మహా వైభవంగా అయిదు రోజుల పెండ్లి చేసి, వెంటనే పిల్లను తీసుకు వచ్చారు.

పెండ్లి చేసినా వాడిలో మార్పు ఏమీ కలగ లేదు. వీలై నప్పుడల్లా అందినవరకు కొట్టుకుని వెళ్ళడం, అవి అయిపోయిన తర్వాత తిరిగి రావడం, ఇట్లా జరుగుతూ వున్నది. రెండు సంవత్సరాలు గడిచినవి. తన కొడుకు ఎంత డబ్బు దుబారా చేసినా నరసింహం ఊరుకుంటున్నాడు. తన కూతుళ్ళు కాపరానికి వెళ్ళిన ఇంతకాలానికీ చెల్లుగా ఒక్క పిల్లనైనా తీసుకుని వచ్చి చేతులారా ఇంత చీర పెట్టిన పాపాన్ని పోలేదు. ఆ సంవత్సరం రెండో కొడుకు విద్యాసాగరుడి పెండ్లి కూడా ఆడంబరంగా చేశాడు. ఆడపిల్లలు నలుగురూ తమ భర్తలతో సహా వచ్చి తమ సోదరునికి కట్నాలూ, కానుకలూ, చదివించి అటు నిద్రలూ ఇటు నిద్రలూ అయ్యేవరకూ వుండి సంతోషంగా కాలం గడిపి తరవాత ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళిపొయ్యారు.

౬

నాలుగయిదు నెలలు తేడాగా ఇద్దరు కోడళ్ళూ కాపరానికి వచ్చారు. సుగుణసాగరుని భార్య రూపవతి అయినా అతని మామూలు ఏమీ మానలేదు. నాలుగు రోజులు ఇంటివద్ద వుండడం, పదిరోజులు ఎక్కడో గడిపి రావడం. తల్లి దండ్రులకు చెప్పీ చెప్పీ విసుకుపుట్టి ఎట్లయినా చావనిమ్మని ఇక చెప్పడం మానివేశారు. విద్యాసాగరుని భార్య అంత రూపవతి కాకపోయినా అతడు భార్య వచ్చిన దగ్గిరనుంచీ అధిక ప్రేమతో

కొట్టు పద్దకు కూడా సరీగా పోకుండా ఆమెను ఘడియ గూడా విడిచిపెట్టి వుండక ఆమె చెప్పినట్టు నడుచుకుంటూ వున్నాడు. అందువల్ల తల్లి దండ్రులమీద అది వరకు అతనికి వున్న అభిమానం అంతరించి పోయింది.

వచ్చిన ఏ రెండు మూడు నెలలు అనుకూలంగా వున్నారో తోడికోడళ్ళిద్దరు. తరవాత కారణం లేకుండానే ఆమె మూతి అటూ, ఈమె మూతి ఇటూ ముడుచుకు చక్కా పోయినవి. ఆమె కంపు ఈమెకు సరిపడదు. ఈమె పొడ ఆమెకు గిట్టదు. ఇంటి పనులలో వంతులు వేసుకుని ఈ దిక్కుమాలిన బండ చాకిరీ అస్తమానం ఎవరు చేస్తారని ఒకామే, దానిని కూర్చో పెట్టి చెయ్యాలని నాకేం ఖర్మం పట్టిందని ఒకామే, ఏ పనీ ముట్టుకోకుండా ఎవరి గదుల్లో వాళ్ళు కూర్చోవడం మొదలు పెట్టారు. కోడళ్లు వచ్చాక సుఖపడదామని గంపెడాశతో వున్న సీతమ్మ ఇప్పుడు కోడళ్ళకు కూడా వండి పెట్టవలసి వచ్చింది. పూర్వం కంటే రెట్టింపు చాకిరీ ఆమె నెత్తిన విరుచుకు పడ్డవి; కోడళ్ళిద్దరూ ఏ కాస్త చిన్న తేడానో పట్టుకుని తెగిందాకా సాగదీసి సాగదీసి ప్రతి రోజూ పోట్లాడుతూ వుంటారు. ఆ తగాదా తీర్చలేక సీతమ్మ చచ్చిపోతూ వున్నది. ఎలుకమీద పెట్టి వకతె అంటే, పిల్లి మీద పెట్టి రెండో ఆమె వెంటనే జవా బిస్తుంది. అక్కడ నుంచి నువ్వు నన్నన్నావనీ నువ్వు నన్నన్నావనీ, పోట్లాట ప్రారంభం అవుతుంది. తిట్లూ దీవెనలూ శాపనార్థాలతో పెద్ద గల్లంతు అవుతుంది. అక్కడనుంచి ఇరుగు పొరుగు అమ్మలక్కలు చేరి లొట్టలు వేసుకుంటూ అటు బారెడూ, ఇటు బారెడూ వేసి, దాన్ని ఇంకా పెద్దది చేస్తారు. అది తీర్చలేక సీత

మ్మకు హత మారుతూ వున్నది. ఎటు చూచినా నిష్ఠూరమే. ఎవ్వరిని ఊరుకోమన్నా కోపమే. నరసింహం కొట్టువద్దనుంచి భోజనానికి ఇంటికి వచ్చినప్పుడు ఆయన ఉన్న కాస్సేపు ఏమి వూరుకుంటారో; ఆయన అటు వెళ్ళగానే మళ్ళీ కథ ప్రారంభం అవుతుంది.

మధ్యాహ్నం తీరుబడి కాలంలో ఇరుగు పొరుగు అమ్మలక్కలు నలుగురూ వీళ్ళింటికి చేరి ఎల్లిమీద మల్లీ, మల్లిమీద ఎల్లీ, పడిందని ఏవేవో వృథా ప్రసంగాలు చేస్తూ వుంటారు. సీతమ్మ పెద్దకోడలు విమల, భాగ్యవంతుల పిల్ల, నాలిముచ్చు. రెండోకోడలు సుశీల, సామాన్య కుటుంబీకుల పిల్ల, తొందర మనిషి

ఒకనాడు ఇరుగు పొరుగు పుల్లమ్మా, ఎల్లమ్మా నలుగురూ కూర్చుని ఊళ్ళో సంగతు లన్నీ ఎదపోసుకోవడం మొదలు పెట్టారు. వాళ్ళ పుట్టింటివాళ్లు ఎంత సారె యిచ్చి కూతురుని అత్తవారింటికి పంపా రంటే, ఓసెమ్మా, మొన్న పెసరివారి కోడలికి ఇచ్చి పంపినంత సారె ఎవ్వరూ ఇవ్వ లే దని ఒకామే, ఇట్లా ఎక్కడెక్కడి సంగతులూ రా మొదలు పెట్టినవి. విమల ఆమాట అందుకుని "మా పుట్టింటివాళ్ళు ఇచ్చే వన్నీ సరీగా ఇస్తే నేను భూమ్మీద నిలవకనే పోదును" అన్నది.

ఆ మాటకు సుశీల లేచి "ఒసేయ్, నన్నే గదే నువ్వనేది? నా వూసు నీ కెందుకే! నా పుట్టింటి వాళ్ళు ఎట్లా యిస్తే నీ కెందుకే? అసలు నా పుట్టింటి వాళ్ల పేరు నువ్వెందు కెత్తాలి? నీ పుట్టింటి వాళ్ళు ఆరిపొయ్యారా! బుగ్గయి పొయ్యారా! ఈ దఫా వాళ్ళ పేరు ఎత్తు, నోట్లొ గడ్డి పెట్టిస్తా! నీ పుట్టింటి వాళ్ళు

డబ్బు కలవాళ్ళని ఎగిరిపడబోకు. రెక్కలు కట్టుకుని ఆకాశం మీద ఎగరబోకు. కొన్నాళ్ళు భూమ్మీద నిలు. అట్లా పొంగిపడతా వెందుకు? పొంగిందల్లా పొయ్యిపాలే!'' అని చేతులు జాడిస్తూ పెద్ద గొంతుకతో అన్నది.

వెంటనే విమల శివమెత్తినట్టు లేచి ''ఏ మమ్మా! రమణమ్మ పిన్నీ, శేషమ్మ వదినే! నేనిప్పుడు ఒక దాని పేరెత్తానటమ్మా! దాని ఉలుకు అది బయట వేసుకుని ఎట్లా పడిపోతూ వున్నదో చూడండమ్మా! ఒసేయ్, నా పుట్టింటి వాళ్ళు ఎందుకు ఆరిపోతారే? నీ పుట్టింటి వాళ్ళు నాశన మవుతారు! నీ పుట్టింటి వాళ్లు దుమ్మయి పోవాలి! నీ పుట్టింటి వాళ్లు నేలమట్ట మయి, జిల్లేళ్లు మొలిచి పోవాలి! మొగుణ్ణి ఎట్లా బడితే అట్లా ఆడిస్తున్నానని అదిరిపడబోకు. ఎవ రన్నా వింటే నోట్లో గడ్డి పెడతా రని సిగ్గన్నా లేకుండా నేనే గనక మొగుడి బుజాల మీద ఎక్కానని నిక్కి చావబోకు'' అని చేతులు విసురుతూ రైలు కూసినట్టు పెద్ద గొంతుతో అరిచింది.

అందుకు సుశీల ''నే నెందుకు చస్తానే! నువ్వు చావు. మీ నాయన చస్తాడు! మీ అమ్మ చస్తుంది! మీ అక్కలూ, మీ చెల్లెళ్ళూ, మీ అన్నలూ, మీతమ్ముళ్లూ చచ్చి పిలవ పేరులేకుండా పోతారు!'' అన్నది ఆడ ఏనుగు ఘీ పెట్టినట్టు ఘీ పెడుతూ.

కథ భూపాలరాగం మీద మంచి రక్తి కడుతూ వున్నది. అత్త ఇదంతా విని ఇంకా ముదిరి పోతుం దని, ''ఊరుకో సుశీలా, ఎవరు వక్క మాటలో వూరుకున్నా పోతుంది. మీ రట్లా శవర్లాడుకుంటూ వుంటే, చూచే వాళ్లు నవ్వి పోతారు'' అన్నది.

అందుకు సుశీల ''అదిగో చూచారమ్మా! పెద్ద కోడలిని వెనక

వేసుక వస్తున్నది. నన్ను ఊరుకో మని చెప్పక పోతే ఆమెగారితో చెప్పరాదూ! నేనే నమ్మా అందరికీ లోకువ! ఎవరు వత్తినా నన్నే. అది నన్నట్లా తిట్టి పోస్తూ వుంటే ఇం దాకటి నుంచీ చూస్తూ ఊరుకున్నావు గానీ, ఎందుకే దా న్నట్లా తిడతావు అని కాస్తన్నా చెప్ప లేక పొయ్యావు! మా పుట్టింటి వాళ్లే భాగ్యవంతు లైతే అందరూ నన్ను బాగానే చూచేవాళ్లు. నా కెవ రున్నారు అడిగేం దుకు? దాపులో అయ్యా అమ్మా'' అని పమిట చెంగు తో కళ్లు అద్దుకుంటూ శుద్ధముఖారిరాగం తీయటం ప్రారంభించింది.

''నువ్వైనా ఊరుకో విమలా! కాస్తలో ఎవరు ఊరుకున్నా పోతుంది. ఇంత రాద్ధాంతం ఎందుకు?'' అన్నది సీతమ్మ. ''ఏ మమ్మోయ్, చూచారా యీ చోద్యం! నే నే మన్నా నమ్మా? నే ఊరికేనే వున్నాగా. ఇప్పు డాతల్లి ఆమె గారితో చెప్పకూడదూ అన్నది గదూ, అందుకని చిన్నకోడలి మాటలు విని నన్నడగ వచ్చిం దమ్మా! చూడండీ, ఎంత చిత్రంగా వున్నదో! నా పెని మిటే గనక నే చెప్పినట్టు వింటే న న్నిట్లా అంటార మ్మా! అది నా రాత, నాగీత!'' అంటూ కళ్లు తుడుచుకుంటూ కలితీ లేని నాదనామక్రియ రాగం అలాపించడం మొదలు పెట్టింది. అంతటితో ఆ రోజుకు నాటకానికి తెర పడిపోయింది.

మొదటి నుంచీ ప్రశాంతంగా వెళ్ళి పోతూ వున్న వాళ్ళ సంసారం కోడళ్ళు రావడంతోనే తగవులూ నూరాముళ్ళతో నడుస్తూ వున్నది. సీతమ్మ దానిని భరించ లేకుండా వున్నది.

ఒక రోజున నరసింహం కొట్టువద్ద వుండగా ఒక మారు వాడీ వచ్చి సుగుణసాగరుడూ, గోపురం రామా రావూ, ఇద్దరూ కలిసి వ్రాసియిచ్చిన ప్రామిసరీనోటు తాలూకు అసలు. పదివేల రూపా

యలున్నూ, వడ్డీ ఇరవై నాలుగు వందలున్నూ, వెరసి పన్నెండువేల నాలుగువందల రూపాయలు మీరు ఇవ్వవలసిం దనిన్నీ, రామారావు దగ్గిర ఆస్తి ఏమీ లే దనిన్నీ, పెట్టిన గడువు కూడా దాటిం దనిన్నీ, నాలుగు రోజుల్లో ఇవ్వని యెడల అగేటందుకు వీల్లే దనిన్నీ చెప్పాడు.

నరసింహం విని నివ్వెర పోయి ఏమీ మాట్లాడలేక పొయ్యాడు. తరవాత నోటు చూపించ మని అడిగాడు. మారువాడీ జేబులోనుంచి నోటు తీసి చూపించాడు. భువనదాస్ కళ్యాణ్ దాస్ అండ్ కంపెనీ తాపున పదివేలు తెచ్చినట్టు వున్నది. దిగువ సంతకాలు చూచాడు. తన కొడుకు సంతకం గూడా వున్నది. ఆయన ముఖం ముడుచుకు పోయింది. కాసినా కూసినా పది వేల రూపాయలు. గుండె బాదుకున్నాడు. కళ్ల నీళ్లు ఒక్కటే తక్కువ. రెండు రోజుల్లో వచ్చి మాట్లాడతా నని చెప్పి మారు వాడీని పంపివేశాడు. తన కొడుకును పిలుచుక ర మ్మని ఇంటికి మనిషిని పంపాడు. సుగుణసాగరుడు ఎట్లాగో ఆ రోజున ఇంటి వద్ద వున్నాడు. పిలవగా కొట్టు వద్దకు వచ్చాడు. నరసింహం తన కొడుకును విష జంతువును చూచినట్టు చూస్తూ, నోటు సంగతి అడిగాడు. నోటు అనే మాట వినగానే సుగుణసాగరుని ముఖం తెల్లబడి పోయింది. మారు పలకకుండా గోళ్లు గిల్లు కుంటూ తలకాయ వంచుకున్నాడు.

"చెప్పు, ఆ రామా రావు ఎవడు? నువ్వెందు కట్లా వ్రాయ వలసి వచ్చింది? వాడి దగ్గరైనా ఈ రూపాయలు వచ్చే విధం వున్నదా? అయిం దేమో అయిపోయింది. ఇప్పు డైనా నిజం చెప్పు" అని కొడుకు ముఖంవంక చూడకుండా పెడముఖం

పెట్టి అడిగాడు నరసింహం.

అందుకు వాడు బెజవాడలో తనకొక వేశ్య వున్న దనిన్నీ, ఒకరోజున ఆవేశ్య అన్న రామా రావు కొన్ని బంగారం వస్తువులు తీసుకుని అమ్మడానికి తనను గూడా వెంట రమ్మని కొంత దూరం తీసుకవెళ్ళి, అప్పుడు తనకు పదివేలరూపాయలు కావా లనిన్నీ, ఇంకా కొన్నిరోజులు ఆగితే బంగారానికి ధర పెరుగుతుం దనిన్నీ, అప్పుడు అమ్మితే చాలా ఎక్కువ డబ్బు వస్తుం దనిన్నీ, నే నొక్కణ్ణే నోటు వ్రాస్తే అంతడబ్బూ ఇవ్వరు, ఆ వస్తువు లన్నీ నీ దగ్గర వుంచుకుని తనతో పాటు నోటుమీద సంతకం చెయ్య వలసిం దనిన్నీ కోరినందున ఆతనిమాటలు తాను నమ్మి ఆవస్తు వులు తీసుకుని ఆ రూపాయలు ఇప్పించి నట్టున్నూ, ఎన్నాళ్ళకూ వాడు కనపడనందున ఆవస్తువులు అమ్మి బాకీ ఇచ్చివేద్దా మని అమ్మజూపగా అవి గిల్టు నగలు అయినట్టున్నూ తాను చింతిస్తూ వేశ్య దగ్గరికి వచ్చి అడగ్గా, ఆ దంతా నా కేమీ తెలియదని చెప్పిన దనిన్నీ నిజం చెప్పి వేశాడు.

"ఓరి దుర్గుణ సాగరుడా! సుగుణసాగరు డన్న పేరు నీవంటి మీద పడి చెడిపోయింది! ఛీ. నీ ముఖం చూడ రాదు! వెళ్ళిపో!" అని నాలుగు తిట్టి, తన దురదృష్టానికి చింతిస్తూ, వాడు దావా చేస్తే ఖర్చులు కూడా తగులుత వని దమ్మిడీతో గూడా చెల్లించి వేసి, నోటు తెచ్చు కున్నాడు. నరసింహం వెంటనే అన్ని పత్రి కల్లో తన కొడుకు సుగుణసాగరుడు మతి స్తిమితం లేకుండా వున్నందున తనపేరుతోగాని, అతని పేరుతోగాని, అతనిద్వారా ఈ రోజు మొదలుకుని ఏలాటిబాకీ ఇవ్వరా దనీ, అట్లా ఇస్తే తన కేమీ సంబంధం లే దని ప్రకటించి వేశాడు.

## ౭

ఒక నాడు సూర్యోదయానికి ముందు నరసింహం చుట్ట కాల్చుకుంటూ, వీధి అరుగుమీదకు వెళ్ళాడు. వాళ్ళగోడకు ఏదో పెన్సలుతో వ్రాసిన కాగితం అంటించి వున్నది. దాన్ని చదివి చిన్న పొయ్యాడు. వాళ్ళ పెద్దకోడలు విమల పైన వ్రాసిన వెలి జా బది. ఎవరైనా చూస్తే అప్రతిష్టని ఆ కాగితాన్ని తీసుకుని, చిన్న చిన్న ముక్కలుగా చించి పారవేశాడు. తన వశంలో ఎప్పుడూ లేని ఇట్టి కళంకానికి చాల చింతించాడు. అగ్నితో తనశరీరం దహించుక పోయినట్టు బాధ పడ్డాడు. తన కోడలిని పుట్టింటికి పంపివేద్దా మను కున్నాడు. ఆ పిల్ల దగ్గిర అటువంటి స్వభావం ఏమీ తనకు కనిపించనందున, కళ్ళారా చూడంది ఏ పనీ చెయ్యరా దని ప్రస్తుతం ఆగాడు.

పూర్వం నరసింహం ఇంటివద్ద వున్నప్పుడు తోడి కోడళ్ళు పోట్లాడ్డం మానివేసే వాళ్ళు. ఇప్పుడు ఆయన వున్నా సరే, జడుపు లేకుండా బండి సాగిస్తున్నారు. ఆ నాడు సుశీలపెట్టెలో ఒక రూపాయి తక్కువైన దట. కథకు వినాయక ప్రార్ధన చేసి గజ్జ కట్టి యెత్తుకున్నది. "నా సొమ్ము తిని బాగుపడ తారా అంటే, ఇట్లా దొంగసొమ్ము ఎన్నాళ్ళు తింటా రంటే, నా సొమ్ము తిన్నవాళ్లు ముతనష్టమైపోతా రంటే, ఇటువంటి దొంగ చచ్చిన వాళ్ళల్లో ఇంకేం మనాయిస్తా రంటే, ఇంకా ఏవేవో అంటూ మందరస్థాయిలోనుంచి తారస్థాయిని అందుకున్నది.

వెంటనే విమల "ఎందుకే అట్లా పిచ్చటిల్లి పోతున్నావు! నువ్వా నీ సొమ్మా ఎక్కడ దాన మయిందీ ఎవరికి తెలుసే! వృథాగా నోరు పారవేసుకున్నా వంటే చెప్పు తీసుకుని కొట్టిస్తా!"

అని తనభాగం తప్పులు పోకుండా చదివి బాగా అభినయించింది.

ఆ మాటలకు సుశీలకు కోపం ప్రతిరక్త నాళానికి వ్యాపించింది. జుట్టుముడి విడి పోయింది, మహిషాసుర మర్దని వలె, "ఎట్లా చెప్పు తీసుక కొట్టిస్తావే రా!" అని రయ్యి మని పమిట చెంగు నడుముకు బిగించి తోడికోడలి మీదికి పోవడానికి సిద్ధమయింది.

ఇట్టి తరుణంలో ప్రసవం అయ్యేందుకు తీసుక వచ్చిన వాళ్ళ ఆడబిడ్డ పద్మిని, ఇదంతా చూచి వాళ్ళు కలియబడతా రనుకుని "ఎందు కమ్మా! మీ రట్లా వృథాగా పోట్లాడు కుంటారు!" అని విమల మీదికి పోతూ వున్న సుశీలను అపుదామని ఆమెకు అడ్డం పోయింది. సుశీల కోప తీవ్రం చేత ఒళ్లు తెలియకుండా ఉన్న దేమో, ఈమెను లెక్క చెయ్యకుండా, విదులుచు కున్నందున పాపం పద్మిని, నవమాసాలూ నిండి బలహీనంతో ఉన్న దేమో, ఆమె తాకుడుకు ఆగలేక క్రింద చతికిల పడ్డది.

అది చూచి సీతమ్మ "అయ్యో! అయ్యో!! ఇంకేమున్నది! నా బిడ్డను చేతులారా చంపింది. నవమాసాలూ నిండి ఇవ్వాళ్నో రేపో ప్రసవం కావడానికి సిద్ధంగా వున్న పిల్లను పడదొయ్యడానికి నీ చేతు లెట్లా వచ్చినయ్యో గొడ్డుమోతుదానా!" అని ఏవేవో అంటూ వున్నది. తోడికోడలి మీదికి కుస్తీక తయారైన సుశీల అత్త అంటూవున్న మాటలను విని ఇదివరకే రేగిన కోపం రెట్టింపై చిందులు తొక్కుతూ తోడికోడలివైపు మాట్లాడుతుం దని అత్తమీద అదివరకే మనసులో కక్ష పుండడం చేత,

ఈనిన ఆడపులిపై రాయి వేస్తే దూకి నట్టు అత్తమీదకు దూకి నన్ను గొడ్డుమోతుదా న్నంటావా? నీ పెద్దకోడ లంటే బెల్లంతో సమానమా!'' అని ఫెళ్ళున సీతమ్మను దవడకు వేసి బాదింది.

అప్పుడు సీతమ్మ కెవ్వున కేక వేసి, "చచ్చానురో నాయనో! దీని నోరుబడ! దిక్కుమాలిన సంబంధం తెచ్చి పెట్టుకున్నాను. దీని వంశం ఇదీ పాడైపోను! అఖరుకు కోడలిదానిచేతకూడా తన్నులు తినవలసి వచ్చింది'' అని పెద్ద పెట్టున ఏడవడం ప్రారంభించింది. అంతకు కాస్తముందు కొట్టువద్దనుంచి ఇంటికి వచ్చి అ దంతా వింటూ వున్న నరసింహం కోపంతో కోడలిని, "అంత వళ్ళూపై తెలియడం లేదూ! పొగరెక్కి దాన్ని కొడతావా!'' అని చెయ్యి పైకెత్తాడు.

అప్పుడు ఆమె "చంపుతున్నాడు రో దేముడా! నా ప్రాణాలు ఎగిరిపోతున్నవో నాయనా! పెళ్ళాన్ని వెనక వేసుకుని వచ్చి నా గొంతు పిసుకుతున్నాడో తండ్రీ!'' అని పెడబొబ్బలు పెడుతూ, శోకాలు తీస్తూ, పెద్ద గల్లంతు చేస్తూ ఉన్నది. భార్య అట్లా శోకాలు పెట్టడం విని గదిలో వున్న విద్యాసాగరునికి ప్రాణాలు ఎగిరిపోయిన ట్లయినవి. అందులో ప్రేమ కుదిరిన ముద్దుల పెళ్ళాం, ప్రళయకాల గర్జనవలె ఆమెకేకలు వినిపించి నవి. శరీరం కంప మెత్తి పోయింది. అప్రయత్నంగా బయ టికి వచ్చాడు. ఒళ్ళు మరచి పొయ్యాడు. అప్పుడు ఏమి మాట్లాడు తున్నదీ తనకు తెలియలేదు. "ఏం దాన్ని కొడతావా! ఏది కొట్టూ చూస్తాను. దెబ్బపడ్డదా నీ మర్యాద దక్కదు!'' అని గుడ్లెర్ర చేస్తూ, తండ్రిపైకి పొయ్యాడు.

ఆ మాటలు విన్న నరసింహానికి మిన్ను విరిగి మీద పడ్డట్టయింది. పెళ్ళాన్ని వెనుక వేసుక వచ్చి కొడుకు తనపై నట్లా తిరగపడతా డని కలలోనైనా అనుకోలేదు. ప్రపంచం తిరగపడ్డట్టు కనిపించింది. ఎత్తిన చెయ్యి కిందకు దించాడు, "ఛీ గాడిదల్లారా! నా యింట్లో ఒక్క ఘడి యయినా ఉండే టందుకు వీల్లేదు. తక్షణం వెళ్ళి పోండి. రామా రామ! ఎప్పుడూ ఎరగని కొంపలో నానా అల్లరీ, నానా ఆగమూ! దుర్మార్గులు పుట్టారు లెక్కకు! ఏం సుఖం" అని అక్కడినుంచి కదిలి అరుగుపైన కూర్చున్నాడు.

గదిలోనుంచి వచ్చి కొడుకు అన్న మాటలూ అతని తీవ్రం చూస్తే సీతమ్మ తండ్రిమీద కలియబడతా డని ఎంచి "ఇంకేముంది నాయనే! పెళ్ళాన్ని వెనక వేసుకుని తండ్రిని కొట్టడానికి వస్తున్నాడు. ఇ వేమి పాడురోజులురా దేముడా. మా బతు కిట్లా అల్లరిపా లయ్యే రాత పట్టిందో బాబూ. కొడుకులో కొడుకులో అని తన్నుకున్నాను. మమ్మల్ని నడివీధిలో పెట్టే కొడుకులు పుట్టారో నాయనా" అని శోకాలు పెట్టింది.

నరసింహానికి పెద్దకొడుకు డబ్బు దుబారా చెయ్యడం వాడి దుశ్చేష్టలూ, చిన్న కొడుకు డబ్బు చేపడుతున్నా డన్న అనుమానం, తోడికోడళ్ళెప్పుడూ జుట్టూ జుట్టూ పట్టుకోవడం, వీటి వల్ల వాళ్ళను ఇదివరకే ఎవరంతట వాళ్ళను ఉంచా లనుకున్నాడు. ఆయనకు ఈ దెబ్బతో వా ళ్లంటే రోత వేసి, ఇద్దరు కొడుకులనూ ఇంట్లో నుంచి వెళ్ళగొట్టి వేశాడు.

## ౯

నరసింహానికి పూర్వం ఉన్న వుత్సాహమూ, కుదురు బాటూ, పోయి జీవితంలో ఒకవిధ మైన అశాంతి ఏర్పడ్డది. ఇద్దరు కొడుకులూ దుష్టులై, పెద్దకొడుకు అందినవరకూ డబ్బు పాడు చెయ్యటం వల్లా, చిన్నకొడుకు భార్య దుర్బోధలు విని డబ్బు చే పట్టడం వల్లా, సంసారం గూడా చితికి పోయింది. వీళ్ళ కాపరం ఇట్లా చిందూ బిందూ కావడం వల్ల, బాకీదార్లు కూడా బాధ పెట్ట జొచ్చారు. ఎట్లాగా సమాధానం చెప్పి ఆపివేస్తూన్నాడు నరసిం హం. ఆర్థికవిషయ మయిన దిగులుతో, కొడుకుల దిగులుతో, మనిషి చిక్కి సగ మయ్యాడు. అందులో వృద్ధాప్యం గూడా రావడం వల్ల, కూర్చున్న దగ్గిరనుంచీ లేవలేని స్థితిలో వున్నాడు. ఎప్పుడూ చెప్పరాని మనోవ్యథ అనుభవిస్తూ వుంటాడు. ఎప్పుడూ ఏదో పరధ్యానంగా వున్న ట్టుంటాడు. క్రమేణా పూర్వం వున్న వ్యాపారం గూడా తగ్గి పోయింది. అంత కంటే ముందు ఆయనకు దాని మీద శ్రద్ధ గూడా తగ్గి పోయింది. కొట్టు ఒక రోజు తీస్తే ఒక రోజు తియ్యడు. ఇట్టి స్థితిలో కొడుకు లిద్దరూ ఏకమై, వాటాలు పంచి పెట్టవలసిం దని పెద్ద మనుష్యులను తండ్రి దగ్గిరికి పంపారు. ఆ వచ్చిన వాళ్లతో నరసింహం "ఉన్న కాస్తా ఎలుకలు తొలిచినట్టు వాళ్లే తొలిచి వేశారు. ఇవ్వవలసిన బాకీలు వున్నవి. రావలసిన బాకీలు కొన్ని వున్నవి. లోకులకు ఇవ్వవలసింది పోగా, ఏదన్నా కాస్త మిగిలితే నా అనంతరం వాళ్ళకు చెంద వలసిందే గాని, నేను బతికి వున్నంత వరకూ ఒక కానీ గూడా పంచి పెట్టను" అని ఖండి తంగా చెప్పి వేశాడు.

కొద్ది రోజులకు కొడుకుల దగ్గిరనుంచీ లాయరు నోటీసు వచ్చింది. తర్వాత కొద్ది దినాలకు దావా నోటీసులు గూడా వచ్చినవి. నరసింహం దగ్గిర ప్రస్తుతం డబ్బు లేదు. వ్యాజ్యానికి కొంత అప్పు చెయ్యవలసి వచ్చింది. కోర్టువారు ఉన్న ఆస్తిని మూడు వంతులు చేసి, భూములూ అవీ వాళ్ల స్వాధీనం చేసివేశారు. రావలసిన బాకీలలో, ఇవ్వవలసినవి పోను మిగిలిన ఆరువేలనూ ఇద్దరు కొడుకులకూ చెరి రెండు వేలూ రొఖ్ఖ పూర్వకంగా ఇవ్వవలసిందిగా కోర్టువారు తీర్పు చెప్పారు.

రావలసిన బాకీలలో మునిగిపోకుండా వచ్చే బాకీ లని కోర్టువారు నిర్ణయించిన వాట్లలో, నరసింహానికి సగం బాకీలు మాత్రమే వసూ లయినవి. అందువల్ల, వాళ్ళకు ఇవ్వవలసిన చెరి రెండు వేలూ ఇవ్వలేక పొయ్యాడు. వాళ్ళకు రావలసిన డబ్బూ, వాళ్ళకు అయిన ఖర్చులూ, వచ్చే మార్గం ఏదీ లేనందున, తండ్రి హిస్సా వచ్చిన ఆస్తిని గూడా, ఇద్దరు కొడుకులూ తల్లిదండ్రులను కట్టు గుడ్డలతో ఇంట్లోనుంచి వెళ్ళగొట్టించి కోర్టు ద్వారా ఇల్లు గూడా స్వాధీన పర్చుకున్నారు. వాళ్ళిద్దరూ ఇంట్లోనుంచి వెళ్ళుతూవుంటే, వాళ్ళ పెంపుడు పిల్లి "మ్యావు మ్యావు" మంటూ దాని చింతను తెలియ జేస్తూ వెళ్ళ వద్దన్నట్టు కాళ్ళకు అడ్డడ్డాలు వచ్చింది.

ఆ రోజున సీతమ్మ దుఃఖానికి మేరలేదు. నరసింహం ఏమీ చింతించ లేదు. వారి పాట్లను ఇరుగు పొరుగువారు చూచి, చాలా విచార పడి, వాళ్ళను బతిమలాడి ఆ రోజుకు ఒకరి యింట్లో ఉంచుకున్ని, ఇంత ఆతిథ్య మిచ్చి గౌరవించారు. ఆ మరునాడు సీతమ్మ "పెద్దమ్మాయి గారింటికి వెళ్ళుదాము"

అన్నది భర్తతో. ఈ స్థితిలో ఆడపిల్లల యిళ్లకు పోవడం, మన స్కరించక "నా కొక పూర్వ స్నేహితు డున్నాడు. వాళ్ల యింటికి పోయి నాలుగు రోజులు గడుపుదాము. తరువాత ఎట్లా అయితే అట్లా అవుతుంది" అన్నాడు నరసింహం.

ఇద్దరూ రైలుస్టేషను వద్దకు వెళ్లారు. ఇల్లు వదిలినా ఏమీ చింతించని నరసింహానికి జన్మస్థానం వదలవలసి వచ్చినందుకు కళ్ల వెంట అశ్రుకణాలు రాలినవి. గ్రామం వాళ్ల వియోగానికి దుఃఖిస్తున్నదా అన్నట్టు సన్న జల్లు పడ్డది. రైలు కూత వేసి వాళ్లను ఆహ్వానించింది. ఇద్దరూ రైలెక్కారు. వా ళ్లెక్కిన పెట్టెలో కూర్చుని వున్న ఒక వ్యక్తి సమీపించి, చిన్న బోయిన ముఖాలను చూచి, "ఎక్కడికి వెళ్లుతున్నారు? ఏమిటి అట్లా వున్నారు?" అని అడిగాడు. ఆ వ్యక్తి వాళ్ళ రెండో అల్లుడు శ్రీధర రావు. ఆయన వాళ్ల కష్టాలు విని చాలా చింతించి, "మీ కేమీ పరవా లేదు. మా యింటికి రాండి. మీ కే లోటూ జరగ కుండా పువ్వులలో పెట్టి పూజిస్తా. మీ రేమీ చింతించ వద్దు" అన్నాడు.

"ఇప్పుడు కాదు. మరి ఒకతూరి వస్తాము. అందులో టిక్కట్లు కూడా కొన్నాము," అన్నాడు నరసింహం.

"టిక్కెట్లు కొంటే పరవా లేదు. ఆ స్టేషనులో దిగి మా గ్రామానికి మళ్లీ టిక్కట్లు కొని తెస్తాను. నే నిప్పుడు ఇంటికే వెళ్లుతున్నాను. నాతో కూడా తప్పక రావలసింది. రాజమండ్రికి నాకు పని తగలడం, వస్తూ వుండగా నే నెక్కిన పెట్టెలోనే మీరూ ఎక్కడం, అంతా సమకూరింది. లేకపోతే మీ రెక్కడ చిక్కులు పడే వాళ్లో పాపం!" అన్నాడు జాలిగా శ్రీధర రావు.

అల్లుడు అటు చూస్తూన్నప్పుడు సీతమ్మ భర్తతో "చూడండీ, అబ్బాయి మనల్ని చూచి ఎలా జాలిపడు తున్నాడో" అన్నది. ఆయన ఏమీ మాట్లాడ లేదు. రైలు చీరాల స్టేషనులో ఆగింది. ముగ్గురూ దిగి పొయ్యారు.

శ్రీధర రావు ముగ్గురు తోడిఅల్లుళ్ళకూ అత్త మామల స్థితిగతులు వ్రాశాడు. వాళ్ళు వెంటనే భార్యలతో, చీరాలకు వచ్చారు. వాళ్ళను చూచి ఎటువంటి వాళ్ళు ఎటువంటి స్థితికి వచ్చా రని కూతుళ్లూ, అల్లుళ్ళూ, చాలా చింత పడ్డారు. మా ఇంటికి రమ్మంటే మా ఇంటికి రమ్మనీ, మేము తీసుక వెళ్ళుతా మంటే మేము తీసుక వెళ్లుతా మనీ వంతులు పడజొచ్చారు. అప్పుడు పెద్ద అల్లుడు రఘుపతి "అట్లా కాదు. తలా ఒకరి దగ్గిరా నెల నెల వంతున ఉండే ఏర్పాటు చేసుకుందాము" అన్నాడు. ఆ మాట అందరికీ నచ్చింది. నరసింహం అందుకు ఇష్టపడ లేదు. ఏ పుణ్యక్షేత్రమో వెళ్ళి, అక్కడ కాలం గడుపుతా మన్నాడు. "మా యిళ్ళ దగ్గిర వుండే టందుకు మీకు ఇష్టం లేకపోతే, కొంత డబ్బిస్తాను, వర్తకం పెట్టుకోండి" అన్నాడు శ్రీధర రావు. తల్లి దండ్రులు దేశాల పాలై పోతా రనగా విని, కూతుళ్ళు భోరు మని ఏడ్చారు.

"ఇక నేను వర్తకం అవీ చెయ్యదలుచుకో లేదు. అంతా తెలుసుకున్నాను ప్రపంచం అంతా వట్టి మోసం, దగాగా నాకు కనబడుతూ వున్నది. ఒక నీతీ నియమం లేదు. నా జీవితంలో రెండు అన్యాయాలను గుర్తించాను. ప్రపంచ మంటే ఏమిటో యిప్పుడు బాగా నాకు అర్థ మయింది. ఒకటి - అందరికీ కావలి సింది డబ్బే. ఒక తండ్రీ లేదు, ఒక తల్లీ లేదు, ఒక కొడుకూ

లేదు, డబ్బే ప్రధానం. దాన్ని బట్టి ఎంతటి దారుణకృత్యా లయినా చేస్తారు. కోటి రూపాయలు సంపాదించి ఇంట్లో రాసులు పోసుకున్న వాడైనా, ఆకలికి కూడు లేక మలమలమాడే నిరు పేదలను సయితం దోయ చూస్తాడు. మా తల్లులు చూడండీ! మా మీద ఎంత అనురాగాన్ని చూపించి పరితపిస్తున్నారో! రెండు. మీసాలూ, గడ్డాలూ, మొలిచే గొప్ప వాళ్ళ మని విర్ర వీగుతూ పురుషులు స్త్రీ జాతిని నీచంగా చూస్తారు. ఏమీ తెలియని వ్యర్థు డయినా బాగా చదివి మంచి విజ్ఞానం కలిగి ఉత్తమురా లనిపించుకున్న స్త్రీని సయితం తేలికగా చూస్తాడు. తోడి మానవజా తని అయినా చూడకుండా మెత్తని వాళ్ళను చూస్తే మగవాళ్లు నెత్తిపై కెక్కి సవారీ చేస్తారు. ప్రపంచంలో ఏ మన్నా కాస్త దయా దాక్షిణ్యాలూ ఉంటే అవి వాళ్ళదగ్గిర వేనని చెప్పొచ్చు. నేను మాత్రం మంచివాడినా? ఆ రెండు తప్పులూ నేనుగూడా చేశా నని ఇప్పుడు తెలుసుకున్నాను. పశ్చాత్తాప పడుతూ వున్నాను. కూతు ళ్ళని తీసివేసి కొడుకు లని నెత్తిన ఎక్కించు కుని ఇప్పు డీఫలితం పొందాను. ఎందులో యే హెచ్చుతగ్గులూ లేకుండా అంతా సమానం అయితేనే గాని ఈ దుర్మార్గాలు నశించవు. ఇప్పుడు నాకు కలుగుతూ వున్న ఉద్రేకానికి లోకం మీదికి పరిగెత్తా లని వున్నది. అయితే ఈ వృద్ధాప్యంలో ఈ కదలలేని స్థితిలో, నే నేమీ చెయ్యాలే నని తెలుసు. అందుకనే వచ్చే జన్మలో అయినా నన్ను అందుకై పుట్టించ మని ఈశ్వరుని ప్రార్థిస్తూ, కాలం గడపా లని వున్నది" అన్నాడు నరసింహం.

ఆయనలో కలిగిన మార్పుకు అల్లుళ్ళు ఆశ్చర్య పడ్డారు.

ఇక వాళ్ళు వెళ్ళిపోతా రని నిశ్చయించి కూతుళ్లు తల్లితండ్రు లను కావిలించుకుని అదే పనిగా ఏడవడం ప్రారంభించారు. "ఎందుకు తల్లీ! అట్లా ఏడుస్తారు? సుఖం, దుఃఖం, అనుభ వించాను. మంచీ చెడ్డా చూశాను. న్యాయా న్యాయాలు తెలుసు కున్నాను. పెద్దవా ణ్ణయ్యాను. ఈశ్వరసేవకంటే నా కింకేం గావాలి తల్లీ!" అన్నాడు నరసింహం.

అ దంతా చూచి రఘుపతి అన్నాడు: "మీ వియోగాన్ని సహించలేక వా ళ్ళట్లా ఏడుస్తూ వుంటే వాళ్ళను కా దని మీరు వెళ్ళడం అంత మంచిది కా దను కుంటాను. మీరు ఎక్కడికో పోయి ఈశ్వర ప్రార్థన చేసుకునే దానికంటే, ఇక్కడ వుండే మీ రట్లా గడపవచ్చును. మీరు మా యిళ్ళదగ్గిరికి వచ్చి ఉండ డానికి సందేహిస్తే, మేము ఒక చోట మీకు ఇల్లు యేర్పాటు చేస్తాము. డబ్బు పంపుతూ ఉంటాము. సుఖంగా మీరు అందులో కాలం గడపండి."

ఆ మాట అందరూ బా గున్న దన్నారు. పద్మిని ఏడుపు మాని "మళ్ళీ ఇక్కడ నుంచి ఇంకో చోటికి పోవడ మెందుకు? ఊ వూళ్లోనే యిల్లు కొనాలి" అన్నది. కూతుళ్ళ దుఃఖాన్ని చూడ లేక, అల్లుళ్ళ మాటలు తోసివేయ లేక వాళ్ళ మాటలను అంగీకరించి నరసింహం "ఊళ్లో ఎక్కడా యిల్లు కొనవద్దు. ఈ గ్రామం వెలుపల ప్రశాంత మైనస్థలాన్ని చూచి తాటాకులతో చిన్న పాకా వేస్తే చాలు, మీ మాటలు తోసి వెయ్యా లేక అందులో కాలం వెళ్ళబుచ్చుతాము" అన్నాడు. అందరూ ఆనం దించారు.

వెంటనే నలుగురూ నాలుగు శాస్త్రలు వేసుకుని ఊరికి

కొంతదూరంలో వెయ్యిరూపాయలకు ఒక చిన్న జీడిమామిడితోట కొని, రెల్లు తెప్పించి మట్టిగోడలతో మూడు గదుల కుటీరం నిర్మించి అందులో వాళ్ళను ప్రవేశ పెట్టారు. ఒక్కొక్కళ్ళూ నెలకు పదిరూపాయల చొప్పున ప్రతి నెలా ఒకటో తారీఖుకు తప్పక పంపుతూ వున్నారు. ఆ తోటలో తీపినీళ్ల బావి ఒకటి వున్నది. చెట్లపై చిలుకలూ, గోరువంకలూ, పావురాలూ వాలి వాటి ముద్దు పలుకులతో వాళ్ళను ఆనందింప చేస్తూ వుంటవి. ఆ ముసలి దంపతులు లిద్దరూ పూర్వం కంటే ఎక్కువ ఆనందంగా, ప్రశాంత మైన జీవితాన్ని గడుపుతూ, వాళ్ళ కాలాన్ని ఈశ్వర ప్రార్థనకై వినియోగిస్తున్నారు. వాళ్ళ కుటీరం మార్గానికి కొంత దూపులో వున్నది; వచ్చే అతిథీ అభ్యాగతికీ ప్రతినెలా వచ్చే రూపాయలకు మించని వ్యయంతో భోజనాది సత్కారాలు చేస్తున్నారు. అల్లుళ్ళూ ఆడపిల్లలూ నెల కొక సారైనా వచ్చి చూచి పోతూవుంటారు.

# పొగడ దండ

శ్రీమతి కొమ్మూరి పద్మావతీ దేవి

---

జులై 1908 రాజమహేంద్రవరములో జననము. దివాన్‌బహదూర్ గుడిపాటి వెంకట రామయ్యగారి మనుమడు కొమ్మూరి వెంకట రామయ్యా గారు భర్త. ఈమెకు కుమారుడు, ముగ్గురుకొమార్తెలు కలరు. ఆంధ్ర, కర్ణాటక, ఆంగ్ల భాషలలో మంచిప్రవేశము కలదు. 1940 లో సిరిసిలో కర్ణాటక సాహిత్య సమావేశమునకు అధ్యక్షురాలు. ఆంధ్రప్రభలో ప్రమదావనము, ఆనందవాణిలో "మహిళాశీర్షిక", నాట్యకళ సంపాదకవర్గము మొదలగువానిలో సాహిత్య నిర్వహణము చేసినది. తాడిపర్తి రాఘవాచార్యులవారితో నాటక రంగముమీద ప్రసిద్ధి చెందినది. సినీమా రంగములో బహుపాత్రలు ధరించినది. మదరాసు రేడియో కేంద్రములో బహుకాలమునుండి పిల్లల మహిళల కార్యక్రమము నడపుచున్నది. కథలు వ్యాసములు అనేకములు రచించినది. 'పొగడదండ' 'కథాసాగరము' ముద్రితములు. 1956 లో గృహలక్ష్మి స్వర్ణ కంకణ బహుమానము పొందినది.

---

౧

"సీతా, సీతా," అంటూ పున్నమ్మ వీధిగుమ్మంలో నిలబడి అటూ ఇటూ చూస్తూ పిలుస్తోంది.

"అబ్బబ్బ! ఏంపిల్ల! అందరూ వస్తారే గాని అరఘంట అయింది ఇదిమాత్రం రాదే! ఏమే! సరోజా! మాసీత కన పడిందా ?"

ఆకేక విని, ఎదురింటిలో ఉన్న సరోజ "వస్తోం దండీ" అంటూ లోపలికి చక్కాపోయింది. "ఏం వస్తుందో, రానీ చెప్తాను" అంటూ విసుగ్గా వంటఇంట్లోకి వెళ్ళింది పున్నమ్మ.

సీతకి పధ్నాలుగేళ్ళు, అంద మయింది, అమాయక మైంది. చిన్నతనంలోనే తల్లీ తండ్రీ పోవడంవల్ల మేనత్త పున్నమ్మ దగ్గిరే పెరుగుతూంది. పున్నమ్మ పంచప్రాణాలూ సీతమీదే పెట్టుకుంది. తనకు ఉన్నఆస్తి సీతకి ఇచ్చి ఒక ఇంటిదాన్ని చేసి మరీ ప్రాణాలు వదలా లని పున్నమ్మ ఆఖరికోరిక.

ఒకచేత్తో పుస్తకాలు, ఇంకోచేత్తో ఏదో కాగితముపొట్లామూ పట్టుకుని పరుగున వచ్చింది సీత. "ఏమిటే ఇంతసేపు!" అంది కోపంగా పున్నమ్మ. "ఎంతసే పయిం దేం ? వస్తూనే ఉన్నాను" అంటూ పుస్తకాలు కింద పెట్టేలోగా చేతిలో పొట్లం జారి కింద పడింది.

"అదే మిటే ?

"పూలు"

"ఏం పూలు ?"

"పొగడ పూలు"

అమాటతో అత్తకోపం చల్లారింది. "ఇవి ఏరుకుంటూ కూచున్నావా! నీకోసరం ఎంతసేపటి నించో చూస్తున్నాను." అత్తమాటలు వినకుండానే "ఆకలే! ఏం చేశావు ?" అన్నది

సీత. ఆక లన గానే పున్నమ్మ ఆలస్యం అంతా మరిచిపోయి సీతను వంటింట్లోకి పిలుచుకు వెళ్ళింది.

అనాడు మొదలు ప్రతిరోజూ సాయంత్రము సీత బడి నించి ఆలస్యంగా రావడము, పొగడపూలు తేవడము ప్రారంభించింది.

''ఎక్కడివే ఇన్నిపూలు'' అంది పట్టలేక పున్నమ్మ ఒకసారి.

''ఆంజనేయుని గుడిలో చెట్టు ఉందే అత్తా,'' అన్నది ఆలోచనగా సీత.

'' నువ్వు ఒక్కదానివే ఏరుతున్నావా, అంది కళ్ళెఱ్రచేసి పున్నమ్మ.

ఇంతలో ఎదురింటి సరోజ ''సీతా, రేపటిపాఠాలు ఏం చదవాలో చెబుదూ'' అంటూ ఇద్దరిమధ్యన చతికలపడింది. అత్త మాటలకి అడ్డు వచ్చింది కదా అని సీత సంతోషంతో నవ్వింది.

''సరోజా, నువ్వు ఏరుతున్నావా'' అంది పున్నమ్మ మళ్ళీ.

''లే దత్తా, సీతమాత్రం ఏరిందా? '' అంది సరోజ. ఆమాట విని సీత కళ్ళెఱ్రచేసి చూసింది సరోజనిని. ''దాని కిష్టం, తెచ్చుకుంది'' అంటూ మాట మార్చింది సరోజ, పున్నమ్మ అలా వెళ్ళగానే సీత నవ్వుతూ '' నా కిష్టం గనుక తెచ్చుకున్నాను. నువ్వూ అత్తతోపాటు అడ్డం తగులుతావా? '' అంది.

''అది కాదే! పూలు వద్దన్నానా? అత నివ్వడాన్నిగాని. నీకు తెలియదు సీతా! ఈఊరి కంతా పెద్ద రౌడీ అతను! నీకు తెలుసా?'' అంది సరోజ. ఆమాట విని ఉలికిపడింది సీత. చేతిలోని పూలదండ జారి కింద పడ్డది.

" రేపు ఇస్తే వద్దని చెప్పు " అంటూ లేచింది సరోజ. " చదువుకోండి " అంటూ కేకవేస్తూ పున్నమ్మ వచ్చింది.

౨

ఆరాత్రి ఆలోచనలతో సీతకి నిద్ర రాలేదు. మర్నాడు బడినించి వస్తూ మధ్యమధ్యన ఎవరూ రావడంలేదు కదా అనే భయంతో వెనక్కి తిరిగి చూస్తూ వస్తూ ఉండగా ఎవరో పక్కగా వచ్చి " సీతా సీతా! " అనగానే అదిరిపడి అటు చూసింది. ఇంతచనువుగా కన్నుపేరు పెట్టి పిలిచినఅతన్ని చూడగానే మరింత భయపడింది. సరోజ చెప్పిన రౌడీ ఇతనే గదా అనుకుంటూ జ్ఞాపకం వచ్చి వణుకుతూ చూసింది. ఆతొందరలో చేతిలో పుస్తకాలు చిందరవందరగా రోడ్డుమీద పడ్డాయి. పుస్తకాలన్నీ తీసి సీతచేతికి కందించాడు అతను. " ఇవిగో పూలు సీతా. సంపెంగలుకుడా" అన్నాడు నవ్వుతూ.

అతని నవ్వుముఖాన్ని చూడగానే సీత భయం పోయి కళ్లు పెద్దవి చేసి తేరిపార చూసింది. మళ్లీ సరోజమాటలూ, అత్తఅదుపులూ తలచుకొని " వద్దు" అంది మెల్లిగా ! ముందుకు అడుగు వేస్తూ. " ఎందుకు వద్దూ " అంటూ పూలపొట్లం చేతిలో పెట్టాడు అతను. మనస్సులో తీసుకోవాలనే ఉన్నా చెయ్యి వెనక్కి తీసుకుంది.

"వద్దు, వద్దు" అంటూ తొందరగా తోసుకువెళ్ళడంలో కాగితం చిరిగి పూలన్నీ నేలమీద పడిపోయాయి. ఆపూల మీదనించే పరుగెత్తుకుని వెళ్ళింది సీత. ఆధూళిలో సీత కాలి

కింద నలిగిన సంపెంగను మాత్రం అతను తీసుకుని నిట్టూరుస్తూ వెళ్ళిపోయాడు.

## 3

ఆఊరి కంతా శంకరం అంటే హడలు. ఇరవై ఏళ్ళు ఉన్నా పెద్ద రౌడీ అని అతనికి పేరు. వీధిలో వస్తున్నాడా అంటే ఆడపిల్లలకి భయం. శంకరం అంతదూరంలో ఉండగానే, అతని అత్తరువాసన గుర్తించి వాళ్ళు తప్పుకునేవారు. ఏం చేశాడో, ఏంచేస్తాడో, ఎవరూ చెప్పరు. కానీ శంకర అంటే మాత్రం ఎవ్వరికీ మంచి అభిప్రాయం లేదు. ఓరోజున గుడి పక్కగా వెళుతూ పొగడచెట్టుకింద పూలు ఏరుకుంటూన్న సీతని మొదట చూశాడు శంకరం. ఎందుకోగాని సీతని చూడగానే అక్కడినించి వెళ్ళలేక అలాగే చూస్తూ నిలబడిపోయాడు.

ఆరోజునించీ సీత పూలు ఏరుకునే వేళకి సరీగ్గా అతనూ ఆపక్కగా వచ్చి సీత అక్కడినించి కదిలేవరకూ చూసేవాడు.

ఒకరోజు సాయంత్రము సీత పూలు కోస్తూండగా కంట్లో ఏదో పడి బాధపడడము చూశాడు శంకరం. ఇంక దూరంగా ఉండలేక దగ్గరగా వెళ్ళి "ఏం పడింది" అన్నాడు మెల్లిగా జంకుతూ. అతన్ని చూసి సంకోచించకుండానే "కంట్లో ఏదో పడింది" అంది సీత లేనినవ్వు తెచ్చుకొని. "ఏదీ, ఊదుతాను పోతుంది" అంటూ తల పట్టుకుని కన్ను తెరవమని ఊదాడు

శంకరం. ఎలా గయితే నేం కంట్లోంచి చీన్నచీమను బయిటికి తీస్తూ "ఇంతపెద్దక ళ్ళయితే పడతాయి" అన్నాడు శంకరం నవ్వుతూ. సీత సిగ్గు పడింది. అతను కోసి ఇచ్చిన పూ లన్నీ తీసుకుంది. ఎందుకో గాని అత నంటే ఏదో తెలియని ఇష్టం ఏర్పడ్డది. అరోజునించీ అతను పూలు ఇవ్వడమూ సీత పుచ్చు కోవడమూ అలవా టయింది. అంచేత వద్దు అని అసాయంత్రం సీత వెళ్ళగానే శంకర అచెట్టుకిందే చతికలపడి ఆలోచనలో పడ్డాడు.

పతి సాయంత్రము సీతని చూ తందే అతనికి నిద్ర పట్టేది కాదు, కాలం సాగేది కాదు

త్వరగా సాయంత్రం అయ్యేదాకా చిరాకు పడేవాడు. అలాంటిది సీత అలా వెళ్ళగానే సీతకూడా అందరిలాగే అతన్ని చెడ్డవా డని అనుకుంటూం దని ఆఖరుకి నిశ్చయించుకున్నాడు. ఆదురభిప్రాయము సీతకి పొగొట్టా లని అనుకుంటూ ఆలోచన లతో ఇంటికి వెళ్లాడు.

సీత ఇంటికి రాగానే పూలు తేనందుకు పున్నమ్మ సంతో షించింది. సీతమాత్రం చిరాకుగా బెంగగా ఉంది. సాలోచనగా పడుకున్న సీతకు దగ్గరగా వెళ్ళి పలకరించింది సరోజ.

"అన్నట్టు పూలు ఇచ్చాడా? ఏం జరిగింది? ఏ మన్నావు?" అంటూ సరోజ ప్రశ్నలవర్షం కురిపించింది సీతచెవిలో.

"వ ద్దన్నాను" అంటూ దిండులో ముఖందాచుకుంది సీత.

"ఏడుస్తున్నా వేమిటే! ని న్నేమన్నా చేశాడా?" అంది సరోజ భయంతో. "నీమొహం, అతను చాలా మంచివాడు" అంటూ ఆమాటలు మరిపించి పంపేసింది సరోజను సీత.

దాచుకొన్నదంత లన్నీ తీసి తెల్లారగానే చూసుకుంటూన్న సీతని పున్నమ్మ గుడికి రమ్మంది.

సీత జంకుతూ పున్నమ్మ వెనకాలే అడుగులు వేస్తూ ఒక వేళ అతను వచ్చి పలకరిస్తాడేమో అన్న బెదురుతో అత్త వెంటే వెళ్ళింది.

పున్నమ్మ గుడిలోపలికి వెళ్ళింది. సీతమాత్రం పొగడ చెట్టుకిందికి వచ్చి, కిందటిరోజు పూ లన్నీ పడినచోటు గుర్తించి వాడిపోయి మన్నులో కలిసిన పూలను చూస్తూ, అందులో వడిలి పోయి రెక్కలు విరిగిన సంపెంగ కాలికి తగలగానే "ఇదిగో సంపెంగలు" అన్న అతనిమాటలు తలుచుకొని అటూ ఇటూ చూసి సంపెంగరేకు తీసి తల్లో పెట్టుకుంది.

"రావే పోదాం" అంటూ పున్నమ్మ పిలవగానే కాళ్ళీడ్చు కుంటూ ఇంటికి వెళ్ళిపోయింది సీత.

శంకరం అక్కడే ఉన్న మొండిగోడమీద పొగడచెట్టు గుబురువెనకాలనించి సీతని చూస్తూనే ఉన్నాడు.

ఆరోజున బడినించి మామూలుగా రాకుండా ఇంకోదారిని వచ్చింది సీత. ఓసందు మలుపు తిరగగానే శంకరం ఎదు రయ్యాడు. అతన్ని చూడగానే అదుర్దాతో భయంతో మూలగా ఒదిగి నిలబడింది సీత. ఆకంగారులో చేతిలోపుస్తకాలు జారి పక్కనే ఉన్న కాలవలో పడ్డాయి.

" అయ్యో " అంటూ తీసుకోబోయింది సీత.

"వద్దు, నేను ఇస్తాను, ఉండు" అని శంకరం ఆపాడు.

"పుస్తకాలన్నీ బురద అయ్యాయి. అత్త తిడుంది" అంటూ ఇంక మాట్లాడలేక బావురు మంది సీత. ఆసందులో వెళుతూన్న

ఒకరిద్దరు ఆగారు. సీతఏడుపు విని "ఇలా రా!" అంటూ సీత చెయ్యి పట్టుకుని అసందులోంచి అవతలకి పిలుచుకు వెళ్ళాడు శంకరం. అతను రమ్మనగానే బెరుకు లేకుండా కూడా వెళ్ళింది సీత. అదగ్గరిలోనే ఉన్న గుడిసెలోపలికి పిలుచుకు వెళ్ళి "వెంకన్నా" అని పిలవగానే అరవైఏళ్ళ ముసలిఅతను "బాబయ్యా" అంటూ అతిభయభక్తులతో వచ్చి శంకరంముందు నిలబడ్డాడు. ఆసందులో కాలవలో పుస్తకాలు తెమ్మని శంకరం అతన్ని పంపాడు.

సీతఏడుపు ఎక్కువయిందే గాని తగ్గలేదు. కళ్ళు ముఖం వాచిపోయాయి. శంకరం ఎంత ఓదార్చినా సీత సమాధానపడ లేదు సరికదా, ముఖం రెండు చేతులతోనూ కప్పుకుని ఏడుస్తూనే ఉంది. "సీతా! ఇలా చూడు. అబ్బ ఏడవకు. నీకు పుస్తకాలు తెచ్చి ఇస్తాగా, నువ్వు నవ్వవూ! నవ్వాలి" అంటూ శంకరం లాలించడం మొదలుపెట్టాడు. "దొంగ! ఇలా చూడు, ఒక్కసారి నవ్వు" అంటూ శంకరం సీతచేతులు పట్టుకున్నాడు.

"ఊహు" అంటూ తల తిప్పింది సీత.

"ఏదీ నాసంపెంగ, నీజడలో ఉంది కదూ" అన్నాడు శంకరం. ఆమాట వినగానే ముసిముసినవ్వులు నవ్వింది సీత. సగం మన్నుఅయిన పుస్తకాలని తీసుకు వచ్చాడు వెంకన్న. అ వన్నీ తుడిచి చేతికి ఇచ్చి ఇంటికి వెళ్ళమన్నాడు శంకరం. సీత నవ్వుతూ గుడిసెముందుకి రాగానే "వెంకన్నా, అందాకా వెళ్ళు" అని సీతదగ్గిరగా వచ్చి జేబులో దాచిన పూల పొట్లం అందిస్తూ "వద్దనకు. నే నివ్వనులే. వెంకన్న ఇస్తాడు, ఏం?" అంటూ సీతని సాగనంపాడు శంకరం.

అలస్యానికి ఏదో సాకులు చెప్పి పుస్తకాలు బురదలో జారా యని అబద్ధాలు చెప్పింది సీత. 'అబ్బ! వాడిన కొద్దీ వాసన. అత్తరుపూలు అత్తా! నాగ దంతా వాసనలే'' అంది సీత ముందుగా. అవును అంటూ అలస్యంసంగతే మరిచిపోయింది పున్నమ్మ. శంకరం చెడ్డవాడు కా డనీ, సరోజ అబద్ధాలు చెప్పిం దనీ సీత నిశ్చయించుకుంది.

''నే నివ్వనులే, వెంకన్నె ఇస్తాడు'' అన్నఅతనిమాటలు మరీ మరీ తలుచుకుని లోలోపల పొంగిపోతూ అత నెంత మంచివాడు అనుకుంది.

సీతకి ఏమాత్రం కష్టం కాగూడ దనే నిశ్చయంతో శంకరం వెంకన్నద్వారా సీతకి పూలు అందచేస్తున్నాడు. స్నేహితురాలు ఇచ్చిం దని అత్తతో చెప్పేది సీత. సరోజమాత్రం సీతని ఓకంట కనిపెడుతూనే ఉంది. అత్తకి చెప్తా నని సీతని తరుచూ బెదిరించేది. బతిమాలుకుని ఈసంగతి బయటికి రాకుండా చేసుకుంది సీత. ఇలా ఒకవార మయ్యేసరికి పూలదండలతో పెట్టి నిండిపోయింది. సీతమాత్రం ఏదో బాధ పడుతూనే ఉంది.

ఒకనాటిసాయంత్రము దండ తీసుకుంటూ వెంకన్నని అడిగింది సీత- ''బాబుగా రున్నారా'' అని.

"జ్వరంగా ఉం దమ్మా" అన్నాడు వెంకన్న.

''ఎన్నాళ్ళనుంచీ'' అంది ఆదుర్దాగా.

''రెండురోజులనించీ'' అంటూ వెళ్ళిపోయాడు వెంకన్న. పూలదండ చేత్తో తిప్పుతూ అలోచనలతో ఇంటికి వచ్చింది సీత. గుమ్మంలో సరోజ నిలబడింది. మరీచిత్రంగా మారిపోయావే సీతా! మా ఇంటికే రావడం మానేశావు ? అంది సరోజ చేతులు

తిప్పుతూ. జవాబు చెప్పకుండానే సీత ఇంటికి వెళ్ళి పడు. కుంది.

"ఆశంకరం కోసమే ఈబెంగ అంతా" అని సరోజ మెల్లిగా సీతచెవిలో అన్నది.

"ఊరుకుందూ, ఎప్పుడూ ఇదే గొడవ" అని సీత విసుక్కుంది.

"ఎందు కలా ఊన్నావు ? అత్తతో చెప్పనా ? చెప్పనులే! పూలు ఇవ్వలేదా ఇవ్వాళ్ళ ?" అంటూ నవ్వుతూ సరోజ వెళ్ళిపోయింది.

జడరిబ్బను తీసి ముక్కలు ముక్కలుగా చించి పారేస్తూ సీత కూచుండి పోయింది.

మామూలుగా వెంకన్న సీతకి పొగడదండలు అందించాడు. సీత ఉండలేక "బాబయ్య గారికి జ్వరం తగ్గిందా వెంకన్నా" అంది మెల్లిగా.

"తగ్గిందమ్మా, గుడికి రేపు వస్తారు" అంటూ వెంకన్న వెళ్ళిపోయాడు.

ఎప్పుడు వస్తాడో అడగలేదే అనుకుంటూ ఇంటికి దారి తీసింది సీత.

అత్తకోసరం దీపందగ్గిర కూచుని పుస్తకం తీసింది. కాని. చదవా లని ఉంటేగా ! ఆరాత్రి చదువూ లేదు, నిద్రా లేదు, మర్నాడు సాయంత్రం కోసరం కాచుకుని అత్తకు అబద్ధాలు చెప్పి గుడికి దారి తీసింది.

సీతకోసరం కాచుకుని ఉన్న శంకరం ముందుకు వచ్చి కోనేరువైపు దారి తీశాడు. అక్కడ ఉన్నచిన్న అరుగుమీద ఇద్దరూ కూచున్నారు. సీత సందేహిస్తూ లేచి నిలబడింది.

"కూర్చో సీతా! కూచోవూ? నాసంగతి అడిగా వని వినీ వచ్చాను. జ్వరం తగ్గలేదు ఇంకా, తెలుసా సీతా? నన్ను అడి గావా!" అన్నాడు నవ్వుతూ శంకరం.

"అడిగాను" అంటూ అతనిపక్కనే సీత కూచుంది. జేబులోంచి పొగడదండలు తీసి సీత ఒళ్ళోపెట్టాడు శంకరం. సీతకి ఒళ్లు తెలియలేదు. శంకరం షర్టుచేతిగుండీలని తిప్పుతూ అతని కళ్ళల్లోకి చూసింది సీత.

"సీతా! నన్ను మరిచిపోవుకదూ!"

"ఊహూ" అంటూ అమాయికంగా తల తిప్పింది సీత.

"ఒక్కనిమిషం ఇలానే కూచో సీతా! ఇలా దగ్గరగా, సీతా! నువ్వంటే నా కెంతఇష్టమో తెలుసా?"

సమాధానం చెప్పకుండా అతనిచేతిని దగ్గరగా తీసుకుంది సీత. శంకరం మాటలు రానిమూగవాడిలా సీతని మరింత దగ్గరగా తీసుకొని "నీవు ఇం కెవ్వరినీ పెళ్ళాడకు సీతా? తెలిసిందా సీతా అన్నాడు శంకరం. ఇంతలో ఏదో అలికిడి అయి సీత లేచి తొందరగా ఇంటివైపు నడిచింది. ఇంటిపను లన్నీ ఆరాత్రి ఎప్పటికంటె ముందుగా ఎంతో బాగా చేసి అత్తదయ సంపా దించుకుంది సీత.

పున్నమ్మ అసాధ్యురాలు ఎలా పసికట్టిందో ఏమో ఎవ రన్నా చెప్పారో! స్వగ్రామ మైన సంతమాగూలూరికి ప్రయాణం కట్టింది. సీత గుండెల్లో రాయి పడింది.

అసాయంత్రం శంకరాన్ని కలుసుకుంది, గాని సీత ఊరి ప్రయాణంసంగతి ఎత్త లేదు. చెబితే బాధ పడతా డనీ, ఏదో అపుతాడనీ అల్లరి అవుతుం దనీ అతనిబాధ చూడలేక అంతబాధ తనలోనే ఇముడ్చుకొని ఊరుకుంది. శంకరానికి మాత్రం ఏం తోచిందో-

"ఏం సీతా! ఇవాళ అలాగ ఉన్నా వేం ?" అని అడిగాడు.

" ఏమీ లేదు" అంటూనే సీత ఏడవడము మొదలు పెట్టింది. ఏమీ అర్థం కాక శంకరం మళ్ళీమళ్ళీ అడిగాడు, బతిమాలుకున్నాడు, బుజ్జగించాడు.

"రేపు రెండుదండలు తెస్తాను తెలుసా సీతా! ఒకటి నేను నీమెళ్ళో వేస్తాను. రెండవది నువ్వు నామెళ్ళో వేయాలి" అన్నాడు శంకరం నవ్వుతూను. సీత దిగు లంతా దిగమింగి నవ్వు తెచ్చుకుంటూ "అలాగే" అన్నది. ఆకొత్తచీకట్లో ఆనవ్వులో వెలితీ వేదన శంకరానికి కనపడలేదు.

"సీతా రేపు వస్తావు కాదూ, త్వరగా రా "

" ఆ "

## ౪

సంతమాగులూరులో తాతగారిఇంట్లో తోచకండా వుంది సీతకి.

ఎప్పుడూ పెండ్లి సంబంధాల సంగతే ఇంట్లో అందరూ మాట్లాడుకోవడం చూసి సీతకి మరీ మతి పోవడము మొదలు పెట్టింది.

సీతమనస్సులో బాధ గుర్తించేవా రెవ్వరు ? గుర్తించినా తీర్చేవా రెవ్వరు ?

అనుకోకుండానే పెండ్లిచూపులు జరిగాయి. పెండ్లికొడుకు ఎవరైనా సరే అన్ననిశ్చయంతో నిస్పృహతో కొయ్యబారి పోయింది సీత.

"మాసీత అమాయకురాలు. మంచిఇంట్లోపడుతూంది" అంటూ పున్నమ్మ అందరితో చెప్పింది. పెండ్లి నిశ్చయం అయిం దని తెలియగానే సీత మరీ బెంగ పెట్టుకుంది. హడా విడిగా ఒక్క రోజులో సీతపెళ్ళి జరిగింది. ఎలా జరిగిందీ ఏవిటీ ఏం తెలియకుండా యంత్రపుబొమ్మలాగా పున్నమ్మ ఏం చెయ్య మన్నా చేసింది సీత.

పొగడదండలు మాత్రం తల్లో పెట్టుకుంది. పెళ్ళి కొడుకు కాస్త చదివినవాడూ, బాగా డబ్బుకలవాడు. అదే పున్న మ్మకి కావలసింది.

"అబ్బ ! మూడు ముళ్ళూ పడ్డాయమ్మా మాసీతకి" అంటూ చేటంత ముఖంచేసుకుని అనందపడింది పున్నమ్మ. సీత అత్తవారిఇల్లు తాతగారి ఇంటి దగ్గిరే అని బంధువులు అందరూ మరీ సంతోషించారు.

అస్తి ఉంది గాని పిల్లవాడు పిల్లకి తగినవాడు కాదు. అదే గాక ముప్ఫయి ఏళ్లున్నా యని అందరూ చాటుగా అను కున్నారు.

"నీకు నచ్చినవాడిని తెచ్చానా ! మోయతే నన్నినగలు" అన్నది పున్నమ్మ ఓరోజున సీతతో.

"మనఊళ్ళో సెట్టిలా గున్నాడు" అంది సీత తల వంచుకుని. ఆమాటకు ఆరో జంతా గింజుకుంది పున్నమ్మ.

వంటెడు నగలతో పట్టుచీరెతో సీత కళకళలాడుతూ కన పడింది అందరి కళ్ళకీ. "ఎంత నెమ్మది! వంచినతల ఎత్తదమ్మా" అనుకున్నారు అత్తవారు. ఎవరు ఎన్ని అనుకున్నా మంత్రాలతో ఎన్ని ముళ్ళు వేయించినా సీతమ్మమనస్సులోంచి శంకరం పోలేదు. అతను భర్త కాలేదనే వేదనతో కృశిస్తూనే ఉంది సీత.

పెళ్ళి అయిన మూడునెలలకి మళ్ళా గుంటూరుకి సీతని పిలుచుకువచ్చింది పున్నమ్మ. వారు ఊరు చేరిన ఉదయం సరోజ ఇంట్లోనే ఉండిపోయారు. పెళ్లికబుర్లన్నీ పున్నమ్మ సంబరంతో ఇరుగుపొరుగు వారికి చెప్పింది. సరోజమాత్రం సీతని చూడగానే గ్రహించింది. సరోజ ఇంకా బడికి వెళుతూన్నందుకు సీత సంతోషించింది.

ఎవ్వరూ లేని సమయం చూసి 'అతను ఎప్పుడన్నా కనిపించాడా సరోజా!' అన్నది సీత దగ్గరగా వచ్చి రహస్యంగా.

"కనిపించడం ఏమిటి ? బడిచుట్టూ తిరిగి తిరిగీ పాపం చివరకి ఆపొగడ చెట్టుకింద కూచునే ఉంటున్నాడు."

"నిజంగా ? అంది ఆదుర్దాగాసీత.

"నీకు పెళ్ళయిందని తెలుసు. ఎవరు కనిపించినా "సరే, నాసీతకి పెళ్ళయిందా ? ఇవిగో దండలు" అంటూ పిచ్చిగా తిరుగుతున్నాడు.

"తిరగడమే ?" అంది సీత కన్నీళ్ళతో.

"తిరగడ మేమిటి! ఇల్లువాకిలి అంతా వదిలి ఆచెట్టుకింద పడి ఉంటున్నాడు. ఎవ్వరూ ఆపక్కకే వెళ్ళరు. అందరికీ అత నంటే అమితభయం" అని సరోజ తల వంచు కుంది. సీత ఇంక వినలేక సరోజ ఒళ్ళోపడి ఏడ్చింది. ఎలా సమాధాన పరచాలో తెలియక సరోజకూడా ఏడుపు ప్రారంభించింది.

"మూడునెలలకే అంత ఏడుపులా? ఆడపిల్లలు కారుటే!" అంటూ పున్నమ్మ వచ్చింది.

ఆరో జంతా సీత లేవలేదు. సరోజకితప్ప సీతబాధ ఇం కెవ్వరికీ తెలియదు.

ప్రయాణబడలిక అని పున్నమ్మ సమాధాన పడింది.

సీత శంకరాన్ని చూడా లనే ఆశతో "గుడికి వెళతాను అత్తా" అంది.

"ఒక్కదాని వీనా వద్దు. పిచ్చివా డున్నాడుట. అందరం వెళదాం లే" అంది పున్నమ్మ. ఆమాట విని నీరై పోయింది సీత.

ఆ సాయంత్రం పూజకి అమర్చినపళ్ళెము సీత చేతికి ఇచ్చి సరోజతో పున్నమ్మ గుడికి బయలు దేరింది.

పొగడచెట్టుకింద వంగి నేలమీద పూ లన్నీ ఏరుతూన్న శంకరాన్ని చూసింది సీత.

"అతనే" అంటూ సరోజ చేయి చూపించింది. నేలమీద మ న్నంతా పూలు అనుకొని పోగుచేస్తున్నాడు శంకరం.

"అడుగో పిచ్చివాడు, త్వరగా రండి" అన్నది పున్నమ్మ తొందరగా అడుగులు వేస్తూ. ఆమాట విని సీత, చేతిలో పళ్ళెం వదిలేసింది. పళ్ళెం చప్పుడుకి శంకరం తల ఎత్తి చూశాడు. కింద పడిన పళ్ళూ, పూలూ తీస్తూ పున్నమ్మ సీతమీద విసు

క్కుంటూ తిట్టడం మొదలు పెట్టింది. సీతమాత్రం శంకరాన్ని తప్ప ఇం కెవర్నీ చూసే స్థితిలో లేక అలానే నిలబడిపోయింది.

"మతి పోయిందా ? కదలవేం సీతా ! పద"

అన్నది పున్నమ్మ ఆదుర్దాపడుతూ.

పున్నమ్మ కేకతో శంకరం ముందుకి వచ్చాడు.

"అ... నావి ఆపూ లన్నీ - ఏరకండి. చంపేస్తా" అంటూ శంకరం దగ్గిరగా రాగానే పున్నమ్మ వణికిపోతూ "తీసుకో నీ వయితే" అంటూ వెనక్కి అడుగు వేసింది. సరోజ పున్నమ్మ వెనక దాక్కుంది.

"ఈచెట్టు పూ లన్నీ నావి" అంటూ కింద పూలు మన్ను అంతా పోగుచేస్తూ శంకరం సీతపాదాలని చూసి లేచి నిల బడ్డాడు.

"నాసీతకి పెళ్ళయిందా ?" అన్నాడు పెద్దగా నవ్వుతూ ఆనవ్వుతో అందరూ భయపడిపోయారు. సీతమాత్రం కదల కుండా అతన్ని అలా చూస్తూ నిలుచుంది. శంకరం దగ్గిరగా వచ్చి – 'నాసీతవా నువ్వుః వచ్చావా సీతా' అన్నాడు చేతులు పట్టుకుని.

అయ్యయ్యో! రావే! అంటూ అరిచింది పున్నమ్మ.

ఆఅరుపుతో అంతా గుంపు చేరారు.

"నాసీతవే నువ్వు. ఇవిగో పూల దండలు." ఎన్ని ఉన్నాయి. రెండుదండలూ నామేళ్ళోనే ఉన్నాయి. అంటూ అక్కడ ఉన్న మన్ను గడ్డీ అంతా చేతులతో తీసి సీత ంలనింద పోశాడు శంకరం. 'రావే! కదల వేం, రావే, మొండి

దానా అని పున్నమ్మ ఏడవటం మొదలు పెట్టింది. పున్నమ్మ అరుపులు విని శంకరం సీతని ఎత్తుకుని కోనేటివైపు పరిగెత్తాడు. సీత రెండుచేతులతో అతనికంఠాన్ని చుట్టుకుని మెడమీద వాలి పోయింది. కన్నీళ్ళతో తిన్నగా కోనేటిగట్టుదగ్గరకి వెళ్ళి రాయిమీద కూచుని సీతని తనఒళ్లో దాచుకున్నాడు శంకరం. ఇంతలో జనం మూగారు. అరుస్తున్నారు. పున్నమ్మ "రావే తల్లీ" అంటూ ఒకటే ఏడుపు. ఆగోల వినకండా సీతతో ఏదో మాట్లాతున్నాడు శంకరం.

"ఇవిగో దండలు, ఒకటి నామెళ్ళో వెయ్యి" అంటూ సీతముఖం ముద్దులతో నింపేశాడు శంకరం. సీత భయంతో 'వదులు, వాళ్ళు నిన్ను కొడతారు' అంటూ ఒళ్ళోంచి లేవ బోయింది.

ఆ నిన్ను ఒదలను నాసీత, నాకోనేరు నాకోనేరు. నాచెట్టు, నాపూలదండలు. వెళితే రావు నువ్వు అంటూ మరీదగ్గిరగా సీతని తనచేతుల్లో బిగించుకొని గుండెలకి అదుముకుంటూ వెర్రి సంతోషంతో ఉన్నాడు శంకరం.

పోలీసులు, జనము అంతా గుంపుగా అతనిచుట్టూ చేరారు. ఆపెద్దగుంపు చూసి సీత అతని చేతుల్లోంచి తప్పించు కుని దభాలున కోనేటిలోకి దూకింది. జనం అంతా కోనేటిచుట్టూ చేరారు. అంతా వెతికారు. సీతమాత్రం తేలలేదు. పున్నమ్మ ఏడుపుతో కోనే రంతా ప్రతిధ్వనించింది. అంతే గాని సీతమాత్రం దొరకలేదు. గుడిలో గంటలు మోగాయి.

పిచ్చి శంకరంమాత్రం ఎప్పుడూ నవ్వుతూ ఆ పొగడచెట్టు కిందే కూచుని కోనేటివంకే చూస్తూ ఉంటాడు. ఎంతమంది ఎన్ని చిన్నరాళ్ళు విసిరినా హేళన చేసినా శంకరం పూల దండలు కట్టడం మానలేదు.

ఇంకా సీత వస్తుం దనే అతని ఆశ!

# వాన

## శ్రీ అడవి బాపి రాజు

జననము 1895 లో పశ్చిమ గోదావరి జిల్లా భీమవర సమీపములో సరిపల్లెలో. రాజమహేంద్రవరములో 1915 లో బి. ఏ. డిగ్రీ. Principal O. J. Couldrey ప్రభావమువల్ల చిత్రకళాప్రబోధము. 1922 లో గాంధీఉద్యమములో సంవత్సరము కారాగారశిక్ష. బందరులో జాతీయ కలాశాలలో ప్రమోద కుమార చట్టోపాధ్యాయునివద్ద చిత్రకళాభ్యాసము. 1929 లో బి. ఎల్. బందరు జాతీయ కళాశాలాధ్యక్షుడుగా నాలుగేండ్లు పని చేసినాడు. 1934 లో ఆంధ్ర విశ్వ విద్యాలయ బహుమానము "నారాయణ రావు" అను నవలకు వచ్చినది. హైదరాబాదు మీజాన్ పత్రికకు సంపాదకుడు. రచనలు : హిమబిందువు; గోన గన్నా రెడ్డి; తుపాను ; కోనంగి ; నరుడు ; జాజిమల్లి; అడివి శాంతిశ్రీ; అంశుమతి—నవలలు. అంజలి; రాగమాలిక; తరంగిణి; తూలికానృత్యము—కథాసందోహములు. అనేక గేయములు, పద్యములు, రేడియో నాటికలు, కథానకములు, వ్యాసములు రచించినాడు. బహు చిత్రములు చిత్రించినాడు. విదేశీయ బహుమానములు లభించినవి. చలనచిత్ర దర్శకుడు. గొప్పఈతగాడు. 1952 లో మృతి.

---

౧

"ఎల్లీ జగ్గాయిపేట యెన్నంగ నేను పోతే
యెగరేసి వలపులు జల్లే దూడమ్మ దూడ దూడా

సిగ తీసి కొప్పు బెట్టీ సిందూరం బొట్టు పెట్టీ
నా అందం నవ్విపోనూ దూడమ్మ దూడ దూడా
రంగూ రంగూల దూడ పొంగుచూ ఎగిరే దూడ
కాళ్ళ గజ్జెల దూడ గంతూ చెంగూల దూడ
దూడమ్మా దూడ దూడ దూడమ్మ దూడ దూడా !"

ఈపాట వానచినుకుల శ్రుతిలో కలిసి పోతోంది. చిన్న ఇల్లు చుట్టూ చిన్నఆవరణ ఆవరణచుట్టూ తాటాకులదడి, ఆ దోడ్లో ఉన్నవన్నీపాదులు, పాదులమధ్యను బంతిచెట్లు, చెట్లపై బంగారుముద్దపూలు. గుడిసెగుమ్మంలో, నీలాలు కూర్చుని ఉంది.

జుట్టు దువ్వుకోదు. బుక్కా రంగయ్య దగ్గర కొన్న కుంకుమ బొట్టు మాత్రం సూర్యబింబంలా ఆమె నీల ఫాలాన ఉదయారుణ కిరణాలు వెదజల్లుతూ ఉంటుంది. వెడద లైన ఆమె కన్నుల్లో నవ్వు లేదు. కంటికి పెట్టిన కాటుక కన్నీటితో కలిసి నున్నసై నల్ల నైన ఆమె చెక్కులమిద మరీ నలుపురంగులు రచించింది.

ఆమె కూర్చున్న మూర్తిలోనే అతిదీనత్వం అలుముకుని పోయింది. ఆమెగుండెలో బాధ, కడుపులో చెయ్యేసి కలిపేసినట్లయి, నిదరల్లె ఆమెఒళ్ళు నీరసిస్తోంది. బిగువై సుందరమై పూర్ణ మైన నవయౌవనంలో తీరని ఆవేదన, సర్వమునూ శుష్కింప చేస్తున్నవి.

తీయని తనమధురకంఠం జీరవోవ పాట సాగించింది

అద్దరూపాయి పెట్టి అద్దాలరవిక కొంటే,
రవికన్నా చిరగలేదే దూడమ్మ, దూడ, దూడా
కోటప్ప తిరణా లెల్లి కోరీన సవరం తెస్తే

కొప్పున్న మాయ లేదే దూడమ్మా, దూడ దూడా,
మూడురూపాయ లెట్టి ముత్యాలపాపిట బొట్టు
బొట్టున్నా చెరగలేదే దూడమ్మా దూడా !

ఆమె జీవిత మంతా నిండిపోయినాడు ఉప్పరి నాగన్న.. పొడుగాటి కోరతలపాగా అందగాడు, గిరజాలు, ముడిజుట్టు కారునల్లరాతి బండల బలం తిరిగిన వయసుకాడు. వెండిబిళ్లల తాడు, బంగారు మురుగులు, బంగారుదండకడియం, ఎడమ చెయ్యి పైభాగములో మాయపచ్చ బిందువు వేలాడే బంగారు పోగు. ఎర్రరాళ్ళ తమ్మంట్లు శుభ్ర మైన ముదుకుపంచె ఎగ దోసి కట్టుకొన్న పనితనం.

ఇలా తనకు మొదటిసారి ప్రత్యక్ష మైన నాగన్న అద్భుత రూపం నీలాల కళ్లల్లో మెరుపు మెరసింది. ఆనాడు అతగాడు పాట పాడుతూ తనతండ్రి పొలములో తారసిల్లాడు.

'బెజవాడ చిన్నదానా. బాజూబందూలదానా
బాజూబందూలమీద మన సేల లేదే ఓచిన్నదానా !

తనను చూచి అతడు ఆగాడు, పాట ఆపాడు. నీలాలు గుండె కొట్టుకుంది. పై కుబికి, రానివ్వకూడని రహస్యభావాలు ఆ మెలో ఎక్కడో పెద్దపేరులా బయలుదేరినవి. బిగువుగా తొడుగు కొన్న పీటీరవికకింద స్నిగ్ధాలై వత్రువలై బిగు వైన ఆమెవక్షోజాలు రవికఖైదును పగులకొట్టి బయటికి వచ్చిన ట్లయినవి.

కమ్మని రంగురంగు నేల లున్న భూదేవికి వారు అనుగు బిడ్డలు. వారి పెద్దలు, ఆకన్నతల్లిలోని ప్రేమను చూరగొన్న ఉప్ప

రులు, నల్లరేగడలు, ఎఱ్ఱచెక్కలు, నీలి ఎరుపుఒండ్రు బంగా రాలు తెల్లనిగంధ్ర ఇసుకలు, బంగారు సన్నఇసుకలు, నిండి పోయిన ధూళిరంగు చవుటిపఱ్ఱలు, వారి గునపాలచే పారలచే మథింపబడ్డవి.

భూదేవిలోని రహస్యాలు, ఆమెకర్కశత్వం, ఆమెలోని కరుణ, వారికి తెలియునట్లు ఇంకోరికి ఎట్లు అవగత మవుతుంది ? ఆమెలోని రసజ్ఞత్వము వారునూతులు కట్టి పైకి తెత్తురు. ఆమెలోని మహదైశ్వర్యము గనులు దింపి లోకానికి అర్పింతురు. ఆమెదివ్యప్రేమను కాలువలు త్రవ్వి దేశదేశాలా ప్రవహింపజేతురు. గుళ్ళుగా, గోపురములుగా, భూలక్ష్మికి నూతనాలంకారాలు వారు సమర్పింతురు.

భూసంతానమైన వారి ఒడలు సకల సుగంధాలను మలయానిలునకు అర్పిస్తూ ఉండును. అందానికి మూలమైన, విశ్వంభరానిధి నుంచేవాళ్ళు సకలసౌందర్యాలను సేకరింతురు.

ఆఉప్పరికులంలో వాళ్ళిరువురూ ఉత్తుంగశిఖరాలు. ఆమె చూపులు అతనిపై, అతనిచూపులు ఆమెపై, చూపులలోచూపులు కలిసినవి. అతడు మదించిన యౌవనసింహము. ఆమె నూత్న లావణ్య శోభావతియైన ఆడసింహము. ఆమెనుచూచి అతడు అనుకున్నాడు:

"పలకనైన పలకవే పంచదారచిలకవే"

అతనిని చూచి ఆమె అనుకున్నది:

"ఓరోరి! నాబావా, ఒయ్యారి నాబావ !
మబ్బుల్నించి దిగి వస్తివా ! మాయదారి నాబావ !
మబ్బుల్నించి, దిగి వస్తివా !"

## ౨

ఒక పెద్దజట్టుకు నాయకుడై, అయిదెకరాల మాగాణీకి అరెకరాల మెరకకు భూపతియై, సాలుకు రెండువందల యాభై రూపాయల ఆదాయం రాగా, మెరక ఊళ్ళల్లో ఏనుయ్యో పల్లపు ఊళ్ళల్లో ఏచెరువో త్రవ్వకంట్రాక్టు పుచ్చుకొనిగాని, ఏ రోడ్డు బాగుచెయ్యడమో, ఏక్రొత్తరోడ్డు వెయ్యడమో బోర్డుకంట్రాక్టరు వద్ద త్రవ్వపని ఒప్పుకొనిగాని, సాలుకు ఒకవందరూపాయలు పైగా సంపాదించే హనుమన్న తనకు ఏకైక పుత్రియైన నీలాలుకు మంచిసంబంధం తీసుకురావా లని ఊళ్ళుఊళ్ళూ గాలించి వెదికాడు. ఏరుదాటైనా ఇంటికి వచ్చి నీ పశువుని తెచ్చుకోమని- తమ జిల్లా దాటి, వేరుజిల్లాలకు వెళ్ళి ఒకజట్టుకు నాయకుడై, నాలుగు ఎకరాల మాగాణిభూమి మీద సాలుకు నూటయాభై రూపాయల ఆదాయం కలవాడునూ, అందగాడున్నూ, త్రవ్వ పనివల్ల సుమారు నూరు రూపాయలు ఆదాయము తెచ్చుకునె వాడునూ అయిననాగన్నను అల్లుడుగా ఎన్నుకున్నాడు హనుమన్న.

పెళ్లై క్రొత్తగా అత్తవారింటికి వచ్చిన నాటిసంగతులన్నీ జ్ఞాపకానికి తెచ్చుకుంది నీలాలు.

నాగన్న భార్యను చూచి ఉప్పొంగిపోయాడు. తనఅందా నికి తగిన అందాలపడుచు. పొద్దస్తమానాలు ఉప్పొంగి పోతూ పాటలు పాడుకొనేవాడు.

"చిన్నదాన, చిన్నదాన, వన్నెల వలపుదాన !
కన్నుల నలుపుదాన, పన్నుల తెలుపుదాన !

చిన్నారి సిగ్గుదాన, యెన్నెల యెలుగులోన !
తిన్నంగ తేలిపోదాం ఓసిన్నదానా ! ఓసిన్ని దానా !

అని నీలాలుని తనసందిట్లో బిగించుకొని, వెన్నెట్లో ఇంటి దగ్గిరనుంచి ఉప్పుటేరుకు తీసుకు పొయ్యేవాడు.

"నీకు నాకూ జోడు ఐతే మల్లెపూల తెప్పగట్టి
తెప్పమీదా తేలిపోదాం పదవే
చల్ చిన్నారిపడుచా తెప్పమీదా తేలిపోదాం పదవే".

సిగ్గుతో నీలాలు అప్పుడు ముసిముసినవ్వులు నవ్వుకున్నది. నాగన్న మెడచుట్టూ చేతులు గట్టిగా బిగించి అతని వెడద యైన రొమ్ములో తన మోమును గట్టిగా అదుముకొన్నది.

"ఏటే ఆలోసిస్తున్నావు ? ఈ పళంగా పడవ ఏసుకోని మన మిద్దరమే ఎల్లిపోతావుంటే నీ మొగం సూత్తూ అంతా మరసి పోయి, ఏళ్ళు ఏళ్ళు గడిపేసు కోగల్ను !"

"ఏ రంటే నాకు బయం" ఏత్తిది బాబూ !

"మరి యవ రంటే భయం లేదు ?"

"ను వ్వంటే బయం లేదు"

"అల్లాగా ! సూత్తా వుండు ఎమికిలు యిరిగేటట్టు నొక్కేత్తా. అబుగ్గలు కొరికేసి తినేత్తా నేను పొలం ఎల్లి వచ్చేటప్పటికి. కూడొండక పోతే చెమడా లెక్క నాగేత్తాను."

"నువ్వు పొలం ఎల్లి వొచ్చేటప్పటికి బొచ్చు చేప కూడ వొండి సిద్ధంగాఉంటే న న్నేంసేస్తావు ?"

"ఏం సేస్తానా ! కడుపునిండా చేపలకూ రేసుకు తినేత్తాను. నిన్ను హెూం అని మింగేత్తాను."

"ఓ సబ్బా నాకు బయ మేటి ? నీ కడుపులోనే, నేను

దాక్కుంటేను."

"నాకడుపులోంచి గుండెల్లోకి పోతా వేంటే నీవే"

"అవును బావా! నీగుండెలు నిండుతా, నీ నిలు వెల్లా నిండిపోతా"

"కూరలో నే నుంటె, కూర మింగీయేత్తే,
గుండెల్లో చేరుకొని, కునుకు తీత్తుంటాను, నాబావా!
గుండెలో దాగుంటె, కోటిరాజ్యా లేలి, ఆకాశమం తెదిగి,
అందాలు తవ్వుతా, నాపిల్లా! చందురుణ్ణి తెత్తానాపిల్లా!

అలాటి తనదొర, తనరాజు, తన బావను, పెద్దరయితు దురన్నాయంగా, ఖైదులో ఏయించాడు గదా, దేవుడు నేడా! అమ్మవోరు నేదా! ఆ ఆలోచనలకి అడ్డం వచ్చాడు ఉప్పరి సెల మయ్యా. ఆరోజు పొలం ఆక్రమించుకోటానికి. పెద్దరైతు వాన లోనే పదిమంది పాలేళ్ళతో వస్తూన్నా డని సెలమయ్యా కబురు చెప్పినాడు— వాననీరు కారిపోతూండగా తుడుచుకొంటూ ఒగర్చుకొంటూ.

ఆమాటలు వినడంతోటే నీలాలు ఆడవేటకుక్కలా లేచింది.

"ఒరన్నో గూడెం అంతా సెప్పురా!" అన్నది, మూల నున్న దుడ్డుకఱ్ఱ పుచ్చుకొని బయలు దేరింది.

వానజడిలో వియ్యా మందుతూన్న కంటినీరు మాయమై పోయింది. సివంగిలా ముందుకు లాగి నడిచింది. మరో వైపు నుంచి పెద్దరైతూ అతని పాలేర్లూ వచ్చారు. నీలాలు కళ్ళల్లో ఎరుపులూ, పెద్దరైతు గుండెల్లో చీకటిపొగలూ కమ్మాయి.

నా పొలంలో ఏయెదవ అడు గెడతాడో అణ్ణి సంపేసి

అక్కడే పారేత్తాను, అంది నీలాలు.

పెద్దరైతు మీసాలు రెండూ కోపంతో వణికిపోయాయి.

ఆడలంజకి ఎంత పొగరూ ? దీని మొగుణ్ణి పాగ రణచి నట్లు దీన్ని అణచాలి. ఈయాళకి ఊరుకొంటున్నాను. రేపొద్దున్న అడ్డం వచ్చావా, పదిమందిలో నీసీర వొలిచి వాత లేయిస్తాను. అని అరుపు అరిచాడు.

"ఓరి చచ్చునాయినా! దౌపదమ్మగారి సీర వొలిచిన యదవ రక్తం ఆమె భర్త భీముడు తాగాడుగాని, సీరక్తం నేను పుడిసిళ్ళ తాగనుట్రా అంది నీలాలు. నీలాన్ని కన్నెత్తి సూడలేక పొయ్యాడు పెద్దరైతు.

పాలంగట్టున ఉన్న ఉప్పరి నాగన్న ఇంటిలో ఉప్పర్లం దరూ ఆరాత్రంతా కూచుని కునికిపాట్లు పడుతూ వున్నారు. జడివాన కురుస్తూనేవుంది.

నింగీ నేలా ఒక టయ్యాయి
కుంగినాయి, లోకా లన్నీ,
పెద్దరైతుకు బుద్దే లేదురా
ఓరన్నా తమ్ముడ సిద్దురపోరా ఆడీగుండెల్లో
నల్లనేలే పరిమళించే
మల్లిపూలూ మొగలీపూలన్నా
మొగలిరేకే భూదేవిబాకేరా !
ఓరన్నా తమ్ముడ !
మొగలిలోన నాగన్నఆడేరా !"

వాన పన్నీరుచే వాసన, నల్లరేగడ పారిజాతపూలవాసన; గరపనేల మంచిగంధంపరిమళం; ఎర్రచెక్కనేల అగరువాసనా,

ఇసుకనేల పెద్దజాజిపూల సురభిళం, రాతినేల లవంగవాసనా, పట్టినేల సముద్రం వాసనా, సున్నంనేల దాల్చిన చెట్టు- పూవు వాసనా వేస్తాయి.

ఈ నేలలలో వానలు కురిసినప్పుడు కొంచెం మంచి గంధం కలిసి అయా వాసనలు ప్రసరిస్తాయి. వ్యవసాయం చేసిన భూమి దున్నినప్పుడు తుంగముస్తలవోసన గుప్పు మంటుంది.

ఈ నేలను తవ్వే ఉప్పర్లకు ఈ వాసన లంటే ఎంతో ఇష్టం.

కాలువలు త్రవ్వి నీరు ప్రవహింప జేసేటప్పుడు వచ్చే సువాసన పూల చెట్లపై తోటమాలి నీళ్ళు పోసేటప్పుడు వచ్చే వాసన వస్తుంది.

ఈ పరిమళా లన్నీ ఉప్పర్ల జీవితాలలో నిండి వుంటాయి. నీలాల కీ సుగంధాలు లేవు. మిరపతోటలో వసంతకాలపు జడివాసనే నిండిపోయింది. ఉదయం కాకుండా, పొలంలో నాగళ్ళు దింపారు. ఉప్పర్లు దున్నలు కట్టి పొలం దున్నేశారు. వాన వారి చుట్టం. మబ్బులూ వాళిచుట్టాలే కదా! పొలమూ, వారూ ఒకటే, ఎవ రయ్యా నీలాల పొలంలో అడుగు పెట్టేది ?

౪

పెద్దరైతువల్ల బాధలు పడ్డ ఒకడు నాగన్నను ఖైదు పెట్టిన సబుజైలు తాలుకా గ్రామం ఆరాత్రి రాత్రి పోయి, నాగన్న పేరున పెద్దవకీలు ప్రజ్ఞావంతుడు అయిన వీరాస్వామి నాయుడు గారిని కుదిర్చి, ఆయన సలహాపైన ఆయన దగ్గరకు

పోలీసు సబ్ ఇనస్పెక్టరు గారిని వానలోనే జట్కా బండిమీద లాక్కొని వచ్చాడు. వీరాస్వామినాయుడుగారు కథంతా విన్నారు. ఆయన హృదయం కరిగింది. నాగన్న పొలందగ్గిర అల్లరి జరుగకుండా, చూడవయ్యా అని సబ్ఇనస్పెక్టర్ని నాయుడుగారు పంపించారు.

నాగన్నవాళ్ళ ఉప్పర్లపల్లె, ఒకపెద్ద గ్రామానికి సివారు. ఆగ్రామంలో పెద్దరైతు నూరెకరాల ఒక పంపును అంటి నాగన్న మూ డెకరాల పంపూ ఉంది. పెద్దరైతుకు అచుట్టుప్రక్క గ్రామాలలో అయిదారువందల యకరాల భూము లున్నవి! ఉద్యోగులే పెద్దరైతుగాదికింద బంగారం తినే మూషికాలు.

నాగన్న పొలం, కాలవగట్టు పొడుగునా ఉంది. ఆ పొలం పెద్ద రైతు నూరెకరాల పంపుకూ, కాలవకూ అడ్డంగా ఉంది. తలుచుకుంటే నాగన్న మూడెకరాలలో ఆకుమళ్ళు మిలమిలలాడిపోతు పోటెత్తురు వస్తాయి. కాలవ వదిలితే అయిదు నిమిషాలలో పొలం తడిసి పోతుంది.

పెద్దరైతు ఈమూడు ఎకారాలు అమ్మమని కోరాడు. నాగన్న రక్తపుబొట్టులు ధారపోసి కొన్నపొలం ఎల్లా అమ్ముతాడు.

అమ్మను నేను బాబయ్యగారూ అని మనవి చేశాడు. ఎంత మందిచేతనో చెప్పించాడు పెద్దరైతు. నాగన్న 'స్వామే! నాప్రాణాలాభూమిలో ఉన్నా యన్నాడు.

పెద్దరైతుకు పంతం వచ్చింది. బెదరించాడు. రెండురెట్లు ఖరీ దిస్తా నన్నాడు. బదలాయింపు మంచి భూమి యిస్తా నన్నాడు. నాగన్న 'ససేమి బాబూ! భూమి నాపెద్దబారియ. సిన్నదే నీలా' లని తలపంకించాడు.

'సరే! నీభూమీదక్కదు. నీలాలూ నీకు దక్కదురా!' అన్నాడు రైతు.

నాగన్న కోపంతో వణికాడు. తల వాల్చుకొని తనగూడెం పోయి, నీలాలును, తనహృదయానికి అదుముకొని, కంట నీ రెట్టాడు.

"ఏటిబావా! అది, అంది వెఱ్ఱినీలాలు. భూదేవి గజగజ లాడింది కాబోలు, ఆమర్నాడు పెద్దవాన ప్రారంభించింది. వానలో వచ్చి నాగన్నను అరెస్టు చేసి తీసుకుపోయి తాలూకా గ్రామంలో ఖైదు చేశారు పోలీసువారు. దొంగతనం నేరం మేజష్ట్రేటు దగ్గరకేసు.

౫

ఉరుములూ మెరుములూ, వానదబ్బాటుతనం వదిలి తుంపరగా మారింది. పడమటి దిక్కున తెరపి కనబడింది.

పుట్టింటికి పోకుండా ఉప్పరి నీలాలు భర్తకోసం అతని యింట్లోనే ఉంది. నీలాలింటికి ఉప్పరి పెద్దపెళ్ళాం వచ్చి, నీలాలుకు ఆసరాగా ఉంది.

రిసీవరు నీలాలుకే భూమి కౌలు కిచ్చి చక్కా పోయాడు. నీలాలు మర్నాడు సాయంకాలము వానతెరపి చూచి పొలం ముదురాకు ఊడ్పిస్తే బాగుంటుం దని అనుకొంది.

"ఏకాడ నున్నావు నాబావా!
ఏమి సేత్తున్నావు నాబావా?"

అని అనుకుంది నీలాలు. చలమయ్య అన్నను ప్లీడరు

గోరి దగ్గరకు పంపినాను కదా ! ఇంకా అన్న తనబావ ఊసొట్టు కొని రాసేలేదు అని తనలో మాట్లాడుకొంది.

వెంటనే వెనకాలే వచ్చి ఎవరో కళ్ళు మూశారు. యా రది, ఎట్టివేళాకోళాలు, ఒదిలేయి కళ్ళు మూత్తావే? ఓ రెవడురా ఉంక! చంపేత్తాను చేతులు తీయవేరా? అని యెక్కడా లేని బలంతో చేతులు లాగిపారేసి, శక్తిలా తిరిగింది నీలాలు.

ఎదుట నాగన్న నవ్వుతో "ఎంత బలం ఉందే నీకు పిల్లా నాయేళ్లు రగతం వత్తున్నాయి చూడేసి" అన్నాడు.

"నాబావే!" అని ఒక్క గంతున అతని మీద వాలి పోయింది నీలాలు.

పీడ రయ్యాగోరు బేలుమీద ఇడదల చేయించాడు. అర్రి నువ్వే పెట్టించా వంటగా? నీమెడలో బంగారు గుళ్ళ పేరు తాకట్టు యెట్టా వంట. నువ్వు మాలచ్చివే పిల్లా అని నాగన్న పలుకుతూ, నీలాల్ని గుండె కదిమేశాడు.

వాన తగ్గింది. సాయంకాలం యెండ, బంగారు రంగులు చల్లిందా కౌగలింతలో ఉన్న దంపతులమీద.

"ఇద్దారి మనసూ లేక మైపోతే,
పొద్దున్న సూరేడు ముద్దెట్టు పూలు
ఇద్దారి బతుకులు ఏక మైపోతే
సందేల సూర్యుడు సెంద్రుణ్ణి ఇచ్చు"

భూమి ముసి ముసినవ్వులు నవ్వుకొంది.

# దేశం నా కిచ్చిన సందేశం

"శ్రీ బుచ్చి బాబు"

(శివరాజు వెంకట సుబ్బా రావు)

---

జూన్ 1916, ఏలూరులో జననము. బి. ఏ (1938 ఆంధ్ర); ఎం. ఏ (మదరాసు, నాగపుర విశ్వవిద్యాలయములు - 1940–42), అనంతపురములో, వాల్తేరులో అంగ్లభాషాధ్యాపకుడుగా పని చేసినాడు. 1945 లో All India Radio లో Programme Assistant గా చేరినాడు. చిత్రకళలోను, రంగస్థలముమీదను అభిమానము. ముద్రితరచనలు: అయిదు కథలు (1939) మేడమెట్లు (కథలు-1950) అడవిని కాచిన వెన్నెల (కథలు-1951): దారినపోయే దానయ్య (నాటికలు-1951); ఆత్మవంచన (నాటిక - విశిష్ట నాటికాబహుమానము పొందినది. ప్రచురణ (1952); చివరికి మిగిలేది (పెద్దనవల-1952); ఉత్తమ ఇల్లాలు (నాటకము– 1953); అద్యంతాలు (1954); నిరంతరత్రయం (కథలు-1955); ఉమర్ ఖయ్యామ్ (రంగనాటిక-1956).

---

౧

"ఏ మైంది?"

"పోయింది."

"నే ననుకుంటూనే వున్నా. నాటకాలు, సంగీతాలు, ఆటలు పెట్టుకుంటే చదువు లొస్తయ్యా?"

"ఇప్పుడు నేను ప్యా సవక పోతే దేశాని కొచ్చిన అనర్థం ఏ ముంటం టావు?" అని అడిగాను యువక ఆవేశంతో.

"దేశాని కేం—దేశం హాయిగా వుంటుంది. నీ మంచికోసమే. ప్యా సవుతే నాలుగు రాళ్ళు గడించుకుంటావు. మీ నాయనగార్ని సుఖ పెడతావు. పెళ్లానికి నగ లెడతావు. అంతే."

"నాలుగు రాళ్ళతో నే?"

ఆయన నా ప్రశ్న వినిపించుకోలేదు, వెళ్ళిపోయాడు. ఉత్తముడు; స్వార్థరహితుడు; ప్రపంచ శ్రేయోభిలాషి; సందేశం యిచ్చాడు; అవతారం చాలించుకున్నాడు.

ఇంటి కొచ్చాను.

చేతులో పత్రికా, నా వైఖరీ చూసి, మామగారు చతికిల పడ్డాడు. నేను తిన్నగా గదిలో కెళ్ళాను. సుందరం గోళ్ళు కొరుక్కుంటూ మంచం పట్టిమీద కూర్చుంది. నన్ను భోజనానికి ఎవ్వరూ లేవ మనలేదో, లేక, అంటే నేను వినిపించుకోలేదో. నా అంతట నేనే వెళ్ళి తి నొచ్చాను.

సాయంత్రం క్లబ్బు కెళ్ళాను.

"ఒరేయ్ బ్రదర్, నన్ను విడిచిపెట్టి ను వ్వొక్కడవు ప్యాస అవడం ఏం ధర్మంరా?" అన్నాడు మాధవ రావు.

"ప్యా సైనవాళ్లు మనల్ని విడిచిపెట్టలేదూ?"

"వాళ్ళలో త్యాగం లేదు రా. ఇంతకీ వా ళ్ళందరికీ ఉద్యోగాలు సిద్ధంగా వున్నయ్యా?"

"ఉండా లన్న నిబంధన వుందా ?

"లేకపోతే ఎందుకూ ప్యా సవా లన్న వుబలాటం--నీలా, నాలా, హాయిగా ఫే లవకూడదూ ?" అంటూ మాధవ రావు,

మెల్లిగా పేకాట బల్లకేసి కదిలాడు. అమ్మయ్య, అనుకుని స్తంభానికి జార్లబడి నా చదువునుగురించి ఆలోచించడం మొదలెట్టాను. నేను వొంటిగాణ్ణి అనే భయం పోయింది. నాతో నిమిత్తం వున్నవారూ, నా శ్రేయస్సు కోరేవారూ, ఎందరో వున్నారు. నే నొక ముఖ్యమైన వ్యక్తిని. నా చేష్టలు కోర్టు పనిమీద వెళ్ళే పెద్ద మనుష్యుల్ని నిలిపివేస్తాయి; మామగార్ని చతికిలపడేటట్లు చేస్తాయి. మాధవ రావుల్ని సంతోష పెడతాయి; సుందరం కళ్ళల్లో కన్నీటిని రేపుతాయి. దేశం అంటే మాటలా! ఎవరో 'దేశం అంటే మట్టి కాదోయ్. దేశం అంటే మనుషులోయ్' అని పాడుకున్నారు. దేశం అంటే, సందేశం.

"పోయిందిటగా..."

ఉలిక్కిపడ్డాను. రాజా రావు గారు; తాశిల్దారు. నాన్నగారి ప్రాణస్నేహితుడు.

"అవునండి."

"నీ పరీక్ష ఫేలవడం ఏమి టయ్యా!"

"........."

"ఐ. సి. యస్. ప్యాసై, మా జిల్లాకి కలెక్టరుగా రావల్సినవాడవు..."

"........."

"ఈసారేనా బాగా చదువు, ఫష్టుగా ప్యా సవాలి." అంతటి భారం నా నెత్తిన పెట్టి చక్కాపొయ్యాడు రాజా రావు గారు. నే నొక సామాన్యుణ్ణి అనుకోడానికి తావు లేదు. నేను అసాధారణుణ్ణి; వొక మహత్తరవ్యక్తిని; లోకోద్ధారకుణ్ణి. దేశం తనపన్ని కాసేపు మానేసి, నాకు సందేశం యిచ్చిం దంటే, నే నెంతటి

వాణ్ణి అవాలో! దేశం సామాన్య మైనదా? 36 కోట్ల జనాభా— ఉత్తరాన హిమగిరులు, తూర్పున బంగాళా ఖాతం; హరప్పా నాగరికత; ఎల్లోరాల శిల్ప కళ; వాల్మీకి సంస్కృతి; కాళి దాసు ప్రతిభ. అనాది నుంచీ, కాంతి కాగడా ఆరిపోకుండా పట్టుకుని నిలబడ్డ భారతమాత.

అవిడికి—నాతో నిమిత్తం వుంది. నాలుగు రాళ్ళనుండి, ఐ. సి. యస్. వరకూ నా యిష్ట మొచ్చిన దాన్ని సంపాదించుకో మంది. ఇం కేం కావాలి?

పరీక్షలు పే లయినకొద్దీ నే నొక మహావ్యక్తి నన్న నమ్మ కము దృఢ పడుతూ వచ్చింది. కావలసిన పరీక్షలు ఎల్లాగో ప్యా సయ్యాను. ఆ మహానుభావుడు ఏరోజు నన్నాడో, నాలుగు రాళ్ళూ గడించడంకూడా జరిగింది. మొదట్లో మన సంఘానికి నా నాలుగురాళ్ళ విషయంలో కొన్ని సందేహాలు రాకపోలేదు. నన్ను మొదట్లో పరామర్శించిన ఉత్తమ పురుషుడే, నిలేసి అడిగాడు.

"అవుతే, అబ్బాయి, నీ కే మిస్తారు?"

"ఏవో నాలుగురాళ్ళు" అన్నాను.

"అది సరే లేవోయి—అస లెం తిస్తారు?"

"చెప్పానుగా."

"చెబుదూ — పెద్ద చదువులు చదివావు, వుద్యోగం చేస్తున్నావు. ఎన్ని వెటకారం మాటలేనా అంటావు." అయన సందేహం తీర్చనందుకు ఆయనకు వూ చిరాకు పుట్టుకొస్తోంది. సంఘం ఆయనచేత ఆ ప్రశ్న వేయించింది. ఆ ప్రశ్న వెనక, మన జాతీయత, నాగరికత, సంస్కారం దాగి వున్నాయి. జాగు

చెయ్యకూడదు. వెంటనే సమాధానం యిచ్చి తీరాలి.

"నాలుగు రాళ్ళండీ" అన్నాను. ఆయనమీద నాకు బహిర్గతం కాని పగ వుందో, లేక నా ఆర్జన అల్ప మైన దని చెప్పు కోడం చిన్నతనమో.—నేను ఆ జవాబే యివ్వడానికి కారణం అవాలి.

"అంటే నాలుగు రూపాయలా? హవ్వ!" అని నోరు నొక్కుకున్నాడు.

"మీ దీవన ప్రభావం" అన్నాను కొంచెం కసిగా.

"ఆ—యిప్పుడు తెలిసిందిలే—రోజుకి కాబోలు."

"కాదండి."

"వారానికి నాలుగా? గంటకి నాలుగా?"

"మీ కంత వేళాకోళంగా వుంది."

"చంపక చెబుదూ."

చూడండి; ఆ సందేహం ఎట్లాంటిదో, ప్రాణం కూడా తీసేస్తుంది. ఆయన ఆ క్షణాన చచ్చిపోతే, నేను హత్యచేసిన వా ణ్ణవుతాను. చెప్పి తీరాలి.

"నాలుగు అంకె గల రెండంకెల సంఖ్య" అన్నాను. ఆయన తేరుకున్నాడు. నాడి ఆడుతోంది. గుండెలు యథా ప్రకారం కొట్టుకుంటున్నాయి.

"తొంభై నాలుగా?" అని అడిగాడు పూర్తిగా శ్వాస విడుస్తూ.

"నలభై తొమ్మిది కాగూడదూ?" అన్నాను.

"ఇంత చదువూ చదివి యింతే? కిల్లీకొట్టువాడు గడించు కుంటాడు. ఓవేళ ముందు ముందు పెద్ద ధనవంతుం డేమో లే"

అంటూ ఆయన్ని తీసుకుని సంఘం లేచిపోయింది.

కిల్లీకొట్లని చూస్తూ యింటి కొచ్చాను. నాలాంటి సంపాదన గల యితర వ్యక్తులను గురించి ఆలోచించడం మొదలెట్టాను. రిక్షావా డొకడు కనిపించాడు. మజ్జిగమనిషి—మోటారు నడిపేవాడు. ఏమో, వా ళ్ళింకా ఎక్కువ ఆర్జిస్తా రేమో నన్న సందేహం బయలుదేరింది. ప్రతివా డింటికీ వెళ్ళి కనుక్కుని వొక ఛార్టు తయారు చేస్తే? అట్లా చెయ్యడం వొక వుద్యోగం అవుతే ఎంత బా గుంటుంది ?

భోజనాలదగ్గర మామగారికీ అ సందేహ మే వొచ్చింది.

"ఎంతిస్తా రేవిటి?"

నాకు మామగారిమీద కోప మొచ్చింది. వా రమ్మాయికి ఉత్తరంలో ఆ విషయం వ్రాయనే వ్రాశాను. ఓవేళ యిందాక పరామర్శించిన వుత్తమ వ్యాఖ్యాత ముందే యిక్కడి కొచ్చి, యీనకి 'కీ' యిచ్చిపొయ్యాడా !

"మీకు తెలుసుగా " అన్నాను.

ఆయన చిత్రంగా నవ్వడం మొదలెట్టాడు.

"అంటే వొచ్చే సంవత్సరానికి."

వారి అనుమానం ఇంక్రిమెంటు ఎం తని, అది కాస్తా చెప్పిద్దా మనే ఆయన సంకల్పం!

"ప్రొబేషన్ పూ ర్తవుతుంది" అన్నాను. ఆయన గడసరి. మళ్ళా ఆ విషయం ప్రస్తావించలేదు.

సాయంత్రం క్లబ్బు కెళ్ళాను

"ఏరా బ్రదర్, ఎంత డ్రా చేస్తున్నావురా ?" అని అడిగాడు. నాతో సమంగా ఫే లవుతూ వొచ్చిన నిజమైన సహాధ్యా

యుడు త్యాగి. సంఘానికి వొక సమాధానంలో గురిలేదు కాబోలు. ఆరా తీసి, సాక్షులచేత వొప్పించి, నిజానిజాలు ఋజువు చేస్తే కాని వూరుకోదు కాబోలు. ఈ స్వార్థరహితుడి చేత తన సందేహం యింగ్లీషులో చెప్పించింది. అది 'డ్రా' చెయ్యడం అంటే ఆవుని పాలు పిండినట్టు సంఘాన్ని పీడించి, బలాత్కారంగా లాక్కోవడం.

"నువ్వెంత 'డ్రా' చేస్తూన్నావో నేనూ అంతే" అన్నాను.

"ఓరి ఫూలా, మనం యింకా డ్రాయింగూ గ్రీయింగూ లేదు. తెలీదు?" అని నవ్వడం మొదలెట్టాడు యీ మహా వీరుడు.

ఏం చెప్పను?

"అవుతే, నువ్వు 'డ్రా' చెయ్యడం మొదలెట్టినప్పుడు ఎంత 'డ్రా' చేస్తావో, అంత" అన్నాను. దెబ్బతో అదిరి పడ్డాడు. ధీరోదాత్తుడు గాయపడి, పేకాట బల్లకేసి కుంటుకుంటూ వెళ్ళాడు.

అడుగడుక్కీ యీ ప్రశ్న నన్ను ఎదుర్కొంటూనే వుంది. కనపడిన వ్యక్తిని ముందుగా నేనే అడిగిస్తే ఎల్లా వుంటుందో? ఎవరో వీపుమీద చరిచారు, వెనక్కి తిరిగాను. రాజారావు గారు, తాశిల్దారు. ఆయన కెం తిస్తారో?

"ఉద్యోగం దొరికిందటగా, ఏ మిస్తారు?"

నన్నుగురించి తెలుసుకోవల్సిన విషయాలు ఎన్నో వున్నాయి. నా మనస్తత్వం, అంతరంగికం, ఆదర్శాలు, శృంగార జీవితం, రాజకీయాలపై అభిప్రాయాలు, యిన్నుండగా, నా జీతం ఒక్కటేనా అడగవల్సింది?

"ఏదో—అందర్లాగే."

"అంటే?"

"మొదట్లో సాధారణంగా అందరికీ ఏ మిస్తారో, నాకూ అదే."

చూపుడు వేలు చూపించి తల పంకించాడు.

నాకు వెంటనే అర్థం కాలేదు.

"వందా?" అన్నాడు.

"యించుమించు" అన్నాను.

"అయ్యో కర్మ! వందా లేదు"

"రిటైరయ్యే టప్పటికీ రెండొందలు దాకా వెడుతుంది లెండి. మీకో?"

రాజా రావు గారు నవ్వడం సాగించాడు. ఆయనికి నా మీదున్న అభిప్రాయం కొంత తగ్గినట్లు కనిపించింది. మా నాయన గారి ఆరోగ్యమేనా అడక్కుండా కదిలి పొయ్యాడు. నవ్వునుంచి చాలా సేపటివరకూ ఆయన తేరుకోలేదు. నా కాశ్చర్యము కలిగింది. జీవితం హాస్యాస్పదం కావడం అంటే యిదే కాబోలు. నాకొచ్చే జీతం అంతటి ఆనందాన్ని కలిగించింది.

♦ ♦ ♦

మూడేళ్ళు గడిచాయి.

నా జీతం ఎంతో ఎవరేనా అడిగినప్పుడల్లా, డైరీలో వొక గుర్తు పెట్టుకుంటున్నాను. అప్పటికి, రెండువందల యిరవై మూడుసార్లు యీ ప్రశ్న అడగడం జరిగింది. అది యించు మించునే కలుసుకున్న వ్యక్తుల సంఖ్య. ఒక వ్యక్తి ఆ ప్రశ్న వేసి, సమాధానం తెలుసుకుంటే, ఆ సమాధానం తన కుటుంబంలో

అందరికీ తెలుస్తుం దని భావిద్దాం. అప్పుడు ఒక్కొక్క వ్యక్తి కుటుంబంలో, పదిమందేనా వుంటా రని అనుకుంటే, రెండువేల మందికి పైగా నా జీతంగురించి తెలిసిం దనుకోవచ్చు. అంటే యించుమించు నా జీవితంలో ఎంతమంది పరిచితు లవుతారో, అందరికీ తెలిసిపోయింది. అమ్మయ్య—అని నిట్టూర్చాను. చింత లేకుండా ఆనాడు కాఫీ తాగి, సినీమా కెళ్లాను. ఇం కెవ్వరూ, ఎప్పుడూ ఆ ప్రశ్న వెయ్యరు. ఒక పెద్ద సమస్య పరిష్కారం ఐపోయింది.

సుందరం బంధువులింట్లో వివాహానికి నేనూ వెళ్ళాను. రెండోనాడు పెండ్లివారింట్లో, రెండోసారి కాఫీలు వొచ్చే సూచనలు లేకపోతే, నేను హొటలుకేసి వెళ్ళాను. ఎదురుగుండా రంగ నాథం కూర్చున్నాడు. చిరపరిచితుడే.

"అవుతే నువ్వు యిప్పు డెక్క డుంటున్నావు?"

ఫలానా చోటని చెప్పాను.

"అవు నవును—జ్ఞాపకం వొచ్చింది, నీ కిప్పు డెం తిస్తు న్నారు?" అని మొహం వింతగా చిట్లించాడు.

రంగనాథానికి యిదివర కొకసారి చెప్పడం జరిగింది. ఈ విధంగా అడిగినవాళ్ళే మళ్లా అడగటం లంకించుకుంటే, దీనికి అం తుందా ?

"అదికూడా జ్ఞాపకం చేసుకో అన్నాను" నేను.

"వెన కోసారి చెప్పావు. నాకు మందమతిరా."

"నా మాటకేం గాని నీ విషయంచెబుదూ. జీతం విషయం కాదు. మీ ఆవిడ ఆరోగ్యం ఎట్లా వుంటోంది? ఆమధ్య చాలా జబ్బు చేసిందటగా?" అన్నాను ధోరణి తప్పిద్దా మనీ, నిజంగా

తెలుసుకుందా మనీ.

"ఇప్పుడు నింపాదిగానే వుంది. న్యూమోనియా. రెండు నెల్ల జీతం వొదిలింది డాక్టర్లకి ఐదా రౌంద లైంది" అని మౌనంలో పడ్డాడు, కష్టాలు స్మరించుకుంటూ. ఇంక ఆ మని షిని కదపడం మంచిది కా దని తోచింది. ఎందుకంటే అతని జీతం ఎంతో నేను అడక్కుండానే నాకు చెప్పా లని వుబలాట పడి చెప్పేశాడు. తన జీతం తెలియబర్చిన వ్యక్తి అవతలవాడి దెంతో కనుక్కోకుండా వదల డని స్వానుభవం. మెల్లిగా లేచి బిల్లు చెల్లించి రాబోతున్నాను.

"ఉండు, నేనూ వొస్తున్నా" అని లేచి వొచ్చాడు.

రోడ్డుమీదికి రాగానే యీ ధీరోదాత్తుడు అడిగేశాడు-

"అవుతే నీ కెంతిస్తున్నారంటావు?"

"న్యూమోనియా చాలా ఖరీ దైన వ్యా ధన్నమాట!" అన్నాను.

న్యూమోనియాని వర్ణించాడు రంగనాథం. పందిట్లోకి చేరుకున్నాం. పన్నీరు జల్లేటందుకు రంగనాథాన్ని పిలిచారు. వెళ్లాడు. నన్ను శాంతి ఆవరించింది.

ఎంతోసేపు లేదు.

బంధువులు, మిత్రులు, పరిచితులు, వో పదిమంది పోగయ్యారు. ఆడపెళ్లివారి పీనాసితనాన్ని చర్చిస్తున్నారు. చర్చలో పాల్గొన్నవారిలో ముఖ్యుడు, వొకాయన, పొడుగ్గా వుంటాడు, గిరజాలు, వెడల్పాంటి జరీకండువా, కోటుజేబు గడియారం అవీ వున్న ఆ పెద్దమనిషి, నా పక్కన కూర్చున్న కళ్లజోడు వ్యక్తిని సంబోధిస్తూ—

"మీ రెవరితాలూకు? అని అడిగాడు.

కళ్ళజోడువ్యక్తి అడపెళ్లివారి తాలూకే నని తేలిపోయింది.

"ఏం చేస్తున్నారు?"

ఫలానా అని చెప్పాడు.

"మీ కేమిస్తారు?"

సభ సమాధానంకోసం, వర్షంకోసం తపిస్తూ మేఘాల కేసి చూస్తున్న కర్షకుడిమాదిరి నిశ్శబ్దంగా వేచివుంది.

కళ్లజోడు వ్యక్తి తటపటాయించాడు. మేఘాలు దట్టంగా అల్లుకుంటున్నాయి.

"ఎనభై" అన్నాడు—వడగళ్లవాన పడింది.

గిరజాల ప్రతిభాశాలి కుటిలంగా నవ్వుతూ ఇల్లా అన్నాడు:

"మా వాళ్ల తాలూ కొకడు మీదాంట్లోనే వున్నాడు- నలభై అని చెప్పాడే!" అన్నాడు.

సభలో కలకలం, ఆశ్చర్యం.

కళ్లజోడువ్యక్తి, అసత్యవాది—మోసగాడు, దొంగ–దొరికి పొయ్యాడు. సత్యాన్ని కాళ్ళూచేతులూ కట్టేసి, గిరజాల అతీతుడు అరచేతిలో పెట్టి నొక్కుతున్నాడు.

"నలభైని రెండెట్టి గుణిస్తున్నారే?" అని రెట్టించాడు- కళ్ళజోడు వ్యక్తి తన జీతాన్ని రెట్టించినట్లు.

కళ్ళజోడువ్యక్తి కడు చతురుడు.

"అంటే, అసలు జీతం—బేసిక్ పే—నలభయ్యే నను కోండి. వార్ఎలవెన్సు, సిటీ ఎలవెన్సు, తిండి ఎలవెన్సు ఆ ఎలవెన్సు, ఈ ఎలవెన్సు అన్నీ కలుపుగుని, ఏభైఐదు, అరవై, డెభై, డెభైఐదు దాకా దేకుతాయి" అన్నాడు. కాని, ఎన్ని

కలిపినా, ఎనభైకి డేకందే! సభ అతన్ని చూచి జాలిపడ్డారు. కళ్ళజోడు వ్యక్తిని- నిజంగా ఈ పరీక్షకు ఆగినందుకు- రెండు. నెల్లపాటు హాస్పిటల్లో వుంచా లనిపించింది.

గిరిజాల భూతద్దం దృష్టి నామీద ఎక్కడ పడుతుందో నని భయపడుతూనే వున్నాను. సత్యాన్వేషకుణ్ణి ఎవరు ఆరి. కట్టగలరు? నామీదకూడా పడ్డాడు.

"మిమ్మల్ని ఎక్కడో చూసినట్లున్నాను" అన్నాడు.

"అవు నవును. మీకు నా విషయం అంతా తెలుసు. జ్ఞాపకం చేసుకోండి" అన్నాను.

"కాకినాడా ?"

"ఇంకా సందేహమా" అనేశాను తెగించి.

"ఇప్పు డేం చేస్తున్నారు?"

"అప్పు డోటీ, ఇప్పు డోటీ వుంటుందా; ఎప్పుడూ వొకటే" అన్నాను.

సభికులలో కిలకిలలు.

"స్మరణకు రావడం లేదు" అన్నాడు గిరజాల భక్తుడు.

"తమ రేం చేస్తున్నారు?" అన్నాను. చూడండి—నలు. గుర్లో కెళ్ళి మాట్లాడడం అంటే నా కెంతో హడలు—అట్లాం. టిది, సంఘం నా కెంత ధైర్యం ఇచ్చిందో!

"నేను రిటైరయ్యాను లెండి" అన్నా డాయన.

బాణంతోనే కూలాను.

కాసేపు సమాధిలో పడి తేరుకుని గిరజాల ప్రవక్త ఆగ్నే. యాస్త్రం ప్రయోగించాడు.

"మీ కే మిస్తున్నారు?"

నేను సమాధానం చెప్పకూడ దని నిశ్చయించుకొన్నాను.

"మీ పెన్షన్ ఏమాత్రం?" అన్నాను.

ఉద్రేకంతో తెల్లగిరజాలు వూగిసలాడాయి.

"మా దంతా ఐపోయింది. మీది వోల్డుస్కేలా, న్యూస్కేలా?"

"ఘాది తులాభారం. భక్తితో తులసిదళం వేస్తే తూగిపోతాం" అన్నాను.

ఇద్దరు ముగ్గురు సంతోషించారు. ఒకరు మెచ్చుకున్నారు కూడా.

"ఏదో పెద్దవాణ్ణి అడిగాను. చంపక చెప్పవయ్యా!" అన్నాడు గిరజాల వ్యక్తి.

"చెప్పకపోతే మరణమే నంటారు?"అన్నాను.

"ఓర్ నీ ఇది బంగారం గాను—చెబుదూ."

గిరజాల వ్యక్తి నన్ను బుజ్జగించాడు, బెదిరించాడు, కోపించిచాడు, అజ్ఞాపించాడు—కాళ్ళా వేళ్ళా పడి బ్రదిమలాడాడు. ఏ మిస్తారో చెప్ప మని దీనంగా ప్రపంచాన్ని సంబోధించాడు.

"అనుభవజ్ఞులు—మీరే చెప్పకోండి" అన్నాను. ఆయన జీవితంలో నేర్చుకున్న పాఠాలని వల్లెవేసుకుంటున్నాడు.–వందా? నూట యాభయ్యా? రెండువందలా? ఏది? అబ్బ, బాధ! తట్టుకోలేను–చెప్పాలి. భూమి పాదాలకింద విడి పోతోంది. ఆకాశం తలమీద కూలిపోతోంది–చెప్పు. చెప్పు–నీ కెం తిస్తారు? ఏ మిస్తారు? దేశం చెప్పిన సందేశం అది.

సభికులు విస్తుపోయారు.

కళ్ళజోడు వ్యక్తి అడదైతే నన్ను రాక్షసంగా వివాహం ఆడును—అంతటి సంతోషం ప్రకటించాడు. నేను సమాధానం ఇవ్వనందుకు నే నొక కథానాయకుణ్ణి అయ్యాను. సంఘం ఈ ప్రశ్న ఎందు కడుగుతుంతో నా కర్థం కాలేదు. బ్రిటిషువారు పాలించిన రోజుల్లో ప్రభుత్వం నడపడానికి, వారికి చాలా మంది గుమాస్తాలు కావాల్సి వొచ్చింది. మధ్యతరగతి కుటుంబాలు ఈ ఉద్యోగాలకి ఎగబడ్డాయి. వీరికి స్వయంగా కృషి చెయ్యడం గౌరవానికి లోటు. భూములను ఎవరికో వ్యవసాయాని కిచ్చి, జమీందారులా కూర్చునేటంతటి భూములూ లేవు. అంచేత వీరికి గుమాస్తాగిరి శరణ్యం. మొదట్లో గుమస్తాలుగా చేరినా, బోలెడు ఆస్తులు సంపాదించగలిగేవారు — లంచగొండితనంవల్ల. మా ముత్తాతకి తన పేరు సంతకం చెయ్యడంకూడా రాదు. రెండిళ్లూ, నలభై ఎకరాల భూమీ, సంపాదించాడు—ఎనిమిది రూపాయల జీతంలో, అంతే కాదు; తాలూకా గుమస్తాగా చేరినా, ఆ రోజుల్లో నాలు గింగ్లీషు ముక్క లొస్తే గబగబ పెద్దపెద్ద వుద్యోగాలలోకి వెళ్ళేవారు. ఆ వుద్యోగాలకి పెద్ద జీతాలూ, హోదాలూ వుండేవి. హోదా వున్నవార్ని, ఎదురుగా వెళ్ళి జీతం ఎంతో అడిగే ధీమా ప్రజాసామాన్యానికి లేదు. అంచేత వారికి ఆ హోదాలో ఎంత జీతమో తెలుసుకోవాలని వుబలాట పడేవారు. ఆ సాంప్రదాయంలో పెరిగిన గిరజాల వ్యక్తులలాంటి వారు మన సంఘంలో ఎందరో వున్నారు. వారంతా అందువల్ల ఈ ప్రశ్న అడుగుతున్నా రనుకుని సమాధాన పడేవాడిని. ఇది పెద్దవారి కుతూహలానికి సమాధానం కావొచ్చు. మిగతా వారి మా టేమిటి?

జీతం ఎంతో తేల్చకపోతే వారి బ్రతుకుతెరువు సాధ్యం

కాదు. ఒక మృగం మరొక మృగాన్ని అడివిలో ఎదుర్కొంటుంది తనకంటె బలమైన దైతే, అది శత్రువు; దాన్నుండి పారిపోతుంది, తనకంటె బలహీనమైన దైతే దాన్ని తినేస్తుంది. దానితో సమానమైన దైతే చెలిమి చేస్తుంది. మనుషులలోనూ అంతే. జంతువులలో బలాబలాలు నిర్ణయించేటందుకు తగినంత పరికరాలున్నాయి–కోరలు, కొమ్ములు, జూలు, పంజాలు, ఎత్తు ఎగరడం, దూకడం. మనుషులలో ఈ వుపకరాలు లేవు—ఏకొద్దిమందికో మోటారుకా ర్లుండొచ్చు, మిగత విషయాలలో ఇంచుమించు అందరూ ఒకేలా గుంటారు. పైగా మేడలకి, కార్లకి, జీతానికి సంబంధం వుంది. అందుకని, అ దెంతో కనుక్కుంటారు.

అవతలవారి జీతం తెలిస్తే మనం క్షేమంగా వుంటాం. అట్లా తెలిసిన తర్వాత, వారికో విలువకట్టేసి, సంఘంలో ఒక స్థానం ఇచ్చి మనం మరోచోట నిశ్చింతగా వుంటాం. ఈ దేశంలో ఎన్నో మతా లున్నాయి. యుగాని కొకటి చొప్పున ఆధునిక యుగంలో మరో మతం లేవదీశారు వీరు—వీరిది జీతాల మతం–పై అధికారీ, కిం దధికారీ మత ప్రచారకులు, ఇచ్చేవాడు దైవం అ దెంతో తెలుసుకునేవారు భక్తులు. జీతం లేనివారు అస్పృశ్యులు. ఈ తెగకి సహాయంచేసి, అస్పృశ్యతని తొలగించా లని, ప్రభుత్వం కృషి చేస్తూ వుంటుంది. ఇట్లా కాక, మ రెట్లా సమాధానపడటం!

◆ ◆ ◆

మరో మూడేళ్ళు గడిచాయి. నా ఉద్యోగం మారింది. పెద్ద దైంది. జీతం మూడింత లైంది. ఈ మూడేళ్ళలోనూ, జీతం ఎంత అని అడిగిన వారి సంఖ్య నూటయనభై. వీరు కోరింది జీతం ఎంతని కాదు. "యిప్పు డెం తిస్తారు" అని. ఉద్యోగం మారడం

జీతం పెద్ద దవడం ముప్పే ననిపించింది.

నీ జీతం తక్కువగా వున్నప్పుడు, చెప్పడానికి చిన్నతనం పడ్డావు కాని, యిప్పుడు నిర్భయంగా, దర్జాగా, అడకక్క పోయినా చెప్పకూడదా అంటా రేమో మీరు! దీనికి రెండు సమాధానా, లున్నాయి. గవర్నర్ జనరల్ నైతే తప్ప, నా మీద నాకంటె పెద్ద జీతంవాళ్లు ఎందరో వుండనే వుంటారు. నీ జీతం ఎంత? అని ప్రశ్నించినవారికంటె నాది ఎక్కువ జీత మైతే, ఆ ప్రశ్నకి సమాధానం చెప్పడం సులభమే. అంచేత నన్ను యీ ప్రశ్న అడగ దల్చుకున్న వారు ముందు వారి జీతం ఎంతో చెప్పేసి నా సమాధానం కోసం ఎదురు చూడాలి. వారిది నా దానికంటె ఎక్కువైతే, సమాధానం రాదు. ఈ ఏర్పాటు ఎంద రంగీకరిస్తా రంటారు? పైగా "యిప్పు డేమిస్తారు?" అని అడగటంలో కొంత 'కసి' కూడా వుంది. అంటే, "ప్రస్తుతం నీ జీతం గొప్పదైనా, మొదట్లో చిన్నదే లేవోయ్!" అన్న హేళనకూడా ఉం దంటారా?

బజార్లో బాల్యస్నేహితుడు బలరామయ్య కనపడి, నన్ను వాళ్ళింటికి తీసుకెళ్ళాడు. తన యిద్దరి సంతానాన్ని చూపించాడు బలరామయ్య డబ్బున్నవాడు. ఉద్యోగం చేసే అవసరం లేదు ఉద్యోగాలు, జీతాలు,—వాటి తబిసీళ్ళని తెలుసుకోవా లన్న మన స్తత్వం కనపర్చనందుకు సంతోషించాను.

"ఇప్పు డెల్లా వుంది నీ కథ?" అన్నాడు. మొదట్లో బెదిరి పోయాను.

"అంటే?" అన్నాను.

"వొకటా, రెండా?..."

నాకు భయ మేసింది.

"లేక నాలా రెండా!" అని వాక్యం పూర్తిచేశాడు.

"పిల్లలా?" అన్నాను.

"మ రిం కే మనుకున్నావు. ఉద్యోగం చేసి, రెండు మేడలు కడతా వనుకుంటానా?" అన్నాడు.

"కట్టినవాళ్ళు లేరా?'' అన్నాను గర్వంగా.

"వెనకటి రోజుల్లో వున్నారేమో." విషయం తప్పించే టందుకు అతని పిల్లల ఆరోగ్యం కనుక్కున్నాను.

"మీ అబ్బాయి పె ద్దయింతర్వాత ఏం చేస్తాడు?" అని అడిగాను.

"అమ్మాయిని వెతుక్కుంటాడు" అని నవ్వుకున్నాడు. ఇంతలో అతన్ని స్నానానికి పిలిస్తే వెళ్ళాడు.

ఇద్దరు పిల్లలూ సిరాబుడ్డి తీసుకుని ఆడుకుంటున్నారు.

పెద్దవాడు గ్లాసులో కాఫీ తెచ్చి బల్లమీద పెట్టాడు. గుమ్మం వెనక నిలబడ్డ ఆమె వాళ్ళమ్మ.

ఆవిణ్ణి నే నెరుగుదును. ఆవిడపేరు సూరమ్మ. వెనక నా కిచ్చి వివాహం చెయ్యా లనుకున్నారు. నాకు తగినంత ఆస్తి లే దని విరమించారు. సూరమ్మకి తగిన మొగుడు ఆ జిల్లాలో లే రనుకొన్నారు—ఏ వుత్తర హిందూస్థానంనుంచో రావాలిట ! అంత చక్కం దని ప్రతీతి.

"ఎక్క డుంటున్నారు?'' అంది సూరమ్మ నీరసించిన కంఠంతో—ముగ్గురు సంతానం కలిగాక కంఠంలో మార్దవం ఎక్క డుంటుంది.

ఫలానాచో టని చెప్పాను. ఏం చేస్తూన్నా రంది; ఫలానా అన్నాను. ''ఏ మిస్తారు?'' అంది.

నాకు మతి పోయింది. ఆ పల్చటి పెదవులు, చీకటి రహస్యాన్ని ఛేదించే ఆ నేత్రాలమెఱుపు, భౌతిక ప్రపంచానికి అతీతం కావల్సిన ఆ సూరమ్మ అనాదిసౌందర్యం, అదా నా కివ్వవల్సిన సందేశం!

"రోజులు గడుస్తాయి" అన్నాను చమత్కారంగా. సూరమ్మ గాజుల జతలు మోచెయ్యిదాకా వున్నాయి; దుద్దుల రాళ్ళు మెరుస్తున్నాయి.

"నెల కింతా అని లేదూ?" అని రెట్టించింది.

"మీ రెండోవాడు భలే అల్లరి చేస్తాడు కాదు?" అన్నాను. నే వేసే ప్రశ్నలో నాకే విశ్వాసం కుదరడం లేదు.

"పిల్లలా!" అంది.

"అమ్మయ్య" అని, లోపల అనుకోవల్సింది- పైకి అనేశాను ఆవేశంలో.

"అంటే?" అని, సూరమ్మ తెల్లబోయింది. ఆశ్చర్యంతో కనుబొమ్మలు మృదువుగా ముడుచుకున్నాయి.

"లేరు" అన్నాను.

"మీ ఆవిణ్ణి వోమారు తీసుకురా మాయింటికి. జీతం ఎంతో చెప్పకపోతే మానెలే" అంది.

"వాడి జీతం కథ కనుక్కుంటాగా" లోపలనుంచి బలరామయ్య కంఠం.

ఏం, తను రాకూడదూ? భాగ్యవంతు లైతే, వారింటికి నా భార్యని తీసుకెళ్ళాలి! తీసుకెళ్ళి ఉద్యోగం వయసు అంతా బైటపెట్టి వినోదించి, మళ్ళా తిరిగి నాకు వొప్పచెపుతారా! సరే అన్నాను ఆ సమయంలో—లోపల పంపకూడదని విశ్చయించు

కున్నాను. సౌందర్యం, భాగ్యం—రెండూ సూరమ్మ విష యంలో గర్వకారణాలు కాకపోవొచ్చు. నా కళ్లా కనిపించింది. ఏం చెయ్యను? నా మనస్సు తప్పితే, నా కిం కే యదార్థం వుంటుంది?

ఇంతట్లో బలరామ య్యొచ్చాడు.

"అబ్బో నువ్వెక్కడ! పెద్ద వుద్యోగస్తుడ వయ్యావు. నువ్వు మీ ఆవిణ్ణి తీసుకొస్తావూ?" అన్నాడు వెటకారంగా. వెట కారంగా అన్నా, అత నన్నది నిజమే నని లోపల స్ఫురించింది. ఆలోచించండి. పెద్దజీతంవాడు, చిన్నజీతం వాడింటికి సామా న్యంగా వెడతాడూ? వెడితే వాళ్ళగృహం పావనం చేసినట్లు భావిస్తాడు. చిన్న జీతంవాడు, పెద్దజీతం వా డింటికి వెడితే చిన్నతనం అనుకుని వెళ్ళడు. మొత్తంమీద వొకడింటికి యింకోడు వెళ్ళడు. బాల్యంలో ఎంత స్నేహితు లైనా, యిద్దరి మధ్యా ఒక గోడ లేస్తుంది. మొదట్లో కేవలం యిటికలగోడ–మధ్యమధ్య శుభకార్యాలూ, పండుగలూ, అనే కంత లుంటాయి. ఈ కంతలుగూడా కొంతకాలమే. వారివారి భార్యలు రాగానే, కంతలు పూడ్చి, సిమెంటు చెయ్యడం జరుగుతుంది.

"ఏం. మాట్లాడవేం?" అని బుజంమీద చరిచాడు. కంగారుపడి లేచాను. అవు ననీ, కాదు కా దనీ, నవ్వేశాను. ఆడ దానికి కన్నీరు, మొగాడికి నవ్వూ, అవాంతరాలలో అభయం.

"నువ్వూ, సూరమ్మా మా యింటికి రాకూడదూ?" అన్నాను. బలరామయ్య ఆశ్చర్య పడ్డాడు.

"మా ఆవిడ పేరు నీ కెట్లా తెలిసింది" అని అడిగాడు.

"శుభలేఖలో వుండదూ?" అన్నాను.

"ఓర్—నీ కింకా జ్ఞాపకం వుందా?"

"మందమరపు భాగ్యవంతుడి శీలంలో మణిలాంటిది" అన్నాను హాస్యధోరణిలో.

"బీదార్పు లారుస్తున్నావు—నీ జీతం ఎంతేమిటి?" అని అడిగేశాడు. నా తెలివితక్కువని నిందించుకుని నాలిక కొరుక్కున్నా.

"చెప్ప వేం?"

"నాలో సంస్కారాన్నిబట్టి. నా జీతం నువ్వే నిర్ణయించొచ్చు" అన్నాను నిగూఢంగా.

"జీతాన్నిబట్టి సంస్కారాన్ని నిర్ణయిస్తే, జమీందారులు గొప్ప సంస్కారం గలవాళ్ళవాలి" అన్నాడు బలరామయ్య.

"నువ్వు చెప్పింది తొంభై పాళ్ళు నిజం. కాని చిన్న భేదం వుంది. జమీందార్ల ఆదాయాన్ని జీతం అనరు. అది ఆర్జించని రాబడి. అదే మన నాగరికతకి, కళకి, విజ్ఞానానికీ, సంస్కారానికీ, పునాది- వెన్నెముక" అన్నాను తెచ్చిపెట్టుకున్న ఆవేశంతో.

"స్వార్జితం కాని రాబడి గలవాళ్ళకి తప్ప మిగతావాళ్ళకి సంస్కృతి లే దంటావు?"

"లే దన్ను. వారి సంస్కృతియొక్క పరిమాణం, జీతాన్నిబట్టి నిర్ణీత మౌతుంది."

"ఒప్పుగుంటాను మహానుభావా. అవుతే, నీ సంస్కృతిని బట్టి, జీతం వెయ్యిరూపాయ లని నాకు స్ఫురించింది" అన్నాడు బలరామయ్య హేళనగా.

"జీతాన్నిబట్టి నిర్ణీత మయ్యేది వొక సంస్కృతే కాదు.

అజ్ఞానం కూడా ఎదుగుతూ వుంటుంది" అన్నాను. బలరామయ్యకి అది నచ్చలేదు. ఓవిధంగా నాకూడా నచ్చలేదు.

"పోనీ సరే నంటాను. అజ్ఞానాన్ని బట్టి చూసినా, నీ జీతం పన్నెండు వందలకి తక్కువ కాకూడదు" అన్నాడు బలరామయ్య, నవ్వుతూ.

"బాగుంది. అజ్ఞానంలోంచి, సంస్కృతి తీసెయ్యి" అన్నాను.

"ఉండు, వుండు...తీసివేతలూ, భాగారాలూ మనకి బాగా రావు—ఆ...రెండువొందలన్నమాట" అన్నాడు.

"సరిగ్గా అంతే కాదనుకో...ఆ చుట్టుపక్కల..."

"హస్త సాముద్రికంలాంటి కొత్తఫక్కి కనుక్కున్నావే! సరిగ్గా ఎంత జీతమో ఎట్లా తెలుసుకోవాలో, ఏదైనా మార్గం పట్టుకుని, ఏ పుస్తకం వ్రాసి పారెయ్యకూడదూ?" అన్నాడు నవ్వుతూ.

"సరి యైన అంకె రావా లంటే ఓమార్గం వుంది. దానికి తిక మక లున్నాయి. జీతగాడి భార్యయొక్క అజ్ఞానం, సంస్కృతీ కూడా నిర్ణయించి భర్తకీ, భార్యకీ వున్న వ్యత్యాసం ఎంతో, అది సరి యైన సంఖ్య."

"గొప్పగా వుంది. దీన్నిబట్టి నా జీతం ఎంతో చెప్పు" అన్నాడు.

"నీది జీతంకాదు. ఆర్జించని ఆస్తి" అన్నాను.

"చంపేశావు. పోనీ స్త్రీలకి జీతం లేదుకదా, వారి సంస్కృతిని నిర్ణయించడం ఎట్లా?" అని అడిగాడు.

"వారి సంస్కృతి చక్కదనాన్ని బట్టి నిర్ణీత మౌతుంది.

మొగాడికి జీతం అవకాశాలు కల్పించినట్లుగానే, అడదానికి చక్కదనం అవకాశాలు కల్పిస్తుంది."

"ఈ సిద్ధాంతం ప్రకారం, చక్కదనంకొద్దీ ఎక్కువయ్యేది అజ్ఞానమా, సంస్కృతా?"

"అవకాశాలు" అన్నాను.

"అంటే?"

'భాగ్యం యిష్టం వొచ్చినట్లుగా జీవించే అవకాశాలు' కల్పిస్తుంది. విశ్రాంతి, అదనంగా డబ్బు—రెండూ వుంటేనే సంస్కృతి వుంటుంది. స్త్రీకి, యీ రెండూ చక్కదనంతో వొస్తాయి అంటే, యీ రెండూ వున్నవాడు ఆమెకు లభిస్తాడు."

"అగు, ఆగు, లభించిం తర్వాత, మొగుడికి ఆ రెండూ పోతే?"

"అ విషాదగాథలు సాంఘిక జీవితంలో కల్లోలాలకీ, సారస్వత అభివృద్ధికీ కారణాలు."

"మరొటి, కర్మవశాత్తు వొక అంద మైన ఆడదానికి యీ రెండూ లేనివాడు లభిస్తా డనుకో, అప్పుడు?" అని అడిగాడు.

"అవకాశా లుండనే వుంటాయి. తన చక్కదనం వల్ల మొగుడికి ఆ రెండూ లభ్య మవచ్చుకూడా" అన్నాను. బలరామయ్య ఎందుకో ఆలోచనలో పడ్డాడు. మనిషి మొహంలో 'కళ' తగ్గింది. నా వ్యాఖ్యానం సూరమ్మకు అన్వయించి బాధ పడుతున్నాడా! ఏమో! సెలవు తీసుకుని నే వెళ్ళిపొయ్యాను. ఆ మర్నాడు ఆదివారం సాయంత్రం అతడు మా యింటికొచ్చి, సుందరాన్నిచూసి, కొంత తేరుకుని వెళ్ళిపొయ్యాడు. నా కదొక అపూర్వ మైన అనుభవం.

ఆవేశంలో, అనేక సిద్ధాంతాలు చేసేశాను. నాగరికతపై విప్లవం చేసే శక్తి అందరికీ వుండదు. వంటింట్లో విప్లవం చాలా సులభం. మూడు సంవత్సరాలైం తర్వాత, బలరామయ్య, సూరమ్మని విడిచిపెట్టేశా డని విన్నాను. ఎందుకో, వివరంగా తెలిసింది కాదు. నా జీతం ఎంతో అడక్కపోతే, సూరమ్మ జీవితం అట్లాగై వుండ దేమో ననిపించింది. 'జీతం'. 'జీవితం-అక్షరాలు, అర్థం, ఎంత దగ్గర!! సృష్టిరహస్యం అర్థం కాకుండా, వొక్క అక్షరం అదనంగా వుంది!

  

మరో మూడు సంవత్సరాలకి నా జీతం మూడింతలైంది. నా సమకాలికు లందరికీ జీతం ఎంతో తెలిసిపోయింది. మరోతరం బైలుదేరింది. వా రందరికీ మేం పెద్దలం; ఆదర్శ వ్యక్తులం; మార్గదర్శకులం. మా జీతాలతో వారి కంత నిమిత్తం లేదు; మా కంత గౌరవం వుంది సంఘంలో.

అలవాటు చొప్పున నా సమకాలీకులలో కొందరు యింకా నిలేసి నా జీతం ఎంతో అడిగిన వాళ్ళు లేకపోలేదు. ఏం చేస్తారు? అడిగేటందుకు వారికి మరో ప్రశ్న కనబడలేదు పాపం! ఇచ్చేటందుకు మరో సందేశం లేదు.

భార్య ఆరోగ్యం?
పిల్లలు కులాసా?
ఇంక్రిమెం టొచ్చిందా?
ట్రాన్స్ఫ రైందిటగా!
రిటైరైతే పెన్ష నెంత?

ఇది-వారు పాడుకునే భావగీతం.

నా కాడ పిల్లలు లేరు. అంచేత అల్లుడు లేడు. ఉంటే వారు చేసే గానం వేరు.

అల్లుడి కే మిస్తారు.

అబ్బాయి కే మిస్తారు.

పెద్ద కుటుంబా లైతే ఖండకావ్యం ధోరణి వేరు.

మొదటివాడికి రెం డొందలా ?

రెండోవాడికి వందా ?

మూడో వాడికి, చిత్రం, మూ డొందలుటగా?

చిన్న చదువుకి పెద్దజీతం.

అజ్ఞానానికి సున్నా.

అయ్యో పాపం! జ్ఞానానికి అరసున్నా!

ఆ రోజుల్లో నా జీతం అడిగేవారు, యించుమించు నా గడింపే కలవారు. వీరు ప్రశ్నించే ఫక్కీ వేరు—అదొక కళ. వీరు హైరోడ్డుమీద నడవక సందు లమ్మట పడతారు.

రామనాథం, నేనూ రైల్లో ప్రయాణం చేస్తున్నాం. మేం యిద్దరం ఎరుగున్న కుటుంబ రావును గురించి మాట్లాడు కుంటున్నాం.

"పాపం కుటుంబం—" అన్నాడు.

"అవు నవును" అన్నాను వినిపించుకోకుండా.

"ఆ జీతంతో నా సిగరెట్లు గడవ్వు" అన్నాడు. నిజానికి నాకు, రామనాథాని కెం తిస్తారో తెలీదు. పెద్దజీత మైవుండాలి.

"నువ్వేమాత్రం ఇన్సూర్ చేశావు?" అని అడిగాడు.

"ఏమీ చెయ్యి లేదు."

రామనాథం ఆశ్చర్య పడ్డాడు.

"పోనీ బాంకులో ఏమాత్రం?"

"సున్నా"

కొయ్యా బారాడు!

"ఏం కథ, గుర్రం పంచాలా...లేక..."

"......?"

"ఏమోలే...అల్లానుకోవలసి వొస్తోంది."

"......"

"మరి జీతం అంతా ఏ మౌతోంది?"

"ఎంతచెట్టుకు అంతగాలి" అన్నాను.

"నీ చెట్టు సైజు ఏమాత్రం?"

అదీ నాగరీకుల మార్గం. మొహాన పేడనీళ్ళు జల్లరు—అందులో కాస్త పన్నీరు కలిపి మరీ చల్లుతారు.

"మాట్లాడవేం?"

"చెట్టు ఎంత పెద్ద దైతే అన్ని కొమ్మలు" అన్నాను.

"పిల్లల కవుతోం దన్నమాట!"

"నీ కెందరు?" అని అడిగాను.

వివరాలు చెప్పాడు. పెద్దవాడు రంగూన్‌లో వున్నాడు. వాడి జీతం మూ డొందలు. అదృష్టవశాత్తు రైలు నిలిచింది. నేను దిగి ప్లాట్‌ఫారంమీదికి నడిచాను. రాజా రావుగా రబ్బాయి, రంగా రావు కనిపించాడు. నా చేతిలో బాగ్ తీసుకున్నాడు.

"ఏ మండోయ్ — విన్నారా —నా కుద్యోగం దొరికింది." అన్నాడు వుత్సాహంతో.

"సంతోషం."

"ఆరంభంలో నూరు, మీ కెం తండీ? అని అడిగాడు.

బాగ్ లాక్కుని గబగబ నడిచిపొయ్యాను.

మరోతరంవారు, వే రన్నాను యిందాకా. ఇందులో, నే పొరబడ్డాను. వారి సందేశం యిదే-అని కించపడ్డాను. ఎందులో సమానత్వం లేని యీ దేశానికి యిందులో ఐక్యత కుదిరింది. సమానత్వం అనేది మానవుడి స్వప్నంగా వుండాల్సిందే కాని యథార్థం కా దేమో!

నా కాపూరు కొత్త. జబ్బు చేసింది. మంచాన పడ్డాను. సుందరం కూడా నలతగానే వుంది. ఓ మిత్రుడు వొక డాక్టర్ని తీసుకొచ్చాడు. ఆయన అన్నీ పరీక్షచేసి మందు పంపించాడు. రెండు రోజు లైంది. నయం కాలేదు.

"మలేరియా — రెండురోజుల్లో తగ్గుతుంది" అని హామీ యిచ్చాడు.

"ఇది సీజన్. చైర్మెన్‌కీ యిదే జబ్బు, నా ట్రీట్మెంటే. మొన్న సబ్ కలెక్టర్ మామగారు వై రిస్తే వెళ్ళాను, మలేరియా" అ వన్నీ వర్ణించాడు డాక్టర్.

"మీరు యీ వూరికి కొత్త. ఏం చేస్తున్నారు?"

ఫలానా అన్నా.

"ఏ మిస్తారు?"

సబ్ కలెక్టర్‌కీ, చైర్మన్‌కి ఏ మిస్తారో ఆయనకి తెలుసు. మరి నా విషయమో! తెలిస్తే గాని, తను అల్లుకున్న వలలో నన్ను యిమడ్చలేడు. చేపల వలలో బురద పాము పడితేఎట్లా? నాకు నీరసం, దిగులు. మాట్లాడిస్తాడు, ఆ ప్రశ్నకి సమాధానం యిచ్చి నేను కళ్ళు మూస్తే బిల్లు పంపకపోయినా ఆయనకి చింత లేదు.

నేను కళ్ళు మూసుగున్నాను. నాకు కోపం రాలేదు. జా లేసి ఏడు పొస్తోంది. సమాధానం యివ్వనంతవరకూ. ఆయన పాదాలకింద ధ్వనించే భూకంపాన్ని నేను సమాధానం యిచ్చి మరీ చావ మంటుంది సంఘం.

"బిల్లు పంపించండి" అంది సుందరం.

ఆయన పంపలేదు. మళ్ళా రాలేదు.

మరో మూడేళ్ళు గడిచాయి. ఏళ్ళు గడవడం కథల్లోనే కాకుండా జీవితంలోంచి కూడా సులభం. గడిచిపోటం గురించి ఆలోచిస్తేనే జీవితం అంతా వొక దుస్వప్నంలా గుండటం, సృష్టి అంతా మాయగా తోచడం జరుగుతుం దేమో! ఎంత దూరం, ఎంత కాలం ప్రయాణం చేసినా, అక్కడే వున్నాను—అద్దంలో చూచు గుంటే ప్రయాణం బడలిక కొంచెం కనబడొచ్చు. సంఘానికి నా జీతం గురించి పరామర్శలు తగ్గాయి. కొత్త వ్యక్తులను కవ్వించడానికి పోయింది. సంతాన నిరోధక మార్గం మన దేశంలో ప్రచారం కాకపోవడంవల్ల నాకు జరిగిన వుపకారాలలో యి దొకటి. కొత్తగా జన్మించిన వారి జీతాల పస కను క్కుంటుంది మరి.

నా జీతం పెద్ద దైంది. ఇంతకంటె పెద్ద దయ్యే అవకాశాలు లేవు. దేశానికి స్వాతంత్ర్యం కూడా వొచ్చింది. అంచేత నాకు మరో అంతకంటే పెద్ద వుద్యోగం, 'కేంద్రంలో' దొరకడం అసంభవం కాదు. నా అభి ప్రాయాలు చాలావరకూ స్థిరపడి పొయ్యాయి. మంత్రు లందరూ జీతాల కట్టలలో కన బడతారు. సంఘం అంటే ఎంత? అని అడిగే వొక ధ్వని. 'స్త్రీ' అంటే జీతాన్ని మాయంచేసే వొకశక్తి: 'స్త్రీ' జీతాన్ని తగ్గించ

గల్దు: హెచ్చించగల్దు. అసలు లేకుండా మాయం చెయ్యగల్దు. సత్యం అంటే జీతం ఎంతో కనుక్కోవడం. సౌందర్యం జీతం ఎంతో అదనంగా అడగడం. సంస్కారం అంటే అదే చమత్కారంగా అడగడం; 'కళ' అంటే అ దెంతో చెప్పక పోవడం—యీ విధంగా నా మనస్తత్వం తయా రైంది. నే నేం చెయ్యను ?

నేనే యిం కొకరికి జీతాలిచ్చే ఏర్పా టుంటే—అప్పుడు నన్ను "మీ రే మిస్తారు ?" అని అడిగే మహానుభావు లుంటారు. ఆ ఏర్పాటు లేదు; అంచేత వొక్కటేమార్గం వుంది; సన్యాసం పుచ్చుకోవాలి—సన్యాసి యివ్వడు, పుచ్చుకోడు—పుచ్చుగుంటే ఎప్పుడేనా, పాలు, పళ్లు; యిస్తే, ఎప్పుడేనా కా స్తంత బూడిదిస్తాడు.

సుందరం మనస్సుకూడా స్తిమితంగా లేదు. ఏదో మూగ బాధ; నా కేసి చూళ్ళేదు; నాతో మాట్లాడ లేదు. వెఱ్ఱిగా చూస్తుంది; స్వప్నంలో సంచారం; మేం ఒకరి కొకరు దూరమై పోతున్నాం. పిల్లలు చెయ్యీ చెయ్యీ కలుపు తున్నారు. వేళ్ళు నెప్పెట్టి ఒదిలేస్తాం. శరీరాలు విడిపోయి, ఆత్మలు రెండూ ఏక మౌతున్నా యనుకోవాలి; ఏమిటో అదంతా భ్రమేమో! శరీరాలు భ్రమైతే, ఆత్మలు కాకూడదా ఏమిటి ?

విశాలానంద స్వామి అనే ఒకరి దర్శనం చేశాం. ఆయన గొప్పయోగి; ఆయన్ని గురించి వింతగా చెప్పుగున్నారు. ఒక ప్రశాంతత హృదయాన్ని ఆవరించు కుంటుం దన్నారు. వొందల కొలది జనం వెళ్ళి ఆయన్ని చూచి వొస్తున్నారు. మా క్కూడా ప్రశాంతత కావాలి.

ఉదయం ఎనిమి దైంది. ఆశ్రమంలో వో పదిమందికంటె ఎక్కువ జనం లేరు. వెళ్ళి గచ్చుమీద నమస్కారం చేసి కూర్చున్నాం నేనూ, సుందరమూ.

విశాలానందస్వామి నిండైన విగ్రహం. విశాల మైన నుదురు, పెద్దకళ్లు, వెడల్పాటి నోరు. లావాటి మెట—నాటకంలో విగ్గు లేని భీముడి వేషంలా వుంటుంది. నిమీలితనేత్రుడై ధ్యానం చేసి, కొంతసేపటికి తెరుకొన్నాడు చిత్రంగా నవ్వి. దగ్గరగా జరిగిన నలుగుర్నీ కుశలప్రశ్నలు వేస్తున్నాడు. చనువుగా మాట్లాడాడు. నాకు భయం పోయింది. కొందరు యోగులు మాట్లాడ రని వినికిడి. ఈన అట్లా కాదు. నాకు సంతోషం కలిగింది. నా సందేహా లన్నీ తీర్చుకోవచ్చు నని, పరమానంద భరితు ణ్ణయాను.

నేను ఎక్కడనుంచి వొచ్చిందీ అడిగా రాయన.

నమ్రతతో చెప్పాను.

ఏం చేస్తున్నదీ అడిగారు.

ఇంకా నమ్రతతో ఫలానా అని చెప్పాను.

"ఏ మిస్తారు?" అన్నా రాయన.

నేను స్తంభించిపోయాను. చావడం సుళువై వుంటే, చనిపోదునుకూడా. సమాధిలో పడ్డాను. ఒక గొప్ప తేజస్సు నాలో లేచింది. ఎవరో హృదయాన్ని బైటకి తీసి, కడిగి మళ్ళా స్వస్థానంలో వుంచిన ట్లయింది. చర్మం వెనక్కి తిరిగిన ట్లుంది ఆ అనుభవం. జ్ఞానోదయ మైంది; సత్యాన్ని తెలుసు కున్నాను. ఆత్మ శుద్ధి జరిగింది. ఆత్మ పవిత్ర మైంది. సందేహాలు, సంశయాలు నశిం పయ్యాయి. ఆత్మబోధచే, సత్ చిత్ ఆనందాలు

జీవాత్మగా మారి పరమాత్మలో ఐక్య మయ్యాయి. అదీ యీ దేశం నాకిచ్చిన సందేశం.

దానిఫలితం?

నేను వుద్యోగాన్నుంచి విరమించాను.

గోదావరి నది తీరాన్ని చిన్న పా కేసుకున్నాను.

ఒక ఆవుని తెచ్చుకున్నాం.

సుందరం నదిలో స్నానం చేసి, పాలు పితుకుతుంది.

ఇద్దరం త్రాగి విశ్వాన్ని తిలకిస్తాం.

ఎవరేనా వొస్తే, కాసిని పా లిస్తాం.

గడ్డిపోచల్ని కోస్తుంది సుందరం—నేను వొక్కొక్కటే నదిలో వొదిలి అలల మీద వాటి ప్రయాణం పరిశీలిస్తాను.

సంధ్య వెలుగులో ఎఱ్ఱనై గడ్డిపూచ నీటిని పచ్చగా కలవరపెట్టి, నిశ్చితంగా కదిలి, నా మనస్సులో నిలిచిపోతుంది.

అదీ అది నా కిచ్చిన సందేశం.

# డు -ము - వు - లు

శ్రీ మల్లాది రామకృష్ణ శాస్త్రి

---

జననము జూన్ 1905. విద్యాభ్యాసము బందరు నోబెల్ కళాశాలలో. మదరాసు విశ్వ విద్యాలయములో ఎం. ఏ, (1934). వేదాధ్యయనము చేసినాడు. నాటకాలంకార వ్యాకరణములు అభిమాన విద్యలు. భారతీయ, ఐరోపీయ భాషలలో కృషి చేసి నాడు. ఇంచుమించు రెండువందల కథలు, అనేక వ్యాసములు రచించినాడు. సినీమా కథా, సంభాషణ, గేయ రచనలలో సిద్ధ హస్తుడు.

---

౧

ముందు ముందు ఎప్పుడో, భారతం పదిహేను పర్వాలూ తెలుగులోకి వ్రాయబోయే-తిక్కన సోమయాజుల్ని కనబోయే గుంటూరి కొమ్మన్న గారు - నిండు యౌవనం వచ్చి రావడంతోనే,- తండ్రితో పోట్లాట పెట్టుకున్నాడు!

కారణం ఏమిటంటే- తన గర్భాధానం విషయం!

చేసుకున్నది సయాం మేనమామ కూతుర్నే.

కాని, బంధుత్వం ముదిరిన తరువాత వియ్యాలవారికి, రాకపోకలు కట్టుబడ్డాయి!

కొమ్మన్న తల్లిదండ్రులకు, రెండిండాల గుసుపుగా ఉంది.

తను, ఒక్కతే ఒక్కగా నాడుపడుచై ఉండగా, అన్నగారు వేసీ వేయని శ్రీమంతుడై ఉండగా, కొడుకు పెళ్ళిలో, లంచాలో లాంఛనాలో సరిగా, తన హెూదాకూ అన్నగారి హెూదాకూ తగినట్లు ముట్టచెప్పలే దని, ఆ యిల్లాలు సదస్యం నాటినుంచీ, ముఖం ముడుచుకునే ఉన్నది!

ఆయన చూడబోదామా అంటే.—అభం శుభం ఎరుగని అమాయకుణ్ణి, తనను మాయచేసి కట్నం కానుకా అంటూ లేకుండా, చెల్లెలిని మెడకు కట్టినట్టుకాన్నే,- యిప్పుడు, కూతుర్ని కూడా అరచేత వైకుంఠం చూపించి తన కొడుక్కు అంట కట్టడం జరిగింది కదా అని, ఆ పెద్దమనిషి అక్కసు.

తా నేమో కొమ్ములు తిరిగిన లౌక్యుడని నలుగురిలో పేరు మోసి, ఒకసారికి రెండుసార్లు, యిలా, యిలాంటి స్వల్ప విషయంలో భావమరది చేతులో దెబ్బ తిన్నాను కదా అని, ఆయనకు ఉక్రోషం.

సరే.. దానా దీనా, - వారికీ వీరికీ మళ్ళు తోరణం నాటి నుంచీ మాటలు లేవు! రాకపోకలు లేవు!

ఆ వంక చుట్టాలు యిటూ, ఈ వంకచుట్టాలు అటూ ఉన్నవా రుండకుండా, కలుగ చేసుకొని రాయబారాలు సాగించి, వారినీ వీరినీ ఎగవన ద్రోయడంతో, మరింత కావేషాలు పెరిగి పోయినాయి!

ఇ న్నేళ్ళకు, తప్పని సరి కనుక, కొమ్మన్న మామగారు, వియ్యంకుడికి శుభలేఖ పంపించారు.

ఫలానా రోజున నిషేకానికి ముహూర్తం ఏర్పాటు చేశాం! అది తప్పితే,- మళ్ళీ ఒక్క అయనం వరకూ ముహూ

ఇదీ కథ. నీ మంచి చెడ్డలు నీవు ఆలోచించు కోవాలిరా-మనవడా-అన్నాడు.

నాన్నకు ఎదురు తిరగ మంటావా?

అది నా చేత చెప్పించాలా?

చెప్పకుండా వెళతాను-

ఇలాటి అపత్సమయంలో అదే ఉత్తమ మని పెద్ద లంటారు.

తండ్రిని తిరస్కరించిన కుమారుడికి ఉత్తమగతు లుండవని శాస్త్రాలు ఘోషిస్తున్నా యటగా!-

తప్పు దారి పట్టిన తండ్రికి విధేయుడై, ఆలిని ఉసురు పెట్టేవాడిగతీ అంతే నంటున్నాయి శాస్త్రాలు, నాయనా!

ఒక్క విషయం ఆలోచించుకో!-పితృవాక్యపరిపాలన చేసి, శ్రీరామచంద్రు డంత ఖ్యాతి గడించడం మే లను కుంటావా?-ఆ సచ్చిదానంద విగ్రహుడి లాగానే, అమాయకురా లైన యిల్లాలిని పరిత్యజించడం ఉత్తమం. ఆ నాడు రాఘవునికి ఆలి ఉసురు తగిలిందా?- లేదు. లేదు తండ్రీ లేదు! ఈ పుణ్యభూమిలో జనించిన తల్లులు, భర్త ఎంతటి ఆతతాయి అయినా, అతడిని పల్లెత్తు మాట అనరు. కంటికి కనబడటం కరు వైనా, హృదయ పీఠాన నిలిపి, మనోవాక్కాయ కర్మ లనే చతుర్విధోపాయములతో అహరహమూ అర్చన చేస్తూ - అంతటి మహానుభావుడికి సహధర్మచారిణిగా మెలగే భాగ్యం తనకు కొరవడిన హతభాగ్య నని తన్ను తాను నిందించుకుంటూ-ఇలా గడుపుతారయ్యా జీవిత శేషం-యీ దేశంలో ఐదువలు ! వేయి జన్మలకైనా అతడే పతి కావా లని తపస్సు చేస్తారు కదయ్యా!-

ర్తాలు లేవు!

మన గర్వం అహంకారం మనలోనే అణచుకోవడం మంచిది!

మీరు ఆడపిల్లలను కన్నవా రైతే,-యీ తీరున శరించి ఉండక పోదురు!

ఇప్పు డన్నా, మీకు యుక్తాయుక్తములు తోచని పక్షంలో పెద్ద లెవరికైనా యీ లేఖ చూపించి, వారు ఆనతిచ్చిన ప్రకారం ఆచరించ వలసింది.—

కొమ్మన్నగారి తండ్రి యీ లేఖ, వూళ్ళో పిన్న పెద్ద లంద రికీ చూపించాడు; కొడుక్కి మాత్రం చూపించడం మరిచాడు!

లేఖ చదివిన వా రందరూ, యథాశక్తి మరో నాలుగు సమిధెలు వేశారు!

ఆడపిల్లలను కనుక్కున్న వాడికి, అంత పొగరుమోతు తనమా?. అయ్యా బాబూ అనివచ్చి కాళ్ళమీద పడక్కర్లేదా?

తలతిరుగుడుతో, తనకూతురి కాపురానికి శాశ్వతంగా నీళ్ళు తోడుకున్నాడు!

కొమ్మన్నగారి తండ్రి ఊర్లోవారిసలహా లన్నింటినీ శిరసా వహించాడు. ఊ రంతా, లంకాయాగంలాగా, ఇదే మాట అయినా, అప్పటికీ కొమ్మన్నకు తెలియలేదు.

అంతమంది పెద్దమనుష్యుల్లో - గురునాథంగారనే ఒక తాతగారు, జ్యోతిషంలో చండ ప్రచండుడు, అమిత తలతిక్క మనిషి - ఒక రుండేవారు; ఆయన, పని గట్టుకుని, కొమ్మన్నను, గ్రామదేవత తోపులోకి పిలుచుకు వెళ్ళి ఉన్న కథ యావత్తు చెప్పి, వాళ్ళ నాన్న వైఖరి వివరించి చెప్పి-

ఇదీ కథ. నీ మంచి చెడ్డలు నీవు ఆలోచించు కోవాలిరా-మనవడా-అన్నాడు.

నాన్నకు ఎదురు తిరగ మంటావా?

అది నా చేత చెప్పించాలా?

చెప్పకుండా వెళతాను-

ఇలాటి అపత్సమయంలో అదే ఉత్తమ మని పెద్ద లంటారు.

తండ్రిని తిరస్కరించిన కుమారుడికి ఉత్తమగతు లుండ వని శాస్త్రాలు ఘోషిస్తున్నా యటగా!-

తప్పు దారి పట్టిన తండ్రికి విధేయుడై, ఆలిని ఉసురు పెట్టేవాడిగతీ అంతే నంటున్నాయి శాస్త్రాలు, నాయనా!

ఒక్క విషయం ఆలోచించుకో!-పితృవాక్యపరిపాలన చేసి, శ్రీరామచంద్రు డంత ఖ్యాతి గణించడం మే లను కుంటావా?-ఆ సచ్చిదానంద విగ్రహుడి లాగానే, అమాయకురా లైన యిల్లాలిని పరిత్యజించడం ఉత్తమం. ఆ నాడు రాఘవునికి ఆలి ఉసురు తగిలిందా?- లేదు. లేదు తండ్రీ లేదు! ఈ పుణ్య భూమిలో జనించిన తల్లులు, భర్త ఎంతటి ఆతతాయి అయినా, అతడిని పల్లెత్తు మాట అనరు. కంటికి కనబడటం కరు వైనా, హృదయ పీఠాన నిలిపి, మనోవాక్కాయ కర్మ లనే చతుర్విధో పాయములతో అహరహమూ అర్చన చేస్తూ - అంతటి మహాను భావుడికి సహధర్మచారిణిగా మెలగే భాగ్యం తనకు కొరవడిన హతభాగ్య నని తన్ను తాను నిందించుకుంటూ-ఇలా గడుపు తారయ్యా జీవిత శేషం-యీ దేశంలో ఐదువలు ! వేయి జన్మల కైనా అతడే పతి కావా లని తపస్సు చేస్తారు కదయ్యా!-

కనుక,-నాయనా, నిర్భయంగా నీవు మీ నాన్నమాట విను! ఆ పిల్లదాని ఉసురు నీకు తగలదు. అంతగా ఒక వేళ తగులు తుం దే మోనని రవంత అనుమానం ఉందా, మన స్మృతుల్లో, ఒకొ్కక్క పాపానికి వందేసి పరిహారా లున్నాయి; మీ నాన్న కలిగినవాడు. కనుక నీచేత అన్నీ చేయిస్తాడు - నిన్ను విముక్తుణ్ణి చేస్తాడు-

రేపీపాటికి, - తల్లీ తండ్రీ లేని పిల్లను చూసి, తెచ్చి నీకు ముడిపెడతాడు. తల్లీ దండ్రీ ఉంటే మళ్ళీ తగాయిదా వస్తుంది కా - ! అందుకని యీ సారి ఆ జాగ్రత్త పడతాడు.

లక్షణంగా పెళ్ళి చేసుకుని, ఒక్క కొడుకును కంటివా,- నీవు తరిస్తావు - ఏడుతరాల వారూ తరిస్తారు-

కొమ్మన్న కళ్ళవెంట కడవలాది నీళ్ళు కారుతున్నాయి- తాతగారి కాళ్ళు పట్టుకున్నాడు - గురునాథం గారు చిన్నవాడి కళ్ళనీళ్ళు తుడిచి - వెరికుంకా - వెళ్ళిరారా-అన్నాడు !

కొమ్మన్న కట్టు బట్టలతోనే - మళ్ళీ ఊరు మొగం చూడ కుండా, అటునుంచి అటే బయలుదేరి పోయినాడు.

దారిలో, ఊరి పొలిమేరల, - వాళ్ళ చేనుగట్టున చెరువు పక్కన, తండ్రి, సంధ్యావందనం చేసుకుంటున్నాడు! కొమ్మన్న ఎదుట పడక తప్పిందికాదు : ఆయన, 'ఎక్కడికి?' అని అడి గితే నిజం చెప్పక తప్పింది కాదు !

తండ్రి వద్దన లేదు. 'నా కొడుకు అత్తవారింట ఊడిగం చేసుకొని పొట్ట గడుపుకునే నిర్భాగ్యు డని అనుకొలేదు-అంటూ సంధ్యావందనంలో కలిపి సణుక్కున్నాడు.

అంటే, నీ అభిప్రాయం-నేను మళ్ళీ యింటికి రాకూడ

దనా?-

మానాభిమానాలు లేనివాడు, మాసీమలో మళ్ళీ అడుగు పెట్టడమే-

కొమ్మన్న నవ్వుకుంటూ వెళ్ళిపోయినాడు-తండ్రి, అలా కళ్ళప్పగించి చూస్తూనిలువ బడిపోయినాడు.

వెళ్ళగా, వెళ్ళగా, ఏరు అడ్డం వచ్చింది! ఎక్కడో వాన కురుస్తున్నట్టు ఉద్దండగా, హోరు వినబడుతూంది. చినుకు గాలివాటాన, ఏటవాలుగా సూదల్లే గుచ్చుకుంటోంది.

మసక, ఈదురు : ఒళ్లు పులకరింతగా ఉంది-,

ఏటిమీద, కంపా గఱ్ఱా కొట్టుకు వస్తూంది- అలమీద, నురుగుంది, - నీటికి ముదురు రంగు తేరుతూంది - వెల్లువ వచ్చే సూచనలు అ వన్నీ-

కనుచూపుమేర ఎక్కడా, తిప్ప లేదు. కొమ్మన్న యజ్ఞోప వీతం నడుముకు చుట్టుకుని, పై అంగవస్త్రం కాసె బిగించి, - ఏటిలోకి ఉరికి -వాలున కొంతదూరం దిగువకు తేలుకుంటూ పోయి, అడ్డం తిరిగాడు-

వాన కొండంత చినుకుగా కురుస్తూంది- కారు చీకటి,- వరద పొంగింది- గట్టు కనబడటం లేదు. కొమ్మన్నపని మునగా నాం-తేలానాంగా ఉంది-

పైనుంచి బానలు కొట్టుకొస్తున్నాయ్- ఓ నడిబాన చేతి కందింది - సునాయాసంగా, మెట్ట పట్టాడు కొమ్మన్న.-

అల్లంత దూరాన, ఏదో నెగడి, రగులుతూంది -అక్కడికి చేరుకొన్నాడు, చిన్నవాడు : తామరపువ్వంటి పిల్ల తడి బట్ట లతో, చలి కాచుకుంటూ కూర్చుంది.

కొమ్మన్న పిల్లకు ఎదురుగా కూల బడ్డాడు-

ఏ రా మడిసి?

బ్రాహ్మలం!-

అయితే దండ మెడుతా!

పిల్ల లేచి నిలుచుంది.

కొట్టు కొచ్చారా అయ్యా!

లేదు - బానపట్టుకు వచ్చాను!

కొమ్మన్న తనలో తాను నవ్వు కున్నాడు-

ఆ బానలన్నీ, మాయే! - నెలసరి ఆవం అంతా గంగ పా లైంది-

మీరు, కుమ్మర్లా!-

పిల్ల కిలకిలా నవ్వింది-

కుమ్మర్లం కాము దొమ్మర్లం కాము : మా అయ్యా కూలికి నాలికీ, బానలు ఆరె బోయించి, లాభసాటికీ అమ్ముకుంటాడు- సరే గాని, - మరి మీకు బు వ్వెట్టా!-

చేరువను ఏదీ గ్రామం లేదో!-

ఉంది - రెండు కోసుల్లో - కాని ఏడు వాగు లడ్డం — అ యన్నీ ఏక మైనాయి — ఎట్టా బోతారయా!- ఈ యాళకు యీడనే పన్తుండండి!-

పిల్లకోక చెంగుపాడి, ఆరింది.

చెంగుతో కొమ్మన్న తల తుడుస్తూ -

మీరు సదువుకున్న బాపనోరే గంద ?-

అని అడిగింది. కొమ్మన్న తల వూగించాడు!

కతలూ, కమామీషులు వస్తాయి గంద-

చక్కని కత ఒక్కటి సెప్పండి—

— పిల్ల తగిలేంత దగ్గరగా కూచుంది—

కొమ్మన్న తన కథే - బేతాళుడు విక్రమార్కుడికి చెప్పి నట్లు చెప్పడం ప్రారంభించాడు-

— ఆ పిల్లవాడు తండ్రితో ఆ విధంగా పోట్లాడి, అత్తవారింటికి వెళుతూంటే, ఏ రడ్డం వచ్చింది. ఏరు ఎల్లాగో దాటా డనుకో - అక్కడ ఓ పిల్ల అడ్డం వచ్చింది :

ఆ పిల్ల ఎల్లా ఉందను కున్నావ్ - బంగారపు బొమ్మ. పిల్లవాడి మనసు ఆ పిల్లదాని మీదే ఉంది. వెళ్ళ లేడు, చూస్తూ ఉండ లేడు - అలాటి సమయంలో వాడు ఏం చేయాలి మహారాజా అని భేతాళుడు అడిగాడు. విక్రమార్కుడు ఏం జవాబు చెప్పాలో తోచక మౌనంగా ఉన్నాడు.

పిల్ల ముక్కుమీద వే లేసుకుంది.

ఏం చోద్దెమయ్యా ! మారాజు మాటకేం గాని, ఒక్కముక్క యిడమరచి సెప్పండి : ఆ పిల్లగాడు సక్కనోడే గంద ?-

ఆహాఁ-

అయితే పిల్ల మనసు పడలా?-

చెప్ప లేం !- వాడు పెళ్ళయినవాడు గదా?-

అయితే మట్టుకు - అదేం ఆడ కూతురయ్యా !

ఒంటరిగా సిక్కా రంటివి - యిద్దరూ సక్కనో ళ్ళంటివి.

వో నంటివి - వొంగు డంటివి. మనసు పడక ఎట్టా ఉం దయ్యా - ఆ రిద్దరూ బాపనో రన్నమాట !- మనసు దాచు కోడం ఆ మా రాజులకే సేత నౌ-

కొమ్మన్న, నిర్భయంగా తల ఎత్తి చూశాడు పిల్ల వంక-

వాడికి మనసుంది కాని, పిల్లది ఏ మను కుంటుందో అని భయం!-

—పిల్ల విరగబడి నవ్వి - కొమ్మన్న చెంపలు దువ్వి -ఆ అయ్యా నీవం టోడే నను కుందామా - అంది .

కొమ్మన్న, చేతులు చేతులోకి తీసు కున్నాడు. పైన ఫెళ్లున నక్షత్రాలు వచ్చినాయి.

తెల్ల వారింది, ఎండ కళ్ళమీదికి వచ్చింది: కాని కొమ్మన్నకు మెలుకువ రాలేదు: కాని ఎందుకో ఉలిక్కిపడి లేచాడు: పిల్ల, కాళ్ళకు మొక్కుతూంది.

అ దేమిటి?—

నేను చేసుకున్న పున్నెం !-

కొమ్మన్న, తెల్లబోయినాడు.

స్నానమూ అనుష్ఠానమూ తీర్చుకుని, తిరిగి వచ్చాడు, పిల్లదాని పక్కను కూర్చున్నాడు.

నా పేరు కొమ్మన్న. మావూరు -

పేరుకీ వూరుకీ ఆసపడ్డా నను కుంటివా - భగవంతు డిట్టా వచ్చా డనుకున్నా-

న న్నేలు కున్నా డనుకున్నా -!

మీ అయ్యా ఎక్కడున్నాడు ?-

ఈదురులో, ఆలమంద తలకొక దిక్కుగా సెదిరి పాయె - మళ్ళోసుకు రావాలి గంద !-

రాగానే, - చెప్పి, నిన్ను వెంట తీసుకు పోతాను :

ఏడకు?-

మా ఊరికి ! - నిన్నూ ఒక భార్యగా చూసు కుంటాను.

పిల్ల ఉన్న ట్టుండి పకాలు మంది -

అది నీవల్ల కాదయ్యోవ్ !- నే నీ గడ్డ యిడిసి రాను గంద !-

రాక ! - నా మీద మక్కువ లేదా !-

లేదో ! అయబ్బ !- లేదంటే దబ్బర కాదో !- ఉన్న మక్కు వంతా, ఒక్క ముచ్చటలో తీరింది గదయ్య !- మాకు అరటి చెట్టు కులదేవత - ఒక్కటే పున్నమి - ఒక్కటే పూత - మన బిడ్డకు ఏం పే రెట్టుకోను !

కొడు కైతే గురునాథుడు ! ఆడ పి ల్లైతే -

నీ కంట పడదుగా! అల్లదుగో- అనవాలుకు ఆసేతి ఉంగరం యిచ్చుకో! - పుట్టే బిడ్డకు ఆపే రెట్టి, బుద్దులు సెప్పి- నూగు మీసం రాంగనే అనవా లిచ్చి, నీ కాడ కంపుతా!-అలించి పాలించి అక్కరకు దెచ్చుకో!-

కొమ్మన్న, పిల్ల రెండు చేతులూ పట్టుకుని బ్రతిమాలు కున్నాడు.

నిన్ను విడిచి ఉండలే నన్నాడు: పిల్ల పెదవి విరిచింది!

న న్నేలిన వోడు యింత నరం లేని మడిసి అనుకో లేదు. మనసేత నే ముం దయ్యా! అది, - మన మొగాన రాత. యిడిసి నిలవలేవా ?-

రేతిరి ముచ్చ టంతా-క లనుకో!-

మడిసీ,- యీ ఆడకూతురు అలవి తప్ప లేదు- అన తప్ప లేదు: నిన్న నే తల కడుక్కుని శుద్ధిగా, కులదేవతకు మొక్కు లిచ్చినా! ఆతల్లి వరదల్లే పొంగి,-ని న్నీడకు తెచ్చింది! ఆ యమ్మను తలచుకొని, న న్నిచ్చుకున్నా- పుటక సెల్లింది. మారు

మాట అనకయ్యా!- తలచుకొని నడచిపో- సేత నైతే, మరచిపో లేదా, - కంట తడి పెట్టకుండా తలచుకో! పోయి రా వయ్యా- నీ బతుకు నీవు బతకవయ్యా—

పోనీ నీ పే రన్నా చెప్పవూ?-

ఏరు నడుగు - అది చెవుతుంది!

పిల్ల, ఒక్క అడుగు ముందుకు వేసింది - కొమ్మన్నకు పట్టరాని దుఃఖము వచ్చింది. పిల్ల ఆగిపోయి, కొమ్మన్న తల చెక్కిలికి ఆనించుకుంది-

ఈ దుఃఖం బిడ్డమొగం చూసేదాకా ఉంటుంది-నేను ఓదార్చ లేను! మన ముచ్చట భారతం అనుకో- నీవు అర్జునుడి వనుకో- నేను అనాగుల పి ల్లనుకో-ఈ మమత యిక్కడే మరచి పోవయ్యా !- నన్ను చూచిన కంటే నీ ఆలిని చూచుకోవయ్యా!-

పిల్ల తెలిమీనల్లే ఏటిలోకి ఉరికి మాయ మైంది.

కొమ్మన్న అత్తవారి ఊరు వెళ్ళి, - అక్కడే ఉండి పోయినాడు.

మనవడు పుట్టా డని కబురు విని, కొమ్మన్న తండ్రి, ఊళ్ళో వా ళ్ళందరిచేతా చెప్పించుకుని, పసివాడిని చూడటానికి వెళ్లాడు. వీడిపుట్టుకతో, అందరి తిక్కా కుదిరి,-మళ్ళీ ఏకం అయినందుకు గుర్తుగా, పిల్లవాడికి తిక్కన్న అని నామకరణం చేయడం జరిగింది.

తిక్కన్న పెరిగి పెద్దవా డైనాడు— సోమయాజి అయి నాడు: భారతం ముందు వేసుకుని తెలిగింపుకు తలపడినాడు.

కొమ్మన్నకు బాగా వార్థక్యం వచ్చింది- కాని, కనుపటిమ, వాక్పటిమ తగ్గ లేదు.

తగ్గకపోగా, కొడుకు మనుమ సిద్ధి ప్రాపకంలో అంత ప్రయోజకుడు కావడం-కాకతి గణపతి దేవుడంతటివేత్త- ఆంధ్ర భారతాన్ని ఎప్పటి కప్పుడు తెప్పించుకుని కళ్ళ కద్దుకుంటూ బహుమానాలు పంపుతూండటం - యీ వైభవంలో మెలగుతూండటంవల్ల, ముసలి ఆయనలో ఎక్కడ లేని ఠీవి రాజసం ఉట్టి పడుతూంది:

వంది మాగధు లందరూ పరివేష్టించి ఉండగా, ఒకనాడు కొమ్మన్న గారు కొలువుదీరి కూర్చున్నాడు.

అప్పుడు - గురునాథుడు వచ్చాడు.

వచ్చి, కొమ్మన్నకు నమస్కరించి, ఓసరిలి నిలుచున్నాడు.

ఎవరు నీవు-

దర్శనానికి వచ్చాను.

అబ్బాయి గారు – ఏకాగ్రతతో గ్రంథరచన చేసుకుంటున్నారు - దర్శనానికి వలను పడదు.

చిత్తం - నేను వచ్చింది, తమ దర్శనానికి -

ఏమిటి విశేషం —

ఏ కాంతంగా మనవి చేసుకుంటాను-

సరే- భోజనా నంతరం దర్శనం చేసుకో !-

గురునాథుడు నమస్కారం చేస్తూ అక్కడే కూర్చున్నాడు .

నీ బోజన మెక్కడ-

ఎక్కడ ప్రాప్తమో అక్కడ-

'ఎవ రీతుంటరి?' అన్న చూపు చూశాడు కొమ్మన్న.

గురునాథుడు, మారు మాట చెప్పకుండా, రొండి నున్న ఉంగరం దోసిట పట్టాడు.

కొమ్మన్న కంపించిపోయినాడు: చుట్టూ వున్నవా రందరూ దిగ్భ్రాంతు లైనారు.

అందరికి సెల విచ్చి పంపి, కొమ్మన్న గారు, 'గురునాథా!' అని కేక పెట్టి కుమారుణ్ణి కౌగలించుకున్నారు.

'అయ్యా! - అయ్యావే! - మా అయ్యావే!

మాయమ్మ సెప్పిన కనుముక్కు తీరే!-

మీ అమ్మ బా గుందా!

బా గుంటే ఆడనే ఉండకపోయినా!- నిన్ను తలసుకుంటూ నన్ను చూసుకుంటూ ఆ యవ్వ పండల్లే బతికింది! మనక థంతా చెప్పింది! అప్పుడే నిన్ను చూడపోతా నంటే, యిడవలేక గొల్లుమంది - మొన్న ఏకాదశి రాంగనే- కన్ను మూసిం దయ్యా!-

కొమ్మన్న పసివాడిలాగా బావురు మన్నాడు-

మీతల్లి గొప్పయిల్లాలు నాయనా!- అంటూ తల నిమిరాడు.

గురునాథుడు మబ్బు విడిచిన యెండల్లే నవ్వాడు-

మా యవ్వ గొప్పలు నాకాడ చెప్పు తుండవా అయ్యా! - సరే గాని, - నాకో సిట్టి తమ్ము డుండా డంట - కొమ్ము ల్దిరిగి వోడంట - కంట సూద్దునా-

కొమ్మన్న కొంచెం తటపటా యించాడు:

నాయనా, విద్యాబుద్ధులు నేర్చి ప్రయోజ కుడివి కావలసిన వాడివి - యిలా ఉన్నావా! అఖరికి స్వచ్ఛంగా మాట లాడట మన్నా రాకుండా - ఇ దంతా నాస్వార్థమే, నా అప రాధమే!-

ఇంతలో తిక్కన సోమయాజి గారు అక్కడకు దయ చేశారు - 'పలపలని మూకలో కాల్నిలువక యరదంబు డిగ్గి నీ కొడుకుగదా, కలితభుజు డగుచు నొక్కడు, తొలగి చనియె నేమి చెప్పుదు — అని మనసులో బిగ్గరగా పద్యం తడుముకుంటూ—

వచ్చేవారిని చూసి, గురునాథుడు లేవబోయినాడు. కొమ్మన్న గారు 'గురునాథా!' అన్నారు, ఆపారు.

సోమయాజి గారు, ఎగిరి గం తేసినంత సంతోషంతో - 'పద్యం పూర్తి అయింది నాయనగారూ - మీముఖంచూడ గానే- అంటూ, ఆగి, 'యీత డెవ్వరు' అని పృచ్ఛించినారు.

'కవి బ్రహ్మ లని పేరు మోశారు గందా - అమాత్రం యెరిక లేదా?- అయ్యాగోరి పక్క నట్టా కూకుండ వయ్యా!- ఒక్క పరి చూస్తా!-

తిక్కన్నగారికి కోపం ముంచు కొచ్చింది!

"ఎవ్వ రీతడు- ఏమిటి పాడుభాష!"

గాలికి పుట్టి, ధూలికి పెరిగి నోళ్ళు కూసే దయ్యా - యీ బా : తాటాకుల కట్టలు మేసేవోళ్లకు మీబాస.

అయ్యా! నాకన్న చిన్నోరు, దణ్ణ మెట్టరాదు- అయ్యా గోరికి మొక్కి, నామనసు విప్పుకుంటా-

యీ బాస, తవురిబాస నేనూ సదివినా-అ కాడ అకాడఅని సూసినా - సుక్కలనీడ బతికేవో ళ్లంతరూ సోద్దెంగా సూసినారు: పొలంలో వోళ్లు పుట్రలో వోళ్ళు-యీాడికి యె ట్రెక్కిం దన్నారు- మరీ గిట్టనోళ్లు యీాడు బ్యామ్మ డైనా డన్నారు: ఛస్- కూడ దను కుని యిడిసినా - ఆడూ యీాడూ పలికే పలుకునే- పాట కట్టినా- పదం కట్టినా - పదం పాటా - చేలో ఆవు లన్నీ అలకిస్తయి -

గొర్రెపిల్లలు కో లేస్తాయి - లేగ లన్నీ సిందేస్తాయ్-

అది, నా పున్నెం కా దంటవా అయ్యా!

తవురిలాటారు, యెయ్యిమందిలో ఒకరు కొండ లగిలేట్టా-కైతలు సేస్తారు. ఏ మా రాజులో మెచ్చుకుంటాడు. ఏనుగు నెక్కిస్తారు-

ఒక్కరి కూటికీ గుడ్డకూ అక్కర కొచ్చేది మీ బాస - మందిలో పడేది మా బాస-

అయ్యా, నేను తవురిలాగ నీడనూ మేడనూ బుట్టలే! - వర దొచ్చి, మా అయ్య కొట్టుకొచ్చినాడు- మా యమ్మ - వానకు తడిసిన జువ్విచెట్టల్లే ఒడ్డున ఆపటింది! మెరుపుమీద మేఘం అల్లే ఒకరి నొకరు కమ్ముకున్నారు: ఆకాశం నీడను - సుక్కల యెలుగులో, మా యమ్మకడుపున పడ్డా నయ్యా! - నా సదువు నాకు - మన్నెంలో మబ్బు లిచ్చినాయి - యేటివొడ్డున రెల్లు మొక్కది ఏబాసో - నాది ఆబాస!—

'ఎవ రండీ- మీరు?'' అని, తిక్కన గారు తెప్పిరిల్లి, మర్యాదాగా అడిగారు: కొమ్మన్న గారు నోరు విప్పబోయినారు: కాని గురునాథుడు, ఉవ్వెత్తున లేచి నిలుచుని తండ్రికి నమస్కారం చేశాడు.

అయ్యా! - నా కళ్లు చల్లబడ్డాయి - నేను పోతా! —

అతడిని ఆపండి నాన్నగారూ - అని తిక్కన తహతహలాడినాడు.

నేను నిలవ నని అయ్యకు తెలుసు—

మీరు - సల్లంగా వరిదిల్లం డయ్యా!

తిక్కన్న ప్రమాన్పడి కూర్చున్నాడు - కొమ్మన్న గారు -

కొడుకును సాగనంపడానికి నాలుగడుగులు వేశాడు.

ఉండవా- నాయనా! — నామీద కోపమా?—

అయ్యా! — నీ వీమాట అంటివో, మా యవ్వ అరటి మొక్కను జ్ఞాపకం చేయమంది! నీవు ఆపైన పల్లకుంట వంది - నా బతుకు బతకాలి గంద - పోయే నయ్యా! - తమ్ముడికి కూతురుడితే, - మా యవ్వ పే రెట్టుకోమంది—

గురునాథుడు — పరుగున వెళ్లిపోయినాడు.

కొమ్మన్న అక్కడే నిలువబడిపోయినాడు.

తిక్కన్న తండ్రి దగ్గరకు వచ్చాడు—

ఎవరు నాయనా — వారు?—

మీ అన్నగారయ్యా!

ఆ నాటి ముచ్చ టంతా కొడుక్కి చెప్పాడు కొమ్మన

తిక్కన్న చే యెత్తి గురునాథుడు వెళ్లిన వంకనే-కను లర మోడ్చి - రవంతసేపు ధ్యానముద్రలో ఉండిపోయినాడు.

నాన్నగారూ, భారత రచనకు ఫలం ఏమిటో నా కిప్పుడు అవగత మైంది. నేను, వ్యాస భగవానుడికి వంకలు దిద్ది, మెరుగులు పెట్టగల మేధావిని కాదూ? - కవిబ్రహ్మను కాదూ? - నా అహంకారం నశించడానికి - దైవం యీ రూపున వచ్చా డను కుంటాను!-

అన్నా-కవే-నేనూ కవినేనా?-

పంచభూతాలలో శాశ్వతంగా స్పందించే పరతత్వపు - పరాకాష్ఠ మా అన్న - పరమేశ్వర స్వరూపానికి ఉండే అజ్ఞాత - శాశ్వత కీర్తి ప్రతిష్ఠలే - అన్నకూ - ఆభాషకూ-

నాన్న గారూ, సోమయాజినై సంకల్పించాను కనుక భారత సంహిత పూర్తి చేస్తాను! ఆపైన గంటం ముట్టను!-

అన్నా - కవే - నేనూ కవినేనా?-

నాదీ కవిత్వమేనా?-

# ఇల్లు కొన్నాడు

## శ్రీ కొమ్మూరి వేణుగోపాల రావు

విజయవాడలో 4-9-1935 లో జననము. అక్కడనే విద్యాభ్యాసము చేసి, హైదరాబాదులో వైద్య విద్య నభ్యసించు చున్నాడు. పిల్లల పత్రికలు చదువు చుండుటచే 14 వ యేట రచనా సక్తి కలిగినది. 16 వత్సరము నుండి రచన చేయుచు ఇప్పటికి 150 కథలు ప్రచురించినాడు.

"కొమ్మూరి కథలు" "పిల్లదొంగ" పుస్తక రూపమున వెలువడినవి. "పెంకుటిల్లు" "కొత్త డాక్టరు" "ఒక్కగంట" అన్న నాటికలు "చిన్నక్క" అనే నవల, "దిగంతాలవతల" అను పెద్ద నవల, అముద్రితములు.

---

౧

వర్షాకాలం; నిన్నటినుంచీ ముసురుగా వుంది. ఇవాళ ఉదయం తుంపరగా ప్రారంభమై మధ్యాహ్నానికల్లా మరీ జోరయింది వాన.

అప్పటిదాకా నిద్రపోయి, వాన ఎలా వుందో చూద్దామని ముందుగదిలోకి వచ్చిన చిదంబరానికి తెరిచివున్న కిటికీలోంచి వాన జోరు గోచరించింది. పొరపాటుచేత కిటికీ తలుపులు తెరవబడి వున్నాయి. పడమటి జల్లుకు గది కొంత భాగం బాగా తడిసి పోయింది. పంచా, చొక్కా తడుస్తున్నా లెక్క జేయకుండా,

వెళ్లి తలుపులు మూశాడు.

వాన తగ్గలేదు. ఇంకా తగ్గలేదు. ఇప్పుడు నాలు గయింది- ఇంకా కొంచెం సేపటిలో అయిదు, మరికొంతసేపటిలో ఆరు అంతలో చీకటి పడుతుంది, రాత్రి ప్రారంభ మౌతుంది. తిరిగి రేపటి ఉదయం వరకు ఏపని చేయటానికి వీలు లేదు.

రెండు మూడు నిమిషాలు ఆయన విసుగ్గా ఆలోచిస్తూ నిలబడ్డాడు. అంతలో టప్‌మని ఒక నీటిబిందువు సరిగ్గా నెత్తిమీద పడింది. వెను వెంటనే యింకొకటి. గ్రహించి, తల పైకి ఎత్తే లోగా మరొకటి. తల ఎత్తి చూశాక యింకా ఒకటి; సరిగ్గా యీసారి నోటిలోకి వచ్చిపడింది- తెరిచివున్న నోట్లోకి.

ఛీ. చీదరగా ఆయన రెండడుగులు యివతలకు వేశాడు. ఈసారి భుజం తడిసింది. విసుక్కొని అవతలకు వెళ్ళాడు. ఈమారు వీపు తడిసింది, చినుకులు! చినుకులు! చినుకులు! గదంతా కురుస్తోనే వుంది. ఎటు వెళ్లినా తడిశాడు. నేలంతా తడిసి పోతోంది. గోడల మీదుగా నీళ్లు కారిపోతున్నాయి. పై కప్పు అంతా తడిసి ముద్దయింది.

పూర్తిగా తడిసిపోయి కోపంగా లోపలకు వచ్చాడు. ఇల్లంతా నిర్మానుష్యంగా వుంది. మూడే గదులు మొత్తం. ముందు గది గతి అలా వుంది మధ్యహాలు ఒకమాదిరి పరవాలేదు. మళ్ళీ వంటగది ఎంతోసేపు ఏడిచినట్లు చెమ్మగిలి వుంది.

మధ్య హాల్లో పరిచివున్న చాపమీద మళ్లీ పడుకున్నాడు చిదంబరం.

నీళ్లు! నీళ్లు! నీళ్లు! ఎక్కడ చూసినా నీళ్లు యీ

యింటినిండా. ఈ యింట్లోనె కాదు. యాభయి అయిదేళ్ల వయస్సు తనది. పుట్టి బుద్ధెరిగాక యింతకంటె మంచి యింట్లో ఎప్పుడూ వుండ లేదు. తన జీవిత మంతా యింతవరకూ అద్దెయిళ్లలోనే బ్రతికాడు. ఇన్నాళ్ళూ అద్దె యిళ్ళ బ్రతుకుకే అలవాటు పడి పోయాడు. గదుల్లోకి యెండ వచ్చినా సహించాడు. వాన కురిసినా భరించాడు. ఖాళీచేయ మన్నప్పుడు ఖాళీ చేశాడు. ఎన్నో యిబ్బందులు పడ్డాడు. కొన్ని పదుల ఇళ్లు మారాడు. ఏనాడూ ఏ యింటిమీదా తనకు స్వతంత్రం లేదు.

"ఈ యిల్లు నాది, నాయిష్టం వచ్చినట్లు చేసుకుంటాను." అని అయ్యో యెన్నడూ అనుకున్న పాపాన పోలేదు.

"ఇది అద్దె యిల్లు—అద్దెయిల్లు" ఎప్పుడూ యీ భయమే. రాత్రిళ్లు ఎక్కువసేపు లైటు వెలిగిస్తే యింటి యజమాని వచ్చి దెబ్బలాడేవాడు తన దగ్గర ప్రయివేటు నేర్చుకునే పిల్లలు కొంచెం గొడవ చేస్తే యింటి యజమాని ఆ యిల్లు ఖాళీ చేయ మన్నాడు.

కొన్ని కొన్ని ఇళ్లలో యిష్టం వచ్చినప్పుడు బయటకు వెళ్లటానికి వీలు లేదు. ఇష్టం వచ్చినప్పుడు లోపలకు రావటానికి వీలు లేదు.

ఎదురింటి వాడితో జగడాలు. ప్రక్కయింటితో విరోధాలు, పంపుదగ్గర దెబ్బలాటలు, అద్దెదగ్గర దెబ్బలాటలు.

అజ్ఞలు, అసూయలు, వైషమ్యాలు, పగలు

ఇంకా ఎన్ని ? ఎన్ని ?

ఆ దృశ్యాలన్నీ ఈ నాడు తలలో తిరుగుతున్నాయి. ఎన్ని యిబ్బందులు పడ్డాడు! ఎందుకు పడ్డాడు ? తనకు అద్దె ఎక్కువ యిచ్చే తాహతు లేదు. చిన్న యిళ్లే తీసుకోవాలి. చౌకపారు.

యిళ్లలోనే కాపరం చెయ్యాలి. సరిపోక పోయినా సరిపెట్టుకోవాలి.

యాభయి అయిదేళ్ల జీవితం తనది. నిన్నగాక మొన్న రిటైరైన జీవితం తనది.

ఉద్యోగమే; బతకలేని బడిపంతులు పని.

అయిదు వేలు అందిచ్చి తనను వదిలిన బడిపంతులు పని.

ఇన్నాళ్ళయాక, జీవితం యింత మొద్దుబారాక, అద్దె బ్రతుకు అలవాటు పడ్డాక మనసు యిప్పుడెందుకో తిరగ బడు తోంది. ఉద్యోగం నుంచి స్వేచ్ఛ లభించింది. ఇహముందు ఈ మనిషి తెల్లవారు ఝామునే తప్పని సరిగా మేలుకో నక్కర్లేదు. కాలకృత్యాలు తీర్చుకొని ఆపరా బాపరాగా నాలుగు మెతుకులు నోట్లో వేసుకొని, రెండుమైళ్ళ దూరం కాళ్ళీడ్చు కుంటూ నడవ నక్కర్లేదు అధికార్ల చివాట్లు తిన నక్కర్లేదు. రాత్రుళ్ళు పన్నెండు వరకూ మేలుకుని కాంపోజిషన్ పుస్తకాలు దిద్ద నక్కర్లేదు.

అంతటితో ఆగక మనసు ఇంకా స్వేచ్ఛ వెదుకుతోంది. అద్దె బ్రతుకుకు స్వస్తి చెప్పాలని చూస్తోంది.

తనూ ఓ యిల్లు కొనాలి.

చిదంబరానికి మేనంతా ఒక్కసారిగా గగుర్పొడిచింది. ఎంత తియ్యని అనుభూతి!

నిన్న తన స్నేహితుడు; అతనికీ తనకీ పాతికేళ్ళ స్నేహం, అతనిది బ్రతికిచెడ్డ జీవితం—తన దగ్గరకు వచ్చి-

"నాకో సహాయం చెయ్యాలి?" అన్నాడు.

"ఏమిటీ?"

"చేస్తావా?"

అప్పుడే భయం వేయటం మొదలు పెట్టింది. ఏం సహాయం చేయగలడు తను? అశక్తుడే.

"చెప్పు" గొణుగుతున్నాడు.

"నాకు డబ్బు కావాలి"

"ఎంత?"

అతను వికటంగా నవ్వి అన్నాడు. జుట్టు నెరసినా, శరీరం ముడతలు పడినా, జర పీడిస్తున్నా అతని నవ్వు యింకా యౌవనపు తీవిలోనే వుంది. బ్రతికి చెడ్డవారి నవ్వులు అలానే వుంటాయి కాబోలు.

"నాకు ఎంత అయినా అవసరం వుంది. కాని అంత నాకెవ రివ్వ గలరూ?" కాని తను కొంత అయినా యివ్వలేడుగా—

"నా దగ్గ రెక్కడుంది?"

"విను" అంటూ వచ్చిన స్నేహితుడు తాపీగా అన్నాడు. "మా తండ్రి తండ్రి రాజా బ్రతుకు బ్రతికాడు. మా తండ్రీ అంతే. నేనూ అంతే. కాని వాళ్ళంతా రాజా చావే చచ్చారు. నా కా అదృష్టం లేక పోయింది. నా ఆస్తంతా యిప్పటికే నశించింది. ఒక్కొరోజు తినటానికి తిండికూడా వుండదు. నా దుస్తులు మాయగా ఎప్పుడైనా నువ్వు చూశావా? ఇప్పుడూ చూడవు. లోకానికి దరిద్రుడిగా కనిపించటం భరించలేక యిలా దొంగ బ్రతుకు బ్రతుకుతున్నాను. నువ్వు నా ఆప్తమిత్రుడివి, కాబట్టి చెబుతున్నాను. నీ ముందు నే నెటువంటి రహస్యమూ దాచను. నీ ముందు మాత్రం నాకు సిగ్గూ, అభిమానం లేవు. చంటిపిల్లకు జబ్బు చేస్తే నిన్న మందు ఇప్పించేందుకు కూడా చేతిలో

దమ్మిడీ లేక పోయింది. కంఠస్వరం వొణుకు తోంది. వేడి నిట్టూర్పు చలిగాలిలో కలిసి పోయింది. ఈ బ్రతుకు దుర్భరంగా వుంది. పదిమందిలో నా పరువు ఎలా పోగొట్టుకోను; ఇహ యీ ఊళ్ళో నిలువలేను. నాకు...నాకు... మిగిలింది ఒక్క యిల్లే. అది అమ్మేద్దా మనుకుంటున్నాను.

భుజా లెగురవేశాడు తను. ఏం చేయగలడు తను?

"పరాయివాడికి బేరం పెట్టి నా పరువు ప్రతిష్ఠల్ని వేలం వేసుకో లేను. నువ్వే నన్ను కాపాడాలి?"

ఏ మాశ్చర్యం? ఎటువంటి వాడు తనని వచ్చి బ్రతిమాలుతున్నాడు? కాపాడగలిగే శక్తి తనకు వుందా?

"నీకు ప్రావిడెంట్ ఫండ్ వచ్చింది కదూ?"

తల వూపక తప్పలేదు.

"ఎంత?"

"అయిదు వేలు"

"నేను చెప్పేది బాగా ఆలోచించు. నా యిల్లు నువ్వు చూశావుగా. దాని ఖరీదు యెంత చేస్తుందోకూడా ఆలోచిస్తే నీకు తెలియకపోదు. ఇంకా మూడువేలు యెలా గయినా సంపాదించు. నీ కిచ్చేస్తాను."

"నా కెందుకు యిల్లు?" అని చిదంబరం గొణిగాడు.

"ఎందు కేమిటి? ఈ రోజుల్లో స్వంత యిల్లు వుండటంకన్న వేరే సౌఖ్యం ఏ ముంది? నాలో నమ్మక ముంటే నా మాటల్ని విశ్వసించు. నాకు వేరే గత్యంతరం లేక యిల్లు అమ్ముకుంటున్నా కాని మరేం లేదు. నేను యెటువంటివాడినో నీకు తెలిసి వుండకపోదు. నన్ను బహిరంగపరచి, నలుగురిలో నవ్వులపాలు

చేయడం నీకు యిష్టమా ఏమిటి?''

తల అడ్డంగా తిప్పాడు.

''మరి? బేరానికి పెడితే నేను చెప్పిన ధరకన్నా యింకో రెండుమూడు వేలు యెక్కువ రాకపోవు. కాని నా పరువూ, మర్యాదా...''

ఎప్పుడూ యిదే మాట. ఈ లోకంలో యితనికి యీ రెండే ప్రీతి అయిన పదార్థాలు కాబోలు.

''ఏ మంటావు?''

ఏ మనాలి? ఈడబ్బు వచ్చినదగ్గరనుంచీ యేం చెయ్యాలో తనకూ బోధ పడటం లేదు. వడ్డీకి తిప్పుదా మని ముందు అనుకున్నాడు. కాని ఆ వ్యాపారం తన కేం చా తవును? తనదృష్టిలో ఇంకా రెండు మూడు వున్నాయి. ఏమీ పాలుపోవడం లేదు. భార్య సలహా తీసుకోటానికే భయం. ఆడవాళ్ళ తెలివితేటల్లో తన కంత నమ్మకం లేదు. ఇప్పుడు హఠాత్తుగా యీ చిరకాల మిత్రుడు నూతన సమస్య తెచ్చి పెట్టాడు. ఇందులో లాభం వుందో, నష్టం వుందో తన కేం తెలుసు? వ్యవహారాలు తనకు అంతగా తెలియవు.

''ఆలోచించాలి''

''ఆలోచించు. ఒకగంటసేపు టైము ఇచ్చాను.'' బ్రతికి చెడినవాళ్ళ మాటలు ఇలానే వుంటాయి కాబోలు.

''గంటా?'' అని తెల్లబోయి ''కాదు. రేపు చెబుతాగా'', అని అప్పటికి తప్పించుకున్నాడు.

''రేపు సాయంత్రం మీ యింటి కొస్తాను. అర్జం టయిన విషయం సుమా!'' ''ఎందుకూ? నే నేవచ్చి ఏ సంగతీ చెబుతాను.''

అతను వెళ్ళిపోయాడు.

రాత్రంతా ఆలోచనలు. ఒకానొక పెద్దసమస్య.

ఎలా పరిష్కరించాలి. ఆ మాటలు స్నేహితుడి నోటిలోంచి విన్నప్పుడు ఎక్కువ చలించ లేదు గాని, లోతుగా ఆలోచించిన కొద్దీ ఊహ లన్నీ హాయిగా, తీయగా వున్నాయి. స్వంతయిల్లు ఇన్నాళ్లకు ఓ స్వంతయిల్లు ఎడా తెరిపీ లేకుండా అద్దెయిళ్ళలో గడపిన వ్యక్తికి, స్వంతయి ల్లంటూ రావటం వింత అనుభూతే. మొదట కొద్దిగా భయం, తరువాత అందోళన, ఆ తరువాత కుతూహలం, యింకా తరువాత ఆనందం యి వన్నీ కలుగు తున్నాయి.

ఇన్ని మెట్ల తరువాత వుంది ఆనందం. ఇంటి యజమాని అయితే అంత ఆనందమూ అనుభవించ వ చ్చన్న మాట.

చివరకు కొందా మనేకోరికే బల మవుతోంది. కాని అంత డబ్బు తను భరించగలడా? మూడువేలు అప్పు అసంభవం.

రాత్రంతా కలిగిన ఆలోచన ఫలితమే యీనాటి యీ దృఢ నిశ్చయం. అందుకే యీ ఆదుర్దాను అణుచుకోవటం కష్టంగా వుంది. పాడు వర్షం పగ సాధిస్తోంది. ఈ వానలో ఎలా తడిసి, బయిటికిపోయి అతనికి యీ విషయం వెల్లడించటం.

ఒక్క రోజులో పుట్టి పెరిగిన వాంఛకు ఎంత బలం? తనని యింత అకర్షణలో పెట్టిందే. మిగతా విషయాలపట్ల శ్రద్ధను పూర్తిగా విస్మరింప చేసిందే.

అంతే కాదు. ఎన్నడూ యింత చిరాకు పడలేదు. ఈ రోజు యీ అద్దె యింటిమీద ఎన లేని అసహ్యం కలుగుతోంది.

ఈ యింట్లో పంపు లేదు. బావినీళ్లే గతి. ఎలక్ట్రిసిటీ లేదు.

వాన వస్తే యి ల్లంతా తడుస్తుంది. చెప్పలేని యిరుకు. ఇన్నాళ్లు యీ యింట్లో తనూ, భార్యా పిల్లలూ యింతమంది ఎలా కాపుర మున్నారు?

అమ్మకానికి వచ్చిన యిల్లు తనకు పరిచితం. ఇంతకు మూడురెట్లు వుంటుంది. డాబాయిల్లు, ఎలక్ట్రిసిటీ, పంపూ యీ సౌకర్యా లన్నీ వున్నాయి. మంచి లొకాలిటీ. ఇంతకన్నా ఏం కావాలి? అంతే కాదు. తాము కాపుర ముండగా మరొకరికి అద్దెకు కూడా యివ్వవచ్చు.

ఏమిటి? తను యిల్లు అద్దెకు యిస్తున్నాడా ?

వళ్లు పులకరించింది. ఆనందబాష్పాలు రాలటానికి అట్టే వ్యవధి లేదు. ఎంతటి ఘనకార్యం చేయబోతున్నాడు? తను ఓయింటి యజమాని అవుతున్నాడు. తన యిల్లు అద్దె కిస్తున్నాడు. తన చుట్టూ అద్దె కిమ్మని అనేకమంది ప్రాధేయపడి తిరుగుతారు. ఎంతకథా! ఎంత కమామీషూ!

వీధితలుపు ఎవరో తట్టినట్లు అనుమానం కలిగింది. ఈ వానలో తన యింటికి ఎవరు వస్తా రనే అపనమ్మకముతో లేవ లేదు. రెండు నిముషా లాగి తలుపు మళ్ళీ అస్పష్టంగా మోగింది. అనుమానం తీరింది. తన తలుపే; ఆ కొట్టేవాడు స్పష్టంగా కొట్ట రాదూ? ఆయన లేచి వెళ్ళి తలుపు తీశాడు. చప్పున జల్లు లోప లకు వచ్చింది. సన్నని, పొడుగాటి వ్యక్తి గుమ్మంలో నిలబడి వున్నాడు, చేతిలో గొడుగు.

చిదంబరం వెంటనే సంతోషంతో "ఓ లోపలకురా" అన్నాడు. ఆ వ్యక్తి లోపలకు వచ్చాక, తలుపు మూశాడు.

ఇద్దరూ పోయి చాపమీద కూర్చున్నాక ఆ వ్యక్తి "ఏ

మాలో చించావు-'' అన్నాడు.

వస్తూనే వ్యవహారంలోకి లాగుతున్నాడు. ఎంత ధీమా?

తనూ సూటిగానే మాట్లాడాలి. మొహమాటం కూడదు. స్నేహాన్ని కొంతసేపు అవతలకు నెట్టాలి, నేర్పు కావాలి.

"అంత యివ్వలేను."

"ఎనిమిది వేలు!"

"అవును."

అతను ఓసారి వికటంగా నవ్వి, "అంత ఇంటిని ఎనిమిది వేలకు తక్కువ కొనటానికి ఎలా ఆశించావు?" అన్నాడు.

"నా శక్తికి మించినపని చెయ్యలేను."

"అప్పు చెయ్యి."

"ఎంతని? మూడువేలా? నావల్ల కాదు."

పోనీ. ఎంతకు కొందా మనుకుంటున్నావు?"

"ఆరు వేల కన్నా దమ్మిడీ ఎక్కువ యిచ్చుకోలేను."

అతను వెంటనే లేచి నిలబడ్డాడు. "ఆశకు అంతం ఉండాలి. సరే నీ ఉపకారాన్ని జీవితాంతం గుర్తుంచుకుంటా నంటే, తప్పేదేముంది? నా పరువు ప్రతిష్ఠల్ని వేలం వేస్తాను." అన్నాడు.

"అది చాలా పాతయిల్లు" అని చిదంబరం హీనస్వరంతో గొణిగాడు.

"అయినా ఎనిమిదికంటె ఎక్కువ విలువే చేస్తుంది."

చిదంబరం మౌనం వహించాడు. "సరే—అయితే వెడుతున్నాను—" అని అతను రెండు మూడు అడుగులు వేశాడు.

వెళ్ళిపోతున్నాడే; తన కలలు!

దురాశ పీడిస్తోంది "పోనీ-ఇంకో అయిదు వందలు".

"లాభం లేదు"

వెళ్ళిపోతున్నాడు. చిదంబరానికి కోపం వచ్చింది. పౌరుషంతో కూడిన కోపం కాదు యిది. నిరాశవల్ల కలిగిన కోపం. దుఃఖపూరిత మైన కోపం.

"నాకు అక్కర్లేదు. వెళ్ళిపో" అని అరిచాడు. మళ్ళీ అన్నాడు. నీస్థితే నీకు తెలుసు. ఇవతలవాడి సాధకబాధకాలు నీకు అక్కర్లేదా? అంత నిర్లక్ష్యమా? మూడువేలు నే తెస్తే ఎలా తీర్చేది?"

పోబోతున్న వా డల్లా ఆగి, వెనక్కి తిరిగి వచ్చాడు. ఎంత గాంభీర్యం ఆ చూపుల్లో! సరే. అంగీకరించాను.

చిదంబరం సంతోషంతో లేచి నిలబడ్డాడు.

అతను చేయి జాపి, "అయిదువేలు ముందు తే"

రాజా మాటలు. మాటల్లో ధీమాకు తక్కువ లేదు.

కాని చిదంబరం తట్టుకుని "నాదగ్గ రెక్క డున్నాయి? బ్యాంకిలో వేశాను. రేపు పైసలు చేసుకుందాం. కాని"...అని సందిగ్ధంతో ఆగాడు.

"ఏమిటి?"

"నాకు పదిహేను వందలు ఎవ రిస్తారు?"

"ఆ పూచీ నాది. ఇంటి తాకట్టు మీదే, నీకు యిప్పిస్తాను."

"తాకట్టా?" అని చిదంబరం నివ్వెరపోయాడు.

అవును. భయ మే ముంది? నెమ్మదిమీద తీర్చుకోవచ్చు.

మనసు పని చేయటం మానింది. ఎలానూ రంగంలోకి దిగాడు. ఏం జరుగుతుందో జరగనియ్యి.

"సరే. రేపు ఉదయం వస్తాను" అని వెళ్ళిపోయాడు. చిదం బరం మళ్ళీ చాపమీద కూలబడ్డాడు.

ఇన్ని ఆలోచనలను భరించటమెలా? ఒకటే... ఒకటే ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. భయాన్నీ కలిగిస్తోంది. ఇంత పెద్ద విషయాన్ని, ఎవరికీ చెప్పకుండా, స్వంతంగా, యింత తేలికగా ఎలా పరిష్కరించు కున్నాడు. ఈ ధైర్యం తనకు ఎలా వచ్చింది?

జవాబు లేదు. జవాబు రాదు.

* * *

ముచ్చటగా మూడురోజుల్లో వ్యవహారం అంతా ముగింపుకు వచ్చింది. ఇల్లు కొంత బాగుచేయ వల్సింది వుంది. అందువల్ల అప్పు రెండువేలవరకూ ఎగబ్రాకింది. మూడోరోజుకు యిల్లు చిదంబరం స్వాధీనం అయింది.

ఈ విషయం ఆయన భార్యకూ తెలియదు. పిల్లలకూ తెలియదు. పెళ్ళికి వెళ్ళిన వాళ్ళు తిరిగి వచ్చేటప్పటికి కనీసం యింకో మూడురోజులు పడుతుంది.వాళ్ళు యిక్కడకు వచ్చి ఆశ్చర్య పోవాలి. అభినందించాలి. తర్వాత సుఖించాలి..

ఇల్లు ఖాళీ అయింది. తన చేతిలోకి వచ్చింది. దీనికి మరమ్మత్తు చేయవలసిన అవసరం వుంది. ఈ పని కూడా భార్యా, పిల్లలు వచ్చేలోగానే సంపూర్తి చేయాలి.

ఈ మూడురోజులూ ఆయన నిద్రాహారాలు లేకుండా కష్టపడ్డాడు. క్రొత్తయింటికి మరింత అందం అంటగడుతున్నాడు. చాలా మంది మిత్రులు వచ్చి అభినందించి వెడుతున్నారు. తనతో పని చేసిన వాళ్ళల్లో, తన స్నేహితుల్లో ఎవరికి

వుంది స్వంతయిల్లు ?

మరమ్మత్తు పూర్తి అయ్యాక డాబామీద నిల్చుని గర్వంగా, నలువైపులా చూశాడు. ఎటువంటి పరిసరాలు !

ఇహ ముందు తను అద్దె యింట్లో బాధపడ నక్కర్లేదు.

"ఇంకా కొన్నాళ్ళు పోనీయండి" అని ఎవరినీ ప్రాధేయ పడ నక్కర్లేదు. చాలీ చాలని దీపం వెల్తుర్లో చత్వారపు కళ్ళతో పుస్తకాలు చదవలేక యిబ్బంది పడనక్కర్లేదు. నీళ్ళకోసం బావి దగ్గర అవస్థ పడ నక్కర్లేదు. ఇహముందు తన యింట్లో వాన కురవదు. ఇహముందు తన మన శ్శాంతికి కొదవలేదు. తన పిల్ల లందరూ ఓకే చాపమీద పడి దొర్లరు. ఇల్లు చాలటం లే దని భార్య విసుక్కోదు. ఎంతశాంతి !! ఎంతహాయి ? ఎంత సౌఖ్యం ?

ఈ స్థితిలో వెలువడే నిట్టూర్పులో ఎంత సొగసు వుంది ?

ఇటు వంటి స్థితిలో నడిచే నడకలో ఎంత ఠీవి వుంది ?

ఇట్టిస్థితిలో నవ్వే నవ్వులో ఎంత గాంభీర్యం వుంది ?

ఎంత కమ్మని అనుభూతి ? యాభయి అయిదేళ్ళ తర్వాత ఎంతటి ప్రయోజకుడు అయ్యాడు.

తను యిల్లు కొన్నాడు.

తను యిల్లు అద్దె కిస్తాడు.

ఆరోజే కాదు, ఈ విధ మైన ఆలోచనల తో మరో రెండు రోజులు గడిచాయి. ఓరోజు ఆయన ఇదివరకటి యింటిముందు బండి వచ్చి ఆగింది. అందులోంచి నలభై యైదేళ్ళ ముత్తైదువ, ఇరవై రెండేళ్ళ యువకుడు, పదహారేళ్ళ అమ్మాయి, ఇద్దరు చిన్నపిల్లలు, ఒక చిన్న పిల్లవాడు దిగారు. వాళ్లు దిగేసరికి ఆ

యింటికి తాళం పెట్టి వుంది.

"ఎక్కడికో పోయార్రా అబ్బాయి" అంది ఆవిడ.

అతను చిరాకు పడడం ప్రారంభించాడు. ముసలాయనకు యీ వేళకాని వేళలో పెత్తనాలు ఏమిటి ? తిని యింట్లో హాయిగా పడుకోరాదూ? రాత్రంతా చచ్చీ చెడి ప్రయాణం చేసి వచ్చి, యిప్పుడింటిబయట ఎవరు పడిగాపులు కాస్తారు ? గొణగటం మొదలు పెట్టాడు. తండ్రి ఏ మాత్రం పొరబాటు చేసినా సహించటం అలవాటు లేని పద్ధతి అతనిది.

పిల్లలు ఎక్కువసేపు 'ఆకలో' అని గోల చెయ్యకుండానే, తల్లి మరింత విసుక్కోకుండానే యువకుడి సణుగుడు తిట్లలోకి యింకా మారకుండానే చిదంబరం అక్కడికి అవతరించాడు.

"ఉత్తరం రాయకుండా యెందుకు వచ్చారే?" అన్నాడు.

"బాగుంది! నిర్వాకం తొందరగా తాళం తియ్యండి" అందావిడ. మరో రెండు నిముషాల్లో అంతా లోపలకు చేరుకున్నారు.

"ఎలా జరిగింది పెళ్ళి?" అని ప్రశ్నించాడు చిదంబరం.

"పెళ్ళికేం? నిక్షేపంలా జరిగింది! మీరు రాలేదని వాళ్ళంతా ఒకటే దెప్పిపొడిచారు" అంది భార్య.

"రెండు సంవత్సరాల క్రితం అత నంతమాట అన్నాక నాకు రా బుద్ధి పుట్టలేదు."

"చాల్లెండి! అత నింకా మనసులో ఆ విషయం పెట్టుకుని కూర్చున్నాడనే అంటారేమిటి" అని ఆవిడ కాళ్ళూ చేతులూ కడుక్కునేందుకు లోపలకు పోయింది.

తర్వాత చాలాసేపు పెళ్ళి కబుర్లలో అంతా మునిగిపోయారు. చిదంబరం యింకా ఆ విషయం బయట పెట్టలేదు.

హఠాత్తుగా వెల్లడించి వాళ్ళందరినీ సంభ్రమాశ్చర్యాలలో ముంచి వేద్దామని ఆయన ఉద్దేశం. తర్వాత ఆవిడ వంటప్రయత్నంలో మునిగి పోయింది. వంట చేస్తుంటే చిదంబరం అక్కడికి ఓ సారి వచ్చి చూశాడు. పెద్దకూతురు తల్లికి వంటలో సాయం చేస్తోంది. చాలీచాలని వంటిల్లు, బోలెడు సామాను, మనిషి కదల టానికి కూడా వీలులేనంత ఇరుకు. అట్లా యిబ్బంది పడుతున్న భార్య మీద చెప్పలేని జాలి పుట్టుకొచ్చింది ఆయనకు.

భోజనం చేస్తుండంగా భార్య అంది హఠాత్తుగా, "అన్నట్టు చెప్పటం మరిచిపోయా నండోయ్. కొంప మునిగింది!" అన్నది.

చిదంబరం ఉలుక్కిపడి "ఏమిటే?" అన్నాడు.

అంతవరకూ గుమ్మం దగ్గర నిలబడివున్న పెద్దమ్మాయి చప్పున లోపలకు వెళ్ళిపోయింది.

"కట్నం యివ్వందే వాళ్ళు జానకిని చేసుకోరుట."

చిదంబరానికి ముద్ద మింగుడు పడలేదు. ఒక్కక్షణంలో ముఖ మంతా వివర్ణ మైంది. గబగబ మంచినీళ్ళు తాగి "మరి మొన్నటిదాకా అలా అనలేదుగా" అన్నాడు.

కట్న మిస్తా మంటూ వాళ్ళ కింతకంటె మంచి సంబంధా లొస్తున్నా యట.

చిదంబరానికి తల తిరిగిన ట్లయింది. ఏమి టీదుర్వార్త? ఇంతవరకూ కూతురి పెళ్ళిగురించి తన కెటువంటి చింతా లే దనుకున్నాడు. దమ్మిడీ కట్న మివ్వకుండా సంబంధం సిద్ధం గా వుందని సంతోషించాడు. కాని చివరకు కథ యిలా అడ్డం తిరిగిందా? తన పరిస్థితి తెలిసికూడా అలా అడిగేందుకు వాళ్ళకు మనసెలా వొప్పింది?

"నువ్వేమన్నావు?" అన్నాడు కీచు గొంతుకతో.

"బ్రతిమిలాడి, భంగపడ్డాను."

"మరి, యిప్పు డెలాగే" అన్నాడు చిదంబరం దిగులుగా.

కొంచెం ఆగి ఆవిడ అసలు విషయం మెల్లగా బయట పెట్టింది. "వా ళ్ళంటారూ మొన్న నేకదా — 'అ దేమి టమ్మా ఆఫండ్-నోరు తిరుగదు నాకు' అయిదు వేలు వచ్చింది కదా కూతురి పెళ్ళికోసం ఆ మాత్రం ఖర్చు చేయలేడా?" అని.

చిదంబరం నెత్తిమీద పిడుగు పడ్డట్లయింది. బంధువులు అనుకున్నవాళ్ళు చివరకు యింతటి కుతంత్రానికి పూను కున్నారా? ఎంత దారుణం!

"దమ్మిడీ యిచ్చేది లేదు!" అన్నాడు.

ఈయన ధోరణి చూసి, ముందు భార్య కొంచెం బెదరినా, తర్వాత తెలివిగా అంది: "మనం కూడా ఆలా పట్టుబడితే ఎలా? ఆడపిల్లలు కలవాళ్ళం"

"అయితే, అడుగులకు మడుగు లొత్తాలా?"

"ఆది కాదు, నే ననేది మనం ఒక మెట్టు క్రింద వుండాలి."

"ఇ వన్నీ నాకు తెలుసు. చస్తే నేను కట్నం యివ్వను."

అంత పట్టుదల అయితే ఎలా గండీ? మనమ్మాయి పెళ్ళి కావటం మనకు ముఖ్యం కాదా?"

"అయినప్పుడే అవుతుంది. కట్నం యివ్వకుండా చేసు కునే వాడు వచ్చినప్పుడే చేస్తాను."

"అ వన్నీ కలలో మాటలు. ఇంత దగ్గర సంబంధం వొదులుకుంటే మళ్ళీ మన తరంకాదు, దాని పెళ్ళి చెయ్యటం."

చిదంబరం విసుగ్గా, "అయినా నా దగ్గర డ బ్బేదే?"

అన్నాడు.

"అ దేమిటి? అయిదు వేలా..."

"ఇల్లు కొన్నాను" మానవుడు నోరు జారాడు.

వడ్డిస్తున్న భార్య, తల వంచుకు తింటూన్న పెద్ద కొడుకూ గోడ చాటునుంచి వింటూన్న పెద్దకూతురూ ఒక్క సారిగా కొయ్యబారి పోయారు.

చిదంబరం నాలిక కొరుక్కుంటున్నాడు. చెప్పక తప్పని విషయమే. ఎటువంటి పరిస్థితుల్లో చెబుదా మనుకున్నాడు? ఎటు వంటి స్థితిలో చెప్పాడు! ఒక్కసారిగా వా ళ్ళందరి హృదయా లకూ కొరడా చురుకు అంటించాడే. వా ళ్ళలా తెల్లబోవటం, ఆ ముఖాల పేలవం తనకు మరీ హృదయ విదారకంగా వుంది. ఇహ యీ అన్నం నోట్లోకి ఎలా పోతుంది? ఇక్కడనుంచి చప్పున పోయి ఎక్కడైనా దాక్కుంటే బా గుండును. ఇహ అను కోని సంఘటనలు ఎదు రౌతాయి కాబోలు. ఎటువంటి ఘాతాన్ని కలిగించే మాటలు వినిపిస్తవో!

నిశ్శబ్దం—రెండు... మూడు క్షణాలు భయంకర మైన నిశ్శబ్దం.

"ఇలా ఎందుకు చేశారండీ?" అంది ఆవిడ; "నాతో ఒక్క మా టయినా చెప్పకుండా కొంప కూల్చారే!"

చిదంబరానికి కోపం వచ్చింది. అసమర్థతతో కూడిన కోపం "కొంప కూలవ లేదు. కొంప కొన్నాను."

భార్య వెంటనే అందుకుంది: "ఎవరి కోసం? ఏ సుఖం కోసం?"

"ఏ సుఖం కోసమా?" చిదంబరం కటువుగా అన్నాడు.

"ఇన్నేళ్లు వచ్చాక ఆ విషయం నీకు చెప్పా లన్నమాట. ఆహా! నీ బుద్ధి చూపించావే. ఇన్నాళ్ళు నారక్తం వోడ్చి సంపాదించాను. మీ అందర్నీ పోషించాను. వీడు పెద్దవాడయ్యాడు. ప్రయోజకుడయ్యాడు. నెలకో నూటయాభయి తెస్తున్నాడు. ఇప్పటికైనా నేను సఖానికి చేచుకో లేదా?"

"ఎవరు వద్దన్నారు? కాలుమీద కాలు వేసుకొని కూర్చోండి మహారాజులాగా. కాని యిదేం పని? ఎవరితో చెప్పా పెట్టకుండా?"

ఆయన యీ సారి ఆకాశ మండలానికి లేచాడు. "ఏమిటే నీకు చెప్పేది. నీ బోడిసలహా చెబుతావనేనా? ఆ మాత్రం తెలివి తేటలు నాకూ లేక పోలేదు. డబ్బుని ఏవిధంగా సద్వినియోగం చెయ్యాలో నాకూ తెలుసు ఇంకా...ఇంకా" అని గాద్గదికంగా "యిలా అద్దె యిళ్ళలో పడివుండి వాళ్ళచేత వీళ్ళచేత మాటలు పడమన్నావా? ఎవడైనా చుట్టం వస్తే కదిలేందుకు, మెదిలేందుకు కూడా చోటు లేని ఈ కొంపలో కుళ్ళి కుళ్లి జీవించమంటావా? ఇన్నాళ్ళు వుద్యోగం చేశాను. ఇంత అనుభవం సంపాదించాను. నాకు తెలుసంటావా, నీకు తెలుసంటావా? కష్టపడి సంపాయించిన డబ్బుతో యిల్లు కొని అందులో హాయిగా వుందామంటే మీకు కంటగింపైంది. ఈ సమయంలో కాకపోతే సప్తజన్మాలకైనా అటువంటి యిల్లు కొనగలుగుతామా?"

ఆ తరువాత మాటలు పెగల్లేదు. ఆ సన్నివేశంలో మరి అక్కడ నిలువగలగటం అసంభవం. బయటకు నడవటం మిగిలింది. అదే చేయగలిగాడు.

బయట తిరిగి నాడు. ఆలోచన్లు అలుముకుంటున్నాయి.

ఎంతపని చేశాడు? ఆ విధ మైన ఉద్రేకం ఎందుకు ప్రదర్శించాడు? నిజంగా అది నిజ మైన ఉద్రేక మేనా? కాజాలదు. తెచ్చి పెట్టుకున్నదీ కాదు. అంత కృత్రిమ ఉద్రేకాన్ని ప్రదర్శించే అవసరం తనకు లేదు. ఏదో భావాన్ని ఉద్రేక రూపంలో చూపించా-డంతే.

భార్యతో యిలా మాట్లాడటం మంచిదో, కాదో తనకు తెలియలేదు. కాని ఆ సంభాషణ యింట్లో చాలా గొడవ లేవదీయగల దని మాత్రం ఊహించగలడు. కన్నీళ్ళకు కొదవ వుండదు. ఊహ తెలిసిన ఆడవాళ్ళు ఒకరికి యిద్ద రున్నారు గనుక నిజానికి ఆలోచిస్తే తను చేసిన తప్పేమిటో కూడా బోధపడటం లేదు. బహుశా కొద్ది రోజుల్లో తన మాటల్లోని సత్యం వాళ్ళే తెలుసు కుంటారు.

నిజానిజాలు ఇప్పుడే బోధపడుతున్నాయి. కొడుక్కి కూడా కోపం రావటం అసహజం కాదు. ఇంటికీ ఆఫీసుకూ ఎంతో దూరం. సైకిల్ కొనుక్కోవా లని వాడు చాలా కాలం నుంచీ అభిప్రాయ పడుతున్నాడు. ఆ కోరిక రెండు మూడు సార్లు పరోక్షంగా తెలియ పర్చాడుకూడా. ఈ విషయాన్ని తను పూర్తిగా విస్మరించాడు. మనసులో వాడు చాలా మధనపడుతూ వుండాలి.

అదీ గాక భార్య యీ విషయానికీ, కూతురు పెళ్ళికీ ముడిపెడుతుం దని తను కల గన లేదే.

చిదంబరం ఆ మధ్యాహ్నం యింటికి పోలేదు. ఎంత అర్థి కట్టుకుందా మన్నా ఏదో తెలియని భయం వెన్నాడుతూనే వుంది. తను చేయని తప్పుకు, కొన్ని గంటల క్రితం వరకూ ఘనకార్యం

అని ఉప్పొంగిన పనికి, యీ క్షణంలో భయపడు తున్నాడు, బెదురు తున్నాడు, చలిస్తున్నాడు.

కాళ్ళలో మునుపు వున్నబలం లేదు. ఎక్కువ దూరం తిరగలేదు. మనసుకి నిగ్రహశక్తి లేదు, స్నేహితుల యిళ్లలో ఎక్కువసేపు గడపలేదు.

కాబట్టి రాత్రి ఏడు అయేసరికి తిరిగి యింటికి చేరాడు.

కొడుకు యింట్లోనే వున్నాడు. తల ఎత్తి తనను చూడలేదు. ఎందుకు వాడి కంతకసి? వాడి మతిలో యింకా తీరని కోరికలు ఏ మయినా వున్నాయా? మాట్లాడ కుండా పోయి, కాళ్ళూ చేతులూ కడుక్కు వచ్చి పీటముందు కూర్చున్నాడు. భార్య నిశ్శబ్దంగా వచ్చి వడ్డించ సాగింది. ఇద్దరిలో ఎవరూ మాట్లా డటం లేదు. జరిగిపోయిన విషయాన్ని గురించి రేపితే ఉద యంలా, తను మళ్ళీ ఎంగిలి చేత్తోనే బయటకు నడుస్తా డని ఆవి డకు భయం కాబోలు.

భోజనం అయాక, చేతులు కడుక్కుని, తువ్వాలాతో తుడుచు కుంటుండగా వెనక నుంచి వచ్చింది.

"ఏ యిల్లు కొన్నారు"? నిదానంగా వుంది కంఠస్వరం.

"గోవిందరావు గారిది."

కొన్ని క్షణాలు నిశ్శబ్దం.

"ఎంత?"

"ఆ... " అప్పు చేశా నని చెప్పటానికి నాలిక జంకింది. ఈ నిజం చెప్పటానికి పూర్తిగా అధీరు డయ్యాడు.

"అయిదు వేలు సరిగ్గా."

ఆమె ఏమీ మాట్లాడక పోయేసరికి మళ్ళీ తనే, "ఎల్లుండి

మంచి రోజు, గృహప్రవేశం" అన్నాడు. తల వూపి ఆవిడ లోప లకు వెళ్ళి పోయింది.

*  *  *

స్వంత యింట్లోకి ప్రవేశించి పక్షంరోజులు గడిచాయి. మానసిక బాధలు మళ్ళీ అంతరిస్తు న్నాయి. మాసి పోయిన గర్వం, ఆనందం మళ్లీ చిగురిస్తున్నాయి.

ఓరోజు 'ఈ భాగము అద్దె కివ్వ బడును' అని తనే స్వంతగా కూర్చుని ఓపిగ్గా బోర్డు రాశాడు. దాన్ని గోడకు తగి లించి, దాని వంక ఓసారి నిటారుగా చూసి, హాయిగా నవ్వు కున్నాడు.

ఇహ రేపటినుంచీ తన యింటి చుట్టూ అద్దెకోసం మను షులు విసుగు లేకుండా తిరుగుతారు కాబోలు. వాళ్ళు అద్దె తగ్గించ మని తనని బ్రతిమ లాడుతారు కాబోలు.

ఒక భాగం తమ కుటుంబానికి చాలు. ఎడంవైపు వున్న చిన్న భాగం అద్దెకు యివ్వ బడుతుంది.

''ఈ భాగము అద్దెకు యివ్వబడును."

ఈ భాగం తన స్వంతం. తనకు సామాన్యంగానే కన బడు తోంది. కానీ కొంతమందికి యిది దాహం వేసిన వాడికి మంచినీళ్ళు కనిపించిన చందాన కనిపిస్తుంది కాబోలు. దీని కోసమే వాళ్లు తపిస్తారు కాబోలు. అద్దె యిళ్ళకోసం తిరుగు తున్న వాళ్ళకు యిది వెదుక బోయిన తీగె కాళ్ళకు తగిలినట్లు అనుభూతి కలిగిస్తూ, గిలిగింతలు పెడుతుంది కాబోలు.

అను కున్నట్టుగానే ఆయన కలలు నిజ మౌతున్నాయి. తీర్థ ప్రజలా కాకపోయినా రోజుకు ఒకరూ యిద్దరూ యింటికి

వచ్చి చూసి, మాట్లాడి వెడుతున్నారు. అద్దె ముప్ఫయి రూపా యలు. ఏ మాత్రమూ తగ్గ వద్దని ఒక రిద్దరు స్నేహితులు సలహాలు యిచ్చారు. ఆ ప్రకారమే కఠినంగా వుండటానికి మనసు కొంచెం యెదురు తిరుగుతున్నా పాటిస్తున్నాడు. ఇద్దరు ముగ్గురికి యిల్లు నచ్చలేదు. ఇద్దరు ముగ్గురు అద్దె భరించ లే మన్నారు. ఇద్దరు ముగ్గురు హిరణ్యాక్ష వరాలుకోరి, ఆయన్ని విసిగించి తిరస్కరింప బడ్డారు. తను అనుకున్న విధంగా ఎవరూ తనని హృదయ విదారకంగా బ్రతిమిలాడక పోవటం కొంచెం భాధకరంగానే పరిణమించింది ఆయనకు. తన దగ్గరకు అటు వంటివాళ్ళు రారు కాబోలు. కొద్దిరోజులవరకూ, సరియైన వాళ్ళె వరూ కుదరకపోతే చిరాగ్గానే వుంది.

చివరకు ఓ ప్లీడరుగారు ఆ యింట్లో వుండటానికి ఖాయం చేసుకున్నారు. మరో రెండు రోజులకు భార్యా, ఒక యింటర్మీడి యట్ చదువుతున్న కొడుకుతో సహా వచ్చి దిగాడుకూడా.

ఈ గొడవల్లో ఆయన అప్పువిషయం మరచి పోలేదు. నీడలా ఆ భయం అనుక్షణం వెన్నాడుతూనే వుంది. ఒకళ్ళకు చెప్పుకునే బాధ కాదు. భార్యకు తెలియదు. కొడుకు సంపా దిస్తున్న నూట యాభయిరూపాయలతో సంసారం యీదుకురా వచ్చు. అద్దె మీద వచ్చే ముప్ఫయి పదిలంగా దాయాలి. తను యిప్పుడు అయిదుగురు కుర్రాళ్ళకు ప్రయివేట్లు చెప్పుతున్నాడు. దానిమీద ఓ నలభైరూపాయలు వస్తాయి. వీటిలో ఓ దమ్మిడీ ఖర్చు చేయటానికి వీల్లేదు. వీటిద్వారానే ఆ అప్పును రద్దు చేయాలి.

ఒక రోజు సాయంత్రం అలా బజారు పని చూసుకొని

వస్తూంటే బలరామయ్య కనిపించాడు. దారిలో ఆపి చాలాసేపు కబుర్లు చెప్పాడు.

"నీ కేమిటి ? అదృష్టవంతుడివి. చవగ్గా కొట్టేశావు" అన్నాడు.

లోపల సంతోషం ఉబుకు తున్నా, బయటకు తేల్చేస్తూ "ఆఁ ఏం చవక ? పాతయిల్లు రిపేర్లు చేయటానికే మూడు నాలుగు వందలు అయింది" అన్నాడు.

"ఎన్నయినా అను. అదృష్టవంతుడివి."

చిదంబరం విచారంగా నవ్వి "ఏం లాభం ? దీనికోసం నీదగ్గరే రెండువేలు అప్పు చెయ్యాల్సి వచ్చింది !" అన్నాడు.

"దాని దే ముంది? నీకు వీ లయినప్పుడు తీర్చేద్దువుగాని."

"నువ్వు కాబట్టి తాకట్టు లేకుండా అంత డబ్బు అప్పు యిచ్చావు, లేకపోతే నాపాట్లు ఉండేవి" అని చిదంబరం పదో సారో, పదిహేనోసారో అభివందనలు తెలియ జేశాడు.

"నా విధి నేను నెరవేర్చుకొన్నాను. నీమీద నాకు నమ్మకం ఆమాత్రం లేదా?"

కృతజ్ఞత నిండిన కళ్ళతో చిదంబరం చూశాడు. మరి కొంతసేపు మాట్లాడి తనదారిన వచ్చాడు.

ఈమధ్య భార్యకూడా ఏమీ గొడవ చేయటం లేదు. మనసులో ఏమి అనుకుంటూందో ఏమో కాని యీ యిల్లు అందరి సంతోషం కోసం కొన్నప్పుడు అందరికీ కాక సంతోషం తనకు ఒక్కడికే కావటం వల్ల కొంత విచారంగానే వుంది. బయటకు ఆవేశాలు పొక్కటం లేదు. ఏనాడో ఒకనాడు మనసులో దాచుకొన్న యీ దుఃఖాలూ, ఆవేశాలూ బయటకు విరజిమ్మవు గద?

చిదంబరం ఇంటికి వచ్చేసరికి ప్లీడరుగారి భార్య తన భార్యా హెూరా హెూరీగా పోట్లాడు కొంటున్నారు.

ఆ మాటలు వినటానికి ఇంకా విచిత్ర మైనవి.

తన రాకతో యిద్దరినోళ్లు కట్టుబడ్డాయి. వా రటూ, వీ రిటూ వేంచేశారు. విశాల మైన మధ్యగదిలో కొత్తగా కొన్న కుర్చీమీద చిదంబరం కూలబడి "ఏ మిటే యీ దెబ్బలాట?"

"అది కా దండీ. మన పంపులో నీళ్ళు పట్టుకున్నంత సేపూ వాళ్ళ వైపుకు నీళ్ళు రావుట. అందుకని మనల్ని నీళ్ళు పట్టుకో కుండా వూరుకో మంటే ఊరుకుంటామా ?"

"అందుకని నలుగురిలో నవ్వులపాలు అయే టట్లు అరుచుకుంటారా ? అప్రతిష్ట వాళ్ళకు కాదు, మనకు. ఫలానా యింటివాళ్లు మంచివాళ్లు కా రంటారు."

"మీ కేం ? అలానే చెబుతారు. ఆవిడ మాటలు వింటూ ఊరు కోవడం నాకు చేతకాదు."

"ఏం చాతనవును ? వా ళ్ళింకా యింట్లో చేరి పదిరోజులు కాలేదు. అప్పుడే జగడాలా ?"

భార్య గొణుక్కుంటూ లోపలకు పోయింది. తను ఎంతో కాలం అద్దెయిళ్ళలో నివసించాడు. ఎప్పుడూ పై చెయ్యిగా యింటివాళ్ళదే వుండేది గాని తనది మాత్రం కాదు. ఇప్పుడు యీ యింటి యజమాని తను. ఈ ఆధిక్యత ఎందు కని నిరూపించుకో కూడదు ? ఒక వేళ బానిసత్వం అలవడ్డ బ్రతుకు అధికారం చెలాయించటానికి వెనుకంజ వేసినట్లు తనూ వెనక్కి తగ్గి పోవటంలేదు కదా. మరి ఆ చొరవ రా దేం ?

* * *

రోజులు గడిచి పోతున్నాయి. ఆయన అనుకున్నవి సరిగ్గా ఒక్కటీ నెరవేరుతున్నట్లు కనబడటం లేదు. చీటికీ మాటికీ రెండువేల అప్పు కళ్ళముందర మెదుల్తోంది. ఎవరికీ తెలియని అప్పు, ఎవరికీ తెలియకుండానే తీర్చాలి. మొదట నెలకు డెబ్భైరూపాయలు దాద్దా మని అంచనా వేశాడు. కాని పాతిక రూపాయల కంటే యెక్కువ మిగలటం లేదు. ఎక్కడ లేని డబ్బు ఖర్చు అయిపోతోంది. తన అవసరం వాళ్లకు తెలియక పోవటంవల్ల వాళ్ళ అవసరాలకు ఖర్చు పెట్టేస్తున్నారు. కాదని అనటానికి నోరు రావటం లేదు. పెద్దకూతురికి ఎప్పుడైనా మూడు చీరెలకన్నా ఎక్కువ వున్నాయా? పెద్దకొడుకు ఎపుడయినా ఇంట్లో నూటపాతిక రూపాయలే ఇచ్చాడా? చిన్నపిల్లలు ఒక్కొక్కరికీ రెండు మూడు లాగూ చొక్కాలకన్నా ఎక్కువ వున్నాయా? ఈ క్రొత్త రోజుల్లో అన్నీ అధిక మౌతున్నాయి. ఈ ప్రకారం బాకీ ఏనాటికి తీర్చేటట్లు? ఈ తన బాధను ఎవరు గుర్తిస్తారు.''

ప్లీడరు గారు మంచివాడేమో అని మొదట అనుకున్నాడు. ఆయన మంచితనం బొగ్గు లైనట్లే వుంది. అద్దె కున్న వాళ్ళలో యింతలేసి మనుష్యులుకూడా వుంటా రన్న సత్యం యీనాటికి బోధపడుతోంది. తన లాగే తన భార్య ఏ మాత్రమో అధికారాన్ని అభిలషించి వుండవచ్చు. తనవలెనే ఆమెకూడా యిన్నాళ్ళూ అద్దెబ్రతుకు బ్రతికి విసిగివుంది కదా. ఆ మాత్రం హొదా చూపించకుండా ఎలా వూరు కుంటుంది?

ప్లీడరు గారు లా పాయింట్లతో వేపుకు తినేస్తున్నాడు. రాను రానూ నెత్తిమీదకు ఎక్కి కూర్చుంటున్నాడు. ''ఇది

'ఖుక్కృత బాగు చేయించాలి, అది అక్కడ బాగు చేయించాలి" అని ఆయన పోరు పెట్టని రోజు లేదు. అస్తమానం స్వర్థతే. ఇదేనా శాంతి అంటే ? ఇదిఇలా వుండగా ప్లీడరుగారి ఇరవైఏళ్ళ అబ్బాయి తనవంక అదోరకంగా చూస్తున్నా డనీ, కూతురు తల్లితో రహస్యంగా చెప్పిం దట. ఇదేనా అద్దెకు యిచ్చినందువల్ల వచ్చే సౌఖ్యం ?

ఈ దెబ్బలాటలు విని యిరుగూ పొరుగూ వారు గుసగుస లాడు కుంటున్నారు. తాను రిటైరైన బడిపంతులు. ప్లీడరు లేకపోయినా ఆయన ప్లీడరుగారు. ఇరుగు పొరుగు ప్రజ లంతా ఆయన పక్షం అవలం బిస్తున్నారు.

వీ ళ్లంతా యీ విధంగా ఎందుకు తనమీద కత్తి గడు తున్నారో తనకు అర్థం కావటం లేదు. తనయింటి కెదురుగా ఓ క్రొత్త వెచ్చాల షాపు వెలిసింది. ఆ షావుకారు తనని యిదివరకు యి ల్లడిగి తిరస్కరించ బడిన వాడే. తనవంక కోరగా చూడటం, తను దారిన పోతున్నప్పుడు వెకిలిగా నవ్వుతూ ప్రక్కవాళ్ళతో ఏదో గుసగుస లాడటం, యి దంతా చిదంబరం చాలా సార్లు పసి గట్టాడు.

'ఇది యిలా వుండగా బలరామయ్య ఎవరితోనో అన్నాడుట, "చిదంబరం కాలాంతకుడు. పదిహేను వేలు ఖరీదు చేసే యింటిని ఆరువేలకు కొట్టేశా'' డని.

ఏమిటి ? బలరామయ్య యిలా అన్నాడా ? కనిపించి నప్పుడల్లా తన శ్రేయోభిలాషిలా కబుర్లు చెబుతున్నాడే. ఆ తర్వాత బలరామయ్య చాలా సార్లు కనిపించాడు. ఇంకా శ్రేయోభి లాషిలాగానే కబుర్లు చెబుతున్నాడు. చిదంబరానికి

నిజా నిజాలు తెలియవు. అందుచేత మెదలకుండా ఊరుకున్నాడు.

తనపై మరో బాధ్యత వుంది. పెద్దకూతురి పెళ్ళి చేయాలి. దమ్మిడీ కట్నం యివ్వకుండా పెళ్ళి చేస్తానని భార్యముందు ప్రగల్భాలు కూడా పలికాడు. అది కేవలం బుకాయింపు క్రిందే తయారయింది. తన కేమి పరపతి వుంది ? తనకి యెంతో మందితో పరిచయం వుంది. పెళ్ళికొడుకులు అని పిలువబడే యువకులు ఎక్కడెక్కడ దాక్కొని వున్నారో, వెతికి పట్టుకోవటం తనకు ఎలా సాధ్యం ? ఒక రిద్దరు తారసిల్లినా కట్నాలు అడిగారు. ఒకటి కాదు, రెండు కాదు. వ్యవహారం మూడు పైన వుంది. ఎలా తూగగలడు ?

ఆ నాడు బావమరిది, తన భార్యతో అంత మాట అన్నాక యిప్పుడు మళ్ళీ మొగ్గుతాడని ఆశ లేదు. ఇంకా కొంత కాలం ఊరుకొంటే వ్యవహారం చేయికూడా దాటిపోవచ్చు; జానకికి యుక్త వయస్సు వచ్చిన మాట యెవరూ కాదనరు. తనస్థితిలో వున్నవాడికి యింకా కొంతకాలం పోతే దానిపెళ్ళి చేయటం కూడా కష్టమైన విషయంగా పరిణమిస్తుందనటంలో అబద్ధం ఏదీ లేదు. అన్నీ తెలిసే తను తప్పటడుగు వేస్తున్నాడు. కొడుకు యే విషయంలోనూ తనకు సహాయపడడు. వాడి దంతా ఆదో వింత ప్రకృతి. ముభావంగా వుంటాడు. గట్టిగా అడిగితే తీరిక లేదంటాడు. తండ్రి వృద్ధుడు, వంటరి. చొరవ లేని మనిషి. ఇన్ని విభిన్న ప్రకృతులకూ, పరిస్థితులకూ ఏ విధంగా తట్టుకోగలడు?

ఇన్ని సమస్యలతో యీ మధ్య యిల్లు కదలటం కూడా

మానేశాడు. రోజుకు నాలుగయిదు గంటలు ప్రయివేటు చెప్ప టంలో గడిచేది. మిగిలిన కాల మంతా ఏమీ చేయక పోవటం.

ఒక రోజు పది గంటలవేళప్పుడు పోష్టుమన్ వచ్చి ఒక ఉత్తరం అందించి వెళ్ళాడు. తాను చదివాడు.

బావమరిది రాశాడు. తన కొడుక్కి సంబంధాలు యెక్కు వగా వస్తున్నా యట. తాము ఏ విషయమూ సరిగ్గా తెలియజేస్తే దాన్ని బట్టి వేరే సంబంధం చూచు కుంటారుట. లేకపోతే ఎవరికి ఏమాట చెప్పాలో కష్టంగా వున్న దిట.

"నీ తమ్ముడు రాశాడు" అన్నాడు ప్రక్కన నిలబడివున్న భార్యతో.

ఆవిడ ఉలకలేదు, పలకలేదు.

"ఏ మని జవాబు ఇవ్వమంటావు ?"

ఈ సారీ పలకలేదు ఆవిడ.

"మాట్లాడ వేం ?"

మళ్ళీ మాట్లాడలేదు. అంతేగాక లోపలికి పోతూంటే ఆయన కసిగా ఆపి "ఏమిటి నీ వుద్దేశం ? ఇందులో నీ బాధ్యత ఏమీ లే దనుకున్నావా?" అన్నాడు.

తల ఎత్తి భర్త ముఖం కేసి ఓ సారి విసురుగా చూసి "నా దేముంది ? మీ కేం తోస్తే అది చెయ్యండి" అని లోపలకు వెళ్ళిపోయింది.

చిదంబరం అంతటితో వదల్లేదు. గబగబ తనూ వెనకనే పోయి ఆవిడ భుజం పట్టుకొని ఆపి "నా కేం తోస్తే అది చేస్తే నువ్వు సంతోషిస్తావా?" అని అడిగాడు.

"ఎందుకు సంతోషించను ? అన్నీ తెలిసిన వారు."

"ఆక్షేపిస్తున్నావా ?"

"అయ్యో కర్మ. మిమ్మల్ని ఆక్షేపించే పాటి తెలివి తేటలు, ధైర్యం భగవంతుడు నాకు ఇవ్వ లేదు."

"మ రయితే ఏమిటి ఈ మొండితనం ?"

"నే నేం మొండితనం చేశాను? అనుకుంటే సిగ్గు. చిన్న దాన్నా? చితకదాన్నా? అలా నాటకాలు ఆడడానికి."

"నాకు నీవుద్దేశం తెలుసులే," అన్నాడు చిదంబరం.

"తెలిస్తే యింకా ప్రశ్నించడ మెందుకు?"

ఎలా అయినా యీ సంబంధం చేసుకోవా లని నీకు వుంది.

ఆవిడ జవా బివ్వ లేదు.

"రెండువేల అయిదొందలూ యిచ్చుకోవాలనే?"

ఆ విడ మాట్లాడ లేదు.

"అప్పో సప్పో చేసి, అయిన కాడికి యీ పెళ్ళి జరిగించాలి ఏం?"

ఆవిడ పలక లేదు.

"జవా బివ్వ మని అడుగు తున్నాను."

జవాబు రాలేదు.

"జవా బివ్వటం నామర్దా అనుకున్నావా?"

ఉలకలేదు, పలకలేదు.

"మాట్లాడ వేమిటే" అని ఊచిపెట్టి ఒక చెంపకాయ కొట్టాడు. లోపలనుంచి యిందాకటి నుంచీ వింటూన్న పెద్ద కూతురు "అమ్మా" అంటూ బావురు మంటూ వచ్చి తల్లి వళ్ళో వాలక ముందే, విసవిస నడిచి బయటకు వెళ్ళి పోయాడు.

ఒక వైపునుంచి కోపం, మరో వైపునుంచి దుఃఖం, ఒక వైపునుంచి ఆవేశం, మరోవైపు నుంచి ఆవేదన ఆరో జంతా ఆయన్ని కాల్చుకు తిన్నాయి.

భార్యను యిదివర కెన్నిసార్లు కొట్టాడు! కాని ఆ కొట్ట టానికి, యీకొట్టటానికి ఎంతో వ్యత్యాసం కనిపించింది. ఇది వరకు తనకు అన్నం పెట్టడం ఆలశ్య మయిం దని కొట్టాడు. చొక్కా చిరిగితే కుట్టలే దని కొట్టాడు. సినిమాకి వెడదా మని పేచీ పెట్టిం దని కొట్టాడు. కాని ఇప్పుడో కూతురికోసం కన్నతల్లి హృదయం రోదిస్తుంటే కొట్టాడు. ఛీ ఛీ ఛీ. తను పాపాత్ముడు. నిజంగా పాపాత్ముడే.

అయినా తన మనస్తత్వం అంత ఎందుకు అర్థం చేసుకోక పోవా లని మరుక్షణంలో కోపం కూడా వచ్చింది.

ఏమిటి అర్థంచేసుకునేది? ఏతల్లి మాత్రం ఆసమయంలో సహనం కోల్పోదు?

చిందరవందరగా అల్లుకుపోతున్నా యిన్ని ఆలోచనల్లోనూ చీకటిలో మెరుపు మెరిసినట్లు ఆయనకు ఓ ఉపాయం తట్టింది

తన కొడుక్కి కూడా కట్నం తీసుకొంటే?

అవును. ఆడబ్బుతో కూతురి పెళ్లి చేయువచ్చు.

కాని ఆలోచన యింకా అసంపూర్తిగా వుండగానే, పెద వులపై దరహాసం యింకా ఉదయించ కుండానే ఎవరో అజ్ఞాత వ్యక్తి వెన్నుమీద ఛెళ్లున చరిచిన ట్లయింది.

ఎంత ద్రోహం తలపెట్టాడు? తన చెల్లిలికి యింత అన్యా యం చేయటానికి మన సెలా వచ్చింది? ఆమె పోతూ పోతూ తనచేత ప్రమాణం కూడా చేయించుకుంది కదా. "ఎల్లా అయినా

ఆనందుడే నా అల్లుడు కావా లన్నాయ్'' అంది. 'అలాగే నమ్మా' అన్నాడు తను. ఆనాడు చనిపోతున్న ఆ అమాయకురాలికి అంత ఆశ కలిపించి యీనాడు ఆడి తప్పటానికి సంసిద్ధ పడతాడా? వాళ్ళూ తమలాగే బీదవాళ్లు. వీలు లేదు. వీలు లేదు. ఇంత ద్రోహం చేయటానికి తన అంతరాత్మ అంగీకరించదు?

కాని తన బావమరిది తనకు యిదివరలో మాట యిచ్చి నంత పనిచేశాడు. అతను ద్రోహం చేయలేదా తనకు?

అది వేరు. తను బావమరది కాదు. అతనిలో వున్న కాఠిన్యం లేదు. పదమూడేళ్ళ పిల్ల అది-ఇంకో రెండేళ్లలో పెళ్ళీడుకు వస్తుంది. వాళ్ళు తమ మీదనే ఆశలు పెట్టుకొని కూర్చున్నారు. ఇటువంటిస్థితిలో ''కట్నం ఇవ్వందే చేసుకోను'' అని తను వెల్లడిస్తే వాళ్ళ గాలిమేడలు కూలిపోవా? తన గుండె యీరోజు మండిపోతున్నట్లే వాళ్ళ గుండెలు ఆ రోజు మండి, మాడిపోవా?

లేదు. వీ ల్లేదు. అంత దురన్యాయం తను చేతులారా చేయలేడు. తను బాధ పడనీ, కష్టాలపాలు కానీ, చావనీ, ఆ అమాయకుల్ని బాధలపాలు చేయటం కూడదు. కనీసం కొందరైనా సుఖించాలి.

తిరిగి తిరిగి, అలిసి అలిసి, విసిగి విసిగి అప్పుడు యింటి దారి పట్టినప్పుడు విద్యుత్ తగిలినట్లు మరో ఆలోచన తాకింది.

"ఈ మనశ్శాంతి లేకపోవడం, యీ మనస్పర్థలూ యివన్నీ తను యిల్లు కొన్నందుకే.''

ఒక్క క్షణం ''నిజమేనా ?'' అనిపించింది.

ఎందుకు కాదు? ఆ డబ్బు వుంటే కూతురు పెళ్లి చేసే

వాడు. కొడుక్కి సైకిలు కొనేవాడు. ఇంట్లో యీ కలతలు వుండేవి కావు.

తను యిల్లు కొనటమన్నమాట యిన్నిటికీ మూల మైంది తను యిల్లు కొనకుండా వుంటే యీ అవస్థ లన్నీ వుండకుండా ప్రశాంతంగా వుండేవా డన్న మాట.

అబ్బ. ఈ ధాటికి తను తట్టుకో లేడు. రాను రానూ ఓపిక సన్నగిలుతోంది. ఒకొక్క క్షణంలో "పిచ్చి ఎత్తుతుందేమో" అన్న భయం కూడా కలుగుతోంది.

ఆ రాత్రి చిదంబరానికి నిద్ర పట్టలేదు. తెల్లవారు ఝామున కాబోలు ఓ కునుకు తీశాడు. ఇంతలో ఎవరో భుజాల మీద, చేతుల్తో తట్టి లేపితే మెలుకువ వచ్చింది. కళ్లు నులుపుకుంటూ లేచాడు.

ఎదురుగుండా భార్య. ఆవిడ ముఖ మంతా వివర్ణమై కన్నీళ్లు తరువాయిగా వుంది.

"ఇదిగో చూడండీ. ఈ వుత్తరం."

చిదంబరం గబగబా చదివాడు. అది ప్రేమ లేఖ. తను జానకిని ప్రేమిస్తున్నా డట. ఆమె కోసం తన హృదయంలో విశాల మైన చోటు ఖాళీచేసి వుంచా డట. తనని కనిక రించాలట. లేకపోతే బ్రతక లేడట.

చిదంబరం కళ్ళెర్ర జేశాడు. "ఎవరి పని యిది?"

"ప్లీడరు గారబ్బాయి పనిమనిషి చేత పంపించాడు."

మారుమాట మాట్లాడకుండా ఆయన లేచి గబగబ ప్లీడరు గారి భాగంలోకి వెళ్ళాడు. ఆ సమయానికి అలస్యంగా లేచిన ప్లీడరుగారు బ్రష్‌తో పల్లు తోముకుంటూ బయటకు

వస్తున్నాడు.

చిదంబరం ఎక్కువ కాలం వ్యర్థం చేయ కుండా "ఇదిగో చూడండి; మీ అబ్బాయి చేసిన ఘనకార్యం" అన్నాడు.

ప్లీడరు గారు ఆ ఉత్తరం సాంతం చదివాడు. క్షణకాలం ఆయన ముఖం పాలిపోయినా, గాంభీర్యత తిరిగి వచ్చింది.

''మా అబ్బాయి యిటువంటి పన్లు చేయడే! ''

"అందరి తలిదండ్రులూ ఇలానే అనుకుంటారు. ఇప్పుడు ప్రత్యక్షంగా చూస్తున్నారుగా?''

ప్లీడరు తాపీగా ''మావాడు ఇంత తొందర పడ్డాడంటే ఏదో కారణం వుండి వుంటుంది కదా'' అన్నాడు.

చిదంబరం కోపం అపుకో లేక ''ఇం కేం కారణం ? ఒకటే యౌవన మదం" అని అరిచాడు.

''అదే. ఎవరి మదం?'' అని.

చిదంబరం ఒక్కసారిగా నివ్వెరపోయి ''ఏమిటీ ?'' అన్నాడు.

"అవు నయ్యా. మీ అమ్మాయి ఏమీ అలుసు యివ్వందే మావాడు యిలా తొందర పడ్డాడంటావా ?"

చిదంబరానికి మతి పోయింది. ఏమి మాట్లాడుతున్నాడో అన్న జ్ఞానంకూడా లేకుండా ''పైగా యిదా? నా యింట్లో అద్దెకుండి నాకే ద్రోహం తల పెడదా మని చూస్తున్నావా ? తప్పు చేసినా దండించటం పోయి నాకే తప్పు అంట గడు తున్నావా ? ఇదేనా నీవు చేయవల్సిన ప్రత్యుపకారం ?'' అని అరవటం ప్రారంభించాడు.

ప్లీడరు వెంటనే సమాధానం చెప్పకుండా గంభీర మయిన

మౌనం ధరించి నిల్చున్నాడు. ఈ లోగా యిరుగు పొరుగు వాళ్లు నలుగురూ అక్కడికి పోగయ్యారు. ప్లీడరుగారు యీ అవకాశాన్ని పూర్తిగా వినియోగించు కున్నారు. అడిగిన వాళ్లకు కా దనకుండా విషయాన్ని సవిస్తరంగా వివరించాడు.

ఆడపిల్లలకు లోకంలో పూర్తిగా న్యాయం జరుగుతుం దని ఎవ రయినా అంటే వాళ్లు యీసమయంలో అక్కడ నిల్చుని జరిగేది పరికించవచ్చు. ఆడపిల్ల తండ్రిమీదకూడా లోకం యింత కఠినంగా యెదురు తిరుగుతుం దని కలలో కూడా తలపోయ లేదు.

"ఆ అమ్మాయి విషయం నాకు బాగా తెలుసును" అని ఒక రన్నారు.

"గుమ్మంలో నిల్చుని వచ్చేపోయే వాళ్ళవంక ఒకటే యిదిగా చూపులు!"

"ఆ అబ్బాయి తొందరపడ్డా డంటే అతని దేం తప్పు?"

"ఆ స్థితిలో యెవ రున్నా అలానే చేస్తారు."

చిదంబరానికి మతి చెడింది. ఈస్థితిలో తన కన్నా శవం నయం. ఒక్కమాట ఆయన నోటినుంచి వెలువడలేదు. ఆవేశం, ఆగ్రహం ఎప్పుడో యెగిరి పోయాయి. మిగిలింది ఒకటే. అవ మానం... అవమానం...

వెనక్కి తిరిగాడు.

వెనకనుంచి యెకయెకలు, పకపకలు.

లోపలకు వస్తూంటే గదిలో పడుకుని యేడుస్తూన్న పెద్ద కూతురూ, గోడకు ఆనుకుని కళ్ళు మూసుకుని నిల్చున్న భార్యా, కుర్చీలో తల పట్టుకుని కూర్చున్న పెద్దకొడుకూ లీలగా కనిపిం

చారు. అంతే. పోయి చాపమీద పడ్డాడు.

తొమ్మి దయినా లేవలేదు. ప దయినా లేవలేదు. పదకొండు, పన్నెండు, వొంటిగం టయినా లేవలేదు.

చివరకు పాదాలమీద మెత్తగా తగిలితే యెర్రబడ్డ కళ్ళు విప్పి బలహీనంగా చూశాడు.

"మీ పాదాలమీద పడి ప్రాధేయ పడుతున్నాను. అమ్మాయి పెళ్ళి అయ్యేమార్గం చూడండి."

చిదంబరం ఉలకలేదు, పలకలేదు.

"డబ్బుకోసం చూడకండి. దాని జీవితం నాశనం చేయకండి."

చిదంబరం మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు. ఆవిడ మరో పది నిముషాలు అలానే పడివుండి భారంగా లేచి లోపలకు వెళ్ళిపోయింది.

ఆలోచన, మౌనం, బాధ. ఆరోజు నుంచి చిదంబరానికి యిదే పని ఇల్లు—పెళ్ళి, పెళ్ళి—ఇల్లు. ఇదే ధ్యాస.

ప్లీడరు మరో రెండుజుల్లో యిల్లు ఖాళీ చేసి వెళ్ళిపోయాడు. కొన్నిరోజులు ఆ భాగం అలా ఖాళీగా పడివుంది. తనభాగం అది. దాని అద్దె వృధాగా పోతోంది. అంత బాధలోనూ వెళ్ళి, పాత బోర్డు దులిపి దానికి తగిలించి వచ్చాడు.

"ఈ భాగము అద్దెకు యివ్వబడును."

లోపలకు వస్తూంటే యెదుటి షాపులోని షావుకారు నవ్వినట్లు వినిపించిది ఆయనకు. లెక్క చేయకుండా లోపలకు వచ్చేశాడు.

ఇది మరీ విచిత్రం. ఈ సారి యింట్లో అద్దెకు వుండేందుకు

ెవరూ రావటం లేదు. ఒక రిద్దరు వచ్చి అద్దె యెక్కు వయిం దని వెళ్ళిపోయారు ఒక రిద్దరు యిల్లు బాగా లే దని వెళ్లిపోయారు. ఒక రిద్దరు వచ్చి చేరుతా మని చెప్పికూడా రాకుండా మాయ మయ్యారు. ఇంకా మరీ విచిత్ర మైన సంగతి. ఒక రిద్దరు వచ్చి ఇంట్లో ఒకటి రెండురోజులు వుండి "అబ్బే, దెయ్యాల కొంపలా వుంది" అని వెళ్ళి పోయారు.

ఎప్పుడైనా చిదంబరం కిటికీలోంచి బయటకు చూసి నప్పుడు యెదుటి షాపులోనుంచి షావుకారు విషపు నవ్వుతో ప్రత్యక్షం.

ఈనవ్వుకూ ఆ విచిత్రానికి యేమీ సంబంధం లేదు గదా.

ఇదేనా చివరకు ఫలితం? ఇందుకోసమేనా ఇల్లు కొన్నాడు? ఈ యింట్లో సుఖం లేదు, శాంతిలేదు. ఈ యింట్లో అధికారం చెలాయించే హక్కు లేదు. కనీసం మాట్లాడేవారు లేరు. ఈ యింట్లో ఎప్పుడూ కన్నీళ్ళు, ఎడమొహాలు, పెడమొహాలు.

ఒకవేళ...ఒకవేళ... ఈ యింటికన్న ఆపాత యిల్లే, నీళ్ళు కురిసే ఆయిల్లే నయమేమో.

అవును. కన్నీళ్ళకన్నా అదే నయం కదూ.

ఆ యింట్లో వుంటే యింతటి విరోధానికి గురి కాడు. ఇన్ని కక్షలు వుండవు. ఇంతకంటే మనశ్శాంతి హెచ్చు. కూతురి పెళ్లికి అడ్డు వుండదు.

కూతురు పెళ్ళికీ, యిల్లు కొనటానికీ సంబంధం?

అంటే...అం...టే...ఇల్లు అమ్మడానికీ, కూతురి పెళ్ళికీ కూడా సంబంధం.

వళ్ళు ఝల్లు మంది. ఇల్లు అమ్మటం—ఇల్లు అమ్మటాని

కేనా కొన్నాడు.

అంతేకాక చిదంబరానికి తను చేసిన రెండువేల అప్పు మనోనేత్రం ముందు గోచరించింది ఇంతవరకూ తీర్చింది వడ్డీకి కూడా సరిపోదు. రెండువేలూ రెండువేల లాగానే వుంది. ఆరోగ్యం పూర్తిగా పాడయింది. ఈస్థితిలో ఏం కష్టపడి ఆబాకి తీర్చేందుకు ప్రయత్నిస్తాడు? కలలోని మాట. ఇంకా కొన్నాళ్లు పోతే చేసిన అప్పుకోసమే యిల్లు అమ్మాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది.

ఏ యింటికోసం అప్పు చేశాడో ఆ అప్పుకోసం ఆ యింటిని అమ్ముతున్నాడు.

భరించలేడు. ఈ ఘాటిని తట్టుకోలేడు.

బావమరది నుంచి బెదిరిస్తూ వచ్చే ఉత్తరాల ఘాటికీ తట్టుకోలేడు.

హఠాత్తుగా ఓరోజు దృఢ నిశ్చయంతో చిదంబరం లేచాడు. ఏడిచే భార్యా, ఏడిచే కూతురూ హృదయంలో చెరిసగం పంచుకున్నారు. బలరామయ్య యింటికేసి ఫర్లాంగుదూరం నడిచేసరికి కళ్ళు తిరిగాయి. శరీరం తూలింది. రిక్షాలో యింటికి తిరిగి వచ్చాడు.

ఆరోజే అనుకుంటే మరునాడుకూడా లేవటం కష్టమైంది. లోపలినుంచి పొంగి పొర్లే ఉత్కంఠను అణుచుకోవటం కష్టం కాగా, చిన్న కొడుకును బలరామయ్య యింటికి కబురు పంపించాడు.

మరో అరగంటలో- "ఎందుకు చిదంబరం, పిలిపించావుట" అంటూ బలరామయ్య వచ్చాడు.

తర్వాత భార్యను ప్రేమతో దగ్గరకు పిలిచాడు.

"ఇదిగో. ఇలారా."

ఆవిడ చెంతకు వచ్చి నిల్చుంది.

"ఇలా కూర్చో."

"కూర్చుంది."

"నా పరుపు క్రింది డబ్బు వుంటుంది చూడు". ఆయన మాట తడబడుతోంది.

ఆవిడ తడిమి తీసింది.

"మూడు వేల...రెండు...వం...ద...లు."

"ఎక్కడి వండీ ?"

"ఇల్లు అమ్మాను ?"

ఆవిడ పమిట చెంగుతో కళ్ళు తుడుచుకుంది

"అమ్మాయి పెళ్లి సలక్షణంగా జరుగుతుంది. వాళ్ళకు ...కట్నం...యిస్తా మని ఉత్తరం...రాయించు"

తరువాత కొద్ది సేపటిలో స్మారకం తప్పింది పెద్ద కొడుకు వెళ్ళి డాక్టరును పిల్చుకు వచ్చాడు. ఆయన పరీక్ష చేసి "యింత ఆలస్యం ఎందుకు చేశారు ? చాలా ప్రమాద స్థితిలో వున్నాడు" అని చెప్పాడు.

"ఏమిటి?" ఇల్లంతా ఓసారి ఉలిక్కి పడ్డది.

"అవును" నాచేత నైనంత వరకూ ప్రయత్నిస్తాను.

* * *

ఆరోజూ మరునాడూ గడిచింది. మూడోదినం తెల్లవారు ఝామున రోగి చుట్టూ అంతా కూర్చున్నారు. ఇద్దరు ముగ్గురు బంధువులు కూడా వున్నారు.

ఉన్నట్లుండి ఆయసకు గురక పుట్టింది.

'అమ్మా అంటూ తల్లివళ్ళో తల పెట్టి బావురు మంటోంది పెద్దకూతురు.'

సరిగ్గా ఆసమయానికే బలరామయ్యగారి మనుషులు యిద్దరు వచ్చారు.

''ఇంట్లో చచ్చిపోవటానికి వీ ల్లేదు : బయట పెట్టాలి.''

ఎవరూ ఏమీ మాట్లాడలేదు. పెద్దకొడుకు కళ్ళు తుడుచుకొని బంధువుల సహాయంతో రోగిని బయట చలిలోకి తీసుకు పోతుంటే ''తల్లీ'' అంది ఆవిడ-కూతుర్ని బిగ్గరగా కౌగలించుకొని ఏడుస్తూ.

# డిప్రెషన్ - చెంబు

## శ్రీ వేలూరి శివరామ శాస్త్రి

---

జననము 1892 లో కృష్ణాజిల్లాలో. చిన్నతనములో తిరుపతి వేంకటేశ్వరుల శిష్యత్వము. శతావధానములు చేసినాడు. సంస్కృతాంధ్ర భాషలలో విద్వాంసుడు. వంగ, గుజరాతీ, ఆంగ్ల, ఫ్రెంచి, భాషలలో కృషిచేసినాడు. పద్యరూపమున ఆంధ్రీకరించిన పద్మపురాణము, కొన్ని పద్యకావ్యములు, వివిధరచనలు గృహముతో పాటు దగ్ధమైనవి. వంగభాషనుండి రవీంద్రుని రచనలు, శరచ్చంద్రుని నవలలు, అనేకము ఆంధ్రీకరించినాడు. గుజరాతీ భాషనుండి గాంధీజీ ఆత్మకథను అనువదించినాడు. దర్శనములలో కృషిచేసినాడు. జయంతి భగీరథ శాస్త్రులవారి వద్ద వ్యాకరణ శాస్త్రాధ్యయనము చేసినాడు. ఎఱ్ఱన నృసింహపురాణమును సంస్కరించినాడు; నాచన సోమనాథునిపై గ్రంథము రచించినాడు. స్వోపజ్ఞములైన కథలు అనేకము చేసినాడు. గ్రామములో శాంత జీవనము గడపుచున్నాడు.

---

౧

రామారావు లిటరేచర్ ఆనర్సు ఫస్టుగా ప్యాసయి నాలుగయిదు నెలలు జుట్టు జాడించి తిరిగెను. పిదప

RAMA ROY DWIVEDI. B. A, (HONS.) అను గిల్టు అక్షరములు గల బారెఁడు బల్ల తయారు చేయించి, మంచి ముహూర్తమున గోడకు తాపటము చేయించి, మేడమీఁద విశ్రమించెను.

అతని కెక్కుడను తగు నుద్యోగము దొరక లేదు. దానికి కారణము ఆడిగ్రీయే. పొమ్మనఁగనే లేచి పోఁగల నియమమునకు లోఁబడి పాతిక రూపాయలకు బి. యిడీలు కో యనిన కోటిమంది దొరకు చుండఁగా ఈయెమ్మేకు విద్యాలయములు బెదిరి పోయెను. అవి ఒకవేళ ఏ యిరువది రెంటికో, లేక యే యిరువది మూటికో దయతో బేరమాడినను రామారావు మొగ్గఁడు. ఏల? తాను యె. మ్మే. పైపెచ్చు తాను డిప్టీ కలక్టరు గారి అల్లుఁడు !

ఈ నాణెము చదువుల టంకసాలలోఁ దక్క మఱియొక చోట చెల్లదు. కాన నతఁ డింకొక డిపార్టుమెంటునకు నీళ్ళు వదలు కొనెను. కాని భార్యయొక్కయు, తల్లియొక్కయు కన్నీళ్ళు తుడుచుటకు దరఖాస్తు మీఁద దరఖాస్తు పెట్టు చుండెను. దానికి పదియేను రూపాయలు కర్చు. ఆ రూపాయలకు తల్లి నగయో, పెండ్లాము నగయో తాకట్టు. 'కరువు వచ్చింది, కలిసిరాలేదు' అని తల్లి మహాలక్ష్మి దైవమునే దూఱును, గాని తులసికి (రామారావు భార్య) ఈ గుట్టు తెలియును. తాను చూచుచుండగా రామారావు పోస్టల్ డిపార్టుమెంటుకును, పోలీసు డిపార్టుమెంటుకును అర్జీలు పెట్టుచుండును. దివాను గిరికిని అసిస్టెంటు దివాను గిరికిని జమీందారులకు తనచేత అర్జీలు వ్రాయించు చుండును. తన మగని

చదువునకును ఆ యుద్యోగములకును గల సంబంధము బదరీ బాదరాయణ సంబంధమే యని తులసి తెలిసియు ఆ నాటక మును తిలకించు చుండును.

రామా రావుకు కొలువు లేని లోటు లేదు. ఓరంత ప్రొద్దు పెండ్లాముతో పేరంటము. తానే కాలేజికిని ప్రిన్సిపల్ కాని ప్రియాదు లేదు. తా నొక పదుగురు ప్రొఫెసరుల పెట్టు; తులసి ఒక నూఱుగురు శిష్యుల పెట్టు. ముక్కోటి నాడు ముక్తిద్వా రములే తెఱవఁబడి యుండును గాని రామారావు మేడ 'బంధు.' మూర్తి - ది - కో - అపరేటర్, సుందరం - ది - లాయ లిస్ట్, శర్మా - ది - నిహిలిస్ట్ లోనగు మిత్రు లెవరేని వచ్చి 'రామా రావూ రామా రావూ' అని రెట్టింప మొదలిడఁగనే మహాలక్ష్మి అసత్యభీతి లేక, 'అయ్యా' అతగాడు అత్తింటికి వెళ్ళా డని వారిని పంపి వైచెడిది.

గ్రీకు - చిత్ర కళలోని నగ్న సౌందర్యముతో పాటు అఱ చాటగు ఆంధ్ర కళ యందము గూడ రామా రాయని గది యలంకరించు కొనెను. ప్రాచ్య రసాయనములతో పాటు అప్రాచ్య రసాయనములును అతని బల్ల నెక్కెను. కోహళ వాత్స్యాయనులు మొదలు, Mary Stopes తరువాతి వారి వఱ కును గల సరస సారస్వత మతని బీరువాలు ప్రదర్శించెను.

తులసి గవాక్షము దెస చూపు త్రిప్పెనా అతనికి బెంగ, అత్తగారు కోడలిని పిలిచెనా వియోగము. పుట్టింటి వారు తులసికి వ్రాయు చీటీ అతని పాలిట విడాకు. రామారావు తులసికి బలవంతముగా అనేక వేషములు వేసెను. దీనికి తులసినగ లొకటొకటియే ఆరతి కప్పురము వలె హరించెను.

ఇటు లోక యేఁడాది గడచెను. ఈ సంసార యాత్రకు మహాలక్ష్మి నగలు చాలవఱకు మంగళ మాయెను.

ఇంతలో నొక కాండ జరిగెను. రామారావు పెట్టిన దరఖాస్తులలో నొక దరఖాస్తుకు ఖాళీ ఉన్న దని ఉత్తరము వచ్చెను. అది ఆపట్నములోని కాలేజిలో ట్యూటర్ పని. అఱువది రూపాయల జీతము.

అది అతనికి వారంటు వలె కనఁబడెను.

'దాఁచు కొను చున్నారే! ఏమి టా రహస్యము?'

అని తులసి అడిగెను.

'ఏ మున్నది? ముష్టి యెత్తుకొనుటకు Pass:'

'ఏదీ'

'చూపుటకుఁ గూడ సిగ్గు చేటు' అని రామారావు దానిని మడఁచి అచటను ఇచటను దాఁచు చున్నటు లభిన యించి తులసి పట్టుకొను నేమో యని భయఁపడి వడి వడిగా మేడ దిగెను. అతడు మేడ దిగఁగనే తులసి అచటి పుస్తకము లన్నియు తిరుగవేయఁ దొడగెను. కాని ఆ కాకితము కనఁబడ లేదు.

'నగలా కరఁగిపోయె, సంసారమా గంపంత, కాలమా, పచ్చి కఱవు, ఈతఁడా యీహామృగ నాయకుఁడు,' అని అనుకొనుచు తులసి అవియు నివియు వెదకు చుండెను.

'ఏమి టా దొంగతనము?' అని వెనుక నుండి రామారావనెను.

'నాదా మీదా?' అని తులసి యనెను.

రామారావు తన జేబు నుండి ఆ కాకితమును దీసి 'ఇదిగో

దీనివెల ఒకముద్దు' అనెను.

'మనిషికి ఏమీ అక్కఱలేదు; అందుది ఉన్నచో సరి' అని లోపల అనుకొనుచు తులసి అవలికి నడచెను.

'పోనీలే ఇదిగో ఇత్తును. రా,' అని రామా రావనెను.

తులసి మాటాడక మేడ దిగుచుండెను. రామారావు గబ గబ నడచి ఆ కాకితమును వెకనుండి ముక్కు ముందర పెట్టెను.

'రామా రావు గా రండీ', అను పిలుపు వాకిటినుండి వినవచ్చెను. రెండవ పిలుపు వినబడక ముందే రామారా వాకాకితమును జేబులోఁ గ్రుక్కుకొని తులసిని తప్పించుకొని రెండు మెట్లు దుమికి వాకిటికిఁబోయి 'పద, నే నే వస్తున్నాను' అని ముందు నడచెను.

ఆ వచ్చినది తామల పాకుల అంగడి వాడు. వానికున్న బాకీ తులసికి తెలియును. మగని మాటల తొందరయు, నడక లోని వడఁకును ఆమె చూచెను. ఆమె నవ్వలేదు. కాని ఆమె అంతరాత్మ ఏమి చేసెనో ఎవరు చెప్పఁగలరు?

తులసి కిన్నాళ్ళకు మేడక్రింద తీరికగా కూరుచుండఁగల భాగ్యము లభించెను. అత్త పిల్లలకు అన్నము పెట్టుచుండెను. కోడలు ప్రక్కగదిలోఁ గూరుచుండెను. ఆ సంగతి ఆమె యెఱిగినచో తన సంసారపు గుట్టునకు ఆ కోడలిని ఏదో మిష మీద మేడమీఁద బంధించి యుండెడిదే.

'ఎప్పుడూ ఒక్క అవకాయే. లేకపోతే గోంగూర పచ్చడి, పొడు పచ్చడి, ఆంధ్రమాత. నేయైనా వెయ్యవు. ఇందాక కాఁకర కాయ వేయించిన వాసన కొట్టలే దేం?' అని ఓటి కంచములోని మెతుకులను అటు నిటు పద్మనాభుడు చిమ్మివేసెను.

'నాయనా! నేయి వేసుకుంటే నాలుక జిడ్డెక్కి చదువు రాదు ' అని మహాలక్ష్మి యనెను.

'అన్నాయి కెల్లా వచ్చింది?'

'అన్నయ్య మాత్రం చదువు కోకముందు ⋯...

'పాపం, యిప్పుడు మాత్రం నెయ్యి వేసుకుంటున్నాఁ డను కొంటున్నావా?'

'అన్నాయి కోసం ఎన్ని అబద్ధాలన్నా ఆడుతుంది!' అని రమణ యనెను.

'నెయ్యి వేతుకోలేదుట —పప్పులేదుట— కూరలేదుట — మనకేనయం— ఆకాయ వుంది--గోంగూరవుంది-అన్నయ్యగారు వట్టి అన్నం తిని ఊరుకొనే వాట్ట! కాదే అమ్మా? నీవు చెప్పలా?' అని ఆఖరు వాడు పుండరీకాక్షుఁడు వట్టియన్నమును నోరఁగూరు కొనెను.

'అమ్మా! నాకు నే యొద్దు గాని, అన్నాయికి పోస్తావే,-- విస్తట్లో తెల్లగా చూచానే, —అది అదీ,— పెరుగే—అది కొంచెం పొయ్యవూ?' అని పొడి మెతుకులు మింగుడు పడక పుండరీ కాక్షుడు గారాబ మొనరించెను. 'వెధవా! అన్నాయి నేయి వేసు కోనూ లేదు. పెరుగు పోసుకోనూ లేదు. నీ కెందుకురా? అని పద్మనాభుడు గద్దించెను. వెంటనే మహాలక్ష్మి యిటు లనెను: 'ఉండరా వాఁడికి కొల మారింది, చిన్నావాడా! పెరు గెక్కడుందిరా? అది పెరు క్కాదు. అన్నాయి లేచాక విస్తరికి చీమలు పట్టుకుంట వని ముగ్గోశాను. అది గాక పెరు గోసుకుంటే పిలక పెరగదు.'

'అలా అయితే నేను పోచుకోను' అని సుందరి యనెను,

'మహా పోసినట్టు, నీవు పోసికోనట్టు!' అని రమణి యనెను.

'పోనీ అమ్మా! నాకు ఆ ముగ్గే పోయ్యే, ఏ, ఏ ఏ,' అని పుండరీ కాక్షుఁ డనెను.

మహాలక్ష్మి నవ్వి 'ఎబ్బే కా దమ్మా, మనకు గేదె ఉందా చెప్పు! ఎవరేనా చెప్పండి' అని అనెను.

'లేదు లేదు' అని పుండరీకాక్షుఁడును, సుందరియు, రమణియు నొకరి తరువాత నొక రనిరి.

'ఏమిరా పద్మా? అని మహాలక్ష్మి పద్మనాభుని గదమాయింపగా అతఁ డిటు లనెను—'లేదు, పాలం లేదు, గడ్డి లేదు, గేదె లేదు, కాని పిల్లికి రోజూ పాలు.'

ఈ మాటతో పిల్ల లందఱకును అఁపరాని ఉత్సాహము కలిగెను. మహాలక్ష్మి మొగము ముడుచుకొనెను.

'మమ్మన్ని గదిలో పెట్టి తాళం వేసి అన్నాయికి వదినెకూ అఁ అక్కాయి చెప్ప లేదెం, పద్దన్నాయికూడా—? అని సుందరి చెప్పఁబోవు చుండగా పద్మనాభుఁడు సుందరిని మిర్రి చూచెను. సుందరి మఱిమాటాడ లేదు. ఈమాటలు మహాలక్ష్మికి మామూలే కాని ప్రక్కగదిలో నున్న కోడలికి సరిక్రొత్త. 'పిల్లల నోటగడ్డి కొట్టుచున్నా' మని మనసులో ననుకొనుచు తులసి మెల్లగా మేడమెట్లెక్క దొడగెను. ఆమెకు దెలియకుండ ఆమె వెనుకనే రామారావు.

తులసి వెను దిరిగి చూచి ముం దున్న పరదా తప్పించుకొని లోని కేగెను. వెనుకనున్న రామారావు - హస్తము లాలింగమునకు అయత్తము లగుచుండెను. తులసి మరల వెను దిరిగి - 'మీరు కాసేపు కిందికి వెళ్ళి సంసార మంతా గమనించు

కోండి. నన్ను కాసేపు ఒంటరిగా ఒదిలిపెట్టండి' అనెను.

'ఇది వైరాగ్య రోగానికి సమయం కాదు తులసీ !'

'రోగమూ నిదానమూ మందూ నాకు బాగా తెలిసింది. ఇదే సరి యైన సమయం. మీరు నన్ను ఒంటరిగా ఉండనియ్యండి.'

'ఇది పతివ్రతలకు లక్షణం కాదు. భర్తమాటకు ఎదురాడితే గుడ్లగూబ అయి పుటుతుందట కాదూ, పుటుతుంది.!'

'ఈ అడంగి రేకుల వాళ్ళమాట చెప్పడానికి మగాళ్ళకు సిగ్గు లేదూ?'

'మీ బోంటి వాళ్ళచేత పుస్తె కట్టించు కోవడం అవమానానికి. పెళ్ళాడడమే అవమానం. తల్లిని, తమ్ములనీ పోషించలేని వాళ్ళను మగళ్ళగా చూచే వాళ్ళు, ఇంకోజన్మలో కాదు - ఈ జన్మలోనే గుడ్లగూబలు.'

'తులసీ ! కూచో ! నిలుచుంటే కాళ్లు నొప్పెటతయ్! ఇదుగో మెత్తగా ఉంటుంది ఒళ్ళో కూచో.'

'ఎవ ళ్ళెట్లా పోతే యేం ? అఁడది దగ్గఱ ఉంటే చాలు. ఉద్యోగ సద్యోగాలు లేని పిన్న వాళ్ళ సంగ తంతా యింతే.'

'అందఱి సంగతీ నీకు తెలుసూ ?'

ఈ మాటకు తులసి మొగము జేగురించెను. పెదవులు కంపించెను. ఇటు లనెను – 'మీరు మాటాడఁ గలిగితే జాగ్రత్తగా మాటాడండి, లేక పోతే మీదఁబడి కొట్టండి. భార్యవంటి పరమనీచురాలు ఈ జగత్తులో మఱి లేదు !

'కాదు తులసీ! యోగం వల్ల సర్వదేశ జ్ఞానం కలుగుతుందిటగా ! అట్టి దేమయినా నీకు కలిగి చెప్పా వేమో నని అన్నాను.'

'తప్పా కున్నా ముళ్ళు గుచ్చటం మగాళ్ళకు బాగా తెలుసు. కిందికి దిగిపొండి ఈ పాటికి - పొండి యీపాటికి కిందికి.'

'ఎవళ్ళయినా వింటారు. నీపుణ్యమా యిది! కొంచం మెల్లగా మాటాడుదూ!'

'పిల్లి కళ్ళు మూసుకుని పాలు తాగుతూ లోకులుగూడా మూసుకున్నా రని అను కుంటుందిట ! లోకులకు తెలియదూ తమరు ఆఁడంగిరేకుల అబ్బయ్యగా రని? మీగౌరవం నే నెన్నాళ్ళ నుంచీ కాపాడుతూ వచ్చానో మీకు తెలియదూ? నానగలు ఎన్ని అమ్ముకున్నారో, అత్తగారి నగలు ఎన్ని ఆహుతి చేశారో మీకు తెలియదూ? కిల్లీ దుకాణాదారుకి ఇపు డిచ్చింది నా ప్రథానపు ఉంగరం కాదూ? తాకట్టు పెట్టడానికి మేడ అయింది. ఇఁక ఏ ముంది? లోకం మూయడానికి మూకుడు ఉన్నదా? సరే గాని కొంచెం కిందికి వెళ్ళండి మీ సంగతి మీకే తెలిసి పోతుంది.'

రామారావు తేరి పాఱఁ జూచి యిటు లనెను: ఏమో అను కున్నాను. కోపం వచ్చినప్పడే ఆఁడది చాలా అందంగా ఉంటుంది. కావలసిన వన్నీ కనిపిస్తాయి, తులసి సర్దుకొని యిటుల నెను—
'సైతాన్! మీరు కిందికి వెళతారా వెళ్ళరా?'

'వెళ్ళ కేం? నాతో కూడా గనుక వస్తే కిందికే కాదు షికారు కూడా వెళతాను. ఇదుగో, పొద్దూక వస్తూంది. నీ మనస్సు ఫిరా యించినటు లుంది. షికారు పోదాం రా.'

'అ దొకటి తక్కువ. నేనే మీతో వస్తే మీరేమో పెద్ద ఉద్యోగస్థు లని అందఱూ భ్రమ పడతారు.'

'అందఱూ డిప్టీ కలక్టరులు అవుతారా యేమిటి?'

'కాక పోయినా వాళ్ళపొట్ట వాళ్లు పోసు కుంటారు. వాళ్ల కాళ్ళ మీద వాళ్ళు నిలబడతారు.'

'ఎంత దప్పిక అయినా చాతకం ఆకాశగంగ కెదురు చూస్తుంది కాని చెరువులకు ఎగఁబడదు.'

'ఏంతమాటా! గుంటల మీఁదికే ఎగబడిం దిప్పుడు.'

'ఏమి తులసీ! నీనగలూ, మాఅమ్మనగలూ నావి కావూ? ఇవి గుంటలా? 'న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి' అనే హిందూ లా ఎవళ్ళకీ తెలియదు. అందులో ఆఁడాళ్ళ కసలే తెలియదు.'

'డొక్కల కఱవు వస్తే మగాళ్ళు ముందర తల్లులనీ, తరువాత పెళ్ళాలనీ విఱుచుకు తినేస్తారు, హిందూదేశంలో పెళ్ళి అనే ఆచారం ఎప్పు డంతరిస్తుందో కదా!'

'నీవు విడాకు లిచ్చేట్టు న్నావే?'

'విడాకు లివ్వటమే వస్తే ఆంధ్ర దేశంలో తులసే మొదటిది.'

'ఇంకా బిల్లు -'

'తొందర పడకండి. కొద్ది రోజులలో వస్తుంది. అప్పుడు మీ మగవాళ్ళ పాటులు తెలుస్తయ్.'

'అయితే బిల్లు రాక ముందే కథ అంతా కానీ' అనుచు రామారావు తులసి సమీపమునకు జరిగెను. తులసి వెనువెనుకకు నడచి గదిలోనికి వెళ్ళి తలుపులు మూయఁ దొడఁగెను. రామారావు వడివడిగా నడచి దగ్గఱకువచ్చి రెండు తలుపుల సందులో చేయి పెట్టెను.

టపా కచేరినుండి వచ్చిన జాబులలో నొక జాబు రామారావు - గౌరవమునకు హానిని కలిగించెను. దానిని జూడఁగనే

అతని ముఖము తుమ్మలలో ప్రొద్దు గ్రుంకి నటు లాయెను. దాని మీద బి. యే. (ఆనర్స్) కాని, యె మ్మే అని కాని, తుదకు 'రామారాయ్ ద్వివేది' అని కాని లేదు. దాని మీఁద నున్న చిర్నామా ఇది: 'శ్రీరస్తు. చిరంజీవ. ద్వివేదుల రామయ్య.'

పేరు చేతనే గౌరవము పుడికి పుచ్చు కొనఁదలచు వారికి మొండిపేరు బండు బూతు కాదా? మగని మొగమున మూడు బంతుల వ్రాసి పెట్టిన ట్లుండిన యీ బండ తిట్టును తులసి సులభముగా చదివి ఆ కవరు విప్పి చూచి 'పాపము, మీమేన మామ గారికి ప్రాణము మీదికి వచ్చిన దఁట!' అనెను.

రామా రావు ముఖము మాఱెను. 'ఏది?' అని చీటి దీసి కొని చూచి 'వెంటనే వెళ్ళి అమ్మకు చెప్పు' మనెను. తులసి వెళ్ళెను. రామారావు ముఖమున చింతకు బదులు సంతసము నెలకొనెను. దాని కారణము గనుఁగొనుటకు దుర్భిణిలో దూఱ సక్కఱ లేదు. తులసి క్రింది నుండి మీదికి రాగానే పొంచి యున్న రామారా వామెను కౌగిటిలో నలిపి వేసెను.

'అబ్బ! ఏమి టీమోట పని? లంఘనములలో మను గుడుపు.'

'అమ్మ రైలుకు వెళ్ళునా?'

'మీరు వెళ్ళరా?'

ఈ ప్రశ్నాయుధముచే తులసి తన నెదిరింప దలచె నని రామారావు కొంచె మాలోచించి యిటు లనెను : 'నేను వెళ్లను, పిల్లలతో అమ్మను వెంటనే వెళ్ళ మను.'

'ఆ ఆలు గోలులో ఈ బాలుగో లెందులకు ? బా గుం డదు. మీరు మీ యమ్మగారితో వెళ్ళుఁడు.'

'అమ్మో, నీ యెడఁబాటు నాకు Anarchy. అమ్మయు పిల్లలును వెళ్ళుచో స్వరాజ్.'

'కాదు. Diarchy.'

'పోనీ, అదైనా సమ్మతమే.'

'మీమాట, మీ యిష్టము. పిల్లలను నేను పంపను.'

'పోనీ అల్లాగే. అమ్మను వెంటనే రైలుకు పంపు.'

'నేను పంపు టేమిటి ? రైలుదను కైనను పంపిరండు.'

'ఊఁ.' యను కొనుచు రామారావు మేడ దిగెను. అతని వెనుక తులసియు దిగెను.

'అమ్మా నే నును బయలు దేర వలసినదే కాని ఉద్యోగ మొకటీ కాళీ యున్న దని తెలిసినది' అని రామా రా వనెను.

'నాయనా, ఉద్యోగం చూడు. మామయ్య కెప్పుడూ ఇల్లాగే వొస్తుంది. మ ఱేమీ తొందర ఉండఁగూడదు.' అని తల్లి యనెను.

రామా రావు ముఖము వికసించెను. వెంటనే అతడు బండిని బిలువఁ బోయెను.

'ఈ పిల్లలను ఎప్పటల్తే మీ కప్పగిస్తాను. వీళ్ళను ఇక్కడ దిగవిడిచి ఈ గౌరవం నాకు దక్కించండి. మీ రొక్కరే పోయి రండి' అని తులసి అత్తగారితో మనవి చేసికొనెను.

'వద్దు వద్దు. వీళ్ళు దయ్యపు పిల్లలు. నీ మాట వినరు. బండి వానికి చేయి యూపి ఇంతలో రామా రావు వచ్చెను. తల్లి యనిన మ్మాటలకు సంతసించెను 'పిల్లలను కూడా తీసి కొని వెళ్ల మనినచో బాగుండ' దనుకొని 'దాని మొహం! అ దేమి చూస్తుంది. కాని నేను చూస్తానులే' అనెను.

తులసి బిగ్గరగా నవ్వెను. 'నాయనా, వీళ్లు పిల్లలు కారు; నెత్తి మీద బండలు. మీ రెవరునూ మోయలేరు' అని మహాలక్ష్మి యనెను. 'వీళ్లు నెత్తిబండలు కా రండీ, నెత్తికి కిరీటాలు' అని తులసి యనెను. పిమ్మట వాదోపవాదము లాయెను. వానికి ఫలితముగా పుండరీకాక్షునితో మహాలక్ష్మి పయనము నిర్ధారిత మాయెను.

రామా రావు మేడ యెక్కెను.

బండి యెక్కి అత్త యిటు లనెను: 'ఎన్నఁడూ ఎఱుఁగని దానవు ఈ యింటి మొహం - సూది పొట్ట మాత్రం పాము పొట్ట. దీనిని నీ బుజాలకు ఎత్తి వెళుతున్నాను.'

'రోగీ పాలే కోరాఁడు; వైద్యుఁడూ పాలే చెప్పాడు.' లక్ష్మి ఒక పొట్లము తీసి తులసి కిచ్చి—'దీనిలో వంట యింటి సామా నంతా ఉన్నది' అని చెప్పుచుండగా ఆమె రెప్పలు క్రమముగా తడిసి కొనుచు వచ్చెను. కంఠము స్తంభించెను.

అత్తగారి నటు పంపి తులసి యిటు వంట యింటి లోనికిఁ జని పొట్లము విప్పెను. మట్టియలు! మంగళ సూత్రము!

తన సంసార యాత్ర కివి దారి బత్తెము. అత్తగారి కేల కన్నీ రురిలెనో తులసి కిపుడు తెలిసి వచ్చెను. మంగళసూత్రము చుట్టును గుడికట్టిన మగలు లేని వారి మనోరహస్య మంతయు ఆమె మానసమున మెఱపువలె మెఱసెను.

'పెద్దకొడు కిఁక సంసారము నంతయు నుద్ధరించును. తమ్ములను తనతో పాటు చేయును, చెల్లెండ్రకు పెద్ద పెద్ద సంబంధములు తెచ్చును' అని గంపెడాసతో ఆ తల్లి ఉన్న దంతయు కొడుకు కోడండ్రకు బెట్టి మిగిలిన వారిని మాడ్చుటకు

జంక లేదు. ఇది తులసి కిపుడు గోచరించెను.

'తా నీ యింటికి వచ్చిననాఁ డీపిల్లలకు దుస్తులే కావు నగలును గలవు. వా రపుడు హృష్టపుష్టు లయి ఉత్సవ విగ్రహ ములవలె నుండిరి. ఇపుడు లజ్జాదేవి వారి మీఁద కాపురము. కడుపున కార్చిచ్చు. వుండు వంటి పుష్య మాసమునఁగూడ వారికి · కప్ప దుప్పటి లేదు. పద్మనాభుఁడు గోఁచితో సంత సించెను. మూడవ వాఁడు మొలనూలితో మురిసి పోయెను. పెద్ద యాఁడు పిల్లకు మాసికల పరికిణీ. చిన్న దానికి చిను గులది. రాత్రి వార లందఱకును ఒకరి చర్మ మింకొకరికి దుప్పటి. వారి తల్లి తన కొంగును కొంతయు, తనను గొంతయు వారికిఁ గప్పి పిల్లలకోడి వలె నడుమ నిదురించును. అట్టి యత్త గారి నగలలో నిది తుది మంగళ సూత్రము!' ఈ సంగతు లన్ని యును తులసి మనః పటమున ఇపుడు అంకితము లగు చుండెను.

తల్లిచూపు ఆ పిల్లలకు సుగ్రీవాజ్ఞ. వారి భూగోళ మంతయు నొక చీకటి గది. కాని వాకిటికేసి చూచుటకు వారి మోములు మూరెఁడు బారెఁడు సాగును. తమ తల్లి తమ యన్నకుఁ జేయు వంటకముల తావియే వారికి విందు. అన్నయు వదినెయుఁ గలిసిన యొక యర్ధ నారీశ్వర మూర్తియే వారి కథి దైవము. దానిలోని నారీ మూర్తి యిపుడు తమకు ప్రత్యక్ష దేవతయై వంటింట సాక్షాత్కరించెను.

రమణి మెల మెల్లగా వంటింటికి దారి తీసెను. వెనుక పద్మనాభుడు. ఆ వెనుక సుందరి.

తులసి వారి నందఱను తనచుట్టు కూరుచుండ బెట్టుకొని

యిటు లనెను: 'పొద్దున చలిది వణ్ణంలో యేం వేసుకో తిన్నారు?'

పీరి కాఱునెలల నుండియు చల్ది యన్నము లేదు. కావున ఈ ప్రశ్న వారికి ఆశ్చర్యమును, కోపమును కలిగించెను. ఈ దేవి తమను రక్షింపనే వచ్చెనో, భక్షింపనే వచ్చెనో తమకు తెలియదు. కావున నందఱును మాటాడక చూచుచుఁ గూరుచుండిరి.

'మఱచి పోయారా యేమిటి?' అని తులసి యనెను.

'చలిది వణ్ణమే మఱచి ఆఱునెల్లయింది' అని పద్మనాభుడనెను.

'ఏమిటి?' అని తులసి అనెను.

'అన్నయ్యకు ఉద్యోగం అయాక పొద్దున్నే వేడివణ్ణమే పెటతా నని అమ్మ అన్నది' అని సుందరి అనెను.

'చలిది వణ్ణము జబ్బు చెయ్యదూ? అని రమణ యనెను.

తులసి నిట్టూర్చి కొంచె మాలోచించుచు గూర్చుండెను. 'ఊరక కూరు చుండుట వలనగాని విచారము వలనగాని ప్రకృత ముపయోగము లేదు. ప్రాయి రాజవలయును' అని తులసి ప్రాయి రగిల్చి బియ్యపు డబ్బాకడ కేగెను. అందు అర సేరు బియ్య ముండెను. ఉట్టి తట్టెను. నేతిపిడత ఖాళీ. పప్పు కొఱకు వెతకెను. శూన్యము. కూరలు శోధించెను. సర్వ మంగళము.

విసుకును విచారమును గలిసి తులసిని కదిలించెను. 'మేడమీది దేవుఁ డేమి చేయుచున్నాఁడు? అయనకు ఈ సంసారము ఇంత మరుభూమి యని యేమేని తెలియునా? పిల్లల నోట గడ్డ కొట్టి తాను అమృత మారగించు చున్నటు లాదేవుఁ డెఱు

గునా?' అని అనుకొని తులసి ఆ బియ్యము ప్రాయి కెక్కించి యిటు లనెను—'నిన్న రాత్రి ఏమి వేసుకొని తిన్నారు?'

'ఎర్రమందు' అని పద్మనాభుఁడనెను.

'అనఁగా?'

ఎర్రమం దనఁగా 'అవకాయ' అని రమణ అనెను.

'ఇంకా?'

'ఆకాశము' అని పద్మనాభుఁ డనెను.

'మజ్జిగ?'

'మీకు కావఖ్ఖర్లా?' అని సుందరి యనెను. బంగాళా దుంపల కూరయు వడియములును వంకాయ బజ్జియు పప్పు చారును సెనగ బజ్జీలును తమకు మాత్రమే నైవేద్య మాయె ననుకొని తులసి మరల నిటు లనెను — 'సెనగబజ్జీలు?' పిల్ల లొకరిమొగ మొకరు చూచుకొనిరి. రాత్రి తమ కావాసన తగిలి నపుడు కారపు పూస యని సుందరియు, జంతిక లని రమణయు వివాద పడిరి. వారి యిరువురి వీపుల మీద రెం డంటించి పద్మనాభుఁడు పకోడీ లని తీరుమానము చేసెను. ఇపు డవి సెనగ బజ్జీ లని తెలిసెను. తెలియఁగనే సుందరి యిటు లనెను— 'చూచావా వదినే! రాత్తిరి నేను కారప్పూ సంటే కాదు పకోడీ లని పద్దన్నాయి కొట్టాఁడు' అనెను.

'సరే కాని అమ్మ మీ కెందుకు పెట్టదు?'

పదునొకండేండ్ల రమణ యీ ప్రశ్నకు మొగము చిట్లించు కొనెను. తొమ్మిదేండ్ల పద్మనాభుఁడు నవ్వెను. ఏడేండ్ల సుందరి మాత్ర మిటు లనెను—'మీరు చదువు కున్నారు కాదూ, అందు కని అమ్మ మీకు పెటుతుంది.'

'అన్నాయి పెద్ద ఉద్యోగం చేస్తాఁడుటగా! చేసిం తరువాత మాగ్గూడా పెటుతుంది' అని రమణ యనెను.

'మీరు మాకూ్డా చదువు చెప్పిస్తారుటగా!' అని పద్మనాభుఁ డనెను.

ఈ సమాధానములచే తులసి విస్తుపోయెను.

ఈ ప్రశ్నోత్తరములలో ఈ విరతి విచారములలో రామారావు నాలుమాఱులు క్రిందికి దిగి పొంచి చూచి నాలుమాఱులు మేడ మీదికి పోయెను. కాని తులసి వచ్చుజాడ కానఁబడ లేదు. కొండ తనకడకు రానిచో మహమ్మదే కొండకడకు.

వసంతకాలము నందలి తుమ్మెదల వలె పిల్లలెల్లంతయు రొద చేయుచు తిరుగుచుండిరి. రెండేండ్లకా నాడు వారికి పండుగ. వారి కపుడే కనులు తెఱచి నటు లుండెను. అట్టి సమయమున రామా రావు తమ కట్టెదుట కాని పింపఁగనే వారు కొయ్యలవలె బిగిసికొని పోయిరి.

రామా రావు సూటిగా పోయి వంటింటి తలుపు తట్టెను. లోపల గడియ.

'తులసీ!' అని రామా రావు పిలిచెను. ప్రతి వచనము రాలేదు. అతడు చెవి యొగ్గి వినెను. స్నానశాలలో చెంబు చప్పుడగు చుండెను. మఱుఁగు దారిని బోయి యతఁడు గవాక్షము క్రింద నిలువఁబడెను. అతని కనులు నివాత దీపముల వలె నిశ్చలము లాయెను.

'మీకు సిగ్గు లేదా ? పొండావలికిఁ బొండు' అని తులసి యనెను.

'నయన సుఖం కో నివారయతి ? అని వినలేదా ?' అని

రామా రా వనెను.

'విన్నాను విన్నాను - లేకి పనులు. చేయి నలిగిపోవును, లేచి పొండు.'

రామా రావు కదల లేదు. తులసి—'రమణా! ఓ రమణా! ఓహోయి రమణా!' అని అఱచెను. ఈ పిలుపు వినబడగనే పిల్లల దండు వచ్చిపడెను. 'ఓహో నా మీద దండయాత్రకు బలే సైన్యమును తరిఫీదు చేసితివి' అని రామా రా వనెను.

'నే నింట్లోకి పోతాను' అని పద్మనాభుడు వెనుదిరిగి పోయెను.

'ఆ కుఱ్ఱవాని కున్న వివేకము మీకు లేకపోయెను' అని స్నాన శాలనుండి వినఁబడెను. రామా రావు పద్మ నాభుని దెసఁ జూచుచు దాన నొదవిన పరధ్యానముచే గూటిలోని చేతిని గొంచెము లాగు కొనెను. వెంటనే గూఁటి తలుపు గుభాలున పడెను. రామా రావు వాకిటిలోని కరగి పచారు చేయు చుండెను.

తులసి వంటయింటి లోనికిఁ జని తలుపులు దగ్గఱగా వేసి కొనెను. రామా రావు మొగము తలుపుల సందు నుండి తులసికి కనఁబడెను

తులసి చేయునది లేక 'ఏ మయ్యా పద్మా' అని అఱ చెను. పద్మనాభుడు రాక ముందే రామా రావు తలుపుల సందునుండి మొగమును లాగు కొని స్నాన శాలలోని కేఁగి సబ్బుతో మొగమును రుద్దు కొనఁ దొడగెను.

'ఈ తూరి నేను లోనికి రావచ్చు ననుకొందును. ముఖ్య

ముగా మూడవ సారి' అని రామా రా వనెను. 'వీధిలోనికి పోవలెను. రెండేండ్లనుండి మీకు తల్లి విందు. నేడు అలిమందు మీ యమ్మ నగలు మీకడుపులోనికి. నా నగలు మీ ఒడలి మీదికి. వెనుక మీకు ప్యాసయినది యె. మ్మేకాదు; దానిఫలితము నేడు! మీరు తిని ఈ పిల్లలను తిని పింప గలరా, లేక ఆ భారము నా మీద నిడుదురా ?' అని తులసి యనెను. 'ఓశ్ ఇంతే కద ?' అని రామా రావు తలుపు తోసి లోనికి పోఁబోవు చుండగా తులసి వెనుదిరిగి 'చన విచ్చు కొలది నెత్తి కెక్కుట మీ కలవాటు. మీ కెబ్బుతికము లేదు. ఆఁడు దానికడ కెపుడు రాఁ దగునో, యెపుడు రాఁ గూడదో మీకు తెలియదు. మీకే కాదు, ఈ కాలపు యువకులకు—'

'ఆఁ గాఁగు! అపాళముగా వారి యందఱు మీఁద బడకు.'

'ఛీ' ఇటు లనుటకు మీకు సిగ్గు లేదోటు! 'దవ్వుగా పొండు'

'నేడు అస్పృశ్యత లేదు.'

'మీ వంటి వారి యెడ అస్పృశ్యతయు, అదృశ్యతయు, అసంభాష్యతయుఁ గలవు.' రామా రావు కోప సౌందర్యమును, ఎఱుఁగును గాని అది ప్రణయ కోపము. ఆ కైవల్యమునకుఁ గూడ సంకోచముచే అసాకల్యము కద్దు. ఈ సత్యభామను, ఈ నాగకన్యను అత డెన్నఁడును చూచి యుండలేదు. ఇపుడు చూచి ఆఁగఁ జాలక రెండడుగులు ముందరికి వేసెను. 'ఏమిటీ రావణ వ్యాపారము ? ఆడవాళ్ళను ఎత్తుకొని పోవుదురా యేమి ? అని తులసి యనెను. 'నేను నా భార్య కడ కరుగుట నారీ హరణమా? రావణ వ్యాపారమా? అని రామా రా వనెను

'భార్య యనగా?'

'డుభృఞ్' భరణ పోషణయోః = భరింపఁ బడునది పోషింపఁబడునది భార్య.'

'అబ్బో పాండిత్యము! ఈడుడూ ఏమిటి? భరింపఁబడు నది భార్య యగుచో నేను మీ యమ్మ గారికి భార్యను.'

'కాదు తులసీ' అని రామా రావు తులసిని ఎత్తుకొని 'ఇదుగో నేనే భరించితిని' అని యనెను. పంజర బద్ధ మగు క్రొత్త చిలుకవలె తులసి విదిలించుకొని గుంజుకొని తప్పించు కొనెను. ఆమె కాటుక కన్నుల నుండి ఒకానొక కృష్ణ ప్రవ హించుటకు గాను కట్టలను తప్పించుకొను చుండెను.

మరల రామా రా వట్టులే చేయుట కాయత్తుఁ డాయెను. మాటలు మాని తులసి ఆతని చెంప చెటేలునఁ గొట్టెను.

చెంపకాయ తిని రామా రా విటు లనెను —

'ఏశ్! సత్య భామ కాలితోఁదన్నెను! నీవు చేతితో చెంప మీఁద వేసితివి. నీ వసత్యభామవు.'

తులసి మరల చే యెత్తెను. రామా రావు రెండవ చెంప యొగ్గెను. తులసి ఛెళ్లు మనిపించెను. రామా రావు తులసి రెండు చెక్కుల మీఁదను రెండు చుంబన ముద్రలు వేసెను.

'ఇది సిలువ' అని తులసి యనెను.

'రామ రామ! ఎవరేని ఒకచెంప మీఁద వేయుచో రెండవ చెంపగూడ వేయించు కొను మని క్రీస్తు చెప్పెను. నే నటులు చేయుటయే గాక నీవు చేసిన పనికి నీ రెండు చెక్కులు గూడ ముద్దాడితిని' అని రామా రా వనెను.

'క్రీస్తు నుదాహరించు వారు ఇంటిల్లి పాదిని పస్తులో

నుంచరు’ అని తులసి యనెను.

‘ఇంతే కద! ఏదీ ఇం దాక అమ్మ యిచ్చిన పొట్లము?’ అని రామా రా వనెను ఆ పొట్లము విప్పి చూపినచో బాధ కలుగునో కలుగదో చూత మనుకొని తులసి లోనికిఁ జని పొట్లము తెచ్చి విప్పి చూపెను. రామా రావు చూచి నిశ్శంకముగా నిటు లనెను—

‘ఇటు తే. అమ్మ వచ్చు వఱకును ఆతంకము లేదు. నీకు బైబిల్ రా నటు లున్నది; ‘రేపటి సంగతి నీ కెందుకు? రేపటి సంగతి రేపే చూచుకొనఁగలదు’ అని ఏసు అనెను.’

‘దయ్యము తారక ముపదేశించిన దట! నేను చచ్చినను ఈ మంగళసూత్రము గాని, మట్టెలు గాని యీయను. కాని నాతాళి తీసి యిత్తును’ అని తులసి తన పుస్తె పుటుక్కున తెంచి రామా రావు మీఁద పడ వయిచెను.

‘ముదిరిన’ దని అనుకొని రామా రావు బజారునఁ బడెను.

రామా రావు సూటిగా సుందరం--ది-- లాయలిస్టు— ఇంటికి వెళ్లెను. ఇతడు రామా రావుకు బాల్య మిత్రుఁడు. ఈ మిత్రుని కడ పదిరూకలు దొరకక పో వని రామా రా వను కొనెను.

సుందరము మోకాలు దిగని కొల్లాయిగుడ్డ కట్టుకొని కూచుచుండెను. ఎదుట నొక వెదురు బుట్ట పెట్టుకొని దానిలోని వేఱుసెనగ కాయలను ఒలుచుకొని తినుచుండెను. రామా రావును చూచీ చూడక ముందే సుందరము ‘ఈ యిల్లటపు టల్లుఁడు ఆ హిమాలయము నుండి ఆ ఓషధి ప్రస్థము నుండి యెపుడు దిగెను’ అని యనెను. రామా రా వీ మాటలకు మాఱు పలుకక ‘ఈ ఫలాహార మేమిటి? ఈ కద్దరు కొల్లాయి

యేమిటి? సుందరం--ది లాయలిస్ట్ గాంధీ యెపు డాయెను?' అని యనెను.

'ఈ కొల్లాయ కద్దరు కాదురా, దొంగ ఖద్దరు. ఫక్తు మాంఛెస్టరు- కుక్క పిల్ల యింకను కనులు తెఱవ నటు లున్నది. నాయనా! డిప్రెషన్ డిప్రెషన్, అంతయు డిప్రెషన్!'

'ఉద్యోగ మెచటనూ దొరకలేదా?'

'దొరక కేమి, దొరికినది. గంగా దేవిని నమ్ముకొంటిని. 'బీ. యే. నీళ్లు బీ. యే. నీళ్లు. నీళ్ళ కావడి వేసి బిందె అర్ధ ణాకు అమ్ము చుంటిని. వెల తగ్గె నని వేఱుసెనగలు తిను చుంటిని.'

'జయించితివి. నీ కిఁక ఈ లాయలిస్టు-తోఁకతో నేమి పని? ఇఁక నీ పేరు సుందరం—ది—బ్యాంకర్.'

'పాప మేదో ఆశపడి వచ్చినటు లున్నావు. మోఁత వలన సంపాదన మూడణాలు. వేరుశనగల ఖర్చు మూడణాలు. బ్యాంకులో బ్యాలెన్సు నిల్.'

అడుగఁబోయి అడిగించు కొన కున్నచో చాలు ననుకొని సెలవు వేడుకొని యతఁడు సెల వీయక ముందే రామా రావు బయట పడెను. పిమ్మట రోడ్డు మీఁద నడచుచు ఆలోచించి యాలోచించి అతఁడు మూర్తి యింటికిఁ జనెను.

మూర్తియు బి. యే. ఆన్సే. విన్నఁబోయిన మొగముతో నతఁడు వసారాలో కూరుచుండి యుండెను. ఇంటి తలుపులు వేసి యుండెను. ఎదుటికి వచ్చుచున్న రామా రావును గమనింపఁ జాలనంత ఆలోచనలో నతఁడు మునిఁగి తేలు చుండెను. రామా రావే కలుగఁజేసి కొని 'హలో మూర్తీ—ది—కో—అపరేటర్'

అని సంబోధించెను.

మూర్తి మొగ మెత్తి 'సుమధ్యాహ్నము మిస్టర్ ద్వివేదీ—దీ—ఇం టల్లుఁడూ' అని సమ్మానించెను.

'ఇం టల్లుఁడు కాక వాకిటల్లుఁ డొకఁడా?'

'య్యెస్! ఉండునురా. 'ఉండును' ఉన్నాఁడురా. ఉదాహరణము తీసికొందము. నేనే రా. తెలియునా? అందఱును నీ వంటివా రుందురా? డిప్రెషన్! ఇపుడు సింహాసనము మీద చక్రవర్తిని తీసివేసి డిప్రెషన్ కూర్చున్నది. బస్తా రెండు రూపాయల కమ్మించుచున్నది. తెలిసెనా? ఈ డిప్రెషన్‌లో అన్నియు నుండును. ఇం టల్లుఁడు, ఊ రల్లుఁడు, విడాకు లల్లుఁడు, వాకిటల్లుఁడు. ఉద్యోగము దొరకనంత వఱకు నేను వాకిటల్లుఁడను' తెలిసెనా? 'నా పనియే యింతవఱకు బాగుగా నున్నటు లున్నది. అని తలచి రామా రావు తనవంటి యీ వాకిలల్లునకు సానుభూతి చూపి రాజ వీధిలోని కడు గిడెను.

అపరాహ్ణ సూర్యుఁడు అతని తలను, క్షుత్సూర్యుఁ డతని యుదరమును మలమల మాడ్చెను. అపుడు తులసి అతని తలపు లోనికి వచ్చెను. ఇంటికిఁ బరుగిడ మొద లిడెను.

తులసి పిల్లలకు అన్నము పెట్టి వారితో మాట లాడుచు గిన్నెలు తోమి ప్రొయి యలికి కొంగు పఱచి తమ యన్నమునకు గింజ లెపుడు వచ్చునా యని నిరీక్షించు చుండెను.

తులసిమీఁద బుద్ధి పాఱి యింటికి సగము దూరమున నున్న రామా రావు హఠాత్తుగా ఆగి — 'పైసా లేనిచో పరస్త్రీ విముఖుఁ డను మాట జూటా. పైసా లేనిచో స్వపరస్త్రీ విముఖుఁడు' అని యనుకొని వెను దిరిగెను.

అతని మిత్రులలో మిగిలిన వాఁ డొక శర్మ. అతఁడు యమ్మే. బి. యెల్. రామా రావు శర్మ యింటి సందు మొగకు వెళ్ళి చూచెను. అచట ఒక పిట్ట యేని కాన రాలేదు. ప్లీడర్ల యిండ్లు క ల్లంగళ్ళు కదా! ఈ సం దింత యరణ్యముగా నున్న దేమి ?' అని యతఁ డను కొని కొంచె మాలో చించెను. అత నికి సమాధానము స్ఫురించెను.

'ఓహో ఇది కోర్టువేళ' అని అతఁడు ఇంటికిఁ బోవ నిశ్చయించుకొను చుండఁగా శర్మ వాకిటలోనికి వచ్చి బెదిరి బెదిరి చూచెను. శర్మకు చత్వారమే కాక రెండు మూన్నాళ్ళ నుండి అతనికిఁ దెలియ కుండ తిమిర రోగము ప్రవేశించెను. అతని కంటిజోడు ఆ కారణమున మొన్ననే పగిలి పోయెను. దానితో నతఁడు జోడు-అలవాటు మానివేయఁ దలచెను. జోటి పని మనస్సు చేతనే చేయించి సమాధాన పడుచుండెను.

శర్మ తన సందు రెండు చివరలును పరికించి, 'భేష్ ఎవ రును లేరు' అని మనస్సును శాంత పఱిచికొనెను. పిమ్మట వడిగాఁ జని గోడకుఁ గట్టియున్న 'యెమ్మే బి యెల్' బల్లను జూచెను. అది తిన్నగా కానరాలేదు. 'ఇది యొక సౌభాగ్యము కాబోలు, షార్ట్‌సైట్ కూడ సంతరించి నటు లున్నది' అని యనుకొని దేవులాడి దేవులాడి బల్లను పట్టుకొని బలవంతముగా లాగి యింటిలోనికిఁ దీసి కొనిపోయి భద్రముగా దాఁచి ఒక టావు కాకితము తీసికొని వ్రాసి కొనుచుఁ గూరుచుండెను. దారిద్ర్య దేవత యొక్క వికట హస్తమును విస్పష్టముగాఁ జూచి రామా రావు సానుభూతి చూపుటకు శర్మ యింటిలోనికిఁ జని—'శర్మా ది నిహిలిస్ట్, దేవుఁడు ఉన్నాఁ డని వ్రాయు

చుండెనా?' అని యనెను.

'ఓహో! అకాలపు ఎండ! ఇంటి యల్లుండ! నీ కెందు కీ కాండ? దేవుఁ డెచట నున్నాఁడురా? ఉన్న దొక్క డిప్రెషన్! యూ-పీ-లో కలెక్టరు ధొరవారు గ్రాజు యేట్లకు పసి యెకరాల వంతున భూదానము చేయుచున్నా రని విని అప్లికేషను వ్రాసి కొను చున్నాను. దీని రిజస్టరుకుఁగాను నీ వొక పావులా దానము చేసి కొన వచ్చును' అని శర్మ యనెను

'అదియే యున్నచో నా కీ పూట నిర్విచారముగా గడచి పోయెడిదే !' అని లోపల నను కొని రామా రావు— 'ఆ భూ దానము ఆంధ్రులకు గాదు, యు—పీ —లోఁగూడ ఒక జిల్లా వారికే. కావున నా దానము అప్రశస్త దానము' అని మఱి యచట నుండక ఆ డిప్రెషన్ బజారునుండి అసలు బజారునఁ బడి ప్రిన్సిపల్ అంబు జమ్మగారి యింటికిఁ జనెను.

'ఇఁక ఈ నాఁడు మా కెవరికిని అన్నప్రాప్తి లేదు' అని యింటికడ తులసి యను కొనెను. వెంటనే మూడు గంటలు మ్రోఁగెను. 'నిక్కము, నిక్కము' అని తులసి యను కొని బోషాణము తలుపులు తెఱచి లోపలికి దిగి వెతకి వెతకి పెద్ద రాగి చెం బొకటి తీసెను. దానికి చింతపండు పులుసు పట్టించి తోముచుఁ గూరు చుండెను.

అచట రామా రావు అంబుజమ్మగారి దర్శన మాచరించి 'నేను ద్వివేదుల రామా రావును' అని మనవి చేసి కొని యెను.

'ఆఁహాఁ. మీరు మని షేమియు తలక్రిందుగా లేరే ? అప్లికేషనులోని 'రామారాయ్ ద్వివేది బి. యే. (ఆనర్స్) మీ

రేనా ?' అని అంబుజమ్మ యనెను. రామా రావు పెదవి కఱచుకొని 'చిత్తము' అనెను.

'మీ రింత యాలస్యము చేసితి రేమి? ఆ పోస్టుకు రెండు వందల అప్లికేషను లున్నవి. నూట యేఁబది మంది బి. యేలు నలుబది రూపాయలకు వత్తు మని తమ యుదారతను వెల్లడించిరి. యేమ్మేల యుదారతగూడ చూడఁదలఁచి ఆ పోస్టును ఇంత వఱకును ఎవరికిని ఈయకుండ తొక్కిపట్టి యుంచితిని. తమ రేమాత్రము Sacrifice చేయగలరో చూతము' అని అంబుజమ్మ యనెను.

రామా రావు డిల్లపోయెను. వెంటనే సహజస్థితిని సంగ్రహించుకొని 'అడవారిని కన్సల్‌ట్ చేసి మనవిచేయుదును' అని యనెను.

'మంచిది. అమ్మగారితో కాదు, భార్యగారితో నని యనుకొందును. వారికి మగల కన్న ఉదారత మెండు' అని అంబుజమ్మ యనెను. ఈ మాటలకు రామా రావు బెంగ పడెను. అతని దురవస్థ అంబుజమ్మ గ్రహించి 'మిస్టర్ ద్వివేదీ' తొందర లేదు. మీరు మీ భార్యతో ఆలోచించి మరల రండు' అని యనెను. రామా రా వా మాటచే పద్మవ్యూహము నుండి తప్పించుకొనినటులు సంతసించి సెలవు తీసికొని లేచునంతలో వాకిటిలో నుండి—'భిక్షాం దేహి' అని ఖంగున వినఁబడెను.

తొందర తొందరగా రామా రావును, అతని కన్న తొందరగా అంబుజమ్మయు వాకిటిలోనికి వచ్చిరి.

డిప్రెషన్--చెంబు

మిసెస్. రామా రాయ్ ద్వివేది.

"బి. యే. ఆనర్స్"

అని తారుతో వ్రాసిన రాగిచెంబు పట్టుకొని తులసి వారి యెదుట నిటారుగా నిలిచి యుండెను. ఆమె వెనువెనుక సుందరి, రమణి, పద్మనాభుఁడుః అందఱును గలసి యిటు లనిరిః 'భిక్షాం దేహి'

# బాధ్యత

## శ్రీ పంతుల శ్రీరామ శాస్త్రి

జననము 15—10—1922 సింహాచలములో. బెంగాల్ నాగపూర్ రైల్వేలో గుమాస్తాగాను, రాయగడ్ గవర్నమెంటు హైస్కూలులో (1945 – 46) ఉపాధ్యాయుడు గాను పని చేసినాడు. B. Sc. B ED. ఉపాధ్యాయ వృత్తి. దేశయాత్ర లోను సంగీతము లోను అభిమానము.

"స్వైర విహారి" అను పేరుతో పద్యములు ప్రకటించినాడు. 1945 నుండి కథారచన ప్రారంభించి 60 పైగా కథలు, 15 నాటికలు వ్రాసినాడు. 1949 లో రేడియో నాటికల పోటీలో బహుమానము పొందినాడు. ప్రపంచ కథానికల పోటీ దృష్టితో "ఆంధ్ర వార పత్రిక" ఎన్నిక చేసిన వానిలో ఈయన కథ గలదు. "కుటుంబము" (కథా సంపుటి – 1949) "శ్రీరామ శాస్త్రి కథలు" (1955) పుస్తకరూపమున వచ్చినవి.

---

౧

సిరిపురం
**1-2-1951.**

మిత్రుడు ధర్మారావుకి.

మనం పరస్పరం ఉత్తరాలు రాసుకొని ఒక పుష్కరం

పైగా కాలం గడిచింది. మనం చదువుకొనే రోజుల్లో ఎవరైనా జ్యోతిష్కుడు మనం ఇంత దగ్గరలో ఉండి ఒకరి నొకరు చూచుకోకుండా, ఉత్తర ప్రత్యుత్తరాలు లేకుండా ఉంటా మంటే నమ్మలేక పోయేవాళ్ళం. కాని, మనం ఎంత ఊహించీ, నమ్మలేని సంగతులే అతి సామాన్యంగా జరిగిపోతూ ఉంటాయి లోకంలో !

అసలు ఈ ఉత్తరం రాయడానికి బదులు నే నే బయలుదేరి రావా లను కొన్నాను. కాని, ఇక్కడ ఇంటిపరిస్థితులు అనుకూలంగా లేవు. కాక పోయినా నేను అక్కడకు రావడం కంటే నువ్వు ఇక్కడకే రావడం చాలా బా గుంటుంది. మీ బాంకుకి ఆదివారం సెలవు ఉంటుంది కదా, మరొక రెండు మూడు రోజులు సెలవు పెట్టి వస్తే చాలును. నేను రాకుండా నిన్ను ర మ్మనడము మర్యాద లక్షణం కా దని నాకు తెలుసును. అయినా మన స్నేహాన్ని పురస్కరించుకొని, ఇలా రాసినందుకు అన్యథా భావించ వని నమ్ముతున్నాను.

ముఖ్యా మయిన అంశంలో నీ సలహా, నీ పలుకుబడీ, అత్యావసరంగా కావాలి. ఇందులో నీకు పెద్ద కష్టం ఏమీ ఉండబోదు. తప్పక రావలసిం దని పదేపదే వ్రాయడం అనవసరం. అన్ని సంగతులూ ముఖస్థంగా మాట్లాడు కొందాము.

ఈ వచ్చే ఆదివారంనాడే వీ లుంటే బయలుదేర గోర్తాను. బయలు దేరేముందు ఉత్తరం రాస్తే ఇక్కడ స్టేషనుకు నేను బండి పంపిస్తాను, వీ లుంటే నేనే వస్తాను.

వచ్చేటప్పుడు కారామసాలా కొంచెం తీసుకొని రావలెను.

ఈ ఆదివారంనాడే తప్పక బయలు దేరవలెను. ఇంతే సంగతులు

కా. కృష్ణ శర్మ.

ఫిబ్రవరి 3, 1951

నిన్నరాత్రి వస్తుందేమో ననిపించిన జ్వరం మరి రాలేదు. ఉదయం లేచేసరికి మామూలుగానే ఉంది. భోజనంకూడా సరిగానే చెయ్యగలిగాను.

ఆఫీసులో ఏమీ విశేషాలు లేవు. నరసింహం గత నెలలో పుచ్చుకొన్న పదిహేనులోనూ అయిదు బాకీ పెట్టి, పది ఇచ్చేశాడు. అయినా నయమే. అడక్కుండా ఇచ్చేడు.

కామేశ్వరరావు వెనుకటి ముప్ఫైరెండు తీర్చకపోడం అటుండగా, మరొక ఇరవై యిమ్మని అడిగేడు. అంతా కలిపి మళ్ళీ నెలలో తీర్చేస్తానంటాడు. ఈ నెలలో లేని అవకాశం మళ్ళీ నెలలో ఎలా వస్తుందో ఊహించుకోకూడదా? అయినా గట్టిగా చెప్పలేకపోయేను... నా దగ్గర కూడా ఏమీ లేదని. ఏవో అనుకోని ఖర్చులు వచ్చేయనీ చెప్పాను. ఈమారుగాని అడిగితే, లోగడ తీసుకొన్నది ఇమ్మని నిష్కర్షగా ముందు చెప్పాలి.

ఇవాళ ఉదయం చిత్రమయిన ఉత్తరం వచ్చింది. కా. కృష్ణ శర్మ ఇన్ని సంవత్సరాల తరువాత రాశాడు. అందులోనూ ఏదో ముఖ్యమయిన విషయంలో నా సలహా, పలుకుబడీ కావాలట! అంత, నా అవసరం ఉన్నవాడు ఆ విషయం ఏమిటో స్పష్టంగా రాయకూడదా? అంత ఉత్తరంలో రాయకూడదనిది ఏమయి ఉంటుంది? ఇదేదో అనవసరపు గొడవలా గుంది. తనకు

రావడానికి కుదర దటః అంటే ఇవతలివాళ్ళకు మ రేమీ పనీ పాటూ లే దని కాబోలు. అసలు సంగ తేమిటో స్పష్టంగా రాస్తే అప్పుడు రావడం రాకపోడం మాట ఆలోచించవచ్చు నని ఉత్తరం రాసి పడెయ్యాలి. ఉత్తరమే రాయకపోతే, మళ్ళీ వాడే రాస్తా డేమో; ఇన్నాళ్ళకు వాడు రాయక రాయక రాస్తే జవాబు రాయకపోతే బా.గుంటుందా? ఉత్తరం మాత్రం రేపు రాసి పడెయ్యాలి.

ఫిబ్రవరి 4, 1951.

ఆదివారం. కొంచెం పని ఉంది గాని, బాంకుకి వెళ్ళ లేదు. ఉదయం సుబ్రహ్మణ్యం వచ్చేడు. ఏవేవో చాలా కబుర్లు చెప్పేడు; వాళ్ళమ్మాయి కాపురం నిలబడేట్టు కనబడ లేదట. పెళ్లయేవరకూ ఈ సంబంధం ఎలా గయినా అయితే చాలు ననుకోడం, వాళ్ళు చెప్పినషరతు లన్నిటికీ ఒప్పుకోడం తరువాత అన్నమాట నిలబెట్టుకోలేక, వాళ్ళు పట్టు పడితే, దుర్మార్గులు, హృదయం లేనివాళ్లు అంటూ ఇక్కడా అక్కడా చెప్పుకోడం, ఏం లాభం? మొదటే నాలుగు సంగతులూ నిష్కర్షగా అనుకొని, శక్తి ఉంటేనే ఒప్పుకోకూడదా? ఏదో తరువాత అదే సర్దుకుపోక పోతుందా అని ముందు కళ్లు మూసుకొన్నందువల్లనే ఇటువంటి అనర్థాలు వస్తాయి. ఇప్పు డయినా తన మంచితనం, ఇబ్బందులు పడుతూండడం మొద లయినవాటిమీద ఉన్న దృష్టి కూతురు సుఖంమీద ఉన్నట్లు లేదు.

క్షవరం చేయించుకోడం మూలాన మధ్యాహ్నం భోజనం ఆలస్య మయింది. భోజనం అయేసరికి పన్నెం డయింది. తరువాత పత్రిక చదవడం, నిద్ర. మధ్యాహ్నం కాఫీ తరువాత

Priestly రాసిన Three Time Plays లో మొదటిది The Dangerous Corner పూర్తి చేశాను. నాటకం బాగానే ఉంది. కాని ఒకటే వింతగా తోచింది. నాటకంలోని అందరు మనుష్యుల నడుమనూ ఏవేవో అసందర్భ మయిన సంబంధాలే. కొన్ని వ్యక్త మయినవీ, కొన్ని అవ్యక్త మయినవీ బహుశా, let sleeping dogs lie అన్న అభిప్రాయాన్ని బాగా నాటేలాగ చేసేందుకు ఇన్ని మెలతలు పెట్టి ఉంటాడు. ఏ మయినా నాటకం, రచయిత పీఠికలో చెప్పినట్టు, కాలానికి సంబంధించిన వైచిత్రం దృష్ట్యానే కాకుండా చాలా బా గుంది! తక్కిన రెండు నాటకాల్లో ఏది ఆరంభించడమా అని ఆలోచిస్తూ ఉండగా విశ్వనాథమూ, నారాయణ మూర్తీ నరసింహం వచ్చారు. అరగంట బాతాఖానీ, తర్వాత షికారు. పార్కులో తెలుగు వార్త లయే వరకూ కూర్చున్నాం. ఇంటికి వచ్చే దారిలో రెండు తువ్వాళ్ళు కొన్నాను. ఒక్కొక్కటి రూపాయి ముచ్చవక. ఖరీదు ఎక్కువయినా బాగానే ఉన్నాయి. పంచలుకూడా కొనుక్కోవాలి. కాని, ఈ నెలలో కుదరదు. బుచ్చిబాబుకి పంపిన మనియార్డరు రసీదు రేపు రావాలి. కృష్ణ శర్మ ఉత్తరానికి జవాబు రాయలేదు. రేపు తప్పకుండా రాసి పడెయ్యాలి.

Priestly నాటకాల్లో మధ్యది వెనక్కి ఉంచి, చివరది I have Been Here Before చదవడం మొదలు పెట్టేను. చాలా బాగుంది. Dangerous Corner కంటెకూడా చదవాలనిపించే ట్టుంది. ఇప్పుడు పదిగంటలవరకూ చదివితే మొదటి అంకం పూర్తి కావచ్చును.

* *

సిరిపురం,
7-2-51.

మిత్రుడు ధర్మా రావుకి.

నీ నమస్కారాలు నీకు మళ్ళీ అందజేస్తున్నాను. నే నను కొన్నట్టుగానే అయింది. నీకు నా ఉత్తరంవల్ల రావలసినంత కోపమూ వచ్చింది. అయితే అసలే ఉత్తరం రాయకపోవా లన్నంత ఆగ్రహము రాకపోయినందుకు సంతోషమే.

ఇక, అసలు సంగతి. నేను నీ కేమీ పెద్ద కష్ట మయిన పని చెప్ప లేదు. ఒక సెలవురోజున బయలుదేరి ర మ్మన్నాను. ఇక్కడకు వచ్చిన తరువాత నీకు అంత చికాగ్గా ఉంటే మర్నాడే బయలుదేరి పోవచ్చును. ఎప్పుడూ ఉన్న బాంకే కదా! ఒకటి రెండు రోజులు కాస్త మార్పుగా ఉంటుం దనేనా నువ్వు రావచ్చును.

ఇంతకంటె నేను విశేషించి రాయవలసింది లేదు. నువ్వు ఈ ఆది వారంనాడు తప్పకుండా వస్తా వని నమ్ముతున్నాను. రైలుకి బండీ తీసుకొని వస్తున్నాను. లేకపోతే నేనే బయలుదేరి వచ్చి, నిన్ను తీసుకొని రావలసి ఉంటుంది.

ఉదయం బండి ఇక్కడకు పదకొండు గంటలకి వస్తుంది. అందులో రావడమే సదుపాయము. మరి ఉత్తరాలకి వ్యవధి లేదు. ఇంతే సంగతులు.

కా. కృష్ణ శర్మ.

ఫిబ్రవరి, 11 1951,
మకాం: సిరిపురం.

ఉదయం అరుగంటల రయిల్లో బయలుదేరి ఇక్కడకు వచ్చాను. స్టేషనుకి శర్మ బండి తీసుకొని వచ్చాడు.

బండి ప్రయాణం సుమారు గంటసేపూ శర్మ తన మునసబు గిరి గురించి, ఊళ్ళో పార్టీలగురించీ చెప్పాడు. అందులోను తన పార్టీ అన్ని విషయాల్లోను ముక్కుకు సూటిగా పోతున్నప్పటికీ, రెండవ పార్టీవాళ్ళు ఎంతకీ సమాధానానికి రాక, కాలికి వేస్తే మెడకీ మెడకి వేస్తే కాలికీ వేస్తూ వృథాగా కక్షలు పెంచడమే పనిగా పెట్టుకొన్నారట. అవతలి పార్టీవాళ్ళుకూడా సరిగా ఇలాగే చేస్తారేమో. ఎవరిపని వాళ్లు చేసుకొని, హాయిగా ఉండరాదూ? ఒకవేళ ఎవడయినా అటువంటి వాడున్నా ఉండ నియ్యరు. ఏదో ఒక పార్టీలో చేరి తీరవలసిందే. లేకుంటే రెంటికీ విరోధి కావాలి.

కృష్ణ శర్మ బలంగానే ఉన్నాడు. కాని జుట్టు బట్ట గురించి ఏమాత్రమూ శ్రద్ధ ఉన్నట్టు లేదు. తలకూడా నాకంటె బాగా నెరిసిపోయింది. కట్టుకొన్న పంచ ఖరీదయినదే. చొక్కాకి గుండీలు లేవు, పైమీద తువాలు. మనిషిలో పల్లెటూరి కళ బాగా వచ్చింది.

ముందు తమ యింటికి తీసుకొని వెళ్ళాడు. ఇల్లు చాలా పెద్దదే గాని, అంతా బూజు పట్టినట్టుంది. గోడలకు సున్నాలు లేవు. ఇంటికిముందే పశువుల పాకలు. పరిశుభ్రత అనేది ఏమిటో తెలియని ప్రాంత మని స్పష్టంగా కనిపిస్తుంది. ముందు తమయింట్లో కాఫీ ఇచ్చారు. ఆ ముసలావిడ వాళ్ళ మేనత్తట.

ఎంతో అప్యాయంగా నిత్యమూ వస్తూ పోతున్న మనిషిని పలక రించినట్లుగా పలకరించింది.

కాఫీ పెద్ద వెండి గిన్నెతో ఇచ్చారు. అంత ఎక్కువగా అక్కర లేదన బోతూండగా అంతకంటె పెద్ద దయిన తన గిన్నెలోని కాఫీ చూపించి మాకంటె తక్కువగానె ఇచ్చారు లే. అయినా భోజనానికి గంట, గంటన్నర వ్యవధి ఉంది కదా అన్నాను. అప్పటికి పన్నెండు కా వచ్చింది. అంటే మామూ లుగా మధ్యాహ్న టిఫిను వేళకు పగటి భోజన మన్న మాట!

తాతలనాటి పెద్ద పడక కుర్చీలో (దాని పేముఅల్లిక చిరిగి పోతే బల్లలు వేయించినది) నన్ను కూర్చో మని తాను పక్క నున్న బల్లమంచంమీద కూర్చున్నాడు. ఇక, తను చెప్పదలచిన భోగట్టా అరంభిస్తాడు కాబోలు ననుకొంటూ ఉండగా, ఉం డిప్పుడే వస్తా నని ఎక్కడకో వెళ్ళిపోయేడు. ఆ వెళ్ళిపోవడం మరొక గంటవరకూ పునర్దర్శనం లేదు. ఈ మనిషి ఒక్కడూ ఇక్కడ ఏం చేస్తాడో అన్న అలోచన లేదు. కాలక్షేపానికి పుస్తక మయినా పడేసిపోతే!

వేళ తప్పిన భోజనం. తరువాత అలవాటు లే దంటున్నా బలవంతగా నల్లుల మంచం మీద పడక. మాటలాడుతూనే (అయిదు నిమిషాల్లోనే) వాడు గుర్రు పెట్టి నిద్రకు దొరకున్నాడు. మంచం మీద మరి లాభం లే దని కుర్చీలో కూర్చున్నాను. అక్కడా నల్లులు తగుమాత్రంగా ఉన్నాయి—అయినా ఏమిటి చెయ్యడమో తోచకుండా, వచ్చిన పని ఏమిటో ఇద మిద్ద మని తేలకుండా కూర్చోడం చాలా కష్ట మనిపించింది. వాడు నిద్ర పోయినది అరగంట సేపే అయినా ఎన్నో గంట లయినంత

బాధగా తోచింది. సాయంత్రం రైలుకే బయలుదేరి పోవాలని పించింది.

వాడు నిద్ర లేచిన తరువాత కార్యక్రమం ఒక దారిని పడిన ట్టయింది. మళ్ళీ కాఫీ తాగినతరువాత "ఒక మారలాగా మా చెల్లెలుగారింటికి వెళ్ళాము" అన్నాడు. దారిలో అతను ఉత్తరం రాయడానికి ముఖ్యకారణం ఆమె భర్త పోయిన తరువాత కొద్దికాలం తమ యింట్లోనే కలిసి ఉండినా, అంతకంటె ఇదే మేలని ఆవిడ వేరే ఇల్లు కట్టించుకొని, తనూ, కూతురూ అందులో ఉంటున్నారనీ చెప్పాడు. అప్పటికీ నన్ను బలవంతంగా రప్పించిన కారణం ఏమో ఊహ కందలేదు.

ఆవిడ మనిషిని చూస్తే వితంతువు అనుకోందికి ఏమీ అవకాశం కనబడదు. వయసు పాతికా సలభై మధ్యను ఎంతైనా కావచ్చును. ఆవిడకూడా బాగా తెలిసిన మనిషిని పలకరించినట్లుగానే పలకరించింది; తరువాత కొంతసేపు అన్నా చెల్లెళ్ళ మధ్య వాగ్వాదం, నన్ను తిన్నగా తమ యింటికి తీసుకరావలసిందని ఆమె, ఎక్కడయితే నేమి, ఈ రాత్రికికూడా మా ఇంట్లో ఉండి, రేపు మీ యింటికి వస్తాడని అతనూ, ఇద్దరూ కలిసి మొత్తానికి నేను సాయంత్రమే బయలుదేరా లనుకున్నాననే మాటను చెప్పనియ్యకుండా చేసేరు. వాళ్ళ మాటలనుబట్టి చూస్తే వారం పదిరోజులు అక్కడ ఉంచే ఉద్దేశం కనిపిస్తుంది.

ఈ ఇల్లు ఒక్కటీ ఈ ఊళ్ళో ఎక్కడనుండో తెచ్చి పెట్టినట్టనిపిస్తుంది. ఇల్లే కాదు, ఇంటిలో సామాను, అలంకరణ అంతా మామూలుగా పట్నవాసాలలోని అధునాతన మయిన ఇళ్ళల్లో ఉన్నట్టే ఉంది. గదిమధ్య టేబిలు, నాలుగు

వంకలా నాలుగు కుర్చీలు, ఒక ప్రక్క చిన్న టేబిలుమీద రేడియో, కిటికీలోంచి పువ్వుల మొక్కలు కనిపిస్తున్నాయి. కాఫీ, ఫలహారమూ కూడా వెూతాదుగానే సాగాయి. వాళ్లమ్మాయి-పద్దెనిమిదేళ్లుండవచ్చును- పేరు లీల. ఇద్దరూ పక్క పక్కను కూర్చుంటే తల్లీ కూతురూ అన్నట్టు కని పించలేదు; అక్క చెల్లెళ్ళలా గున్నారు.

ఆవిడ అనవసరపు ఉపోద్ఘాతం అట్టే లేకుండా అసలు విషయానికి వచ్చింది. వాళ్ళమ్మాయిని మా మేనల్లుడు బుచ్చిబాబు కిచ్చి పెళ్లి చేసే వుద్దేశ మట. నాకు నిజంగా కోపం వచ్చింది. ఆవిడ నా మనసులో మాట గ్రహించినట్టు 'పెళ్ళి మాటలికి, అందులోనూ పిల్లను ఇస్తా మని చెప్పటానికి ఇది పద్ధతి కాదు. మనమే అక్కడకు వెళ్ళి చెప్తా మని అన్నాను. మా అన్నయ్యే కదలడానికి బద్ధకించి ఇలా మిమ్మల్ని రప్పించాడ' అంది.

ఫలహారం తరువాత శర్మ ఏవో పని ఉం దని ఇప్పుడే వస్తా నని వెళ్ళేడు. నా బస యీ యింటికి మారిపోయినట్టే. ఆవిడ మేడమీదికి తీసుకొనివెళ్ళి ''మీరు మధ్యాహ్నం విశ్ర మించినట్లు లేదు. కాస్త విశ్రమించండి. అన్నయ్య మళ్ళీ వచ్చే సరికి ఏ సాయంత్రం అవుతుందో. ఇప్పుడే వస్తా నంటాడు. ఎంతకీ మరి అయిపు ఉండదు. ఈ వెధవ మునసబుగిరీ వాడి ప్రాణాలు తింటూంది!'' అంది. గదిలో మంచం, టేబిలూ కుర్చీలు అన్నీ చక్కగా అమర్చి ఉన్నాయి. గోడకి ఉన్న అద్దాల తలుపుల అలమారలో పుస్తకా లున్నాయి. ఇంగ్లీషు పుస్తకా లన్నీ పాతవే. కాని, తెలుగు

పుస్తకాలు మాత్రం కొత్తవికూడా ఉన్నాయి. ఒక అర అంతా పత్రికలు, దేనిసంచికలు దానికి వరుసగా సర్ది ఉన్నాయి.

ఏదో పత్రిక తిరగవేస్తూ ఉంటే నిద్రవచ్చింది. క్రింద నున్న రేడియోకి సంబంధించిన లౌడ్స్పీక రొకటి గదిలో ఉం దన్న సంగతి అంతకుమునుపు గుర్తించ లేదు. వాళ్ళు నాకు మెలకువ తెప్పించడానికే పెద్ద ధ్వనితో మోగించి ఉంటారు. అందులోనూ వచ్చిన ప్రోగ్రాము నాగ స్వరం. మేడ మీదనే మొగం కడుక్కొందికి ఏర్పాటు చేయబడి ఉంది. ఇన్నిమార్లు కాఫీ తాగడం అలవాటు లే దంటున్నా ఆమె వినకుండా 'మా అన్నయ్యగారింటి లాగ పెద్ద గిన్నెలతో ఇవ్వటం లేదు. చిన్న కప్పు కాఫీ ఎప్పుడు తాగినా తాగవచ్చును' అంటూ తాగించింది.

నేను చెప్పవలసినమాట ఏదో స్పష్టంగానే చెప్పాను. వాళ్ళ తల్లి దండ్రులు ఉన్నారు. కుర్రవాడు కూడా బి. యస్ సి. చదువుతున్నాడు. మీరు ఇచ్చినా, వాళ్ళు చేసుకొన్నా మధ్య నా అంగీకారంలో ఏ ముంది అని. కానీ, ఆమెకు ఏమీ నమ్మకం కలిగినట్టు లేదు. "మీ రెలా చెప్తే వా రలా చేస్తా రట. పోనీ, మీవంతు మీరు ఇష్టపడ్డా మనండి. తక్కినది మా అన్నయ్య చూసుకొంటాడు" అంది. తరువాత మాటల్లో శర్మకూడా 'అ దేమిటోయ్ అలా అంటావు? కుర్రవాడు సాక్షాత్తు నీకు మేనల్లుడు. మరి నిన్ను కాకపోతే మ రెవరిని అడగ మంటావు? మరి మా లీల నాకు మేనకోడలే కదా? నేనే నాపూచీ అని పూనుకొని తిరగడం లేదా? మా లీలకు నేను వట్టి నోటిమాటతప్ప మ రేమీ ఒరగబెట్టినది లేదు. అసలు కుర్రవాని చదువు కయ్యే ఖ ర్చంతా నువ్వే భరిస్తూన్నా వట కదా?

ఇటువంటి ధోరణి మనుష్యులతో ఎంత స్పష్టంగా చెప్పి లాభం లేదు. అసలే చెప్పకుండా ఊరుకొంటే తమమాటని అంగీకరించి నట్టే లెక్క కడతారు. తమకు సబబుగా తోచినది ఇతరులకు మరొకలాగ తోచడానికి వీ ల్లేదని వాళ్ళ నమ్మకం. ఏ మయినా రేపు బయలుదేరేలోగా, శర్మతో, లాభం లేదు, ఆవిడతోనే స్పష్టంగా చెప్పెయ్యాలి; చదువుకి సాయం చేసి నంత మాత్రాన వాళ్ళ యిష్టానిష్టాల ప్రసక్తి లేకుండా పెళ్ళి సంబంధం నిశ్చయించే అధికారం లే దని, ఉన్నా వినియోగించే ఇష్టం ఎంతమాత్రం లే దనీ, వివాహం అనేది తల్లిదండ్రులూ-అంతకంటే ముఖ్యంగా వరుడూ తమ స్వంతబాధ్యతలమీద నిర్ణయించుకోవలసిన వ్యవహారం అనీ — వాళ్ళు ఏవిధంగా అర్థం చేసు కొన్నా చెప్పవలసిన మాటలు నాలుగూ స్పష్టంగా చెప్పేస్తే, మరి తరువాత మొగమాట ముంచ వలసిన పరిస్థితి రాదు. రేపు ఉదయం రైలుకే వీ లుంటే బయలు దేరాలి; తప్పితే సాయంత్రం బండికిమాత్రం తప్పకూడదు.

బెనారెస్, 17-2-51.

ప్రియమైన మామయ్యకు :

నమస్కారములు, ఇక్కడ నేను క్షేమంగా ఉన్నాను.

నీవు వ్రాసిన ఉత్తరం అందింది. మాకు మార్చి ఆఖరులో సెలవు లిస్తారు. అప్పుడు నువ్వు వ్రాసిన ప్రకారం సిరిపురం వెళ్ళడానికి నా కేమీ అభ్యంతరం లేదు. అంతకుమించి నే నేమీ హామీ ఇవ్వలేను నా పెళ్ళిగురించి. లోగడ మా అమ్మా నాన్నా తొందర చేసినప్పటికీ నువ్వు నాతో కలిసి ముందు నా చదువు పూర్తి కావా లనీ, నేను నా కాళ్ళమీద నిలబడే సావకాశం

కలగా లనీ అంటూండే వాడవు. అటువంటిది స్వయంగా నువ్వు ఈ విషయం రాసే వంటే, అందులోను ఆ ఊరు వెళ్ళి అక్కడ ఉండి మరీ ఉత్తరం రాసే వంటే- తప్పకుండా ఆలోచించదగిన పరిస్థితే అయి ఉంటుంది. అయితే ముందుగా అక్కడకు నీ మాట ప్రకారం వెళ్ళాను. అక్కడనుండి నీ దగ్గరకు వచ్చి తరువాత మా వూరు వెళ్ళాను.

మా మిత్రుడు రాజశేఖరం ఈ సెలవులలో అజంతా, ఎల్లోరా మొద లయినవి తిరిగి వద్దా మంటున్నాడు. నా ఖర్చు లన్నీ తానే భరిస్తా నంటున్నాడు గాని కొంచ మయినా మనది అని లేకుండా ఉంటే బాగుండ దనిపిస్తుంది. ఇప్పుడు మట్టుకు నేను వస్తాను, రాను అని ఏమీ అతనితో నిర్ధారణ గా చెప్పలేదు. నువ్వు ఇష్టపడితే, ఒక్క ఇష్టమే కాదు; ఏ మయినా పంపిస్తా నంటే, వెళ్తాను. లేదా తిన్నగా యింటికి వచ్చేస్తాను. ఈ ప్రయాణానికి మామూలు దానికి అదనంగా యాభై రూపాయలు ఉంటే చాలు ననుకుంటాను.

మొన్ననే ఇంటిదగ్గరనుండి చెల్లమ్మ ఉత్తరం రాసింది. అంతా క్షేమం. అమ్మకు యింకా పురుడు రాలే దట. అక్కయ్యను పండుగకు తీసుకొని వచ్చి యీ ఫష్టుతారీఖునే దిగబెట్టేసే రట. తమ్ముడు రామం - బొమ్మలు చూసి, మునిసిపల్ చైయిర్మన్ గారు స్కాలర్‌షిప్పు ఏర్పాటు చేయిస్తా నన్నా డట. ఈ సంగతు లన్నీ నీకూ ఉత్తరం వచ్చి ఉంటుం దేమో. మొన్న పండగకి నువ వస్తా వేమో నని చాలా చూసే రట. పోనీ మా వేసవి సెలవులలో వస్తే నాలుగు రోజులు హాయిగా చదరంగం ఆడుకో వచ్చును. నీ ఉత్తరం కోసం ఎదురు చూస్తూ

ఉంటాను.

బుచ్చి బాబు.

కృష్ణరాయపురం,
1-3-51.

క్షేమం.

శ్రీరస్తు! చిరంజీవి బావమరిది ధర్మారావుకు, అనేక ఆశీర్వచనములు. నివు 24-2-51 తేదీని వ్రాసిన ఉత్తర మందినది. సంగతులు చూచి మేము యావన్మంది చాలా సంతోషించినాము. చి. బుచ్చిబాబువద్దనుండి నిన్ననే ఉత్తరము వచ్చినది, పెండ్లి సంబంధము విషయంలో. నీకు నచ్చినది అంటే మా అందరకు నచ్చినట్టే. వాడుకూడా చూసుకొన్న మీదట మరి మే మెవ్వరమూ చూడ నక్కర లేదు. కట్న కానుకల విషయంలోకూడా, నువ్వు ఆలోచించి ఎలా బా గుంటుం దంటే అలా చేయవలెను. ఆడపిల్లలు చిన్నపుచ్చు కొంటారు గనక వాళ్ళ లాంఛనాల విషయంలో మాత్రం తక్కువ చేయవ ద్దని మీ చెల్లెలు రాయ మన్నది. ఏదో భగవత్కటాక్షమువల్ల ఈ వ్యవహారం స్థిరపడి, సవ్యంగా నెరవేరితే చి. బుచ్చిబాబు విద్యా విషయమై నీకు కలుగుతున్న ఒత్తిడి తగ్గుతుంది. అన్ని విషయములు ఆలోచించి ఎలా బా గుంటుం దంటే అలా చేయవనెను. ఇక్కడ పిల్ల లందరూ కులాసాగా ఉన్నారు. చి. రామానికి స్కాలర్‌షిప్పు దొరికింది. శ్రీ సంజీవరావు పంతులు గారు "వారాలకు ఏం తిరుగుతావు, మాయింట్లోనే భోంచెయ్యి" అన్నా రట. చి. పిల్లలు నీవు పండగకి వస్తా రని చూసేను. వీ లుంటే ఒక పర్యాయము రాగోర్తాను. శ్రీ శ్రీ శ్రీ. ఇంతే

సంగతులు. గ్రహించవలెను.

కో. సోమసుందరం వ్రాలు.

సిరిపురం, 10-3-51.

మిత్రుడు ధర్మారావుకు.

మా చెల్లెలు సుభద్రమ్మ మరీ మరీ తొందర చేయగా నీకిది వ్రాస్తున్నాను. మీ మేనల్లుడు కృష్ణమూర్తికి సెలవు లివ్వగానే ఇక్కడికి ఒక్క పర్యాయము వచ్చి వెళ్ళవలసిందిగా పదేపదే వ్రాయ మంటున్నది. స్వయంగా చూచేవు గనక దాని ఆందోళన నీకు తెలియనిది కాదు. కుర్రవాడు వచ్చి పిల్లను చూచుకొన్న మీదట నీకు వీ లుంటే ఒక పర్యాయము వస్తే కట్న కానుకల విషయం నిశ్చయంగా మాట్లాడుకొందాము. లేదా, మేమే అక్కడకు వచ్చి నాలుగు సంగతులు మాట్లాడుతాము. కావా లంటే మీ చెల్లెలుగారి ఊరుకూడా వెళ్తాము. మీ మేనల్లుడు చిరంజీవి కృష్ణ మూర్తి ఎప్పట్లో బయలుదేరి వచ్చేదీ వ్రాయగోర్తాను. వెంటనే జవాబు రాస్తా రని నమ్ముచున్నాను. ఇంతే సంగతులు.

కా. కృష్ణశర్మ.

మార్చి 15, 1951.

ఏమీ విశేషాలు లేవు. మామూలుగా బాంకు —సాయంకాలం పార్కు దారిలో పెంగ్విన్ ఎడిషన్ హక్స్లీ Antic Hay కొన్నాను -- పుస్తకం చిత్రంగానే ఉండేలా గుంది. లోగడ చదివిన Point, Counter Point ధోరణికీ After Many A Summer కీ చాలా భేదం ఉన్న ట్టుంది. వాటికంటె చాలా

ముందు రాసిన రచనలు. ఈ ఆదివారం రాత్రికి చదవడం పూర్తి కావచ్చును.

ఉత్తరాలు కృష్ణ శర్మకీ, బుచ్చి బాబుకీ రాసేను. రెండూ-కార్డులే. వాళ్ళు రాసిన భోగట్టా వీడికీ, వీడికి రాస్తున్నా నన్న సంగతి వాళ్ళకీ వ్రాశాను.

వాళ్ళు తప్పకుండా తమ పిల్ల పెళ్ళి విషయంలో తొందర పడవలసిన మాటే. వీడికి మంచిసంబంధం దొరికి, కాస్త కట్నంరూపేణ వీళ్ళ కుటుంబానికి లాభించడమూ వాంఛనీయ మయిన సంగతే. అయితే ఆయా సంగతులు వాళ్ళ వాళ్ళ స్వంతబాధ్యతలమీద నిర్ణయించుకొంటే తరువాత మంచి అయినా చెడ్డ అయినా ఉభయులూ కలిపి, మధ్యవర్తినెత్తిన అక్షింతలు వెయ్యనక్కర లేదు: బావకి రాస్తే, నా దేముంది, అంతా నీ యిష్టం. ఎలా బాగుంటుం దంటే అలా చెయ్యి అంటాడు. కాని, నా బాగుండటంతో ఏమిటి సంబంధం? అసలే కట్నం పుచ్చుకోకపోడం నాకు బాగుంటుంది. తాము అందుకు ఇష్ట పడగలరా? కాక, ఒకవేళ వాళ్ళు యిష్టపడినా, అది తమకు తాము నష్టం చేసుకొంటున్నట్టే కదూ? ఎప్పుడో వాడు ఉద్యోగం చేసి ఇచ్చేడబ్బు ఈనాడు కట్నంరూపంలో వస్తే చేదా? అందు లోనూ ఇంకా పెళ్ళి చెయ్యవలసిన ఆడపిల్లలూ చదివించ వల సిన మగపిల్లలూ బోలెడు మంది ఉన్నారు. అందుచేత బావకి ఈ అంశంలో స్పష్టంగా రాయాలి. వాళ్ళకికూడా ఇందులో నా ప్రమేయం అట్టే లే దనీ, వ్యవహారం తామూ తామూ నడిపించు కొంటే బాగుంటుం దనీ నిక్కచ్చిగా రాసెయ్యాలి.

ఇంకా వాడు చూసి ఇష్టపడాలి కదా! ఎలాగూ ఇష్టపడ

తాడు. తప్పక మర్నాడు వచ్చితీరా లనుకున్న నన్నే అయిదు రోజులపాటు ఉంచగలిగేరు ఆ తల్లికూతుళ్లు. పాపం, ఆ ఊళ్లో వాళ్ళకు సౌకర్యాలకు లోటు లేకపోయినా, వాళ్ళకు కావలసిన రకం సంఘం లేదు. ఒంటరిగా ఏదో దేశం కాని దేశంలో ప్రవాసం అనుభవిస్తున్న ట్టున్నారు. అయినా, ఆ మాట ఒప్పు కోరు. మనుష్యులకి తాము చేసినది పొరపా టని తెలుస్తున్నా, ఇతరులు చేస్తే మాత్రం అంగీకరించా లని ఉండదు. ఆ యిల్లును విడిచిరావడం కష్టమే ! కాని డబ్బు పెడితే మరొకచోట అటు వంటిచోట ఇల్లు వస్తుంది, గాని అక్కడ ఎంత కాలం ఉన్నా వాళ్ళు కొత్తగా వచ్చిన మనుష్యులలాగే కనిపిస్తారు. ఆవిడ ఉద్దేశంకోసం ఈ పిల్లకు త్వరగా పెళ్ళి చేసేసి, వాళ్ళతోపాటు తానూ పోయి ఏ పట్నంలోనో ఉండవచ్చు నని అన్నట్టుగా ఉంది. ఎవరి ఉద్దేశాలు ఏ వయినా, మన నెత్తిని అక్షింతలు పడకుండా మాత్రం చూసుకోవాలి.

సిరిపురం, 12-4-51.

ప్రియమైన మామయ్యకు.

అనేక నమస్కారములు. ఈ రోజు ఉదయం క్షేమంగా ఇక్కడకు చేరుకున్నాను. నేను ఈ సాయంత్రమే బయలు దేరుతా నన్నాను. వాళ్లు నాలుగు రోజు లుండి వెళ్ళదువు గాని అంటున్నారు. ఏ మయినా రేపు సాయంకాలం బండికి బయలు దేరడం జరుగుతుం దనుకొంటాను.

న్యాయంగా మా సంచార కార్యక్రమం అనుకొన్నట్టు జరిగి ఉంటే, మరొకనెల్లాళ్ళ అనంతరం, అంటే మే నెల పదవ తేదీ ప్రాంతంలో ఇక్కడకు రావడం జరిగి ఉండేది. కాని, మా

మిత్రుడు రాజశేఖరం తల్లిగారికి వంట్లో బాగు లేదని టెలిగ్రాము రావడంతో కార్యక్రమం తారుమా రయింది. వాడు ఇంటికి వెళ్ళాడు. నేను ఇక్కడకు వచ్చాను. వాడు మళ్ళీ అక్కడ పరిస్థితి బాగు పడ్డాక ఉత్తరం వ్రాస్తా నన్నాడు. నువ్వు దయతో పంపిన అరవై రూపాయిలూ అలాగే ఉన్నాయి; వాడు నన్ను ఒక రూపాయికూడా ఖర్చు పెట్టనియ్య లేదు. అక్కడికి టిక్కట్టుకూడా తీసుకొన్నాడు.

నేను రేపు రాత్రి రయిలులో బైలుదేరి వస్తున్నాను.

బుచ్చి బాబు.

క్షేమం కృష్ణరాయపురం,

శ్రీరస్తు! చిరంజీవి బావమరది ధర్మారావుకు : 1-5-51

అనేక ఆశీర్వచనములు. త. ఇక్కడ మే మంతా క్షేమంగా యున్నాము. అక్కడ నీ క్షేమసమాచారం వ్రాయించగోర్తాను. చి. బుచ్చిబాబు శలవులలో తన మిత్రుడు రాజశేఖరం అనే కుర్రవానితో కలిసి దేశసంచారం చేసే తలంపుతో ఉన్నట్టున్నాడు. అందులకు నీవు అనుమతించడమే కాక ఖర్చుల నిమిత్తం డబ్బు కూడా పంపించావనీ వ్రాసినాడు. తర్వాత బయలుదేరినట్టును, ఏవో రెండు మూడు ప్రదేశములు చూచినట్టును ఉత్తరములు చేరినవి. తరువాత సుమారు నెలదినముల నుండి వాడివద్దనుండి ఎట్టి ఉత్తరములు లేకుండుటచే మిక్కిలి ఆందోళనగా యున్నది. శలవులు కదా యని కాలం వృథా చేసినట్లయితే తరువాత చదువుకొనుట కష్టము కదా? వాడు ఎక్కడ

ఉన్నది ఏమి చేయుచున్నది నీకు ఉత్తరము వ్రాసినయెడల వాని క్షేమసమాచారము వెంటనే తెలియజేయగోర్తాను. ఇచ్చట పిల్లలందరునూ వానికొరకు ఆతృతగా ఎదురు చూచుచున్నారనీ, వెంటనే బయలుదేరి రావలసిందనీ వానికి వ్రాయగోర్తాను. నీ ఉత్తరంకోసం ఆతృతగా ఎదురు చూస్తూ ఉంటాము. బైటకి అనక పోయినా వాళ్ళమ్మకు వానిని గురించి చాల బెంగగా యున్నది.

ఇంతే సంగతులు : గ్రహించవలెను.

కో. సోమసుందరం వ్రాలు.

సిరిపురం, 1-5-51.

మిత్రుడు ధర్మారావుకు-

మీ మేనల్లుడు ఇక్కడే కులాసాగా ఉంటున్నాడు. తోడుగా మా బావమరది, అతని స్నేహితుడుకూడా ఉన్నారు. మావాడు కవి; ఆ రెండవ వాడు చిత్రకారుడు—ముగ్గురికీ బాగా స్నేహం కలిసింది. ఈ పదిహేను రోజులక్రితంవరకు వీళ్ళు ఒకళ్ళనొకళ్ళు చూసుకోలేదంటే ఎవ్వరూ నమ్మలేరు. వీళ్ళకి సమఉజ్జీగా ఉంది మా లీలకూడా.

అసలు రాద్దామనుకొన్న సంగతి మరచిపోతున్నాను. మా చెల్లెలు సుభద్రమ్మ వీలయినంత త్వరలో వివాహం చేసే తలంపుతో ఉంది. మీ రంతా యిష్టపడితే తను ఈ శలవులాఖరులోగానే, వైశాఖంలో ముహూర్తాలున్నట్లున్నాయి, జరిపించే ఉద్దేశంతో ఉంది. అందుచేత కట్నకానుకలవిషయమై నీవు వచ్చి మాట్లాడితే బాగుంటుంది. లేదా, ఫలానా అని ఉత్తరంలో స్పష్టంగా రాసినా సరే. మమ్ముల్నిరమ్మన్నా సిద్ధమే. మరి

అట్టే వ్యవధి లేదు, కనుక వెంటనే నిశ్చయించ గోరుతున్నా మని వ్రాయ మంది—వధూవరులు పరస్పరం నచ్చడం విష యంలో మ రేమీ అనుమానం లేదు. గనుక సాధ్య మయినంత త్వరలో ముహూర్తం నిశ్చయపరచడం బా గుంటుంది. పెళ్ళి ఎక్కడ జరగాలి, ఏవిధంగా జరగాలి అనే విషయ మంతా నిర్ణ యించే భారం మీదే ననీ, మీ రెలా అంటే అలా జరిపించగల వార మనీ, మా చెల్లెలు రాయ మంది—ఈ ఆదివారంనాటికి నువ్వు రాగలిగితే చాలా బా గుంటుంది. నీ ఉత్తరంకోసం ఎదురు చూస్తూ ఉంటాము.

కా. కృష్ణశర్మ.

మే 5, 1951.

ఆదివారం ఉదయం అంతా ఒకరి తరువాత ఒకళ్ళు నరసింహం, విశ్వ నాథం, సుబ్రహ్మణ్యం వచ్చేరు--తీరుబాటుగా ఉండి ఏమీ తోచక ఎవ ళ్ళయినా వస్తే బా గుండు నన్నాడు. ఎవరూ కనిపించరు. శాస్త్రి, ఏదో స్వంతంగా ఆలోచిద్దాము, ఏదో పని చేసుకొందాము అన్ననాడు అందరూ తయారు. అందులో ఒకడు వెళ్ళిపోయేడు, బా గుంది- ఇక తీరుబాటుగా కూర్చుందాము అన్న సమయంలో సరిగా మరొకడు ప్రత్యక్షం. అంతే కాదు, నీ కేదో పని తొందరగా ఉంది కాబోలు నంటూనే పేకాట వేసుకొందామా ? అనీ, ఆ మధ్య కొత్తగ్రామఫోను ప్లేట్లు కొన్నావుట, నేను వినలే దనీ, నిజంగా అవి వినడం పని మీదనే వచ్చినట్టు మాట్లాడ్డం! అందరిలోనూ సుబ్రహ్మణ్యామే

నయం. ముందుగా తను వచ్చిన చేబదులుపని చెప్పేసి తరువాత మాటలు మొదలు పెట్టేడు. ఉదయం ఈవిధంగా మాటలు, తన్మూలంగా భోజనం పన్నెండు గంటలు. అలా కాకుండా ఉంటే, ఇవాళ పదకొండు గంటల రైల్లో కృష్ణరాయపురం బయలుదేరి ఉండేవాణ్ణే! సరే పోనీ ఇదీ ఒకందుకు మంచిదే - నాలుగు సంగతులూ నింపాదిగా ఆలోచించి ఒక నిశ్చయానికి రా వచ్చును.

మనుష్యులకు ఎవరిమీదనో ఒకరిమీద నమ్మకం ఉండడం మంచిదే. కాని, ఆ నమ్మకం అన్నది తమ బాధ్యతలను గురించి తాము ఆలోచించకుండా ఇతరులమీద భారం వేసి ఊరుకొనే పద్ధతివల్లమాత్రం ఎవరికీ ప్రయోజనం లేదు.

బావగారికి మంచికో చెడ్డకో నామీద యింత నమ్మకం ఉండడమే పెద్ద చిక్కుగా ఉంది. నా మాటమీద ఈ వివాహం జరిగిం దంటే, తదుపరి వచ్చే మాట పట్టింపులకూ స్పర్ధలకూ బాధ్యత నాదిగా ఎంచబడుతుంది. బైటికి అనకపోయినప్పటికీ ఇది వాళ్ళ కుటుంబ శ్రేయస్సుదృష్ట్యా మంచిదా కాదా అన్నది నిర్ణయించుకోవాలి. అయితే, బుచ్చిబాబు సర్వ విధాలా యిష్ట పడినప్పుడు, తక్కిన కుటుంబంకోసం వాడు తన సౌఖ్యాన్ని త్యాగం చెయ్యవలసి ఉంటుందా? ఇది పైవాళ్ళకంటె వాడు కుర్రవా డయినప్పటికీ స్వంతంగా ఆలోచించి నిర్ణయించుకోవలసిన వ్యవహారం. మర్నాడే బయలుదేరి వస్తా నన్నవాడు నేటివరకూ యింటికి గాని, ఇక్కడికి గాని ఉత్తరం లేకుండా అక్కడే ఉంటున్నా డంటే అక్కడి ఆకర్షణశక్తి ఎంత బల మైనదో అర్థ మవుతుంది. మరి యీ ముజు మారీ వ్యవహారం

లాభం లేదు. వాడికి అన్ని సంగతులూ స్పష్టంగా రాయాలి. తరువాత వాడి యిష్టం - ఎప్పుడో లాభం లేదు, ఇప్పుడే ఉత్తరం రాసెయ్యాలి. ఈ వివాహాల మూలంగా వాడు తమ కుటుంబానికి ఎలా దూరం అయిపోతాడో అది స్పష్టంగా రాయాలి. అప్పటికీ వాడు కావాలని చేసుకొంటే వాళ్ళ అదృష్టం ఎలా అంటే అలా ఉంటుంది. పెళ్ళికాక మునుపు పెళ్ళిచూపుల కని ఒకపూట ఉండి రావడానికి వెళ్ళినవాడు ఇన్నాళ్ళు ఉండిపోయినప్పుడు పెళ్ళితరవాత అక్కడే స్థిరంగా ఉండిపో డనడానికి ఏమిటి ఆధారం? ఈ సంగతు లన్నీ వారికి నిర్మొగమాటంగా తెలియజేసి తన యిష్టం ఏదో నిర్ణయించుకో మనాలి; అది నిష్ఠురమే నయం కదా?

కృష్ణరాయపురం,
12-5-51

ప్రియమయిన మామయ్యకు! అనేక నమస్కారములు.

నీఉత్తరం అందిన నాటి సాయంకాలమే బయలుదేరి ఇక్కడికి వచ్చేను. దారిలో నీ దగ్గరకు రానందుకు ఏమీ అనుకోరని నమ్ముతున్నాను. ఎదురుగా మాట్లాడేకంటె ఉత్తరంలోనే నా అభిప్రాయాలు స్పష్టంగా తెలియ జెయ్యగల ననుకొంటున్నాను. అసలు ఇంతకీ తెలియజెయ్యడానికి అట్టే లేదు. కారణం ఏ దయితే నేమి, వాళ్ళ సంబంధం మనకు కుదరదు. వాళ్లు ఇ దేమీ పెద్ద ఆశాభంగం అనుకో నక్కరలేదు. లోగడ వా రెందరినో ఆహ్వానించి, తీరా వచ్చినతరువాత దాసరీ నీ కన్ను లొట్ట అనకపోలేదు. ఇంతకీ వివాహం అనేది కేవలం వాళ్ళ

సదుపాయంకోసం జరిగే వ్యవహారం కాదు కదా!

నిజంగానే నీ ఉత్తరం వచ్చి ఉండకపోతే వాళ్ళుగాని "పెళ్ళి అనే దానికి పెద్ద ఆడంబరం ఎందుకు? పెళ్ళికొడుకూ పెళ్లి కూతురూ అంగీకరించి మంచిరోజు కుదిరితే చాలదా" అని ఏదో రోజున ఎవ్వరూ లేకుండా పెళ్ళి జరిపినా నా అభ్యంతరం ఉండక పోయే దేమో! అసలు నేను ఏ మయినా ఆలోచించితే కదూ? నువ్వు మొదట ఈ సంబంధంగురించి ఉత్తరం రాసేవు గనక నీకు యిష్టమే. నీయిష్టమై నప్పుడు అమ్మకీ నాన్నకీ ఏమీ అభ్యంతరం ఉండదు. ఇంతే నా ఆలోచన. పైగా అక్కడి వాతావరణంకూడా అంతా చిత్రంగా ఉంది. నాగురించి నేను ఆలోచించుకొందికి ఒక్క క్షణ మయినా తీరక ఉంటే కదూ! ఈ సందర్భంలో నా కనువిప్పు చేసినందుకు నీకు ఎం తయినా కృతజ్ఞుణ్ణి.

నేను ఈ మాట చెప్పడంతో మా అమ్మవాళ్ళకూ కొంచెం ఆశాభంగం అన్నట్లనిపించింది. వాళ్ళు యిది పూర్తిగా నిశ్చయమైనట్టుగా ఊళ్ళో వాళ్లతో కూడా చెప్పేశారు. వాళ్ళకు భవిష్యత్తులో నువ్వూ నేనూ చూడగల యిబ్బందులు ఏవీ గోచరించవు. మనం చెప్పినా అర్థం చేసుకోరు. తగిన కట్నం ఇస్తున్నప్పుడు, పిల్ల రూపసి అయినప్పుడు, అడ్డు చెప్పవలసిన కారణం ఏ ముంటుం దని నేను ఎక్కువగా చెప్పడానికి ప్రయత్నించ లేదు. ఏం చెయ్య మంటావు" అన్నాడు.

నేను ఇక్కడికి వచ్చిన మర్నాడే మా మిత్రుడు రాజశేఖరం దగ్గర నుండి ఉత్తరం వచ్చింది. వాళ్ళమ్మగారి వంట్లో కులాసాగా వుం దట, మా ఆగిపోయిన సంచార కార్యక్రమం

పూర్తి గావించుకొనే ఉద్దేశంతో రేపు రాత్రికి ఇక్కడికి వస్తున్నానని రాశాడు ఎల్లుండి ఉదయం బయలుదేరుదా మనుకొంటున్నాము. మా నాన్నగారికి నేను చదువు అశ్రద్ధ చేస్తా నేమో నని భయం. కాని యీ నెల్లాళ్ళూ నిజ మయిన శలవు లన్నట్టుగా తిరిగితే తక్కిన ఏడాది అంతా జ్ఞాపకంతో శ్రద్ధగా చదవడం జరుగుతుం దనీ, తప్పకుండా ఫస్టుక్లాసు తీసుకొని వస్తా ననీ హామీ ఆయనకు యిచ్చి బయలుదేరుతున్నాను. ఈ ప్రయాణం చివరి భాగంలో ఢిల్లీ, ఆగ్రా మొద లయినవి చూచి, సెలవు లాఖరుకి బెనారెస్ వెళ్ళుతాము. అందుచేత నువ్వు మళ్ళీ నెల డబ్బు హాస్టల్ ఎడ్రసుకే పంపించగోర్తాను. మా ప్రయాణపు విశేషాలు నోట్ చేసి ఉంచుతాను. వీటికి లోగడ పదిహేనేళ్ళ క్రితం నీ ప్రయాణపు విశేషాలతో పోల్చి చూడడం తమాషాగా వుంటుంది కదూ! అప్పుడు నీ సంచారం గురించి ఎక్కువ ఆలోచించడమే ఇప్పటి మా సంచారానికి కారణ మేమో?' నే నేదో మాట వరసకు "ఎప్పుడూ ఇల్లూ, కాలేజీ, ఇంతకంటె మ రేమీ లేకుండా వుండేకంటె, దేశం అంతా ఒకమాటు తిరగవేస్తే ఎంత బా గుంటుంది!" అన్నాను. రాజశేఖరం తరవాత మరి నేను ఎన్ని అభ్యంతరాలు చెప్పినా వినిపించుకో లేదు. ప్రస్తుతానికి రాయడానికి మ రేమీ విశేషాలులేవు.

—బుచ్చిబాబు.

సిరిపురం, 16-5-51.

మిత్రుడు ధర్మారావుకు.

సుమారు వారంరోజుల క్రితం మీ మేనల్లుడు చి. కృష్ణ

మూర్తి ఇచ్ఛాపురంనుండి బయలుదేరి వెళ్ళినాడు. ఇంతవరకూ ఏమీ వుత్తరం లేదు. మా చెల్లెలు పెళ్ళిప్రయత్నాలు చేయుచున్నది. ముహూర్తంకూడా చి. కృష్ణమూర్తికి శలవు లుండగానే నిర్ణయించడం మంచిది అనుకొంటున్నాను. నీకు ఇక్కడికి రావడం అసదుపాయంగా వుంటుం దనే కారణంతో నేనూ మా చెల్లెమ్మా బయలుదేరి అక్కడకు వస్తున్నాము - ఎల్లుండి వుదయం రయిల్లో బయలుదేరి వస్తున్నాము — అన్ని సంగతులూ ముఖస్థంగా మాట్లాడుకో వచ్చును-ఇంతే సంగతులు.

కా. కృష్ణశర్మ.

మే 18, 1951

వుదయమే కృష్ణశర్మ దగ్గరనుండి వుత్తరం. పన్నెండు గంటలకి మనుష్యుల ఆగమనం. వస్తున్నా మంటే ఊళ్ళో మరెక్కడో బస చేస్తా రను కొన్నాను, గాని తిన్నగా ఇక్కడికే వస్తారనుకో లేదు-వాళ్ళ ధోరణి చూస్తే, కేవలం మాటలకోసం వచ్చినట్టు లేదు-ఏదో డాక్టర్ చేత పరీక్ష చేయించవలసిన అవసరం కూడా వుం దట. హోటలునుండి తెప్పించుకొని భోజనం చెయ్యడం ఆవిడకు మ రేమీ వింతగా తోచ లేదు.

పెళ్ళిమాటల ప్రసక్తి మరి నిలిచిపోయినట్లే అనడంతో శర్మకి చాలా కోపం వచ్చింది ఆవేళ. మొదట కొంతసేపు ఏమీ మాట్లాడ లేదు. తరవాత ఆమె తన అన్నగారి ధోరణిని సమర్థిస్తూ మాట్లాడ్డం మొదలు పెట్టినా, శర్మకంటె సబవరిగా మాటాడింది. నేను వేసిన ప్రశ్నలకు సరి అయిన సమాధానాలు చెప్పలేక

పోయే నని ఒప్పుకొంది. నేను వేసిన ప్రశ్నలు యివి : "పెళ్ళి అయిన వెంటనే మీరు మీ అమ్మాయిని విడిచి వుండగలరా? అసలు మీ అమ్మాయి మిమ్మల్ని విడిచిపెట్టి ఆ సమిష్టి కుటుంబంలో మనగలదా? అందులోనూ మా బావగారి ఎలిమెంటరీ స్కూలు హెడ్మాస్టరు వుద్యోగం, ఎనమండుగురు పిల్లలు గల సంసారం, తర్వాత పిల్ల లందరి చదువుల పెళ్ళిళ్ళ బాధ్యత అంతా వాడే భరించ వలసి రావడం మీకు సమ్మతంగా వుంటుందా? వాడు చాలా తెలి వయినవాడే, కాని మీ రను కొన్నట్లుగా పెళ్ళి చేసుకొని ఆ పల్లెటూళ్ళో కూర్చోడంతో తుప్పు పట్టిపోతాడు. ఇందు మూలంగా వాడికీ మీకు అనవసరంగా ఇన్ని సమస్యలు రేకెత్తడం తప్ప, మ రే మయినా వుపయోగం వుంటుందా?" ఆయా ప్రశ్నలను విని, అవిడ ఇలా అంది; "మేము కుర్రవాడు చాలా తెలివయినవా డనీ, రూపసి అనీ విని ఎంతో ఆశ పెట్టుకున్నాము. లోగడ ఈవిధంగా ఎందరిని చూసినా, యిష్ట పడని మా లీల మీవాణ్ణి చూడగానే ఎంతో సంతోషించింది-మీ మేనల్లుడు కూడా పూర్తిగా యిష్టపడ్డాడు. మీరు ఏవేవో ఊహలూ అపోహలూ చేసి, వాళ్ళిద్దరినీ ఎడం చేసేరు. ఆయా సమస్యా లన్నీ ముందుగానే ఊహించ లేక పోయేరా? అలా అయితే రెండువంకలా యింతటి ఆశాభంగం లేకపోవును గదా!" నన్ను మరి సమాధానం చెప్పనియ్యకుండా కృష్ణ శర్మ అడ్డు పడ్డాడు. ఏ దయినా ఉత్తరాలలో ఈ వ్యవహారం జరిగేకంటే ఈ విధంగా ముఖాముఖీ మాటలలో తేలి పోవడమే బాగుంది.

ఇక వాళ్ళ వైద్యవ్యవహారం మరొకటి రెండురోజులు పట్టే

లాగుంది. ఒకటి రెండు రోజులు ఉండే ఉద్దేశంతో వచ్చిన వాళ్లు పరుపులు వగైరాలు తెచ్చుకొంటే బాగుండును కదా! ఇవాళకి ఎలాగో సర్దుకున్నాము. తాత మడతమంచమూ, కాంపు కాటు బైటికి తీసేము. ఆవిడ ఇవతల మాట్లాడుతూనే అవతల మామూలుగా తమ యింట్లో సర్దుబాటు చేసుకొన్నట్టే సామానులు అటూ ఇటూ సర్ద సాగింది. కొద్దిసేపట్లో గదిని కొంత అందంగా తయారు చెయ్యగలిగింది. భోజనానంతరం కడుపులో నొప్పి వస్తున్నదట. ఎంత తక్కువగా తిన్నా యీ నొప్పి తప్పడం లేదట. ఇక్కడ డాక్టరు పార్థసారథి గారికి చూపించడం ఉద్దేశమట. సరే, వాళ్ళిష్టం. ఇక్కడ ఈ బ్రహ్మచారి యింట్లో యిముడగలిగి వారుంటే నాకేం అభ్యంతరం? రేపు మరి శలవు అక్కర్లేదు. మామూలుగా బేంకుకి వెళ్ళిపోవచ్చును. కొంత చికాకు తప్పనప్పటికీ, యిక్కడి ఈ వ్యవహారం పరిష్కారం అయిపోయినట్టే. బుచ్చిబాబుకి ఈ సంవత్సరంకూడా డబ్బు పంపించాలి. తరువాత సంగతి ఏమిటో అటునుంచి నరుక్కు రావచ్చును. వాడికీ ఎమ్. ఎస్ సి. చదివి, లెక్చరరు కావాలని ఉంది. అదే మంచిదేమో. వాళ్ళ తమ్ముళ్ళ కాలేజీ చదువులవేళకు అందివస్తాడు.

సిరిపురం, 24-5-51.

మిత్రుడు ధర్మారావుకి.

మేము ఇక్కడికి వచ్చేసరికి అనుకోని సంఘటన జరిగింది. మా మేనకోడలు లీల, మా బావమరిది స్నేహితుడు అ చిత్రకారుడు రాజరత్నంతో లేచి వెళ్ళిపోయింది. ఎక్కడకు వెళ్ళేరో తెలియదు. అక్కడకు మీ దగ్గరకు వస్తున్నామని మేము

బయలుదేరిన మర్నాడే బయలుదేరే రట. దాని ఒంటి నున్న బంగారమే కాక మా చెల్లెలు పెట్టెలో వస్తువులు కూడా కొన్ని తీసుకొని వెళ్ళిపోయేరు. మా చెల్లెలుకి మతి చలించిన ట్లయింది. ఎవరితోనూ మాట్లాడ్డం లేదు. తిండికూడా సరిగా తినడం లేదు. ఇందుకు, నువ్వు ఎంత లే దన్నా, బాధ్యత నీదే. మా లీలకు మీ మేనల్లుడు రాసిన ఉత్తరం ఒకటి దొరికింది - అందులో మొన్న నువ్వు మాట్లాడినట్లుగానే సంబంధం బెడిసి పోయిన సంగతి నిష్కర్షగా రాసి ఉంది. ఆ ఉత్తరం అందినమీదనే అది ఇటువంటి తొందరపాటు పని చేసి ఉంటుం దనుకొంటాము. ఏం చేస్తాం, అది మరొక ఏడాదినాడు ఎటువంటి స్థితిలో ఇంటికి తిరిగివచ్చినా విశేషం లేదు; అసలు మళ్ళీ ఎన్నటి కయినా తిరిగివస్తుందో రాదో ? మా కీ పల్లెటూరికి ఏసంగతీ తెలియదు. నీకు గాని వాళ్ళ భోగట్టా ఏ మయినా ఆచోకీ తెలిస్తే రాస్తా వని నమ్ముతున్నాను. లేక, ఆ మాత్రం బాధ్యత ఎందుకు నెత్తిని వేసుకోడం అనుకొంటావా ? మాచెల్లెలు కడుపునొప్పి అలాగే ఉంది. మొన్నటి మాటు రావడంలో డాక్టరుగారు కొన్నాళ్ళ పాటు అక్కడ ఉండా లన్నారు: నాకు ఇప్పుడు ఏమీ తీరు బాటు కాకుండా ఉంది. మరొక పది పదిహేను రోజులలో బయలుదేరి వస్తే బా గుంటుం దనుకొంటున్నాను. అక్కడకు వచ్చిన మీదట యిల్లు అద్దెకు తీసుకోవా లనుకొంటున్నాను. నీకు వీ లయితే చిన్నయిల్లు, శుభ్ర మయినది చూస్తే చాలా సంతోషిస్తాను. మా చెల్లెమ్మ ఒక్కతే ఉంటుంది; నేను అప్పు డప్పుడు వచ్చి వెళ్తూ వుంటాను. ఇంతే సంగతులు.

కా. కృష్ణశర్మ.

సిరిపురం, 24-9-51.

మిత్రుడు ధర్మారావుకు-

నిన్ననే మా చెల్లెమ్మ దగ్గరనుండి ఉత్తరం వచ్చింది. ప్రస్తుతం నా దగ్గర డబ్బు సర్దుబాటు కావడం లేదు. వాళ్ళ రైతులుకూడా ఇంకా మరి కొన్నాళ్ళు పోతేనే కాని ఇవ్వ మంటు న్నారు. అందుచేత నువ్వు ప్రస్తుతానికి ఒకనూరు రూపాయలు సర్దుబాటు చేసి ఇవ్వగలిగితే మరి పదిహేను రోజులలో నేను పంపిస్తాను. నువ్వు ఏ సంగతీ నాకు ఉత్తరం వెంటనే వ్రాయ గోర్తాను. నీకు వీలు కాని పక్షంలో నేను ము రేదయినా ఏర్పాటు చేస్తాను. ఇంతే సంగతులు.

కా. కృష్ణ శర్మ.

నవంబరు 15, 1951

ఈ రోజు పుట్టినదినం. అంటే ముప్ఫైఆరు వెళ్ళి ముప్ఫై ఏడవ సంవత్సరం వచ్చిం దన్నమాట. ప్రతిసంవత్సరం మామూ లుగా జరిగేదె. ఈ సంవత్సరం కొంచెం కొత్తపద్ధతిగా జరిగింది. నిన్న సాయంత్రం మాటలసందర్భాన ఆవిడతో రేపు నా పుట్టిన సం అనడంవల్ల వచ్చింది చికాకు. ఆఫీసుకి శలవు పెడితేనే కాని ఒప్పుకో లేదు. భోజనంకుడా వాళ్ళింట్లోనే చేయవలసి వచ్చింది. హొటలునుండి మూడు తీపిపదార్థాలు తెప్పించింది. తాను స్వయంగా సేమ్యా పాయసమూ, పెరుగు గారెలూ చేసింది. వెనుక సుశీల ఉండిన రోజులు జ్ఞాపకం వచ్చి కళ్లలో నీళ్ళు తిరిగేయి.

ఇటీవల ఈ రెండుమూడు నెలలలోనూ ఆవిడ ఇంత ఉత్సాహంగా ఉండడానికి ఇదే ప్రథమం. రోజంతా అక్కడే గడిచిపోయింది. అసలు ఇదొక అలవాటయిపోయింది. ఉదయం ఒక గంటసేపూ, సాయంకాలం ఆఫీసునుండి రావడమే తిన్నగా అక్కడకు వెళ్ళడమూ, ఎనిమిది ఎనిమిదిన్నర వరకూ అక్కడే కూర్చోడం. మొదట ఆమె ఆరోగ్యం గురించి, మందు మాకుల గురించి కనుక్కోడం. ఇటీవల రోజూ ఉదయం సాయంత్రం వెళ్ళి, అంతసేపు అక్కడ కూర్చోడానికి ఏమిటి అవసరం ఉంది? కేవలం రేడియో వినడ మన్నది పెద్ద కారణం కాదు కదా? ఎంతమంది ఇతరుల ఇళ్ళల్లో లేదు రేడియో? కాక అంతగా కావా లంటే ఒకటి కొనుక్కోకూడదా? లేకపోతే అవసర మయిన వదంతులకు ఆధారం కల్పించిన ట్టవుతుంది.

అందులోనూ ఆవిడ ఈ సాయంకాలం ఇచ్చిన వాచీ పుచ్చుకోక పోవలసింది. అది కొత్త దయినా బాధ లేకపోను. వెనుక ఆమె భర్త పెట్టుకొనే దట. అది ఇన్నాళ్ళు భద్రంగా పెట్టెలో ఉంచి కీ యిస్తూ వచ్చిందట - అటువంటి ప్రియ మైన వస్తువు, అంత ఖరీ దయినది ఎవడో నాబోటివాడికీ ఇవ్వడం ఆమెది తప్పే. కాని ఇచ్చిందే తడవుగా పుచ్చుకోడం నాదీ పొర పాటే — కాని, ఆమె యిస్తూంటే వద్దనేపాటి శక్తి లేకపోయింది. ఇక అది మరి తిరిగి ఇస్తే బా గుండదు- ఆవిడ పుట్టిన దినమో, లేక మరొక అవకాశమో చూసుకొని, ఏ దయినా తగిన వస్తువు బహూకరించాలి. దీనికి ప్రతి ఫలంగా చేసే మన్న ట్టుండకూడదు. అలా అయితే ఆమె పుచ్చుకోకపోవడమే కాక నవ్వుతుంది. ఆమె మాటలనుబట్టి చూస్తే మళ్ళీనెల సిరిపురం వెళ్ళిపోయే ఉద్దేశం

ఉన్న ట్టుంది. అవును మరి, డబ్బేమీ లేనప్పుడు ఇక్కడ అనవ సరపు ఖర్చులు పెట్టుకుని ఇబ్బంది పడేకంటె, అక్కడ స్వంత యిల్లుంది. దేని కయినా కావలసినవాడు అన్నదమ్ము డున్నాడు! ఆమె వెళ్ళిపోతే, మళ్ళీ కొన్నాళ్ళు ఒంటరిగా ఉన్న ట్లుంటుంది- మనిషి సాంఘిక జంతు వన్నమాటలో ఎంతో సత్యం ఉంది. ఎంతగా ఒంటరితనానికి అలవాటు పడిన మనిషి అయినా సరే, కొద్ది రోజులపాటు స్నేహం కలిసిం దంటే మరి విడిచిపెట్ట లేడు. ఇప్పుడు వాళ్ళింటికి రోజూ వెళ్ళి యోగక్షేమాలు విచారించి రావడం, ఆవిడకోసమో నా కోసమో అనుమానం వచ్చేలా గుంది. కళల గురించిగాని, రాజకీయాల గురించిగాని అంత చక్కగా మాట్లాడే ప్రజ్ఞ ఆడవాళ్ళలోనే కాదు, మగవాళ్ళలో కూడా అతి అరుదుగా చూస్తాము.

ఆవిడ కుమార్తెని పెళ్ళి చేసుకోకపోవడంతో బుచ్చిబాబు నిజంగా చాలా నష్టపోయాడు. అయితే ఆ నిశ్చయానికి బాధ్యత వాడిదే - నేను చేసిన దల్లా ఉన్న సాధక బాధకాలు తెలియ జెయ్యడం మాత్రమే- ఒక్కొక్క కుటుంబం బాగు పడడానికి ఒక మనిషి తన సౌఖ్యాన్ని కొంతవరకు త్యాగం చెయ్యాలి మరి—

ఆవిడ మనిషిలోని వైచిత్ర్యం ఇదే—తనకు ఒక కూతురు ఉండేదని-ఆ అమ్మాయి పెళ్ళి ప్రయత్నమే తన ప్రధాన కర్తవ్య మని ఉండే దని-అసంగతే మరిచిపోయిన ట్టుంటుంది. ఎల్ల ప్పుడూ ఇలా ఒంటరిగా తను ఉంటూ ఉండడమే అలవా టయి నట్లు మాట్లాడుతుంది. అయితే మళ్ళీ అక్కడ ఆ పల్లెటూళ్ళో ఆ యింట్లో వెళ్ళి ఉండడం సంభవిస్తే, యింతగా మరిచిపోవడం

సాధ్యం కా దేమో? మళ్ళీ కడుపునొప్పి కాకపోయినా, కూతురు వెళ్ళి పోయినా కొత్తలో వచ్చిన స్తబ్ధంవంటిది అంతకంటె ముమ్మరంగా రావచ్చును.

గత సంవత్సరం పుట్టిన దినం నాటికి ఈ మనుష్యులు ఉన్నా రనే తెలియదు; కృష్ణశర్మని గూర్చి కూడా వాడి ఉత్తరం వచ్చేవరకూ ఎటువంటి ఆలోచనా లేదు. అటువంటిది సుమారు ఈ పది నెలల కాలంలోనూ వాళ్ళ సమస్యలు కొన్ని నన్నూ పట్టుకున్నాయి. మావాడు బుచ్చిబాబు వాళ్ళతో ఆ జన్మాంతం తెగని సంబంధం కలియవలసిన పరిస్థితి ఏర్పడి మళ్ళీ ఏమీ లేకుండా ఎవరిదారి వారి దయింది. మరికొద్దిరోజుల్లో ఆవిడ వాళ్ళఊరు వెళ్ళిపోవడంతో నాకూ వాళ్ళకూ మరి ఏమీ సంబంధం ఉండదు. ఉత్తరం రాయవలసిన అవసరంమాత్రం ఏముంటుంది?

సిరిపురం, 10-2-52.

మిత్రుడు ధర్మారావుకి

నన్ను పెళ్ళికి పిలవనందుకు "బావగారికి" అని సంబోధించ లేదు. నాకు నిజంగానే కోపం వచ్చింది. నీకు మొదటి నుండీ ఉన్నదే యీ గుణం-చేసేపని చాపకింద నీరులా చేస్తూ ఉండడమూ, బైటికి ఏమీ తెలియనట్లు ఉండడమూను. కాని, నీనుండి ఇంతలో యీ గుణం మా చెల్లికికూడా ఎలా సంక్రమించిందో నా కర్థం కాకుండా ఉంది. ఎంత రిజిస్ట్రేషన్ మారేజి అయితే మాత్రం! మే ముండడంవల్ల అభ్యంతరం లేదు కదా! నాకు ముందుగా రాయనివాడివి మీ అక్క చెల్లెలువాళ్ళకిమాత్రం

రాసివుంటా రేమిటిలే-ఏ మయినా మీ ఉభయులూ ఇక్కడికి వచ్చి పిలిస్తేనే గాని నేను మీ యింటికి రాను.

ఇక, మీ యిద్దరికీ వేర్వేరు ఉత్తరాలు రాయడం ఎందుకని ఇందులోనే రాస్తున్నాను. మాచెల్లెలు రాసింది, యింటిని ఎవరి కయినా అమ్మివేసే సంగతి - మరి ఎలాగూ ఉండనప్పుడు తప్పకుండా అమ్మివేయవలసిందే. అయితే నాకు మా చెల్లెలు ఆ యిల్లు కట్టించిన నాటినుండీ అటువంటి యిల్లు కట్టించుకోవాలని ఉండేది. కాని, చెల్లెలును చూసి అన్న యిల్లు కట్టించేడంటా రని ఊరుకొన్నాను. ఆ యిల్లు నేనే తీసుకొంటాను: అలా గని మీ కేం నష్టం చేస్తా నని భయపడ నక్కర లేదు. మామూలుగా అమ్మ జూపి, ఎంత ధర వస్తుందో చూసి, ఆ ధరకే నేను తీసుకొంటాను. ఈ వ్యవహారం పరిష్కరించుకొనే నిమిత్త మయినా మీ రిక్కడికి రావాలి.

ఇంకా నిశ్చయం లేదు గాని, చిన్న సంగతి ఒకటి తెలిసింది. మన లీల అతగాణ్ణి సక్రమంగానే పెళ్ళి చేసుకొం దనీ, అతగాడు మద్రాసులోని ఏదో సినిమా కంపెనీలో పని చేస్తున్నాడని వార్త. అయితే ఇంకా నమ్మలేం. ఏసంగతీ రూఢిగా కనుక్కొని రాయవలసిం దని, అక్కడ ఉన్న మన హయగ్రీవ రావుకి రాసేను - వారం పదిరోజుల్లో జవాబు రావచ్చును. నామట్టుకు నిజమే అయి ఉంటుం దనిపిస్తుంది. మీ మేనల్లుడికి అదృష్టం లేక పోయింది గాని, మా లీల చాలా ప్రపంచజ్ఞానం కలిగినపిల్ల. దానిని చేసుకొన్నవా డెవడూ చాద స్తంగా తెలివి తక్కువ పనులు చెయ్యడు.

మేనల్లుడికి సంసారబాధ్యత నెత్తిని పడుతుం దని భయ

# అ నా శ్వా సి

## శ్రీమతి ఇల్లిందల సరస్వతీ దేవి

---

26-6-1915 జననము. మెట్రిక్యులేషన్ పరీక్ష, Certificate Course of Journalism లోను ఉత్తీర్ణురాలు. వివిధ పత్రికలకు, రేడియోకు అనేక కథలు, వ్యాసములు, ఏకాంకికలు, ప్రసంగములు రచించు చున్నది.

భర్త ప్రిన్సిపల్ ఇల్లిందల సీతారామా రావు గారు. ముద్రితగ్రంథములు: "వందుగ బహుమానం" (కథానికా సందోహము), "జాతి రత్నాలు" (స్త్రీల పా[illegible] కథలు); "గాంధీ జీవిత కథ" (ఆంగ్లము నుండి అనువాదము); "బాల వీరులు" (పిల్లల నాటికలు;) "పిల్లల పాటలు" (గేయములు).

ఆంధ్ర వార పత్రికలలో "వనితా లోకము" అను శీర్షిక నిర్వహించినది. సారస్వత సాంఘిక కార్యక్రమములలో ప్రముఖముగా పాల్గొనుచుండును.

---

౧

బంగారమ్మ తెల్లవారి నప్పటినుండీ కిటికీలో తల పెట్టి చూస్తున్నది. రెండు స్టేషనులు దాటినా బట్లరు కాఫీ తీసుకొని రాలేదు. కాఫీ కొరకు ఎదురు చూడటములో ఎప్పుడో ఆమెకు

పడి నువ్వు స్వంతవిషయంలో ఇంతలా రెండవకంటివాడికి తెలియకుండా గురుతర మయిన బాధ్యతను స్వీకరించినందుకు అభినందించకుండా ఉండలేక పోతున్నాను.

మీ రెప్పుడు బయలుదేరి వచ్చేదీ ముందుగా రాస్తారు కదూ ? మద్రాసు నుండి వచ్చిన భోగట్టా నిజ మయితే వాళ్ళ దంపతులను ర మ్మనడం గాని, లేక మీ దంపతులు అక్కడకు వెళ్ళడం గాని జరిగించవచ్చును.

ఇంతే సంగతులు,

కా. కృష్ణ శర్మ.

# అనాశ్వాసిత

## శ్రీమతి ఇల్లిందల సరస్వతీ దేవి

---

26-6-1915 జననము. మెట్రిక్యులేషన్ పరీక్ష, Certificate Course of Journalism లోను ఉత్తీర్ణురాలు. వివిధ పత్రికలకు, రేడియోకు అనేక కథలు, వ్యాసములు, ఏకాంకికలు, ప్రసంగములు రచించు చున్నది.

భర్త ప్రిన్సిపల్ ఇల్లిందల సీతారామా రావు గారు. ముద్రితగ్రంథములు: "పండుగ బహుమానం" (కథానికా సందోహము), "జాతి రత్నాలు" (స్త్రీల పాటల కథలు); "గాంధీ జీవిత కథ" (ఆంగ్లము నుండి అనువాదము); "బాల వీరులు" (పిల్లల నాటికలు;) "పిల్లల పాటలు" (గేయములు).

ఆంధ్ర వార పత్రికలలో "వనితా లోకము" అను శీర్షిక నిర్వహించినది. సారస్వత సాంఘిక కార్యక్రమములలో ప్రముఖముగా పాల్గొనుచుండును.

---

౧

బంగారమ్మ తెల్లవారి నప్పటినుండీ కిటికీలో తల పెట్టి చూస్తున్నది. రెండు స్టేషనులు దాటినా బట్లరు కాఫీ తీసుకొని రాలేదు. కాఫీ కొరకు ఎదురు చూడటములో ఎప్పుడో ఆమెకు

కన్ను మలిగింది. పెట్టి ఖాళీగా కూడా ఉన్నది - కాళ్లు జాపు కొని తల క్రింద చెయ్యి పెట్టుకొని పడుకున్నది.

ఆమెకు నిద్రలో కూడా అప్పు డప్పుడు కలుగుతూ వచ్చిన మెలకువలో వేళకు కాఫీ అంద లేదని తల నొప్పి జ్ఞాపకము చేస్తూ వచ్చింది. రైలు కుదుపుకు కళ్ళు వాటంతట అవే మూతలు పడి పోతున్నాయి. రైలు ఎన్ని స్టేషనులు దాటి వచ్చిందో ఆమె గమనించ లేదు. ఆమెకు మెలకువ వచ్చేటప్ప టికి పెట్టి కొంత సందడిగా ఉన్నది. ప్రయాణీకుల మాటలు స్పష్టంగా వినబడు తున్నాయి.

"ఆమెకు వయసు ఎంత ఉంటుం దనుకుంటావు ?"

"పాతికేళ్ళు ఉంటా యేమో !"

"ఆఁ ! అట్లా కనబడుతుంది గాని ఇంకా ఎక్కువే ఉంటా యని నా ఊహ".

"అవునులే. ఈ రోజుల్లో ప్రతివాళ్ళూ ముఖము మీది ముడతలు కనబడకుండాను, జుట్టు నరవ కుండాను జాగ్రత్త పడుతుంటే ఎదిటివాళ్లు ఏం తెలుసుకో గలుగు తారు?"

"మనము ఇంకో సంగతి గమ నించాలి. ఈ కాలములో పదిహేనేళ్ళకే తల నరసిన వాళ్ళుకూడా ఉన్నారు. వాళ్ళ సంగ తేమి టంటారు?"

ఆ సంభాషణ ఎవరిని గురించి అయినదీ ఆమెకు స్పష్టము కాలేదు. కాని యింకా ఏమి చెప్పుకుంటారో నన్న కుతూహలము మాత్రము కలిగింది. నిద్రపోతున్నట్లుగా పడుకున్నది.

ఆమెకు మెలకువ వచ్చినట్లు వాళ్ళు గ్రహించి ఉండాలి. తరువాత గుసగుసలు తప్ప మాటలు ఆమెకు వినపడ లేదు.

అంతలో బట్లరు వచ్చి పిలిచాడు. ఆమె డిగ్గున లేచి కాఫీ అందుకున్నది. తల వంచుకునే చేతిసంచీ తెరచి వక్క పలుకు నోట్లో వేసుకుంటూ తన తోడి ప్రయాణీకులు నలుగురు ఉన్నట్లు గ్రహించు కున్నది. వాళ్ళల్లో ఒకాయన సూటు వేసుకున్నాడు. మిగతా వాళ్లు దేశీయ వేషధారణలో ఉన్నారు. ఆమె లేచి కూర్చోగానే వాళ్ళందరూ జాగ్రత్తగా సర్దుకొని పెద్ద మనుష్యుల వలె మర్యాదగా కూర్చున్నారు.

గాలి నిండుగా ఉన్న సైకిలు టైరులాంటి తన దేహాన్ని ఆమె ఒకసారి తల యెత్తకుండా కలయ జూసుకున్నది. చేతి బంగారు గాజుల కాంతి దేహకాంతులలో కలిసిపోతూ ఉండ టాన్ని పదే పదే చూసుకొని మురిసి పోయింది. వయసును లక్ష్య ము చేయని తన దేహదార్ఢ్యాన్ని బంగారమ్మ క్రీగంట గమ నించుకున్నది. వెంటనే ఆమెకు ప్రయాణీకుల సంభాషణ జ్ఞాపకము వచ్చి దేహము జలదరించింది. ఆమె దానిని పైకి కన బడనీయకుండా సర్దుకుంటూ కిటికీలో తల పెట్టుకొని చూడటము మొదలు పెట్టింది.

ఉదయము ఎనిమిది గంటలు దాటుతున్నది. రైలు అతి వేగముతో విసురుగా నడుస్తున్నది. బంగారమ్మ తోడి ప్రయాణీ కులు వాళ్ళల్లో వాళ్ళయినా మాట్లాడుకో కుండా--కదలకుండా-- కూర్చున్నారు.

బంగారమ్మకు ఈ వాతావరణము అసిధారావ్రతములా కనిపించింది. ఆమె కెటూ తోచక తోలుసంచీ తెరచి మరి కొన్ని వక్క పలుకులను నోటి కందించుకుంటూ ఉండగా - రైలు అకస్మాత్తుగా ఆగింది. చాలా మంది ప్రయాణీకులు రైలు దిగి

ఇంజనువైపు పరుగెత్తారు. బంగారమ్మ పెట్టెలోనుంచి కూడా ఇద్దరు ప్రయాణికులు దిగి వెళ్లారు. మిగతా ఇద్దరూ ఆదుర్దాతో కిటికీలలో తలలు పెట్టి చూస్తున్నారు. చూడటానికి వెళ్ళేవాళ్లు వెళ్ళుతూ ఉంటే, చూసి వచ్చేవాళ్ళు వస్తున్నారు.

'పాపము చిన్నవయసుదే – తల బాగా చితికి పోయింది. వేషము చూస్తే పాటకజనములో మనిషిలా లేదు' అనుకుంటూ పోతున్నారు.

ఒక గంట తరువాత మృతదేహాన్ని తొలగించి రైలు కదలటానికి ఏర్పాట్లు జరిగాయి. ప్రయాణీకులు ఎవరి స్థలాలలో వాళ్ళు కూర్చున్నారు.

"పాపము ! ఆమనిషి ఎవరో - ఎట్లా పడ్డదో - ఎందుకు పడ్డదో ?" అన్నా డొక ప్రయాణీకుడు. ఆయన ఆ దృశ్యము చూడటానికి స్వయముగా వెళ్ళక పోవటమువల్ల చూసిన వాళ్లను అడగటము మొదలు పెట్టాడు.

"ఆ ప్రశ్నలు మమ్మల్ని అడిగితే మా కేం తెలుస్తుంది? ఏదో వెళ్ళాము- అందరితో పాటు చూసి వచ్చాము. త లంతా చితికిపోయింది" అన్నాడు వెళ్లిచూసివచ్చిన ఒకాయన.

"ఆ మనిషి వయసు ఎంత ఉంటుంది?" ఏదో కిటుకు తెలిసిన వాడి వలె ప్రశ్నించాడు మొదటి ప్రయాణీకుడు.

"ఏమో! ఆడవాళ్ళ వయసు చప్పున చెప్పటము కష్టము. ఏ మంత చిన్నదీ కాదు. ఏ మంత పెద్దదీ కాదు, తన మామూలు ధోరణిలో అంటూ తటాలున బంగారమ్మను చూసి నాలుక కొరుక్కున్నాడు.

ఈ సంగతి గ్రహించని మరొకాయన "పిల్లలు కూడా

ఉన్నా రుట వాళ్ళను వదలిపెట్టి రైలుక్రింద పడటానికి ఎంత ఇబ్బంది వచ్చిందో?'' అన్నాడు.

వాళ్ళ సంభాషణ దానంతట అదే ఆగిపోయింది. రైలు మరొక స్టేషనులో ఆగింది. అక్కడ ఇద్దరు స్త్రీలు ఎక్కారు. ఎక్కిన రెండు నిమిషాలకే "ఏఊరు వెళ్ళుతున్నా?" రన్నది ఒకావిడ బంగారమ్మను చూసి. బంగారమ్మ చెప్పింది.

''అక్కడ ఎవ రున్నారు?''

''మా అమ్మాయి ఉన్నది''-- ఆమనిషి ముఖము చూడ కుండా ముభావముగా అన్నది బంగారమ్మ.

''అయితే అమ్మాయి అక్కడ ఏం చేస్తున్నది? పెళ్ళ యిందా?'' ఎంతో అవసరము ఉన్నట్లుగా--బంగారమ్మ జవాబు ఇచ్చితీరా లన్నట్టుగా అడిగింది.

''మా అమ్మాయికి పిల్లవాడు. వాడి పుట్టినరోజుకే నేను వెళ్లుతున్నాను.'' జవాబు చెప్పటము యిష్టము లేకపోయినా కను బొమలు ముడివేసుకుంటూ జవా బిచ్చింది బంగారమ్మ.

ఆమె విస్మయపడి ''మనుమడికి పుట్టిన రోజా? మిమ్మల్ని చూసినవాళ్ళు మీకు మనమలు ఉన్నా రంటే నమ్మరు. తానేదో క్రొత్త విషయాన్ని తెలుసు కున్నట్లు ముఖం పెట్టి నవ్వుతూ అందరి ముఖాలవంకా చూసింది.

ఈ సంభాషణ శ్రద్ధగా ఆలకిస్తున్న మగ ప్రయాణీకుల ముఖాలలో విస్మయము కనబడ్డది. వాళ్లల్లో ఒకాయన ''నేను అప్పుడే అనుకున్నా, మీతో సూచనగా అన్నాను కూడాను'' అన్నట్లు అందరివంకా చూశాడు. మగ ప్రయాణీకులలో అక స్మాత్తుగా మాటలు లేని సందడి ప్రారంభ మైనది. మొదటినుండీ

మాటలో ఉనికిలో వాళ్ళు నిలుపుకొంటూ వచ్చిన గాంభీర్యము మర్యాద సడలిపోయింది. వాళ్ళల్లో వాళ్లు చౌకరకపు హాస్యముతో అతిగా సంభాషించు కోవటము మొదలు పెట్టారు. చదివి వేసిన పత్రికలను అజాగ్రత్తగా పెట్టెలో దొర్లనిచ్చారు. ఈ మార్పును బంగారమ్మ గ్రహించ టానికి ఎంతో సేపు పట్ట లేదు. ఆమెకు ఇది రుచించక మనసులో వికార పెట్టింది. ఒక విధమైన అసహ్యము కలిగింది.

ఇది జరిగిన తరువాత సరిగా అరవై నిమిషాల పాటు ఆమె రైలులో కూర్చుంది. స్టేషను రాకముందే సామాను లన్నీ ఒకచోటికి చేర్చింది. రైలు ఆగగానే చప్పున దిగిపోయి దూరముగా నిలబడ్డది. ఒక యువకుడు వచ్చి సామాను లన్నీ దింపించు కున్నాడు. రైలు కదులుతూ ఉండగా లోని ప్రయాణీకురాలు "పిన్నిగారూ ! ఆయన మీ అల్లుడా " అని గట్టిగా కేక వేసి అడిగింది. బంగారమ్మ ముక్కు చిట్లించి ముఖము ప్రక్కకు తిప్పుకున్నది.

వాకిట ముందు బండి ఆగగానే కూతురు ఎదురుగా వచ్చి తల్లిని లోపలికి తీసుకొని వెళ్ళింది ఇంటి నిండా బంధువులు కిటకిట లాడుతున్నారు. ఆడుకొంటున్న పిల్లవాడిని కూతురు ఎదురుగా తీసుకొని వచ్చింది. బంగారమ్మ వాడిని పలకరించకుండానే పెట్టె తీసి బిస్కట్ల డబ్బా చేతి కిచ్చింది.

దాని నందుకొని పిల్లవాడు పరుగెత్తా లని చూశాడు. కూతురు పట్టుకొని ఆపి "అమ్మమ్మరా వచ్చింది. అట్లా పారిపోతావేం ?" అని కోపము చేసింది.

బంగారమ్మ మనస్సు చురుక్కు మంది పరధ్యానముతో.

భోజనాలయిన తరువాత సాయంత్రము అయిదు గంటలవరకూ పడుకొన్నది. కాఫీ త్రాగుతూ ఉండగా కూతురు వచ్చి దగ్గరగా కూర్చున్నది. తెల్లవారితే పుట్టినరోజు పండుగ. పెద్ద విందు జరుగ బోతున్నది. అతిథులు ఎంతోమంది రావలసి ఉన్నది. వివరముగా తల్లితో చెప్పుతూ "మీ అల్లుడు చాలా సరదా పడుతున్నా రమ్మా. పెద్ద ఎత్తులో దీనిని తలపెట్టారు. నా కేమీ తెలియటము లేదు. రేపటి సంగ తంతా నీవే చూసుకోవాలి." అన్నది.

బంగారమ్మ విని ఊరుకున్నది. అంతలో పిల్లవాడు వచ్చాడు. ఉదయము ఇచ్చిన బిస్కట్లు తాను తినగా మిగిలినవి స్నేహితులకు పంచి యిచ్చాడు. వాటి రుచి తెలుసుకున్న తరువాత అమ్మమ్మను మళ్ళీ మంచి చేసుకుందా మని వచ్చాడు. పిల్లవాడు రాగానే తనతల్లి దగ్గర కూర్చుండ బెట్టుకుంటుం దని కూతురు అనుకున్నది. బంగారమ్మ ఆవైపే చూడలేదు. కూతురు ఊరుకో లేక "ఎందుకురా, అమ్మమ్మ దగ్గరగా వచ్చి నిలబడ్డావు? మళ్ళీ బిస్కట్లు ఇస్తుం దనుకున్నావా ?" అని పిల్లవాడిని మందలించి "చూడవే అమ్మా ! వీడి కొంటెతనము!" అని దగ్గరకి తీసుకున్నది.

బంగారమ్మ పొడినవ్వు నవ్వింది.

రాత్రి కూతురు అల్లుడితో అంటున్నది--"మా అమ్మలో చాలా మార్పు వచ్చిం దండీ! ఎవరితోనూ మాట్లాడకుండా ముభావముగా ఉంటున్నది. మధ్యాహ్నము నేను ఎంతో సేపు దగ్గర కూర్చుని రేపటి ఏర్పాట్లను గురించి అడిగితే ఒక్కదానికైనా సమాధానము యివ్వ లేదు."

"అంత యింట్లో ఒక్కతే ఉండలేక దిగులు పడిపోయి నట్లుంది. పోనీ మనదగ్గరే ఉండి పొమ్మను" అన్నాడు అల్లుడు.

ప్రయాణపు బడలికలో ఉండికూడా బంగారమ్మ ఈ మాటలను శ్రద్ధగా ఆలోచించింది.

మరునాడు బంగారమ్మ లేని ఉత్సాహాన్ని తెచ్చుకొని ఏర్పాట్లన్నీ స్వయముగా చేసింది. పిల్లవాడికి తాను తెచ్చిన బహుమతు లన్నీ ఇచ్చింది. కూతురు చూస్తూ ఉండగా పిల్ల వాడిని దగ్గరికి తీసుకున్నది.

బంగారమ్మకు ఈ కూతురి తరువాత సంతానము లేక పోవటము వల్లనూ, ఉన్నపిల్ల కాస్తా అత్తవారింటికి వెళ్ళిపోవ టముచేతనూ దంపతులు ఇద్దరే ఉండవలసి వచ్చింది. చూసే వాళ్ళకు ఆదంపతులు కొత్తగా గృహస్థాశ్రమములో ప్రవేశించి నటనిపించేది. మాతృధర్మము దైహికముగాగాని, మానసికముగా గాని, ఆమె నెక్కువ వత్తిడి చేయలేదు. అందుకు పెనిమిటి ఉద్యోగరీత్యా ఏడాది కొక ఊరు తిరగటము కూడా అను వైంది. ఎక్కడికి వెళ్ళినా 'ఆమె ఎట్లా ఉన్నదో చూడు' అని అందరూ అంటూంటే ఆమెకు మరీమరీ వినా లనిపించేది. ఆమాటలు ఆమె కెంతో ఉత్సాహాన్ని ఇచ్చేవి. తరువాత ఆమె వితంతు వైనా ఆ దుఃఖభారము వల్ల ఈ భావాలు అంతరించి పోలేదు. అందు నుంచి ఆమె తన అలంకారాలన్నీ తీసివేయ లేదు. ఆకారము వికారముగా లేదు.

బంగారమ్మ జార్జెటు చీరె కట్టుకున్నది. అతిథులను లోపలికి ఆహ్వానిస్తూ-వాళ్ళతో మాట్లాడుతూ-- చాలా ఉత్సా హముతో తిరిగింది. అందరూ పిల్లవాడిని బహూకరించి దీవిం

చారు. విందు సక్రమంగా జరిగింది. అతిథు లందరూ వెళ్లటము మొదలు పెట్టారు. వెళ్తుతూ ఒకావిడ "మీ అమ్మగారు వస్తా రని చెప్పితిరే- వచ్చారా?" అని కూతురిని అడిగింది.

కూతురు తల్లిని అందరికీ పరిచయము చేసింది. "మీరేనా పిల్లవాడి అమ్మమ్మ? ఇంకా ఎవరో ననుకుంటున్నాము సుమా! మనుమడు అచ్చు మీ పోలికే. మీరు ఎమీ అనుకోకండేం మీకు మనుమడు ఉండవచ్చు నన్న ఊహయినా మాకు తట్టలేదు" అన్నారు ఇద్దరు ముగ్గురు ఆశ్చర్యపడుతూ.

కూతురు నవ్వింది. వాళ్ళ కెంత ఆశ్చర్యము కలిగిందో బంగారమ్మ మన సంత క్రుంగి పోయింది, హృదయ మెంతో భార మనిపించింది.

రాత్రి భోజనా లయిన తరువాత బంగారమ్మ చల్లగాలికి ఒంటరిగా వెళ్ళి కూర్చున్నది. ఆమెను వెతుకుతూ అల్లుడి తల్లి దండ్రులు కూడా అక్కడికే వెళ్ళి కూర్చున్నారు. పగటి విందు విశేషాలు మాట్లాడు కుంటున్నారు.

పిల్లవాడు అక్కడికి తప్పటడుగులు వేస్తూ ఒక పెద్ద జపాను బొమ్మను ఎత్తుకొని వచ్చాడు. వచ్చిరాని మాటలు మాట్లా డుతూ ఎదురుగా నిలబడ్డాడు.

బంగారమ్మకు వాడిని చూడగానే ము ద్దనిపించింది. ప్రేమతో వాడి వంక చూసింది. దగ్గరికి రమ్మని చేతులు జాపింది.

అంతలో తాతగారు "అబ్బాయీ! ఆ బొమ్మ నా కిస్తావురా?" అన్నాడు.

"నీ కియ్యను. అమ్మమ్మ కిస్తా" నన్నాడు.

ఏ పురుగో కుట్టినట్టుగా - చాచిన చేతులను బంగారమ్మ

చప్పున వెనక్కు లాగుకున్నది.

మరునాడు బంధువు లందరూ వెళ్ళారు.

బంగారమ్మను కూతురు వెళ్ళ నివ్వలేదు.

అంత వైభవముగా పుట్టిన రోజు జరిగిన వారానికే పిల్ల వాడికి పెద్ద జ్వరము వచ్చింది. నాలుగు దినా లయినా తిరుగు ముఖము కాలేదు. డాక్టరు మందు ఇస్తున్నాడు. కూతురూ అల్లుడూ చాలా భయపడి పోయారు. ఒక రాత్రి పిల్లవాడికి మరీ ఎక్కువ చేసింది. పిల్లవాడి తల్లిని సమాధాన పరచటము చాలా కష్ట మైపోయింది. కూతురు పడుతున్న బాధకు బంగారమ్మ తల్లడిల్లిపోయింది. కూతురుని ఊరడించాలనీ, తనహృదయానికి హత్తుకోవా లనీ ఆమె మనసు ఆరాటపడ్డది తీరా గదిముందరికి వచ్చేసరికి పిల్లవాడు "అమ్మమ్మా!" అని పిలిచిన పిలుపు విన బడ్డది. ఎవరో తనను తరిమివేసినట్లుగా బంగారమ్మ ఆగదిలో నుంచి పరుగెత్తింది. కూతురు గది దాటి ఇవతలికి వచ్చిన తరువాత బంగారమ్మ ఆమెను కౌగలించుకొని ఏడ్చింది. తన కూతురు కంటినిండా నిద్రపోయి, కడుపునిండా అన్నము తిని వారము దినాలు కావచ్చింది! బంగారమ్మకు దుఃఖము పొంగు కుంటూ వచ్చింది.

ఆరాత్రి డాక్టరు పిల్లవాడిని చూడటానికి వచ్చి "పిల్ల వాడి దగ్గర తల్లిని ఎప్పుడూ ఉండనీయకండి. అట్లా ఉంటే ఆమె కే దయినా జబ్బు చేస్తుంది" అన్నాడు. కూతురు పడుతున్న ఆవేదనను బంగారమ్మ చూడలేక పోయింది. మనస్సు చిక్కబట్టుకొని పిల్లవాడి దగ్గర కూర్చున్నది. పిల్లవాడు కళ్ళు మూసుకొని పడుకున్నాడు. మందువే ళయింది. లేపి ఇవ్వటము

మంచిదా కాదా అని మందు సీసా చేత బట్టుకొని ఆలోచిస్తూ గడియారమువంక చూస్తున్నది.

"అమ్మమ్మా !" పిల్లవాడు హీనస్వరములో పిలిచాడు. బంగారమ్మ మనసులో ముళ్ళకంప మెదలినట్లయింది.

వచ్చినప్పటినుండీ పిల్లవాడు ఆ చిన్న ఎఱ్ఱటి పెదవులతో తేనె లొలికిస్తూ మాట్లాడుతూ ఉంటే ఆమెకు హృదయంగమముగానే ఉన్నది. కూతురు ఆ పిల్లవాడిని చూసుకొని మురుస్తుంటే ఆమె హృదయములో ఆనందము వెల్లువలై పారేది. తన పెనిమిటి దురదృష్టవశముచేత ఈ ఆనందాన్ని అనుభవించ లేక పోయినాడు. తాను చూసి ఆనందిస్తున్నది. కాని ఆ పిలుపు- 'అమ్మమ్మా' అన్న ఆ పిలుపు - ఆమె గుండెలో చిచ్చు పెట్టినట్లవుతున్నది. మనుమలను ఎత్తుకోటాన్ని అందరూ ఎంతో అదృష్టముగా ఎంచుకుంటారు; కాని ఆభావము బంగారమ్మ ఎదలో జ్వాలలను రెచ్చగొడుతున్నది. పిల్లవాడు మళ్ళీ "అమ్మమ్మా!" అన్నాడు జాలి గొలిపేటట్టుగా చూస్తూ.

బంగారమ్మ అదిరిపడి తన దేహాన్ని కిందినుంచి మీది వరకూ ఒక్కసారి చూసుకున్నది. పిల్లవాడు పిలిచే ప్రతిపిలుపులోనూ ఆమె దేహ దార్ఢ్యమును యౌవనమును నశింప చేసేశక్తి ఉన్నట్టుగా ఆమెకు తోచ నారంభించింది. పటిష్టముగా ఉన్న ఆమె శరీరము ముడుతలు పడి, నరములు పైకి తేలినట్లే నిండుగా ఉన్న ఆమె చెంపలు గుంటలు పడినట్లే--గట్టిగా తెల్లగా ఉన్న పళ్ళన్నీ ఊడిపోయి నోరు బోసిపోయినట్లే- నల్లగా నిగనిగలాడే ఆమెకురులు నరసినట్లే-- తిన్నగా ఉన్నవెన్ను వంగిపోయినట్లే-- భావపరంపర ఆమెమనసులో దొరలిపోయింది. చేతినరాలు పట్టు

తప్పి మందుసీసా చేతిలో నుంచి జారి నేల మీద పడ్డది.

ఆ చప్పుడు విని అదిరిపడి కూతురూ అల్లుడూ పరుగెత్తు కుని వచ్చారు. బంగారమ్మ దేహము వణుకుతూ ఉండగా చూసి కూతురు తల్లిని గదిలోనుంచి బైటికి తీసుకొని వచ్చింది.

రెండు దినాల తరువాత పిల్లవాడికి కాస్త నెమ్మదించింది. కూతురూ అల్లుడూ మామూలుగా మాట్లాడుకుంటూ ఉదయపువేళ పిల్లవాడి మంచముదగ్గర కూర్చున్నారు. 'తల్లి కాఫీ తీసుకొని వస్తుంది గదా' అని కూతురు ఎదురుచూస్తున్నది. ఎనిమిదిగంటలు దాటింది. కూతురు లేచి, తల్లిని పిలుస్తూ ఇల్లంతా వెతికింది. తల్లి పడుకునే గదిలోకి వెళ్ళి చూడగా బల్లమీద ఉత్తరము పెట్టి ఉన్నది.

' అమ్మాయీ !

మిమ్మల్ని నిద్రనుంచి లేపట మెందుకని మీకు చెప్పకుం డానే వెళ్ళి పోతున్నాను. సంసారములో ఉన్న బంధాలమీద విరక్తి కలిగింది. వైద్యాలయములో నర్సుగా ఉండా లని ఎంత కాలమునుంచో నాకు కోరిక. నేను వేరే విల్లు వ్రాయనవసరం లేదు. నీ కొడుకే నా ఆస్తికి సర్వాధి కారి.

బంగారమ్మ."

ఉత్తరము చదువుకొని "మా అమ్మకు బొత్తిగా ధైర్యము లేదు" అన్నది కూతురు కన్నీళ్ళు తుడుచుకుంటూ పెని మిటితో.